# తొలిపలుకు

ఈ శాస్త్రీయగ్రంథాన్ని ఆమూలాగ్రంగా చదివిన మానవుడు తప్పక సన్మార్గప్రవర్తకుడౌతాడు.

శాస్త్రంయొక్క యథార్థం ఇందులో ప్రతిబింబిస్తుంది. ఇది దుర్మార్గుణ్ణి చక్కగా శాసిస్తుంది. భారతీయుని సాంసారిక జీవనం యిందులోవుంది. భారతీయుని ధర్మం ఇందులో ఉంది. భారతీయుని త్రివర్గసేవన పద్ధతి ఇందులోని విషయం.

ఈ విషయాలను సూక్ష్మంగా నిర్ధారణచేసి సామాన్య విద్యావంతులకుగూడ ఈ ప్రబోధాన్ని కల్పించడంకోసమే విపుల వ్యాఖ్యలున్నా, ఈ సంగ్రహ వ్యాఖ్యను తెలుగులో నేను గిలికాను.

నేను చాలావరకు సూత్రభావాన్నే చెప్పడానికి ప్రయత్నించాను. ఎక్కడైనా విశేషాంశాలుంటే కొద్దిగా సూచించాను. జయమంగళుని వ్యాఖ్యానమే నా ఈ గ్రంథరచనకు ఆధారం.

నా లక్ష్యసాధనకు వ్యావహారికమే ముఖ్యమని తోచి భాషావిషయమై ఒకరకమైన నడకనడిచాను. గ్రాంథికవాదులకు క్షంతవ్యుణ్ణి.

నేను తెనాలి సంస్కృత కళాశాలలో ఆంధ్రోపాధ్యాయుణ్ణిగా పనిచేస్తూ ఉన్నప్పుడు ఈ గ్రంథానికి సంపూర్ణ మూర్తి యేర్పడ్డది. చాలారోజులు ప్రయత్నించానుగాని, అచ్చుపడేవీలు దొరకలేదు. ఇలా మూలపడిఉన్న ఈ గ్రంథ ముద్రణానికి తమంతటతాముగా పూనుకొన్న కృష్ణాజిల్లా, నందిగామ తాలూకా, అంబార్పేట వాస్తవ్యులైన శ్రీ గరికపాటి కృష్ణమూర్తిగారికిన్నీ, శ్రీ గరికపాటి లక్ష్మీనరసింహశాస్త్రి

గారికిన్నీ నైజాంరాష్ట్రీయ మహాదేవపుర కాపురస్థులైన శ్రీ పుతుంబాక వెంకటప్పయ్యగారికిన్నీ నా అంతులేని అభివంద నాలు. ఇంకా ఇతరసహాయకులకుగూడా నా కృతజ్ఞతాపూర్వక నమస్కారాలు.

నేను ఈ గ్రంథాన్ని ప్రారంభించిన నాటినుండీ నాకు సలహాదార్లుగాఉండి నా ప్రార్థన నంగీకరించి ఈ గ్రంథానికి సమర్థమైన పీఠికనువ్రాసియిచ్చిన అప్పటి మా తెనాలి సంస్కృత కళాశాలోపాధ్యాయులును, ఇప్పటి నెల్లూరు సంస్కృత కళా శాలా సాహిత్యాలంకారాద్యుపన్యాసకులునునగు సాహిత్య విద్యాప్రవీణ శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారిని నేనెన్నటికి మరువలేను.

నేను తమ దర్శనమున కేగినంతనే మిక్కిలి యాదరించి తమయింట నాలుగయిదురోజులు నన్నునిలిపి వార్ధక్యము పీడిం చుచున్నను వీలున్నపుడెల్ల నాచేత ఈ గ్రంథమును వినిపించు కొని యాశీస్సుతో నభిప్రాయమొసగిన వారును, విజయనగర వాస్తవ్యులును, ఇటీవలనే స్వర్గస్థులయిన, కళాప్రపూర్ణ, మహామహోపాధ్యాయ శ్రీ శ్రీ తాతా సుబ్బారాయశాస్త్రి గారి యాత్మకు శాంతి కలుగజేయుగాకయని భగవంతుని ప్రార్థించుచున్నాను.

ఈ గ్రంథమునకు ప్రకాశకులైయున్న సికింద్రాబాదు వాస్తవ్యులయిన అస్మన్మిత్ర శ్రీ అనుముల రాఘవశర్మగారికిన్నీ, ఎంతోఅందంగా పుస్తకాన్ని ముద్రించిన శ్రీ కొండాశంకరయ్యా గారికిన్నీ నా ధన్యవాదములు.

ఇట్లు

గ్రంథకర్త



శ్రీ మహా కామకామేశ్వర్యై నమః

# కామ పీఠము



అచ్ఛిన్నమేఖల మలబ్ధదృఢోపగూఢం
అప్రాప్తచుంబన మవీక్షితవక్త్రకాంతి
కాంతావిమిశ్రవపుషః కృతవిప్రలంభ
సంభోగసఖ్య మివ పాతు వపుః పురారేః॥

ఒకప్పుడు ఒక చోట నే నిట్లంటిని. "ఇహానుభూతిలో బ్రహ్మానుభూతి యున్నది. కాని నిర్లిప్తమయిన అనుభవము, నియమయుతానాసక్తి భోగము వలయుట ఆవశ్యకము. అందువలన శాంతవేదాంతము లభింపగలదు. ఏతత్సాధన అందరకు నిత్యము అందుబాటులో కలదు. కాని కష్టము. అయినను అట్టి యనుభూతి యుండనేని స్త్రీ పురుషు లిద్దరకును సమకాలము క్తి కలదు. అంతయు ఆత్మశ్రీప్రాప్తికి హేతువు దాన స్వయం ప్రోపలబ్ధి యున్నది." అని.
ఈ వచనములు అంతశ్చేతనలో దాగి ఉన్నవి. అవి మరల నేను ఏతద్రచనా సమయమున నాకు స్ఫురించుచున్నవి. భావసీమలు అనుకూలసమయమున అవభాసింపక పోవు కదా! కేవలము ఇది ఆత్మప్రత్యయము కాదు. అనేకులు అంతర్వాణులు ఇట్టి ఆత్మసంవాదము పొందువారు కలరు. వారి రసాత్మకు జోహారులు. "సర్వః స్వాంతే విశ్వసితి" అని కాళిదాసు అనినాడు కదా!

ధర్మము, అర్థము, కామము, మోక్షము, అని పురుషార్థములు నాలుగు. కామము తృతీయపురుషార్థమని సుమనస్కుల సూక్తి. కామమును పురుషార్థము అగునా? అని కొందరి సంశయము. అటు ధర్మము, ఇటు మోక్షము, రెంటియును అందరానివై ఏమో! ఏమో! గానున్నవి. అర్థము, కామము, రెండును అనుకూల నిషేవ్యమాణములు కదా! అవి ఎల్లెడల కరప్రచేయములై ఉన్నవే! ధర్మమోక్షములవలె కాని ఇవి పురుషార్థము లెట్లగును? అని సంకోచ పడువారి పటు పటు హృదయము. ఈ సంకోచ ఉచితము కాదని మనవి. కామము పురుషార్థము. ఆఁ! అందురేని వాత్స్యాయనుడు "కామమే పురుషార్థ" మని యర్థవాదమున

పలికినను గడుసుమాట కాదు. కామము పురుషార్థము కాకపోవుటేమి? అని ఎదురు ఉమురదా?

సామాన్యముగా ననుడు విశేషముగా ననుడు. కామమన్న సుఖమే, సంకల్పరమణీయమగు ప్రీతి. సంభోగసుందరములగు అభిలాషయే కామము. ఇది కలుగుటలో చెప్పదగు బహిర్హేతువు లేదు. ఏదో ఒక అంతర హేతువు, దాని కలుగజేయును. ఒకానొక స్నేహతంతువు ఆ ఈ తత్త్వముల కట్టి జతపఱచును. ఆ సంధానములో అభిలాషమున్నది. అది కామము. నీలాదిపదార్థములు ఎన్నియేని ఉండుగావుత. కొన్నియే మనోనుకూలములు. తాదృశములలో కలుగు సుఖసంవేదన స్వరూపమయిన రతి, ప్రీతి, ఇచ్ఛ, కామమగును.

'సౌఖ్యాభిమానసంకల్పఫలవాన్ కామఉచ్యతే.' అని శారదాతనయుని వచనము. కామము ఒక మహాసంకల్పము. అతీతానందమును అన్వేషించువాని అనుకూలారాధన- ఇది జన్మాంతర సౌహార్దము ననుసరించిన ఇచ్ఛావిశేషము. వాస్తవమయిన సహజసంబంధము మరుగుపడినపుడు కాలాదిపరిపాకమున పునరుద్బోధము కలుగును. ఆ ఉద్బోధములో సంకల్పమున్నది. ఈ సంకల్పము ఆత్మీయమై, కావుననే ఇది పవిత్రము. పవిత్రమగు కోరిక స్వభావరమణీయమగు స్వసంవేదనమును సూచించును. ఈకామము మౌలికార్థమును విడనాడక ఎన్నివిధముల నయిన పల్లవించుగావుత. పవిత్రము పావకము కాకపోదు. హృదయస్పందము నిచ్చుటకు అనేకములు సమర్థములు కలవు. కామమేళనమున కలుగు హృదయస్పందము, అపూర్వము, రమణీయము, అచుంబితమును. కామములో ప్రహ్లాదన స్వభావమున్నది. దేవుడు, నరుడు, పశువు, పక్షి అన్నియు రతి ఉదయించునపుడు అభిన్నసంస్కారము కలిగిఉండుట సహజము. సర్వప్రాణులకును రతిలో హృదయసంవాదము కలిగితీరును. తుదకు యతికిని రతిచమత్కారము కలదు. వివేకి, అవివేకి, రోగి, నీరోగి, శర్కరను అపేక్షించును గదా! ప్రత్యక్షమధురానుభూతిని కాలదన్ను ద్వేషి ఉండునా? కామము మృదులమయిన మధురానుభూతి.

అనుభవరసికుడు భోజభూపతి రతిని ఈవిధమున నిర్వచించును. "భావన ఉదయించినది మొదలు జనుడు అనన్యధీనుడై మనమున భావనచే భావించునదే భావము. సత్యముకల ఆత్మవంతులకు హృదయమున అహంతాకలిత మయిన ఒకస్పందము ఉండును. అది అమల ధర్మవిశేషమున నై కలుగును. జన్మ జన్మలలోని

అనుభవవాసనలు అందు హేతువు. ఆత్మసంపదదయాతిశయమున ఆ స్పందము కారణము. ఇది అహంతామయమగు గుణవిశేషము. దీనిస్థాన మాత్మ. దీనిని ఆత్మశక్తిచే రసనీయముగ చేసికొను నాతడే రసికుడు'' అని.

కామము ఆత్మధర్మమే. కాని ఆగంతుకము కాదు. అఖండమయిన అద్వయానుభూతిలో స్వభావపరినిష్ఠితమయినది కామమె. అధ్యాసకలిగి మిథ్యా ప్రపంచ స్థితులము అయినపిమ్మట ఆ కామము ఖండఖండ విధమున నేడు మనకు గోచరమగుచున్నది. మానస విజ్ఞానమును అనుసరించి స్వభావాన్వేషణము చేసినచో మనోవృత్తులు స్వస్పందమనోహరమైన కామమునందే విశ్రాంతమగుటను మనము గ్రహింపగలము కామము సర్వభావములకు మూలము. ఆగంతుకనిమిత్తములను అనుసరించి ఇతర భావములు కామావరణములో కలుగుచున్నవి. కామము సహజభావము. ఇతరములు ఔపాధికములు, అని కామవాదుల భావము.

"కామిగాని మోక్షగామి కాడు'' అని ముగ్ధమధురమగు తెలుగు నుడికారమున్నది. ఈమాటకు ఆనేకులు అనేకార్థములను చెప్పవచ్చును. కామితయున్నపుడే మోక్షము కలుగును" అని ఏతదర్థమె కదా! కామితలో మోక్షమున్నదా? చిత్రమగు సూక్తి, ఎట్లు? కామము ధర్మానుబంధి అయినపుడు మోక్షానుకూలత ఉండకపోవునా? కామము, అనదగుకామము మోక్షప్రవణమగుట వింతకాదు అట్లుకాకపోవుటయె వింత. అనుకూల కామసేవనము మోక్షపథమె, అపుడె కామము కామమగును.

మోక్షమున స్వరూపానంద లాభమున్నది. స్వరూపసాక్షాత్కారము మోక్షస్వరూపము. రసికుడు అంతటను స్వరూపమును సాక్షాత్కరించుకొనగలడు. స్వసంవేదనము సార్వత్రికము. నిశ్చలబుద్ధి వేద్యములందు, చంచల మనోగోచరములందు, ఇంద్రియ గ్రాహ్యములందు, సర్వప్రాపంచిక విషయములందును సంవేదనము నిత్యసన్నిహితమై యున్నది. వాని వానియందు అనుగతమయిన ఆత్మసంవేదనమును అనుభూతికందించుకొన్నపుడు స్వరూపానంద లాభము కలిగితీరును. విశ్వపదార్థములలోని సంవిత్తిని స్వాత్మానుభూతిలో సమన్వయపరచికొనుట, స్వసంవాదమును ఉపలక్షించుకొనుట కామమె.

అయిన నొకడు విశేషమున్నది. విషయానుభవము మాత్రము సంవేదన మార్గముకాదు. అందు అనాసక్తి పాదుకొనవలయును. ఆయా విషయములం

దను తదీయోపభోగములందును అనాస్థ అతిశయింపవలయును. ఇట్టి అనాసక్తితో, అనాస్థతో కూడిన విషయభోగమే, నిత్యసంవేదనద్వారమును ఉద్ఘాటించును.

గంధము, రసము, రూపము, స్పర్శ, శబ్దము, అన్నిటియందును నిర్లిప్తానుభవము పైసిద్ధికి అవసరము. ఏతదర్థమును భావింపుడు.

గీతాది విషయాస్వాదాసమసౌఖ్యైకతాత్మనః, యోగినస్తన్మయత్వేన మనోరూఢేస్తదాత్మతా ॥ ఇది విజ్ఞానభైరవములోని పద్యము. దీనిభావమును శ్రీశివోపాధ్యాయుడు తన వివృతిలో ఇట్లు అనుగ్రహించినాడు.

గీతం, గాయనం,... శబ్దనం ఇతియావత్ । ఆదిశబ్దేన స్పృశ్యరూపరసాది గ్రహణం। తేన శబ్దాదివిషయాణాం యత్ ఆస్వాదనం శ్రవణేంద్రియవృత్త్యా గీతశబ్దగ్రహణం తచ్చమత్కరణం, ఏవం అతిసుందర రూపదర్శన చమత్కారః తథామధురాది రసచర్వణాస్వాదః। తస్మాత్ విషయేభ్యః యత్ అసమం అనుపమం, స్వానుభావగమ్యం సౌఖ్యం, తేనయా ఏకతా తద్రూపః ఆత్మాయస్య యోగినః తస్య మనోరూఢేః యత్ తన్మయత్వం శాస్త్రస్పర్శావేశః తేనహేతునా తదాత్మతా, పరబ్రహ్మమయత్వాపత్తిః—

ఆయాఇంద్రియములద్వారమున ఆయా విషయములను అనుభవించునపుడు ఒక అపూర్వమగు చమత్కృతి ఉదయించును. దానివలన ఒక సౌఖ్యము కలుగును. అది స్వానుభవవేద్యము. ఆ యోగి తదేకతానుడై ఉన్నచో పరబ్రహ్మమయత్వమే కలుగును. అనిభావము. ఇట్టి అనుభవమే ఇచట అపేక్షితము. ఇట్టిది కానిది కానిది. భక్షణములో, పానములో, ప్రతి గ్రాసము, ప్రతిబిందువున, తుష్టి,పుష్టి, క్షున్నివృత్తి యున్నది. వానివలన ఉల్లాసానందములు కలుగును తత్ప్రజృంభణమున భరితావస్థ యొకటి ఉన్నది. అప్పటి అనాస్థానుభూతియే మహానందమిచ్చును కదా! ఆవిషయమున ఇంకను విస్తృతి అపేక్షితము కాదు. ఇది అదనునుకాదు.

ఈ అనాసక్తికలిసిన అనుభూతివలన అంతశ్చేతనకు వికాసము కలుగును. అపుడు ఆత్మస్వరూపమునయిన అనంతభావములు ఆవిర్భావము పొందును. అపుడు ఆత్మసంవేదనమునకు కల ఆవరణము భగ్నమగును. స్వరూపము సాక్షాత్కరించును. ప్రత్యభిజ్ఞాదర్శనముయొక్క సమన్వయము ఇట్లాయున్నది. చిత్తరూపమునందలి అనంతభావచక్రము అతీతానంత జన్మలకు సంబంధించి ఉండును, అవి

ఇతరసమయములందు ఆవిర్భావ తిరోభావములు లేక ఆత్మలీనములై ఉండును. అవస్థలో విషయమును అనుభవించునప్పుడు సత్త్వోద్రేకము కలుగుటయు, ఆభావములకు విస్ఫారము కలుగుటయు, అనుభవమునగోచరమగును. రజస్తమోగుణములు అపుడు నిగరణము పొందుట తప్పనిసరి. కాగా ఎదుటనున్న జడవర్గము ఆత్మానుకూలమగును. జడవర్గమంతయు స్వసంవిత్తత్త్వములో అభివిలీనమై భాసించును అపుడు అవి సంవిద్రూపములౌ. అట్లు అవి సంవిత్స్వభావకములై జడములు, చేతనములు అగుచున్నవి కదా! ఆసంవిద్భూమియు భోక్తృవర్గమున లీనమగును. అదియు ప్రధానభోక్తయందు, అనగా నిత్యసంవేదన స్వభావకమగు ఆత్మప్రకాశమందే అంతర్లీనమగును. ఇదిఅంతయు కామసంవిదాగములోని రహస్యము అభినవగుప్తాదులందరు ఈ విషయమును ఇట్లే వ్యాఖ్యానించుచున్నారు కాగా ఏవం కామిత మోక్షోపయోగినియగు కాదా!

కామితలో మోక్షమనుటను శివశక్తి సామరస్యమునుగనె నిశ్చయించుట సముచితము. అట్లె తంత్రికారులు సెలవిచ్చుచున్నారు తిలకింపుడు!

శక్తిసంగమసంక్షుబ్ధ శక్త్యావేశావసానికం ।
యత్సుఖం బ్రహ్మతత్త్వస్య తత్సుఖం స్వాక్యముచ్యతే ॥

అని విజ్ఞానభైరవసూక్తి. పురుషుడు స్త్రీసంగానందమును పొందినపుడు పార్యంతికముగా పరబ్రహ్మానందమును అనుభవించుట లేదేమి? అప్పటి ఆ ఆనందము ఆత్మీయమేకదా! అంచటి అభిముఖవ్యక్తి అభివ్యక్తి కారణమే కాని అన్యము కాదు.

జాయయా సంపరిష్వక్తో । న బాహ్యం వేదనాంతరం ॥
ఎందువలన? బ్రహ్మానందము అనుభూతినుంటయే హేతువుకదా!
మనసిజ కలాతత్త్వాభిజ్ఞై మనోజ్ఞ విశేషితైః
సకలవిషయవ్యావృత్తాక్షైః సదానుసృతోత్తమః
కృతరుచిచర్యాపాస్త్యాఽత్యంతం సునిర్వృతమానసః
నిధువనపరబ్రహ్మానందం నిరర్గలమన్వభూత్ ॥

అని శంకరవిజయములోని అజ్ఞాతకవి వచనము. (అతడు వ్యాసాచలకవి కావచ్చును. భగవత్పాదశంకరులు మాత్రము కారు) ఆసంవద్యాత్మానుభవము, కామయోగమున ఉన్నట్లు ఋషులు అనేకధా నిరూపించినారు.

నిత్యానుభూతి సాక్షికమయిన ఈవిషయమున దృష్టాంతములు ప్రమాణములు వలయునా?

శివశక్తుల సముల్లాసమె మహాకామ సంవిధానము. ఆ సముల్లాసము ప్రపంచవస్తువు లన్నిటను కలదు. చేతనములో అచేతనములో శివశక్తి సామరస్య మున్నది.

వ్యక్తావ్యక్తస్వరూపాసా । వ్యాప్యాకృత్యైవం జగత్స్థితా ॥

అనికదా! రహస్యసూక్తి. అసలు పదార్థములు చేతనములు, అచేతనములు అని ద్వివిధావిభక్తములు కావు. వాస్తవము చేతనమె. అదియె మిథ్యాప్రత్యయమున అచేతనమయినది. అట్టి అచేతనమునందు చేతనతను ఆవిర్భవింప చేయుటయు ఆవశ్యకము. అట్లొనర్చి తత్సర్వస్వమును మహాచేతనమునందు విలాసము చేయుటయ మహాక్రియ. ఈజడము, అజడము అను వ్యవహారము మధ్యలో ప్రాతిభాసికమె. నిత్యచేతనమె వాస్తవమని నిరుక్తము. నిత్యము చేతనమగుటయె వాస్తవముకాని నిత్యము అచేతనమగుట లేదు. స్వాభావపరిస్థితిఇట్టిది. ఇట్టి ఈస్వస్పంద సందోహమును అనుసరించి ఒక నిరీక్షికను సారించితిమేని కామపీఠరహస్యము విశదమగునని ఊహ. ఉన్మేషనిమేష మయమయిన ఈవిశ్వదృష్టిలో జడములు అజడములు కన్నడును కదా! అట్టి జడములకు చేతఃతావాప్తి వలయుట, నిశ్చితము. కాన అది భావసాధ్యము. భావసాధ్యమగు చేతనయోగమును కామశక్తి కలుగజేయును.

శివశక్తిమయత అంతట కలదనికదా! సూత్రీకృతార్థము. అన్నిటను శివశక్తి వివేకము పొందుట అవసరము పాషాణమున స్త్రీపుంసాత్మకత యున్నది. శిల్పుల అమృతహస్తములు సనేత్రములై అతత్త్వమును అవగతము చేసికొన్నవి. వృక్షములలో, పశువులలో, పక్షులలో, మానవులలో, స్త్రీపుంసాత్మకత క్రమవికాసము పొంది స్ఫుటవేద్యమయినది. అయినను నేమి? ఒకింత ఓపిక పట్టుడు.

శివశక్తుల అద్వయసామరస్యము ఈవిశ్వ విశ్వమయినది. వారి అఖండానుభూతి నిత్యసుందరమై కామపురుషార్థమయినది. అసలు శివశక్తుల అద్వైత సామరస్యము, విశ్వసముత్తీర్ణమె. అయినను అధ్యాస వశమున విశ్వమయమై అవభాసించును. కావుననె ప్రపంచవిలాసమంతయు కామానందభరితమైయున్నది.

పురుషవిధుడైన ఆనందమయాత్మ ఒంటరిపాటు సహింపలేక స్త్రీ

వ్యక్తి నభిలషించెనట. ఆతని ఆ మధురసంకల్పములో సంపరిష్వక్తము, అవిభాజ్యము అగు అర్ధబృంగళాకారము (సగము స్త్రీ సగము పురుషుడు) ఆవిష్కరించినది. దానినుండి స్త్రీపురుషులు పతిపత్నీ భావమున అభివ్యక్తమగుట శ్రుతిసమ్మతమయిన అర్థము. ఇంతకును ప్రపంచోన్ముఖమైవచ్చిన సమరసాత్మక తత్వములో నిరంతరాఖండాద్వయానుభవము పవిత్ర కామసంవేదనాత్మకము కలదని గ్రాహ్యము. అర్ధబృగళమునుండి ద్వైధాభావము వచ్చినది. అందును అవిశిష్టమైన ఆనంద సంవేదనమె ఉన్నది. అనంతరము స్త్రీపుంసాత్మకత. ఇందనుభూతికి లోటులేదు కాని స్త్రీత్వ పుంస్త్వకృత విశేషము ఉండినేరినది ఆనందమయ స్వభావముకన్న ఇతరమగు విశేషము అవభాసింప నంతవరకు కలుపుకలేని కలుషము కాని కామసంవేదనానంద శ్రీవిలాసమె కలదని పౌనఃపున్యమున నిరూపితము. ఇతరవిశేషములు కలియగనె ఆనందము అన్వేషణీయమయినది. స్త్రీవ్యక్తియందు పురుషుడు స్వానుభవమును శతధా అన్వేషించుచున్నాడు. పురుషవ్యక్తియందు స్త్రీ స్వరూపానుభవమును సహస్రధా అన్వేషించుచున్నది. స్త్రీభావ పుంభావములులేని అవస్థలో ఇతరవిశేషములు లేవనుటను క్షణక్షణము గుర్తుపెట్టుకొనవలయును. స్త్రీపురుషులకు అనుభవము స్వాభావికపథము తొలిగినట్లయి అన్వేష్యమయినది కదా! అప్పుడు పురుషునకు స్త్రీ ఆధారకమయిన స్వానుభవము. స్త్రీకి పురుషాధీనకమయిన స్వానుభవము. ఇట్లు అవి ఔపాధికములు కావలసి వచ్చినది.

స్త్రీపుంసత అస్పష్టము, స్పష్టము, స్పష్టతరము, స్పష్టతమము అగును కదా! అస్పష్టస్త్రీపుంసతలోని అనుభవమునకును స్పష్టస్త్రీపుంసతలోని అనుభవమునకును భేదమున్నది. అవిభక్తతలో విభక్తతలో నిత్యస్వరూపానుభూతి తారతమ్యము ననూహ్యము కాదు. స్పష్టత విభక్తత కలిగినకొలది నిత్యానుభూతి నైమిత్తికమగును. సామాన్యానుభవము విశేషాత్మకమగును. అకృత్రిమము, కృత్రిమమగును. ప్రకటము ప్రచ్ఛన్నమగును. సార్వకాలికము నియతకాలికమగును. కావుననె వ్యక్తస్త్రీపుంసభావములుకల వృక్ష పశు పక్షులకామానుభవము ఋతుధర్మి అయినది. ఆయా ఋతువులందె అవి అట్లగుట ప్రసిద్ధమె. మానవులు సువ్యక్త స్త్రీ పుంస తత్వములు కలవారయినను ఈ చెప్పిన విధానమునకు కొంతవ్యత్యయము కలిగినది. మానవుల స్వరూపానుభవము సాంవత్సరికమును కాదు. ఋతుధర్మియు కాదు. అది నిత్యమె అయినది.

సామాన్యమై యయినది. అకృత్రిమ మయినది. ప్రకటమయినది. ఇంతటితో ఆగ లేదు. నైమిత్తికమై విశేషాత్మకమై కృత్రిమమై పరిచ్ఛిన్నమై బహురూపమైనది.

మానవుల కామానుభవము బహురూపము, బహువిధము, బాహ్యాభ్యంతర భేదభిన్నమై అది విశ్వజన స్పృహణీయమైనది. బాహ్యానుభవమును నానాభేదసుభగము. ఆంతరము అనంతస్వరూప సిద్ధికలది అయినది. ఇంతటితో నిది ఇట్లు అగునా? కాలము, దేశము, వయస్సు, అవస్థ, పరిమాణము, పరికృతి భావము, స్వభావము, ఏతదాది భేదములెన్నో కలవు అయినను అనుభవతృప్తి కవధిలేదు. చతురుడయిన మానవుడు ఎన్నెన్ని ప్రమోదములు కల గతి ప్రగతులయినను అవి శేషమగు సమానుభూతినే పొందును. ఆత్మశక్తికి అవధి, హద్దులేక పోవచ్చును, కాని భేదగతుల ననుసరించిన విశేషము లందు లేవు. సమానమయిన ఆత్మరసము అన్నిట ననుభూతమగును. ఈయంశము భావనీయము.

మానవుని స్వరూపానంద లాభమునకు విశ్వసామగ్రి బహుళముగా నున్నది. చేతనసామగ్రి కాని అచేతన సామగ్రి కాని ఏరీతినైన మానవుని యానందమునకు హేతువగును. చేతనసామగ్రియు నానాత్వశోభితమై యున్నది. చేతనములు అచేతనములు మానవున కుపభోగ్యములే. ఉపభోగ మనేకవిధములు. ఆహారరూపమున అవి స్వీకృతములగును కాని అది యిట ప్రసక్తము కాదు. కామానుభవమున నున్నదాని స్వీకృతియే ప్రకృతము కావలయును. జడాజడములు కామపథములో విభావములు. అచేతనములు కామోద్దీపనములుగా స్వీకృతమగును. చేతనముల కాలంబన భావమున స్వీకృతియున్నది. మానవుడు తన నిజసుఖమునే వాని యందారోపించుకొని యనుభవించును. ఎదుటనున్న చేతనమును అట్టి భావపుష్టితో గూడియున్నపుడు సామగ్రీసమగ్రత గలుగుచున్నది. తరుణుడు తరుణిని అనుభవింపదలచుట, తరుణి తరుణుని అనుభవింప దలచుట అను రెండు భావములు అద్వయమేళనము పొంది అభిన్నానుభవమును ఆవిర్భవింప జేయుచున్నది. ఇట్లు స్వసమాన చేతనాశ్రితమైన చిదానందమే కామము. తాదృశమే పురుషార్థము.

ఇది మూలఫలకముగా ముందువిచారసౌధము మెరుగులను దర్శింతుము గాత. స్త్రీసృష్టి సహజసుందరము. "స్త్రీనామాపి మధురం" అని కుంతకుని వక్రోక్తి. మానవేతరప్రాణులలో పురుషప్రాణియె స్వభావ సుందరము. మానవులందిది భిన్నమయినది. మానవులందు స్త్రీప్రాణియె సుందరము. ఇది

యాపేక్షికము గాదు. ఆభిమానికమును గాదు. స్త్రీ యంగ ప్రత్యంగ సృష్టి యీ వాస్తవార్థమును ధృఢము చేయును. సహజములు ఆగంతుకములు అయిన శోభా విలాసాదులు రమణీతనువునందే విశ్రాంతి పుచ్చుకొనుచున్నవి. స్త్రీత్వము మానవత్వముననే పరిపూర్ణమయినది.

ఇట్లు శ్రీభూషితము పరిపూర్ణము అయిన స్త్రీసృష్టి నవలంబించి కామము, స్వరూపలాభము కందాయమైనది. కావున ఆకామము మానవులందు పురుషార్థమయినది. కాన ఈ మానవద్వంద్వమున నిత్యనైమిత్తికములు, ప్రకట గుప్తములు సామాన్య విశేషరూపములు, అకృత్రిమ కృత్రిమములు, అగు కామ విలాసములు సమరసము లయినవి.

శివానుభూతి మహాకామము. మహాకామ, కామేశ్వరాంకనిలయ, మహాకామేశ్వరీ తత్వము ఈ పరమార్థ కామరహస్యమును స్పష్టభాసము చేయుచున్నది. దేవ్యుపాసకులు వచించు కామకలా స్వభావము ఉచ్ఛూన బిందువునుండి సృష్టి ఉన్మేషము పొందుట సామరస్యము, సృష్టి హేతువగుట అనుసీయంశముల విశదవివేకము, కామోపనిషత్తు వివేచితము చేయును. ఈ విషయ మన్యత్ర విస్తృతము.

తాదృశ శివతత్త్వము, శివాతత్త్వమును జగములో అంతట అనుగతము. సర్వప్రాణులందును ఆ ఉభయశక్తిరూపత ఉన్నది. జీవజాలమంతయు ఆసామరస్యమునె, ఆ కామసంకల్పమునె కోరును. ఇచ్ఛచేగాని అనిచ్ఛచేగాని అవిరతము, నిరతము అన్నియు తన్ముఖములె యగును నిత్యమనంత వేగమున అణువణువును మహాస్పందము పొందుట నేటి వైజ్ఞానికులకును తెలియును. స్పందసామాన్య మంతయు ప్రతిభోన్ముఖ మగుచున్నది ప్రత్యభిజ్ఞాత్మకమై మగ్నోన్మగ్న మగుచున్నది. ఇట్టి యీ ప్రత్యభిజ్ఞాకలయె కామము. ఆ మహానుభూతికై కామమును, లోకమును సేవించును. ఇట్లు కామమును పురుషార్థముగా భావన చేయగల యాతడె కామయోగి.

కామపురుషార్థమును సాధించు కామయోగికి చిత్ర మధురములయిన సాధనములున్నవి. ఈసాధనములు యోగములు. ఈ సాధనములందు నిష్ణాతుడయినగాని కామసాఫల్యము పొందజాలడు. సాధనములందె పరమాసక్తుడగుట పతనహేతువు. సాధన సాధ్యమె యాతని లక్ష్యము కావలయును. సామాన్యముగా సాధనరీతులు నానావిధములై ఉన్నవి. కేవలము నివృత్తి పరములై

ప్రవృత్తి పరముగా సాధనములు ఇతరత్ర కన్పడును. ప్రవృత్తినివృత్తిసామరస్య పరత్వము కామయోగములో నున్నది. ఈ కన్పడు విశ్వజగత్తు అంతయు ఈ యోగానుకూలమై, బహువిధములయిన మానవుల సర్వశక్తులు దీని ప్రవణములై ఉండుట మన మెఱుగనిది కాదు.

మొదట చెప్పిన అనాసక్తితో విషయోపభోగము యీ యోగ సాఫల్యమునకు మూలస్తంభము. దీనిలో ఆత్మభోగమే ఫలము. అందుకే యీ సురతయోగము. సురతయోగము స్వాభావికమై యనుకొన్నను సులభము కాదు. నిగ్రహరూపమైన త్యాగమే యపేక్షితమగుట స్పష్టము. స్త్రీసన్నివేశము నిగ్రహమునకే, సర్వవిధముల ఉపభోగ్యమగు మధురమూర్తియెదుట ఉన్నప్పుడే నిగ్రహము సముచితమని కాళిదాసాదుల సూక్తి. స్త్రీవ్యక్తియందును సౌందర్యమును ఆధానించుటలో యీ యర్థమే యున్నది. ఉపభోగ్యములు లేనప్పుడు నిగ్రహము నిగ్రహముకాదు. ఆ సామగ్రి ఉన్న కాలమందే తత్ప్రాబల్యమునందే నిగ్రహము నిగ్రహము. ఈ నిగ్రహయోగమే కామతత్వములో కలిసియున్నది.

నిగ్రహము రెండువిధములు. అనుభవకాలమున నిగ్రహమొకటి. అదిలేనప్పుడు రెండవది. ఈ రెండిటిలో అనుభవ నిగ్రహమే మహాయోగము. అనుభవమున నిగ్రహమా! అదియెట్లు? ఇట్లు శంకింపనక్కరలేదు. నిర్లిప్తత్వమున నది సిద్ధము గాగలదు అనాసక్తిలో అదిసులభము. అలోలుపత్వము అంతట ఆవశ్యకము. అందుకై సురతయోగాభ్యాసమని కామోపనిషత్తులు అధ్యయనము చేసినవారు పలుకగలరు. ఇతర యోగములకన్న సురతయోగమున క్లేశ మధికతరమని యిదివరలో నిరుక్తమగుట యావశ్యకము. దీనిలో కాలాంతర, దేహాంతర, లోకాంతరముల పనిలేదు. ఎప్పటికప్పుడు, ఎక్కడికక్కడ ఆత్మసంవాదమున్నది. ఆహారమున, ప్రదేశమున అంతటను అనుభూతిని ప్రత్యక్షముగా చూచుట దీనిలో మౌలికాంశము. ఈ కామయోగమునం దనేక యోగములు నేను నేనని సమావేశము పొందును. శరీరయోగము అపరిహార్యమనుట సర్వులకు అందుబాటులో నున్నది. ఉద్విగ్నమతులకు తెలియకున్నను, ఇంద్రియ యోగమందు సంలగ్నమై యున్నది సర్వేంద్రియములు ఒకే ప్రనాడికలో కేంద్రీకృతములై లక్ష్యమును సాధించుటకు చూచుచున్నవి. వాక్కు, మనస్సు, బుద్ధి, అన్నియు ఒకటొకటి చవిచూచుకొని గుమిగూడి యున్నవి. వీటి పునాదులో ఆత్మబోధనము అనులగ్నమై యున్నది కదా! ఇదే సురతయోగము. ఇందను ఎంతటి

వైలక్షణ్యమున్నను విసదృశత్వ మంతగా లేదు. యమనియమాది అంగములన్నియు నీయోగములో సమన్వయము పొందియే తీరవలయును. పూర్వాంగములగు అవి లేకున్న ఉత్తరభూమికల పొందుట స్త్రీపురుషుల ద్వంద్వయోగములో బాహ్య భేదరతులు చాల కలవు గదా! ఇతర యాంతరములును అసంఖ్యాకములే. వీనిలో యమాదుల సమన్వయము దుశ్శకముగాదు బంధభేదగతులలో యోగాసనములను సమన్వయింపలేమా? పూర్వాంగయోగశక్తులు లేకున్న యా బంధగతులు సిద్ధించునేమి? మహార్థమంజరి మొదలుగాగల శాక్తతంత్రములను చూచినప్పుడు ఈ పరస్పర సమన్వయము స్పష్టమేయగును. పాతంజలయోగమునందే సమాధి కాదు భేదప్రభేదభిన్నమగు సమాధి యిందునుగలదు. సవికల్పమో? నిర్వికల్పమో? ఏదియైనను యీ యోగములోని భావావసానములో ఉండితీరును. అదో! యిదో! యన నక్కరలేదు. మహాసమాధియనతగిన యాత్మ సమాధియే యీ మహారసములో నున్నది. ఇది పురుషార్థమేల కాదు?

కామము పురుషార్థము ఇట్టి కామము పవిత్రము. ఇందసహ్యభావ మేమియు లేదు. స్త్రీపురుషుల సంయోగము యోగము. అంతియే కాదు. అది ఒక యాగము. బృహదారణ్యకోపనిషత్తులో

"యోషావాఅగ్నిః । గౌతమ । తస్యా ఉపస్థ ఏవ సమిత్ । లోమాని ధూమః । యోనిరర్చిః । యదంతః కరోతి తేఽంగారా అభినందా విస్ఫులింగా స్తస్మిన్నేతస్మిన్ అగ్నౌ దేవా రేతో జుహ్వతి. ౬.౨.౧౩.

ఈ మంత్రార్థ మిచట మొదట భావనీయము ఈవరుస చూడుడు. ౬.౪

"ఏషాం వై భూతానాం పృథివీరసః । పృథివ్యా ఆపః । అపామోషధయః । ఓషధీనాం పుష్పాణి । పుష్పాణాం ఫలాని । ఫలానాం పురుషః । పురుషస్య రేతః. ౧.

"సహ ప్రజాపతిరీక్షాం చక్రే । హంతాస్మై ప్రతిష్ఠాం కల్పయానీతి । స స్త్రియం ససృజే । తాం సృష్ట్వాధ ఉపాస్త । తస్మాత్ స్త్రియ మధ ఉపాసీత । సవితం ప్రాంచం గ్రావాణం ఆత్మన ఏవ సముదపారయత్ । తేనైనా మభ్యసృజత. ౨.

తస్యా వేదిరుపస్థః లోమాని బర్హిః చర్మాధిషవణే సమిద్ధో మధ్యతస్తౌ ముష్కౌ । స యావాన్ హ వై వాజపేయేన యజమానస్య లోకో భవతి । తావానస్య లోకో భవతి. ౩.

ఇట్లు దీనిలో వాజపేయ యాగ సామాన్య క్లుప్త సంభావనము శ్రుత్యుపదిష్టము. స్త్రీ పురుషులకు పరస్పరము ఆనుకూల్య మత్యవసరము అనియు శ్రుతియే చెప్పెను. ఇట్లన్యోన్యస్థలములందును శ్రుతి యీ విషయమును ఉట్టంకించుచునే యున్నది. ఇది మహారసాత్మికమగు శివయోగము, శవయోగము, శివాశివయోగమును. ఇది ఇట్టిదని ముందుగా మనకు తెలియజేసిన యాతడు నందికేశ్వరుడు. అనంతరము మహర్షులనేకు లీ యర్థమును విశదముచేసినారు.

కామసూత్రములను రాజశేఖరకావ్య మీమాంసను పరిశీలించినపుడు యీ సంప్రదాయ ప్రవర్తకులు అనేకులు కలరని, వారు ఋషులని, మహనీయులని తెలియును. "అధికృతశాస్త్రమును గౌరవాన్వితము చేయుటకు దేవతల ఋషుల సంబంధమును చెప్పుకొనుట సంస్కృతలేఖకులకు స్వభావసిద్ధ"మని కొందఱి భావము. సంస్కృతలేఖకులు ఇట్లు చేసిరనుట పాశ్చాత్య శిక్షా ప్రభావితులయిన విమర్శకుల కపోలకల్పన. మన ఋషుల యిట్టి వాక్యములపై యీ విధముగ నిరాధారకల్పన చేయుటలో అంధత్వము ఆ హేతువు. అట్టి వారికది స్వభావసులభము. ఈ అంధ విశ్వాసమును మనముమాత్రమెట్లు స్వీకరింపగలము? ఈ కల్పనలు విరుద్ధమనుటకు మనకును ప్రమాణములున్నవి.

రాజశేఖరుడుల్లేఖించిన సంప్రదాయ ప్రవర్తకులను భరతుడు చెప్పుచున్నాడు. వాత్స్యాయనుడును పలుకుచున్నాడు. ఈ వచనములు కపోలకల్పితములనుటలో ప్రమాణమేమి? ఇట్లే మహర్షులు కామము ధర్మానుబంధిగా ఉండునట్లు నిరూపించినారు. దీని సేవనములో పవిత్ర సాంసారిక సుఖజీవనమున్నదని వారు చూపుచున్నారు. ఆధిపత్యము, అనుద్వేగకరమయిన కామమును సేవించువారలకు ఆత్మానుభూతి ఉండుటయకాక సత్సంతాన ముదయించును. మధురజీవిత ముపలబ్ధమగును. మానవజన్మము సార్థకమగును. ఈశ్వరసంకల్పము నెఱవేరును. కామము అట్టిది.

కాలక్రమమున ధర్మవ్యత్యయము గల్గినది. ఆర్థిక పరిణామము వచ్చినది. అనుకూల వివాహములు లేవు. అననుకూలపద్ధతిలో కామఫలముండునా? అసలు స్త్రీ పురుషులు విసర్గాత్మకులు. పూర్ణబిందువు సంవర్ధ్ధాగభాగములు (ః) విసర్గ వాచ్యములు కదా! అరసన్నలు రెండును అనుకూలములయినప్పుడు వాని యోగములో పూర్ణతయుండును. భార్యాభర్తలు అననుకూలములయిన విసర్గాత్మకులయినపుడు ఆ దాంపత్యమున పూర్ణతయుండదు. అనుకూల వివాహములు

లేకపోగా అననుకూల విసర్గాత్మకత ఏర్పడినది. కాగా అనుకూలకామము లేదు. దానివలన అనాసక్త్యనుభవము లోపించినది. అందటి అనుభవము ఆసక్తితో గూడినదయినది. ఐంద్రియికమయినది. అప్పుడే పరదారాభిమర్శము, కన్యా విస్రంభణము, పణ్యాంగనాపరిచయము కామాదరణమున కలిసినవి. వీని వలన, యీ దృశములవలన కామము పవిత్రతనువీడి నింద్యమయినది. ఇందు నాగరధర్మము పోయి గ్రామ్యత వచ్చినది. అట్టి కామము ఇట్లుకాగా దీనిని నాగరము చేయుటకు, సభ్యముచేయుటకు వాత్స్యాయనుడు గ్రంథకరణమున కుద్యమించినాడు. వాత్స్యాయనుని కామసూత్రములకు పూర్వమెన్నియో కామశాస్త్రములుండవచ్చును. అందు కొన్ని సరియయినవి కావచ్చును. కాని కొన్ని విరుద్ధమార్గమున నుండగా వానిని సవరించి కామమును నాగరము, సభ్యము చేయుటకే అతని యుద్యమము. ఆతని గ్రంథముతో అప్పటిలో ఎట్లో ఉన్నకామము నాగరమయినది ఉదాత్త సేవ్యమయినది. కొందటిలో కుదింపు పొందినది. వాత్స్యాయనుడు నాగరధర్మము వీని సంబంధమును శ్రీ భావ రాజు చరిత్రకోవిదని అడుగుడు విశదముగాగలదు.

కామతత్త్వ వ్యాఖ్యానపరములయిన గ్రంథములెన్నియో కలవంటిని. వారు ఒక్కొక్కరు ఒక్కొక విషయమును విశదముగా విమర్శించి పరిశీలించి సమీక్షచేసి అందందు నిబంధించియుందురు. అట్లు నిబంధనమె వారి యభిలాష. కాని దాని సముదాత్తము చేయజాలలేదు. ఆ పనిని వాత్స్యాయనుడు చేసి నాడు.

ఇతగా కామతత్త్వమును విపులముచేయు వాత్స్యాయనుడు ధర్మాను సారితను చూపుచునేయున్నాడు. వర్ణాశ్రమ వివక్షను మఱవిపోలేదు. కామ సూత్రసూచ్యమగు స్త్రీపురుష జీవితమును భావించిన అప్పటి లోకసుఖము, వ్యవహారము స్పృహణీయముగ భాసించును. ప్రాక్తనములు అర్వాచీనములు అయిన కామశాస్త్రమునకు సంబంధించిన గ్రంథములు చాలకలవు. వీనిలో నిరూప్యమాణమగు కామములో పురుషార్థత ఉన్నదో? లేదో? భావుకులు భావింపగలరు. వారిహృదయము అందు సాక్షి.

సాహిత్య గ్రంథములందు కామము నిరూపితమైనది. అది పవిత్ర కామము. శంకరభగవత్పాదుని కృతియనిపించుకొను సౌందర్యలహరిలో నిరూపిత విశేషణములను నిభాలనము చేసినపుడు, మూకపంచశతిలో పరమేశ్వరీ

స్మృతిని పరిశీలనము చేసినపుడును పవిత్రకామము మనబుద్ధి నిర్ధ్యేయము కాక పోవుటలేదు.

భారతీయ సాహిత్యమును సమీక్షించినప్పుడు దేవశృంగారము, మానవ శృంగారమును చిత్రవిచిత్రమై కన్పడును. కామప్రసాదము లోకములో భిన్న పథీనమై కన్పడుచున్నపుడు ఆ కామమును సుపరిష్కృతముచేసి చూపుటకు దాని మహత్వమును ప్రతిపాదించుటకును సాహిత్యకారులీవిధమున నిబంధించినారు. గాథా సప్తశతిలో హాలుని ఘటనము చూచినపుడు జీవితమాధుర్యమును ఆస్వాదించు వ్యక్తులు కన్పడుదురు. పామరలందను దాగివున్న కామసంవేదనము పవిత్రమై పొడగట్టును. పామరుల కామమునుగూడ ఆతడేల నిబంధించినాడు? అని అంతరాళమున ప్రశ్న ఉదయించినప్పుడు వారి కామమునగూడ సంభావనీయ కామముకలదని సూచించుటకేయని సమాధానము చెప్పికొనగలము కాళిదాసాదులు భవభూతిప్రముఖులు కామమును సముదాత్తముచేసి సుశోభితమొనర్చి నిబంధించుట అత్యంతము ఆదరణీయము ఈ విధానములపై అలంకారికులు అధికామోదమును వెల్లడించినారు. వారి సాహిత్యగ్రంథములు చక్కనిసమ్మతిని చూపినవి.

ఇట్టిదే కామమయినపుడు ఇది ఏల ఇట్లు అపురుషార్థముగా అపవిత్రముగా అసహ్యముగా నయినది? అని శంకపుట్టుట సహజము. మొదట పవిత్రముగానున్న శాక్త సంప్రదాయము కొంతకాలమునకు రూపాంతరము పొందినది. కలుషమయినది. అందు ప్రౌఢోల్లాసాదికము ప్రవేశము పొందినది కలుషమయినది. మాదకద్రవ్యముల సేవనము అధికమయినది. విలాసత అతిశయించినది. ఉపభోగలాలసత హద్దు దాటినది. పరదారామోహనము కన్యల విస్రంభణము వేశ్యల సంబంధమును శాక్తమున ప్రవేశించినవి. వ్యాపకతతోల్లాసమున ధర్మపథాతిక్రమము కలిగినది. వామాచారము కౌళాచారము ఉచ్ఛృంఖలగతులను నేర్పినవి. మొదట శాక్తతంత్రమునే అనుసరించి పురుషార్థమయిన కామము యీ కాలమున అట్టి శాక్తమున అపురుషార్థమయినది. విశృంఖలముగా స్త్రీపురుషుల వర్తనము సాగినది. ఈ విషయము కొన్ని శాక్త తంత్రములందు పొడగట్టును.

ఉదయానాచార్యుడు కుసుమాంజలి గ్రంథములో

"పూర్వం హి మానస్యః ప్రజాః సమభవన్। తతో౽పత్యైక ప్రయోజన మైథునసంభవాః। తతః కామావర్జనీయ సన్నిధి జన్మానః। ఇదానీం దేశ కాలాంత్యవస్థయా పశు ధర్మాదేవ భూయిష్ఠాః"

అనుచున్నాడు. వ్యాత్స్యాయమొంతకలలో యోచింపుడు ఉదయనుని కాలమునకు ఇప్పటికాలమునకును తేడాను గమనించి ఇంకను భావింపుడు. అఖండమై ఉండవలసిన అనురాగము ఖండఖండమై భోజభూపతికాలమునకె పలుచన అయినట్లు కన్పడును. యత్నముపడి భోజుడు అనురాగ మనేకవిధముల నున్నట్లు కనిపెట్టి శృంగారప్రకాశమున నిబంధించినాడు. సాహిత్యకారులు శృంగారవిశేషములను మనోహరముగ నిబంధించినారు. రతి నిరూపణమందును వారి సావధానమనస్కత సముచితముగా నున్నది. చూడగా చూడగా కామమునకు వెనుక కాలమున ఉన్న ఉదాత్తత మరుగుపడిపోయినట్లు గోచరమగుచున్నది.

పురుషార్థ స్వభావముతో నున్న కామము ప్రేమపదవాచ్యము. ఈ దృష్టిలో కామము ప్రేమ ఒకటి. కామము అనుదాత్తమై అపురుషార్థముకాగా న్యూనత్వము పొందినట్లయినది. అప్పుడు ప్రేమ పంచమపురుషార్థమైనది. ప్రేమ ఐదవపురుషార్థమను క్రొంగ్రొత్త కల్పనములో కామము స్వభావచ్యుతమగుటయే హేతువు. ఇప్పుడు ప్రేమ వేరు కామము వేరు అయినవి. ఈ దృష్టిలో ప్రేమ కామములకు స్వరూప స్వభావభేదము కలిగినది. ఇట్టిది కామమగునట. కామము మనోవృత్తి. తృప్తిలేని వేదన కామస్వభావము. కామము లైంగికము దైహికము సావధి సాంతరాయము. ప్రేమ ఏతద్విలక్షణము. ప్రేమ సహజమయిన జీవధర్మము. అది ఆనందసీమ. మనోవృత్తికాదు. దైహికము కాదు. ఆత్మికము. అని ప్రేమ భక్తి ముఖ్యవాదుల వాదము. వాస్తవమయిన కామము మాధుర్యాత్మకమయిన ప్రేమలోకలదని రూఢి వచనము.

ఎట్లైనకానిండు. మధ్యమధ్యకాలమున కామము కలుషమయినది. కలుషకామమును శోధించి శుద్ధముచేయుటకును, పరిష్కరణముచేయుటకును కామశాస్త్రములు బయలుదేరినవి. అందువలననె కామమును శాసించి నిరూపింపవలసిన అవసరము కలిగినది. భారతీయులె కామమును పరిష్కరించి సుపథమున పెట్టగల సుహృదయులు. ఇట్లు పవిత్రాశయముకల భారతీయులు రచించిన కామశాస్త్రీయ గ్రంథములు ఆరువందలకు పైగాకలవని, అవి పాశ్చాత్య

(జర్మనీ) దేశమున సురక్షితములై ఉన్నవని మన ఆంధ్రరత్నము దుగ్గిరాల గోపాలకృష్ణవచనము. పాశ్చాత్యుల సెక్సువాఙ్మయము చాలవఱకు ఏతదాలంబనకమని ప్రథ యుండనే యున్నదికదా! ఇది విచారణీయమే యగుగావుత. కాని మన కామశాస్త్రీయగ్రంథములను మనము ఎప్పుడయిన సంపాదింప నోచుకొనలేదా!

దేశకాల స్వభావాదులందు పరిణామము అధికముగానున్నది. మానవుల చిత్తవృత్తులు క్షణక్షణము మార్పు పొందుచున్నవి. దేశదేశములతో యీనాటికాలమున సంబంధము అపరిహార్యమగుట మార్పును అనుకొనకుండ కలుగుచున్నది. ఈ పరిణామమును ఆకలనముచేసి లోకానుసారముగ గ్రంథయోజనముసేయుట పాశ్చాత్యుల పద్ధతి. మనమో! ఎప్పుడయినగాని కొండలు దిగనీ, నదులుపొంగనీ, అరణ్యములు ప్రాకనీ! ఏమయినను ప్రాక్తనమునె చెప్పుదుము. చెప్పవలయుననందుము. "ఇది ఉపయోగించునా" అని అనేకులు సంశయపడుదురు. మనమనుకొందుముకదా! నేటి పరిణామము నేడు ఎట్లో అనుభవమున ఉండనేయున్నది. దీని శాసించుట అవసరముకాదు. ప్రాక్తనములయిన పవిత్రశాస్త్రములను మఱలమఱల స్మృతిపథమునకు వచ్చినచో భావించిన విజ్ఞులు ఉభయసామరస్యమును సంపాదించి సంపాదించికొందురు. అనుభవికామమున పరిష్కరించుకొందురు ఎప్పుడయిన పవిత్రతను భావింతురు.

ఇప్పటిలో చూతుముకదా! సామాన్యముగా నెవరును చుంబనాలింబనమును సహింపలేరు చతురచతురముగా చుంబనచంచువు లగువారెందఱో లేరు. ఆలింగనభేదము లందాసక్తులగువారు అధికముగా కన్పడరు. బంధాడంబరము లేదు. ప్రమాణకాల భావపరీక్ష లేదు గదా! ఈ కాలమున వానిం జెప్పనిట్టి గ్రంథములేల? అందురేమో! అనిన ననుడు. సమాధియిది. ప్రాక్తనము ఏవం విధమని తదనుసరణము యోగ్యమని ఇప్పటిలోను పరిష్కారమవసరమని సూచించుటకె యీ కామశాస్త్రముల రచనము.

కామసూత్రముల కనువాదములెన్నియో ఉండవచ్చును. ఇంకను వచ్చిన రావచ్చును. మా మేడిచెర్ల ఆంజనేయమూర్తి, మా సహాధ్యాపకులు, కామసూత్రానువాదమును రతిరేఖగా చేసినారు. కాలస్వభావముచూడగా పునరపి సూచనము అవసరమని మా మిత్రులకు తోచినది. తత్ఫలము రతిరేఖ. దీనిలోని భాషలో ఊపు ఉన్నది. పాఠకులమనసులను కదిలించు మనోహరత్వ మున్నది.

అన్యూనమై, అనతిరిక్తమై, అపేక్షితమును గ్రహించి, అనపేక్షితమును త్యజించి అక్కరలేనివారలకు కూడ యీ రతిరేఖ అందమయిన ముగ్గు కూర్చుచున్నది. ఇందంతట జయరథుని జయమంగళ శ్రీ ప్రతిబింబనము కన్పడును. అయిన నిది పాటవముకల శాస్త్రీయశైలిని విడనాడి అందుబాటులోనున్న అందఱిపలుకుల లోనికి వచ్చినది. కొన్నికొన్ని యెడల పలుకును విడిచిపుచ్చలేదు. అది అవసర మని మా మూర్తి తలంపు

నానాదేశ స్త్రీ పురుషుల స్వభావనిబంధనము కామశాస్త్రమునకు అభిప్రేతము. ప్రాక్కర్తలు భారతావనిమాత్రమె యెఱుంగుదురు. ఇతర భూవిశేషములు తెలియుటకు వారల కవకాశములు లేవు. కొంచ మున్నను వారటు చూడలేదు. దేశవిదేశముల ఏతదీయవార్తలును వారలకు లభింపలేదు. అందుచే మనము భారతదేశములోని ఆయారాష్ట్రీయువతుల స్వభావాదికములే మన యిప్పటి కామశాస్త్రములందు కన్పడును. నేడు భారతభూమి అందరి దృష్టి యందును నిలిచినది. ఇతర దేశవాసు లనేకులు ఇందు వసతులను కల్పించుకొన్నారు. పారసీకులపడుచులు, పఠానుపిల్లలు, మొఘులు ముగుదలు, ఆంగ్ల కన్యలు, ఫ్రాంసుపడుచులు, జర్మనునారీమణులు, అమెరికాఅబలలు, జపానులేమలు, చీనాభామలు, బర్మాభామినులు, రష్యా జావా సుమిత్రా మొదలగు దేశములయోషలు మనకు అంతట కన్పడుచున్నారు. వారి వీరి పరస్పరసంబంధ సంజాత లనేకలున్నారు. వారల స్వభావాభిరుచ్యాదికములను ప్రమాణకాల భావ స్వభావములనుకూడ చెప్పవలసిన అవసరమున్నది. ఉద్దీపకసామగ్రి ఉపభోగసామగ్రి పూర్వము ఒకరీతిగ ఉండెడివి. నేడు అనేకవిధముల మారినది. ఇప్పటిలో ప్రపంచసంబంధము భారతమునకు అనివార్యముగ నున్నది. ఉద్దీపకములు, ఉపభోగములు మనకు నానావిధముల వచ్చుటయె కాక స్త్రీ పురుషుల పరస్పరోపభోగములోని బాహ్యాభ్యంతర విధానములును చిత్రవిచిత్రములై పరిసరములందు పరుగులిడుచున్నవి. అవి యన్నియు నేడు నిరూపణీయములె కాదా? సెక్సు (Sex) వాఙ్మయముచూడగా మానవేతరప్రాణి సహవాసమును కూడ అభిలషించిన అన్యదేశీయ మత్తకాశినులున్నట్లు తెలియును. కృత్రిమముల నాశ్రయించి భావావసానము పొందుటయు పాశ్చాత్యులకు కొందరకు పరిచితమని ప్రథితిఉన్నట్లు సుజ్ఞేయమగుచున్నది. అట్టివారును ఈ భూమిలో నడుగుపాదుకొని ఉందురు. ఆ స్వభావములు తాదృశములు ఇంకను నేటి కామ

గ్రంథముల నిరూపణీయములై యుండునుగదా? తద్విజ్ఞానమును అభిలషించువారు లేకుందురా? ఇంకను ఈదృశములగు ఒకప్పటి కామరతి గ్రంథములంను రావచ్చును భవిష్యము నెవరెరుంగుదురు? ఇంతే ఆవియు నుండవలయునను అభినివేశమేల? వాటికిని ఇచటనే అవకాశమున్న ఇవియు వాత్స్యాయనీయములై అనుకొందురేమో? అని మా ఆంజనేయభావము కావచ్చును.

ఈ గ్రంథముల అధ్యయనము చేయుటకు తదుక్తవిధానముల అవలంబించుటకును కొందరే అధికారులు. అభిలాషకుల అందరును అధికారులమనుకొనుట అపచారము. కలహములేనివారు, తిండికలవారు, అనుద్విగ్నులు, అన్యాయబుద్ధి లేనివారు, అధర్మరతిలేనివారు ఏతదధికారులు కావచ్చును ఈ విషయమును వాత్స్యాయనుడే అచ్చటచ్చట సూచించును. స్త్రీలుకాని పురుషులుకాని కామమును కామముగా చేయుతలంపు కలవారందరును దీనిచదువుట కర్హులు. కామమును పురుషార్థముగా చూడగల చూపుకలవారలకే యిది.

శాలి. శ. ౧౮౭౬ }
వాసంతము }

శ్రీ మాధవరామశర్మ



శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

### ౧. సాధారణాధికరణం

### శాస్త్ర సంగ్రహాధ్యాయం

సూ॥ ౧. ధర్మార్థ కామేభ్యో నమః
౨. శాస్త్ర ప్రకృతత్వాత్ ౧-౧-౧-౨

వ్యా॥ ధర్మమూ, అర్థమూ, కామమూ అనే పురుషార్థాలకు నమస్కారం. న్యాయంగా ఆలోచిస్తే ఏదైనా ఇష్టదైవాన్ని గ్రంథారంభ సమయంలో నమస్కారంతో గౌరవించడం ధర్మం. అయినా శాస్త్రకారులైన వాత్స్యాయనులు తాము వ్రాయబోయే శాస్త్రానికి ధర్మార్థకామాలే ప్రధానవిషయాలు కావడంచేత వాటికే నమస్కరించారు.

3. తత్సమయావబోధకేభ్యశ్చాచార్యేభ్యః ౧-౧-3

అటుతరువాత ఆ ధర్మార్థకామాల స్వరూపాన్ని ఉపదేశించే ఆచార్యులకుగూడా నమస్కారం అన్నారు. అయితే శాస్త్రానికి ప్రధాన విషయాలు గదా అని పురుషార్థాలకు నమస్కారం చెయ్యడం ఉచితమే. కాని ఆ శాస్త్రకర్తలైన ఆచార్యులకు కూడా ఎందుకూ ఈ నమస్కార బాణాలు?

౪. తత్సంబంధాత్ ౧-౧-౪

వారికిగూడా మేము వ్రాయబోయే శాస్త్రంలో సంబంధం ఉన్నదిగనుక నమస్కరించాము అన్నారు.

౫. ప్రజాపతిర్హి ప్రజాస్సృష్ట్వా తాసాం స్థితినిబంధనం త్రివర్గస్య సాధన మధ్యాయానాం శత సహస్రే ణాగ్రే ప్రోవాచ. ౧-౧-౫

ఆదిలో బ్రహ్మదేవుడు ప్రజలను సృష్టించి, వారి ధర్మార్థ కామాలనే పురుషార్థాలకు సాధనభూతంగా ఉండటానికి లక్ష అధ్యాయాలతో కూడిఉన్న 'స్థితినిబంధనం' అనే శాస్త్రాన్ని చెప్పాడు.

౬. తస్యైకదేశం స్వాయంభువోమను ర్ధర్మాధికారికం పృథక్చకార. ౧-౧-౬

ఆ బ్రహ్మదేవుడు చెప్పిన 'స్థితినిబంధనం'లోనుంచి ధర్మానికి సంబంధించిన భాగాన్ని మనువు గ్రహించి 'ధర్మశాస్త్ర'మనే పేరుతో చెప్పాడు.

౭. బృహస్పతి రర్థాధికారికం. ౧-౧-౭

ఆ 'స్థితినిబంధనం'లోనుంచే అర్థానికి సంబంధించిన భాగాన్ని విడదీసి దేవగురువైన బృహస్పతి 'అర్థశాస్త్ర' మనే పేరుతో రచించాడు.

౮. మహాదేవానుచరశ్చ నందీ సహస్రేణాధ్యాయానాం పృథక్కామసూత్రం ప్రోవాచ. ౧-౧-౮

ఆ 'స్థితినిబంధనం'లోనుంచే విభజించి పరమశివుని అనుచరు

డైన నందికేశ్వరుడు పదివందల అధ్యాయాలతో 'కామశాస్త్ర' మనే పేరుతో చెప్పాడు.

౯. తదేవతు పంచభి రధ్యాయశతైః ఔద్దాలకి శ్వేత
కేతు స్సంచిక్షేప. ౧-౧-౯

ఆ నందికేశ్వరుని గ్రంథాన్నే ఉద్దాలకుని పుత్రుడైన శ్వేత కేతువు అయిదువందల అధ్యాయాల గ్రంథంగా సంక్షేపించి చెప్పాడు. ఈ శ్వేతకేతువు ఆ కాలంలోని ఒక పెద్ద సంఘ సంస్కర్తగా గోచరిస్తాడు. ఇతడు తనకాలంవరకూ మానవులలో ఉన్న కొన్ని దురాచారాలను (అతిథివచ్చినప్పుడు తన స్త్రీజనము నతనికడ కంపి తృప్తిపరచడం మొదలైన వాటిని) కూడదని నిష్కర్షగా ఖండించి స్త్రీపురుషులకు శీల విషయమై చక్కని నియమాన్ని యేర్పరిచాడు. ఈయన కామశాస్త్రం త్రేతాయుగంలోని ప్రజలకోసం వ్రాయబడ్డది.

౧౦. తదేవతు పునరధ్యర్ధ శతేన సాధారణ, సాంప్ర
యోగిక, కన్యా సంప్రయుక్తక, భార్యాధికారిక,
పారదారిక, వైశికౌ, పనిషదికైస్సప్తభిరధికరణైః
బాభ్రవ్యః పాంచాల స్సంచిక్షేప. ౧-౧-౧౦

ఆ ఔద్దాలకి సంక్షేపించి వ్రాసిన కామశాస్త్రాన్నే విషయం లోనూ, గ్రంథవిస్తారంలోనూ కూడా చాలావరకు తగ్గించి నూటయేబది అధ్యాయాలతో బాభ్రవ్యుడనే ఆయన ఒక కామశాస్త్రాన్ని వ్రాశాడు. ఈయన పాంచాల దేశీయుడు. ఈతని గ్రంథంలో సాధారణాధికరణం, సాంప్రయోగికాధి కరణం, కన్యా సంప్రయుక్తకాధికరణం, భార్యాధికారికాధి

కరణం, పారదారికాధికరణం, వైశికాధికరణం, ఔపనిషది కాధికరణం అనే నామధేయాలతో ఏడు అధికరణాలున్నాయి. ఈయన తన గ్రంథంలోని అధికరణాలకు వాటిలో వర్ణింపబడే విషయాన్నిపట్టే పేర్లుపెట్టాడు. ఈయన తన గ్రంథాన్ని ద్వాపరయుగంలోని ప్రజలకోసం రచించాడు.

౧౧. తస్యషష్ఠం వైశికమధికరణం పాటలిపుత్రికాణాం
గణికానాం నియోగా ద్దత్తకః పృథక్చకార. ౧-౧౧

బాభ్రవ్యుని కామశాస్త్రంలోనుంచి వైశికమనే అధికరణాన్ని మాత్రం ప్రత్యేకించి పాటలీపుత్రి నివాసులైన గణికల కోరిక పైన దత్తకుడనే ఆయన వ్రాశాడు. ఈ దత్తకుణ్ణి గూర్చి జనశ్రుతిగా ఒక కథ వినబడుతుంది. "పాటలీపుత్రం అనే పట్టణంలో ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయనకు వార్ధక్యంలో ఒక పుత్రుడు పుట్టాడు. శిశువు జనించినవెంటనే తల్లి గతించింది. ఇక ఈ పిల్లవాణ్ణి పెంచేభారం ఈ వృద్ధ బ్రాహ్మణునిమీద పడ్డది. ఆయన ఈ బాధ పడలేక ఆపిల్లవాణ్ణి మరి ఒక ఆవిడకు పెంచుకునేందుకు ఇచ్చి కొంతకాలానికి లోకాంతర గతుడయినాడు. ఆ పెంపుడు తల్లి ఆ పిల్లవానికి దత్తకుడని నామకరణం చేసింది. ఆ దత్తకుడు కూడా ఆమె పెంపకంతో వృద్ధిపొంది సకలశాస్త్రాలలోనూ, సకలకళలలోనూ అందె వేసిన చెయ్యి అనిపించుకున్నాడు. మంచి వక్తకూడా కావడం చేత దత్తకాచార్యుడని పేరు తెచ్చుకున్నాడు. ఇలా ఉండగా ఒకరోజున ఆయనకు 'లోకయాత్ర'ను గూర్చి తెలుసుకోవాలని బుద్ధిపుట్టింది. ఆ విద్య వేశ్యల అధీనంలో ఉన్నదని

ఊహించి ఆయన వాళ్ళ పరిచయంకొద్దిగా సంపాదించి వాళ్ల వల్ల 'లోకయాత్రను' మెల్లగా సంగ్రహించాడు. వాళ్లే మళ్లీ ఆ శాస్త్రంలో ఉన్న రహస్యాలను బోధించమని తనను బ్రతిమాలేవిధంగా నేర్పుకున్నాడు. ఒకప్పుడు వీరసేన మొదలైన కొందరు వేశ్యలు ఆయనదగ్గరచేరి 'పురుషులను రంజింపచేసే విధానాన్ని మాకు ఉపదేశించండి' అని కోరారు. వాళ్ల ప్రార్థనమీద తానీగ్రంథాన్ని వ్రాశాడు"అని కొందరంటున్నారు. మరికొందరు 'ఈయన చాలా వేశ్యాలోలుడనీ, ఆ సందర్భంలో ఒక మహాపురుషునివల్ల స్త్రీ స్వరూపుడై పోయే విధంగా పెద్ద శాపపు దెబ్బ తిన్నాడనీ, కొంతకాలం అలా స్త్రీరూపంతో ఉండి వెనుక శాపం ఇచ్చిన మహాపురుషుని చేత అనుగ్రహింపబడి మరల తన పురుషరూపాన్ని పొందాడనీ, ఈ స్త్రీపురుష రతి రసానుభవాలు రెండూ పొందటం చేత ఈ గ్రంథాన్ని పృథక్కరించి వ్రాయగలిగాడ'నీ మరొక విధంగా చెవుతారు. ఈ రెండో గాథ అంత విశ్వసనీయంగా లేదు. ఈయనను ఉభయరసజ్ఞునిగా శాస్త్రకారులు గ్రహించి ఉంటే వాత్స్యాయనులుగూడా "ఉభయరసజ్ఞోదత్తకః" అని వ్రాసిఉండేవారు. అందువల్ల ఈయన గణికల కోరికపై ఈ భాగాన్ని పృథక్కరించి రచించాడనటమే యుక్తంగాతోస్తుంది.

౧౨. తత్ప్రసంగా చ్చారాయణిః సాధారణ మధికరణం పృథక్ప్రోవాచ. ౧-౧-౧౨

బాభ్రవ్యుని గ్రంథంలోనుంచి వైశికమనే అధికరణాన్ని దత్తకుడు పృథక్కరించినట్లే చారాయణుడు సాధారణాధికరణాన్ని పృథక్కరించి రచించాడు.

౧౩-౧౪. సువర్ణనాభ సాంప్రయోగికం, ఘోటకముఖః కన్యాసంప్రయుక్తకం, గోనర్దీయో భార్యాధికారికం, గోణికాపుత్రః పారదారికం, కుచుమార ఔపనిషదికం. ౧-౧-౧౩-౧౪

ఇలాగే సువర్ణనాభుడు సాంప్రయోగికాధికరణాన్నీ, ఘోటకముఖుడు కన్యా సంప్రయుక్తాధికరణాన్నీ, గోనర్దీయుడు భార్యాధికారికాధికరణాన్నీ, గోణికాపుత్రుడు పారదారికాధికరణాన్నీ, కుచుమారుడు ఔపనిషదికాధికరణాన్నీ విభజించి వ్రాశారు.

౧౫. ఏవం బహుభిరాచార్యైః తచ్ఛాస్త్రం ఖండశః ప్రణీత ముత్సన్న కల్పం భూయాత్. ౧-౧-౧౫

ఇలా బాభ్రవ్యుని కామశాస్త్రం అంతాకూడా తునాతునకలుగా ఆచార్యులచేత విభజింపబడడంచేత లుప్తప్రాయం అయిపోయింది. అంటే నంది మొదలైన పూర్వాచార్యుల కామశాస్త్రం అంతా దాదాపు ఆ కాలానికి ప్రచారంలో లేకుండా పోయిందన్నమాట.

౧౬. తత్ర దత్తకాదిభిః ప్రణీతానాంశాస్త్రావయవానాం ఏకదేశత్వాత్, మహదితిచ బాభ్రవీయస్య దురధ్యేయత్వాత్, సంక్షిప్య సర్వమర్థ మల్పేన గ్రంథేన కామసూత్రమిదం ప్రణీతవాన్. ౧-౧-౧౬.

మన వాత్స్యాయనునికన్న ప్రాచీనంగాఉన్న దత్తక, చారాయణ, సువర్ణనాభ, ఘోటకముఖ, గోనర్దీయ, గోణికాపుత్ర, కుచుమారుల గ్రంథాలు కామశాస్త్రంలో ఒక్కొక్క

భాగాన్ని మాత్రమే చెప్పడంచేతనూ, బాభ్రవీయుని గ్రంథం చాలా పెద్దది కావడంవల్లనూ, చదువుకునేవాళ్ళకు చాలా క్లేశపాత్రం కావడంచేతనూ కామశాస్త్రంలో ఉన్న సమస్త విషయమూ సంగ్రహరూపంగా ఈకామసూత్రంలో వాత్స్యాయనసిచేత వ్రాయబడుతోంది.

౨౦-౨౮. తస్యాయం ప్రకరణాధికరణసముద్దేశః. శాస్త్రసంగ్రహః, త్రివర్గప్రతిపత్తిః, విద్యాసముద్దేశః, నాగరకవృత్తం, నాయకసహాయ దూతీ కర్మ విమర్శః, ఇతి సాధారణ మధికరణం, ప్రకరణానిపంచచ.

౧-౧-౨౦-౨౮.

ఈ కామశాస్త్రగ్రంథంలో చెప్పబోయే ప్రకరణాధికరణాలు సంగ్రహరూపంగా ఈ క్రింద వ్రాస్తున్నారు. మొదటిది సాధారణాధికరణం, ఇందులో అయిదు ప్రకరణాలుంటాయి. 1. శాస్త్రసంగ్రహాధ్యాయం:- ఈ శాస్త్రంలో వర్ణింపబోయే విషయాలు సంగ్రహంగా ఇందులో వర్ణింపబడతాయి గనుక దీనికి శాస్త్రసంగ్రహం అని పేరు వచ్చింది. 2. త్రివర్గ ప్రతిపత్త్యధ్యాయం:- ధర్మార్థకామాలనే త్రివర్గాన్ని పరస్పరమూ (ఒకదానికొకటి) విరుద్ధం కాకుండా సేవించే విధానం ఇందులో వర్ణింపబడుతుంది కాబట్టి దీన్ని త్రివర్గప్రతిపత్తి అన్నారు. 3. విద్యాసముద్దేశాధ్యాయం:- విద్యలంటే కళలు. ఆ కళారాధనకు ఎవ్వరెవ్వరు అధికారులో ఆ మొదలైన చర్చలు ఇందులో వర్ణింపబడతాయిగనుక దీన్ని విద్యాసముద్దేశం అన్నారు. 4. నాగరకవృత్తాధ్యాయం:- నాగరకు

లంటే పట్టణాలలో నివసించేవాళ్లు. వాళ్ల ప్రవర్తనమే నాగరక వృత్తమంటే. ఈ నాగరకవృత్తం ఇందులో వర్ణింపబడుతుంది. అందువల్ల దీన్ని నాగరకవృత్తం అన్నారు. 5. నాయక సహాయ దూతీకర్మ విమర్శాధ్యాయం:- నాయికానాయకుల సహాయకులూ, దూతికలూ, మొదలైనవారి పనులు ఇందులో వర్ణింపబడతాయిగనుక దీన్ని దూతీకర్మ విమర్శ అన్నారు.

సూ-౮. ప్రమాణ కాల భావేభ్యో రతావస్థాపనం, ప్రీతి విశేషాః, ఆలింగన విచారాః, చుంబనవికల్పాః, నఖరదనజాతయః, దశనచ్ఛేద్యవిషయాః, దేశ్యా ఉపచారాః, సంవేశనప్రకారాః, చిత్రరతాని, ప్రహణనయోగాః, తద్యుక్తాశ్చ సీత్కృతోపక్రమాః, పురుషాయితం, పురుషోపసృప్తాని, ఔపరిష్టకం, రతారంభం, అవసానికం, రతవిశేషాః, ప్రణయకలహాః. ౧.౧. సూ-౮.

ఇతి సాంప్రయోగికం ద్వితీయమధికరణం, అధ్యాయాదశ, ప్రకరణానిసప్తదశ.

ఇక రెండవది సాంప్రయోగికమనే పేరుగల అధికరణం. ఈ అధికరణంలో స్త్రీపురుషుల అంగపరిమాణమూ, రేతస్ఖలన కాలమూ, స్త్రీ పురుషుల భావప్రాప్తినిగూర్చిన విషయమూ, అనే యీ మూడూ కలిపి మొదటి అధ్యాయంలో వర్ణిస్తారు. కనుక దీన్ని రతావస్థాపనాధ్యాయం అన్నారు. ఇలాగే క్రమంగా ప్రణయవిశేషాలూ, స్పృష్టకమూ మొదలైన ఆలింగన విచారాలూ, చుంబనచర్చలూ, గోళ్లరకులూ, పంటి

నొక్కులూ, దేశీయాలైన ఉపచారాలూ, సంభోగంకోసం స్త్రీపురుషులు ఉపవేశించడమూ, చిత్రరతాలూ, ప్రణయ తాడనాలూ, రతికూజితాలూ, పురుషాయితమూ, పురుషోప సృప్తమూ, ఔపరిష్టకమూ, సురతారంభమూ, సురతాంతమూ, రతివిశేషాలూ, ప్రణయకలహాలూ, ఇవన్నీ యీ పేర్లతో ఈ రెండో అధికరణంలో వర్ణింపబడతాయి. ఇందులో అధ్యాయాలు పది, ప్రకరణాలు పదిహేడు ఉంటాయి.

౭౩-౭౯. వరణవిధానం, సంబంధనిర్ణయశ్చ, కన్యావిస్రంభణ విధానం, బాలాయాఉపక్రమాశ్చ, ఇంగితాకార సూచనం, ఏకపురుషాభియోగాశ్చ, ప్రయోజ్యస్యాను వర్తనం, అభియోగతశ్చకన్యాయాః ప్రతిపత్తిశ్చ, ఇతి కన్యాసంప్రయుక్తకం తృతీయమధికరణం, అధ్యాయాశ్చపంచ, ప్రకరణాని నవ. ౧.౧.౭౧.౭౯

ఇక మూడవది కన్యాసంప్రయుక్తకాధికరణం. ఇందులో కన్యకను వరించే విధానమూ, కన్యకను వివాహంచేసుకునే విధానమూ, కులకాంతను వశపరచుకునే విధానమూ, బాలలతో ఉపక్రమించే విధానమూ, అభిప్రాయాన్ని సూచించే విధానమూ, ప్రయోజ్యుణ్ణి నివర్తింపచెయ్యడమూ, దాది మొదలైన వాళ్లవల్ల కన్యకను పొందే విధానమూ వర్ణింపబడతాయి.

౫౦-౫౧. ఏకచారిణీవృత్తం, ప్రవాసచర్యా చ.

౧.౧.౫౦-౫౧.

ఒక స్త్రీ ఒక పురుషునిచేత వివాహం చేసుకోబడినతరువాత భార్య అని వ్యవహరింపబడుతుంది. ఆ భార్యను గూర్చి చెప్పే అధికరణం కాబట్టి దీన్ని భార్యాధికరణం అన్నారు శాస్త్రకారులు. ఇది నాలుగో అధికరణం. ఇందులో రెండు అధ్యాయాలుంటాయి. ప్రకరణాలు ఎనిమిది. తన భర్తచేత తాను ఒక్కతే ప్రేమింపబడి 'భార్య' అనే పదవిలో ఉన్న ఆడది 'ఏకచారిణి' అని పిలువబడుతుంది. ఆమె వృత్తాంతాన్ని వర్ణించే అధ్యాయాన్ని ఏకచారిణీ వృత్తాధ్యాయం అన్నారు. ఈ ఏకచారిణి తనభర్త దేశాంతరంలో ఉంటే ఎలాప్రవర్తించాలో చెప్పే అధ్యాయానికి 'ప్రవాసచర్య' అని పేరు పెట్టారు.

౫౨-౫౭. సపత్నీషు జ్యేష్ఠావృత్తం, కనిష్ఠావృత్తం, పునర్భూవృత్తం, దుర్భగావృత్తం, అంతఃపురికం, పురుషస్య బహ్వీషు ప్రతిపత్తిః, ఇతి భార్యాధికారికం చతుర్థమధికరణం, అధ్యాయాద్వౌ, ప్రకరణాన్యష్టౌ.

౧.౧.౫౨-౫౭.

చాలామంది సవతులుంటే వాళ్లలో జ్యేష్ఠభార్య అనుసరించవలసిన విధానాలూ, చాలామంది సవతులలో చివరభార్య నడచుకోవలసిన విధానాలూ, పునర్భువు, దుర్భగ, అంతఃపురిక అనేవాళ్ల వర్తనాలూ ఈరెండు అధ్యాయాలలోనూ చెప్పబడతాయి.

౫౮-౬౭. స్త్రీ పురుషశీలావస్థాపనం, వ్యావర్తనకారణాని, స్త్రీషుసిద్ధాఃపురుషాః, అయత్నసాధ్యాయోషితః, పరిచయకారణాని, అభియోగాః, భావపరీక్షా, దూతీకర్మాణి, ఈశ్వరకామితం, అంతఃపురికం, దారరక్షితం, ఇతి పారదారికం, పంచమమధికరణం, అధ్యాయాష్షట్, ప్రకరణానిదశ. ౧.౧.౫౮-౬౭

పరస్త్రీ రీతినిగూర్చి చెప్పేదికాబట్టి ఈ ప్రకరణానికి పారదారిక మని నామకరణం చేశారు. ఇందులో అధ్యాయాలు ఆరుంటాయి. ప్రకరణాలు పదిఉంటాయి. స్త్రీ పురుషుల స్వభావాలూ, స్త్రీలు విముఖులు కావడానికి కారణాలూ, స్త్రీల విషయంలో సిద్ధులయే పురుషులను నిరూపించడం, ప్రయత్నం గూడాలేకుండా లభ్యపడే స్త్రీల విచారణ, అనేవి పై ప్రకరణాలలో వర్ణింపబడే విషయాలు.

౬౮-౭౯. గమ్యచింతా, గమనకారణాని, ఉపావర్తనవిధిః, కాంతానువర్తనం, అర్థాగమోపాయాః, విరక్తలింగాని, విరక్తప్రతిపత్తిః, నిష్కాసనప్రకారాః, విశీర్ణప్రతిసంధానం,లాభవిశేషః, అర్థానర్థానుబంధ సంశయవిచారః, వేశ్యావిశేషాశ్చ, ఇతి వైశికం షష్ఠమమధికరణం, అధ్యాయాష్షట్, ప్రకరణాని ద్వాదశ. ౧.౧.౬౮-౭౯

వేశ్యలకు సంబంధించిన విషయం ఇందులో చర్చించబడుతుంది గనుక దీన్ని 'వైశికాధికరణం' అన్నారు. దీనిలో వర్ణింపబడే విషయం సంగ్రహంగా ఇక్కడ నిరూపింపబడుతున్నది. ఆరు

అధ్యాయాలతోనూ, పన్నెండు ప్రకరణాలతోనూ, ఈ ఆరో అధికరణం ఒప్పుతుంది. ఇందులో వేశ్యాగమనానికి నియోగింప తగిన సహాయకుల విమర్శ, పొందతగిన పురుషులనూ, పొంద గూడని పురుషులనూ నిర్దేశించడమూ, కారణాలను పరామర్శించడమూ, పొందతగినవాళ్లను సమీపానికి రప్పించుకోడమూ, అనేవి ప్రథమాధ్యాయంలోనూ, కాంతానువృత్తం రెండో అధ్యాయంలోనూ, ధనార్జనోపాయాలూ, విరక్తులను గుర్తించడమూ, నిష్కాసనవిధానమూ, మూడో అధ్యాయంలోనూ, వియోగులను సమకూర్చడమూ, ప్రతి సంధాన విధానమూ నాలుగో అధ్యాయంలోనూ, లాభవిశేషాలు అయిదో అధ్యాయంలోనూ, అర్థానర్థానుబంధ సంశయవిచారం ఆరో అధ్యాయంలోనూ వివరింపబడతాయి.

౨౦-౨౭. సుభగంకరణం, వశీకరణం, వృష్యాశ్చయోగాః, నష్టరాగప్రత్యాయనం, కామవృద్ధిః, వృద్ధివిధయః, చిత్రాశ్చయోగాః, ఇత్యౌపనిషదికం సప్తమమధికరణం, అధ్యాయాద్వౌ, ప్రకరణానిషట్, ఏవం షట్త్రింశదధ్యాయాః, చతుష్షష్టిః ప్రకరణాని, అధికరణాస్సప్తసపాదం, శ్లోకసాహస్రం. ఇతి శాస్త్రస్య సంగ్రహః. ౧.౧.౨౦-౨౭.

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాధారణే ప్రథమేఽధికరణే శాస్త్రసంగ్రహః ప్రథమోధ్యాయః.

తంత్రావాపాదులచేత కామాన్ని పొందలేకపోతే ఔషధ ప్రయోగం అవసరం అవుతుంది. అలాటి విధానం ఇందులో

వర్ణింపబడుతుంది గనుక ఈ ఏడో అధికరణాన్ని ఔపనిషది కాధికరణం అన్నారు. ఇందులో రెండధ్యాయా లుంటాయి. ప్రథమాధ్యాయంలో సుభగంకరణమూ, నష్టమైనకామాన్ని ప్రత్యాయనంచెయ్యడమూ, కామవృద్ధియోగాలూ వర్ణింపబడ తాయి. ఇక ద్వితీయాధ్యాయంలో నష్టమైన అనురాగాన్ని ప్రత్యాయనంచెయ్యడమూ, అనురాగవృద్ధియోగాలూ, చిత్రి యోగాలూ, చెప్పబడతాయి. ఈప్రణాళికతో వాత్స్యాయన కామసూత్రాలు ముప్పదిఆరు అధ్యాయాలతోనూ, అరువది నాలుగు ప్రకరణాలతోనూ, ఏడు అధికరణాలతోనూ, పది వందల శ్లోకసంఖ్యతోనూ ప్రఖ్యాతిని పొందుతున్నాయి.

ఇట్లు భారధ్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ,
ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయ
మూర్తిచేత వాత్స్యాయన కామసూత్రములకు
జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన
'రతి రేఖ' అను తెలుగు వ్యాఖ్యలోని
సాధారణాధికరణంలో
శాస్త్రసంగ్రహాధ్యాయం
ముగిసింది.

శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుఁగు వ్యాఖ్యాన సమేతం

### ౧. సాధారణాధికరణం

### ౨. త్రివర్గ ప్రతిపత్త్యధ్యాయం

౧౧. శతాయుర్వై పురుషః విభజ్యకాల మన్యోన్యాను బద్ధం, పరస్పరస్యానుపఘాతకం, త్రివర్గం, సేవేత. ౧.౨.౧

త్రివర్గం అంటే ధర్మార్థకామాలు. శాస్త్రానికి ఈ త్రివర్గమే ఫలం. ఆ త్రివర్గం సులువుగా లభించనప్పుడు ఉపాయ పూర్వకంగా లభింపచేసుకోవాలి మానవుడు. అందువల్ల ఆత్రివర్గాన్ని గూర్చి యిక్కడ చెవుతున్నారు. సాధారణంగా ఉపాయం మూడువిధాలుగా ఉంటుంది. 1. అనుష్ఠానం. 2. అవబోధం. 3. సంప్రతిపత్తి. అనుష్ఠానంఅంటే ఆచరించడం. అవబోధం అంటే తెలుసుకోడం. సంప్రతిపత్తి అంటే ఫలితాన్ని అనుభవించడం అని అర్థం. పైమూడిటిలోనూ మొదటి దైన అనుష్ఠానం ముఖ్యం కాబట్టి అదే యిక్కడ నిరూపితం అవుతుంది.

సాధారణంగా పురుషునికి ఆయుః పరిమాణం నూరు సంవత్సరాలు. ఈ నూరు సంవత్సరాలకాలంలోనూ ధర్మార్థ కామాలను ఒకదానితో ఒకటి సంబంధంకలిగి ఉండేట్టుగా నున్నూ, ఒకదాని కొకటి విరుద్ధంకాకుండానున్నూ విభజించు కుని సేవించాలి.

౮౯. బాల్యేవిద్యాగ్రహణాదీనర్థాన్. ౧.౨.౨

పైనచెప్పిన నూరు సంవత్సరాల ఆయుర్దాయాన్నీ విభాగంచేసి ఉపయోగించుకునే విధానం ఈక్రింద చెప్పబోతున్నారు. గ్రంథాంతరంలో వయోవిభాగం ఇలాఉంది. 'మానవునికి పదునారోయేడు వచ్చేవరకూ బాల్యం, అప్పటినుంచీ డెబ్బది యవయేడు వచ్చేవరకూ మధ్యమం. అటుతరువాత వార్ధక్యం' అని ఉన్నది. కాని న్యాయశాస్త్రంలో "గ్రహణధారణ పటు ర్బాలః" (ఎవ్వడుచెప్పినది గ్రహించగలుగుతాడో, గ్రహించినదాన్ని జ్ఞాపకం ఉంచుకోగలుగుతాడో వాడు బాలుడు) అనిఉంది. బాల్యం అంటే బాలుడుగా ఉండేదశ అన్నమాట. విద్య అంటే చదువు, లేక జ్ఞానము. పై బాల్య దశను విద్యను సంపాదించుకోడానికి విభజించుకుని వినియో గించుకోవాలి.

౯౦. కామంచ యౌవనే. ౧.౨.3

యువకుడుగా ఉండే దశనే యువకదశ అంటారు. ఈ దశలో విద్యనీ, కామాన్ని గూడా సేవించాలి. కామసాధనకు సహాయ భూతమైనది అర్థం. కాబట్టి అర్థాన్ని గూడా సేవించాలి.

౯౧. స్థావిరే ధర్మం మోక్షంచ. ౧.౨.౪

స్థావిరం అంటే వృద్ధుడుగా ఉండేదశ. ఈ దశలో ధర్మాన్నీ మోక్షాన్నీ గూడా సేవించాలి.

౯౨. అనిత్యత్వాదాయుషో యథోపపదంవా సేవేత. ౧.౨.౫

ఆయుష్యం స్థిరమైనదికాదు. అంటే ప్రతిమానవుడూ పైన చెప్పినవిధంగా నూరు సంవత్సరాలూ బ్రదుకుతున్నాడా? లేదు. అందువల్ల ఆయువు ఎంతవరకుఉంటుందో నమ్మకంలేదు. ఈ కారణంచేత బాల్యంనుంచీ ధర్మార్థాలనుకూడా సేవించాలి. వార్ధక్యంలో ధర్మాన్నీ, ఓపికఉంటే అర్థకామాలనుగూడా సేవించవచ్చు.

౯౩. బ్రహ్మచర్యమేవ త్వావిద్యాగ్రహణాత్. ౧.౨.౬

విద్యాగ్రహణాదులు పైనచెప్పిన మూడుదశలలోనూ సంభవిస్తాయి. కాబట్టి ప్రత్యేకించి బాల్యానికి నియమంచేస్తున్నారు. విద్యాసముపార్జనం పూర్తి కానంతవరకూ బ్రహ్మచర్యాన్నవలంబించాలి. కాని కామాన్ని సేవించరాదు. అలా సేవించితే అధర్మప్రవర్తన మవుతుంది. విద్యగూడా నాశంచెందుతుంది. దానివల్ల ధర్మార్థాలు నాశనమవుతాయి. విద్యాగ్రహణసమయంలో భూమ్యాదులు సంపాదించుకోడానికి నియమంలేదు. కొందరు పై మూడుదశలకూ నూరు సంవత్సరాలనూ పంచి ముప్పదిమూడు సంవత్సరాలనూ బాల్యంక్రింద లెక్కకట్టి, పదునారోసంవత్సరంనుంచీ కామం ప్రాప్తిస్తుంది గనుక

బాల్యంలోకూడా ధర్మార్థకామాలను మూడింటినీ సేవించవచ్చునన్నారు.

౭౪. అలౌకిత్వా దదృష్టార్థత్వా దలౌకికానాం యజ్ఞాదీనాం శాస్త్రాత్ప్రవర్తనం, లౌకికత్వా ద్దృష్టార్థత్వాచ్చ ప్రవృత్తేభ్యశ్చ మాంసభక్షణాదిభ్య శ్శాస్త్రాదేవ నివారణం ధర్మః. ౧.౨.౮

అలౌకికాలూ, అదృష్టార్థాలూ, అయిన యజ్ఞయాగతపస్స్వర్గాదులను ఆచరించనివారిని ఆ ఆచరణకు ప్రోత్సహించేది శాస్త్రమే. లౌకికాలూ, దృష్టార్థాలూ, ఆచరణలోఉన్నవీ అయిన మాంసభక్షణాదులను నిషేధించేదిన్నీ శాస్త్రమే. పై రెండురకాల ధర్మభేదాన్నీ తెలుసుకునేమార్గం ఈక్రింద చెపుతున్నారు.

౭౫. తం శ్రుతేర్ధర్మజ్ఞ సమవాయాచ్చ ప్రతిపద్యేత ౧.౨.౯

ఆ ప్రభేదాన్ని వేదంవలనగానీ, ధర్మజ్ఞులైన పెద్దల పరిషత్తువల్లగానీ తెలుసుకోవాలి.

౭౬. విద్యాభూమి హిరణ్య పశు ధాన్య భాండోపస్కర మిత్రాదీనామర్జనం, అర్జితస్య పరిరక్షణం అర్థః. ౧.౨.౭.

విద్యలంటే ఆన్వీక్షికి మొదలైనవి. భూమిఅంటే దున్ని, విత్తులు చల్లి పంటలుపండించేపొలం. హిరణ్యం అంటే బంగారమూ, వెండీ, కంచూ, మొదలైనవి. పశువులంటే గుర్రాలూ, ఏనుగులూ, గోవులూ, మొదలైనవి. ధాన్యాలు మూడు

రకాలు. 1. పూర్వ్యాలు. 2. మధ్యాలు. 3. అపరాలు. పూర్వ్యాలంటే తొలకరినాటినుంచీ వ్యవసాయంచేసి పండించేవి. వడ్లూ, జొన్నలూ, తమిదలూ మొదలైనవి. అపరాలంటే సంవత్సరానికి చివరభాగంలో పండించేవి. కందులూ, పెసలూ, మినుములూ మొదలైనవి. ఇక సంవత్సర మధ్యకాలంలో పండించే తక్కినధాన్యాలన్నీ మధ్యాలు. భాండోపస్కరణం అంటే కొయ్యతోనూ, మట్టితోనూ, చర్మతోనూ, లోహాల తోనూ తయారైనకుండలూ, మానుముంతలూ మొదలైనవి. ఇంకా ఇలాటి గృహోపయోగ్యాలైన వస్తువులను సంపాదించుకుని వృద్ధిపరుచుకోవాలి. రక్షించుకోవాలి. మిత్రసంఘాన్ని గూడా సమకూర్చుకోవాలి. పైనచెప్పినదంతా అర్థానికి సంబంధించినవిషయం.

౯౭. తం అధ్యక్ష ప్రచారా ద్వార్తాసమయవిద్భ్యో వణిగ్భ్యశ్చేతి. ౧.౨.౧౦

సంపాదించుకున్న అర్థాన్ని వృద్ధిపరుచుకునేవిధానాన్ని 'అధ్యక్ష ప్రచారం' అనేగ్రంథంవల్లా, వార్తాశాస్త్రాన్ని తెలుసుకున్న పెద్దలవల్లా, వర్తకులవల్లా, వ్యవసాయదారులవల్లా, గోపాలకుల వల్లా నేర్చుకోవాలి.

౯౮. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణానాం ఆత్మసంయుక్తేన మనసా అధిష్ఠితానాం స్వేషు విషయే ష్వానుకూల్యతః ప్రవృత్తిః కామః. ౧.౨.౧౧.

కామశాస్త్రం వ్రాయబోతున్నారు కాబట్టి ముందుగా కామం అంటే ఏమిటో చెప్తున్నారు. ఆత్మఅంటే జీవుడు. ఆ జీవు

నితో కూడిఉన్న మనస్సుయొక్క పరిపాలనలోఉండి చెవి, చర్మమూ, నేత్రమూ, నాలుకా, నాసికా అనే బుద్ధీంద్రియాలు తమతమవిషయాలలో అనుకూలంగా ప్రవర్తించడం కామం. ఆత్మ, చెవి మొదలైన యింద్రియాలద్వారా విషయాలను అనుభవిస్తూ ఏ సుఖాన్ని పొందుతుందో ఆ సుఖాన్నే సామాన్యంగా కామం అంటారు. ఇది సామాన్యకామం.

౯౯. స్పర్శ విశేషవిషయే త్వస్యా ఆభిమానికసుఖాను
విద్ధా ఫలవత్యర్థప్రతీతిః ప్రాధాన్యాత్కామః.
౧.౨.౧౨.

ఇక విశేషకామాన్ని యీ సూత్రంలో వివరిస్తున్నారు. స్పర్శ విశేషమంటే సురతం. ఆ సురతసమయంలో స్త్రీ పురుషరూపాలతో ఉన్నజీవులకు చుంబనాదులవల్లకలిగే ఆభిమానిక సుఖంతోకూడిఉన్న ఫలవంతమయిన అర్థ ప్రతీతేకామం. ఇది ప్రధానకామం. అర్థప్రతీతిఅంటే స్ఖలనావస్థలో ఏ ఇంద్రియం ఆనందానికి కారణమైన కర్మను పుట్టిస్తుందో ఆ యింద్రియం యొక్క ఆంతరంగికస్పర్శ విశేషాన్నిగూర్చిన భావం అన్న మాట. ఆభిమానిక సుఖంఅంటే నేను ఈ పురుషునిచేత గిచ్చబడుచున్నాను, రక్కబడుతున్నాను అని స్త్రీ వ్యక్తీన్నీ, నేను ఈస్త్రీని ముద్దుపెట్టుకుంటున్నాను, ఆలింగనం చేసుకుంటున్నాను అని పురుషవ్యక్తీన్నీ ఒకరిని ఒకరు అభిమానించుకుంటూ పొందేసుఖం అన్నమాట.

౧౦౦. తం కామసూత్రాన్నాగరక జన సమవాయాచ్చ ప్రతిపద్యేత. ౧.౨.౧౩

పైన చెప్పిన సామాన్యకామాన్నీ, విశేషకామాన్నీ గూడా ఈ కామసూత్రాలవల్లగానీ, ఈ సూత్రాన్ని ఎరిగిఉన్న ఏ నాగరక జనబృందంవల్లగానీ తెలుసుకోవాలి.

౧౦౧. తేషాం సమవాయే పూర్వః పూర్వో గరీయాన్. ౧. ౨.౧౪

ప్రస్తుతం చెప్పబోయేది త్రివర్గ ప్రతిపత్తి కాబట్టి ఆత్రివర్గమనే ధర్మార్థకామాలను ఎలా ఉపయోగించుకోవాలో నిరూపిస్తున్నారు. పై మూడుపురుషార్థాలనూ ఒక్కమాటుగా సేవించడంకుదరదు. అందువల్ల వాటిని సేవించేవిధానంలోఉన్న బరువు సుళువులను తెలుసుకుని సేవించాలి. ధర్మార్థకామాలు మూడూ ఒక్కమాటు సమకూడితే, కామాన్ని ఒదిలి అర్థాన్నీ అర్థాన్నివిడిచి ధర్మాన్నీ సేవించాలి. అంటే ఒకచోట ధర్మమూ అర్థమూ ప్రాప్తిస్తుంటే, అర్థాన్నివిడిచి ధర్మాన్నే స్వీకరించాలనీ, ఒకచోట అర్థకామాలు రెండూ ఒక్కమాటు ప్రాప్తిస్తుంటే, కామాన్నివదలి అర్థాన్నే గ్రహించాలనీ చెప్పినట్లైనదన్నమాట. సారాంశం ఏమంటే ధర్మార్థాలను విరోధించకుండా, వాటికి అడ్డుపడకుండా లభించేకామాన్నే సేవించాలని తేలింది. కాబట్టి కామంకంటె అర్థంగొప్పది అనిన్నీ, అర్థంకంటె ధర్మం ఉత్తమం అనిన్నీ సూత్రకారులు చెప్పిఉన్నారు.

౧౦౨. అర్థశ్చ రాజ్ఞః. ౧.౨.౧౫

పై విధానం అందరికీ నిర్ణయింపబడలేదు. ధర్మార్థకామాలకు సంఘర్షణయేర్పడితే రాజపురుషుడు ధర్మకామాలకంటె అర్థానికే ఎక్కువప్రాముఖ్యం ఇవ్వాలి.

౧౦౩. తన్మూలకత్వా ల్లోకయాత్రాయాః. ౧.౨.౧౬

బ్రాహ్మణులూ, క్షత్రియులూ, వైశ్యులూ, శూద్రులూ మొదలైనవర్ణాలూ, బ్రహ్మచర్యమూ, గార్హస్థ్యమూ, వానప్రస్థమూ, సన్యాసమూ అన్న ఆశ్రమాలూ వీటికి సంబంధించినక్రమమే లోకయాత్ర అంటారు. ఆలోకయాత్ర తలక్రిందు కాకుండా ఉండాలనేదృష్టితో లోకసంరక్షణం చెయ్యడం రాజులకు ధర్మం. అది ప్రభుశక్తిమీద ఆధారపడిఉంటుంది. ఆ ప్రభుశక్తి కోశబలంమీదా, దండబలంమీదా నిలిచిఉంటుంది. కోశదండాలకుగూడా మూలాధారమైనది అర్థం. కాబట్టి లోకయాత్ర అర్థమూలమన్నమాట.

౧౦౪. వేశ్యాయాశ్చ. ఇతి త్రివర్గప్రతిపత్తిః. ౧.౨.౧౭

వేశ్యకుగూడా అర్థమే ముఖ్యం. ఆమెజీవిక ధనసంపాదనమే ఉద్దేశంగాకలిగిఉంటుంది. కామబాధచేత తొందరపడుతున్న బ్రాహ్మణుడూ, ధనికుడైన నాగరకుడూ ఒక్కమాటుగా తటస్థించినప్పుడు ధర్మంమాట దూరంగాపెట్టి ఇష్టంలేకపోయినా భాగ్యవంతుణ్ణే సేవించాలి. ఇలా త్రివర్గాన్ని సేవించేవిధానం ముగిసింది.

౧౦౫. ధర్మ స్యాలౌకికత్వా త్తదభిధాయకం శాస్త్రం యుక్తం. ౧.౨.౧౮

ఇక కామశాస్త్రాన్ని నిందించేవారిమాటలు కొన్ని చెప్పి, అటుపైన కామశాస్త్రం అవసరంగా గ్రహించవలసినదే అని నిరూపించబోతున్నారు శాస్త్రకారులు. ధర్మం అలౌకికం కాబట్టి ఆ అలౌకికధర్మాన్ని జ్ఞాపకంచేసి మానవుణ్ణి ధర్మమార్గంలో నడిపించడంకోసం ధర్మశాస్త్రాన్ని వ్రాయడం యుక్తమే.

౧౦౬. ఉపాయపూర్వకత్వా దర్థసిద్ధేః ౧.౨.౧౯

ధనం సంపాదించాలంటే ఉపాయంకావాలి. దాన్ని సంరక్షించాలన్నా ఉపాయంకావాలి. అందువల్ల అర్థశాస్త్రాన్ని చెప్పడంకూడా అవసరమే.

౧౦౭. ఉపాయ ప్రతిపత్తి శ్శాస్త్రాత్ ౧.౨.౨౦

ఉపాయంలేకుండా ప్రయత్నించేవానికి ధనప్రాప్తిగానీ, ధనవృద్ధిగానీ ఉండదు. మీదుమిక్కిలి ధనహీనునికి బుద్ధిహీనతకూడా యేర్పడుతుంది. బుద్ధిహీనుడు ప్రతి విషయంలోనూ సంశయగ్రస్తుడౌతాడు. కాబట్టి శాస్త్రాధ్యయనాలద్వారా ఉపాయాన్ని నేర్చుకోడం అవసరమే.

౧౦౮. తిర్యగ్యోని ష్వపితు స్వయంప్రవృత్తత్వాత్, కామస్య నిత్యత్వాచ్చ, న శాస్త్రేణ కృత్యమస్తీత్యాచార్యాః ౧.౨.౨౧

కాబట్టి ధర్మబోధకోసం, అర్థబోధకోసం శాస్త్రాలు అవసరమే. కాని గోవు మొదలైన తిర్యగ్జంతువులయందుగూడా శాస్త్రాప

దేశం లేకపోయినా కామాన్ని సేవించడం కనిపిస్తోంది. ఇక తమోవికారంగల మనుష్యులు వాటికంటె తీసిపోరుగదా! దీనికి గ్రంథ ప్రమాణంగూడా ఉన్నది. "కామం ఇలా ఉంటుందని ఎవ్వరూ ఉపదేశించే అవసరంలేదు. తమతమ స్త్రీలను మృగాలూ, పక్షులూ, ఏ శాస్త్రోపదేశంవల్లా, గురూపదేశంవల్లా రమింపచేస్తున్నాయి? ద్రవ్యపదార్థమైన ఆత్మలో కామక్రోధాదులు ఎప్పుడూఉన్నాయి". అందువల్ల కామం ఎప్పుడూ సిద్ధమే. అట్టి సర్వకాలసంసిద్ధమైఉన్న కామంకోసం శాస్త్రాన్ని సృష్టించడం అనవసరం. కాబట్టి ఈ ప్రయత్నంనుంచి విరమించడంమంచిదని ధర్మార్థమోక్షవాదులైన ఆచార్యులంటున్నారు.

౧౧౯. సంప్రయోగ పరాధీనత్వాత్ స్త్రీ పుంసయోరుపాయమపేక్షేత ౧.౨.౨౨

ఇక ఈ కామశాస్త్రాన్ని ఎందుకు చెప్పవలసిఉంటుందో చెవుతున్నారు. సామాన్యకామమైనా, విశేషకామమైనా స్త్రీ పురుషులయొక్క సంప్రయోగంమీద ఆధారపడి ఉంటుంది. సంప్రయోగం అంటే సంయోగం అన్నమాట. సంయోగం అంటె కలయిక. ఆ కలయికకూడా ఉపాయంలేకుండా సంభవించదు.

౧౨౦. సాచోపాయ ప్రతిపత్తిః కామసూత్రాదితి వాత్స్యాయనః ౧.౨.౨౩

ఆ ఉపాయంకూడా ఈ కామసూత్రం వల్లనే లభ్యపడుతుందని వాత్స్యాయనులన్నారు. 'వాత్స్యాయనుడ'నే పేరు కాకుండా

'మల్లనాగు'డనే పేరుగూడా ఈయనకు ఉన్నది. మొదటి పేరు గోత్రానికి సంబంధించినది. రెండవది అసలైనది.

౧౧౧. తిర్యగ్యోనిషు పునరనావృతత్వాత్, స్త్రీ జాతేశ్చ ఋతౌ యావదర్థం ప్రవృత్తే రబుద్ధిపూర్వకత్వాచ్చ ప్రవృత్తీనా మనుపాయసి ప్రత్యయః. ౧.౨.౨౪

పశువులూ, పక్షులూ మొదలైనవాటి విషయంలో ఉపాయసిద్ధి లేకపోయినా, మనుష్యులకువలె బట్టకట్టుకొని మానాన్నికప్పి ఉంచుకొనడం మొదలైనవి ఉండనందువల్లా, ఋతుకాలంలో తృప్తికలిగేవరకు మాత్రమే వాటికి సంప్రయోగం జరుగుతుంది కాబట్టినీ, మళ్లీమళ్లీ సంప్రయోగానికి ఆపేక్షపడవుగనుక నున్నూ వాటికి ఉపాయాత్మకలేకపోయినా కామం సిద్ధిస్తున్నది. ఇక మనుష్యులకో? సంతానంకోసం ఋతుకాలంలోనూ, స్త్రీలను రంజింపచెయ్యడానికి ఇతర సమయాలలోనూ కామం లభించాలి. పశుపక్ష్యాదులు ధర్మంకోసంగానీ, అర్థంకోసంగానీ, వంశవృద్ధికిమూలమైన పుత్రప్రాప్తికోసంగానీ బుద్ధిపూర్వకంగా ప్రవర్తించడంలేదు. కాబట్టి మానవులకు కామశాస్త్రప్రసంగం అవసరమే అవుతున్నది.

౧౧౨-౧౧౩. నధర్మాంశ్చరేత్
ఏష్యత్ఫలత్వాత్ ౧.౨.౨౫-౨౬

ఇక ధర్మార్థకామాలు అవసరమా? అనవసరమా? అనేచర్చ చేస్తారు. కొందరు, యజ్ఞయాగాదులు లోకానికి సంబంధించినవి కావు. అందువలననే వాటిని అలౌకికాలన్నారు. వాటి ఫలితాలు మరొకజన్మదాకా కాచుకుని కూర్చుంటేగాని లభించవు.

వ్యవసాయాదులలాగా అప్పటికప్పుడే కాకుండా ఎప్పుడోగాని ఫలితాన్ని ప్రసాదించని ధర్మాన్ని సేవించడం అనవసరం.

౧౧౪. సాంశయికత్వాచ్చ. ౧.౨.౨౬

ఇంకా ఏమో యెవరికితెలుసు? ఇంతా కష్టపడి తపశ్చర్యాదులు నడిపినా, ఫలితం అసలు ఉన్నదో లేదో ఎవ్వరూ చూచిరాలేదుగదా? అనే సందేహం కలగడానికికూడా అవకాశం ఉన్నది కనుక ధర్మాన్ని ఆశ్రయించడం వ్యర్థం.

౧౧౫. కోహ్యబాలిశో హస్తగతం పరగతం కుర్యాత్. ౧.౨.౨౭

బుద్ధిగలవాడెవడైనా చేతికి చిక్కినదాన్ని పరునికి అతకపెట్టి ఊరుకుంటాడా? అలాగే ఎప్పుడో సౌఖ్యాలు ప్రాప్తిస్తాయని ఈ లోకంలోని సౌఖ్యాలను విడుచుకోడం ఏమంత తెలివి?

౧౧౬. వరమద్యకపోతశ్శ్వో మయూరాత్. ౧.౨.౨౮

రేపటిరోజున లభించబోయే నెమలికంటె ఈవేళ దొరకిన పావురము మేలుకాదా? అలాగే పరలోక ఫలితాన్నిగూర్చి గూడా.

౧౧౭. వరం సాంశయికాన్నిష్కాదసాంశయికః కార్షాపణ ఇతి లౌకాయతికాః ౧.౨.౩౦

వెనుక ఒక ఆయన యాచనకోసం ఒక పెద్దమనిషిదగ్గరకు పోతే ఆయన 'ఈవేళ నాదగ్గర ఒక కార్షాపణం మాత్రం ఉన్నది. ఇది తీసుకో, లేకపోతే రేపు రా. అప్పటికి నా దగ్గరకు మరికొంత డబ్బు వస్తుంది. అప్పుడు నీకొక నిష్కంవరకూ ముట్టచెపుతాను' అన్నాడట. అప్పుడా యాచకుడు బాగా

ఆలోచించి 'సంశయగ్రస్తమయిన నిష్కంకంటె, అప్పటి కప్పుడు చేతులో రాలే కార్షాపణమే మేల'ని ఊహించి గుట్టు చప్పుడు కాకుండా చేతులో వేసుకునిపోయినాడట. అలాగే ఇదిన్నీ, ఇదంతా ధర్మాన్ని ఆక్షేపించేవారి వాదం.

౧౧౮. శాస్త్రస్యానభిశంక్యత్వా, దభిచారాను వ్యవహార యోశ్చ క్వచిత్ఫలదర్శనా, న్నక్షత్ర చంద్రసూర్య తారాగ్రహచక్రస్య లోకార్థం బుద్ధిపూర్వకమివ ప్రవృత్తేర్దర్శనా, ద్వర్ణాశ్రమాచార స్థితిలక్షణార్థ త్వాచ్చ లోకయాత్రాయాః హస్తగతస్యచబీజస్య భవిష్య తస్సస్యార్థే త్యాగదర్శనాచ్చరేద్ధర్మానితి వాత్స్యాయనః. ౧.౨.౨౧

ఇక ధర్మం అవసరమనే నిశ్చయాన్ని తెలియపరుస్తున్నారు వాత్స్యాయనులు. శాస్త్రం యెప్పుడూ సందేహింపతగినది కాదు. హింసాపూరితాలైన అభిచార కర్మలకూ, మంగళ కర్మలైన శాంతిక పౌష్టికాదులకూ కూడా ప్రత్యేకంగా హింసా శాంతీ, పుష్టీ మొదలైన ఫలితాలు కనపడు తున్నాయి. నక్షత్రాలూ, చంద్రసూర్యులూ, తారాగ్రహ మండలమూ మొదలైన ఖగోళం అంతా లోకంకోసం బుద్ధి పూర్వకంగా వెలుగుతున్నట్లు కనిపిస్తోంది. ఇక లోకయాత్ర వర్ణాలూ, ఆశ్రమాలూ, ఆచారాలూ, వీనికి ఉనికిమాత్రమే స్వరూపంగా గ్రహించిఉంటుంది. కాబట్టి చేతులో ఉన్న విత్తనాన్ని రాబోయే పంటకోసం ముందుగా త్యాగం చెయ్య

డం లేదా? అలాగే ముందు రాబోయే ఫలితాలకోసం ఇప్పుడే ధర్మాన్ని ఆచరించాలి.

౧౯. నధర్మాంశ్చరేత్. ౧.౨.౩౨

పైన ధర్మాచరణ పనికిరాదనే వారి వాదాన్ని చూపించి వానికి సమాధానం చెప్పారు. ఇక అర్థశాస్త్రాన్ని నిషేధించే వారి వాదాన్ని చెప్పి దానికిగూడా సమాధానం వ్రాయబోతున్నారు. అర్థాన్ని సంపాదించడానికి ప్రయత్నించరాదు. ఉపాయాన్ని ఆచరించరాదు.

౧. ౨౦. ప్రయత్నతోఽపిహ్యేతేఽ నుష్ఠీయ మానానైవ కదాచిత్స్యుః. ౧.౨.౩౩

ప్రయత్నపూర్వకంగా ఉపాయాలు ప్రయోగించినా, ఒక్కొకప్పుడు అర్థం సిద్ధించకపోవడంకూడా జరుగుతోంది. ఒకవేళ లభించినా అది కాలమహిమేకాని ఉపాయాన్ని ఆచరించడం వల్ల వచ్చిన ఫలం కాదు.

౧.౨౧. అననుష్ఠీయమానా అపి యదృచ్ఛయా లభేయః. ౧.౨.౩౪

ఒక్కొకప్పుడు ఉపాయానుష్ఠానం లేకుండానే అర్థం లభిస్తోంది. కాబట్టి యెలాగూ ఉపయోగపడని అర్థశాస్త్రం అనవసరం.

౧.౨౨. తత్సర్వం కాలకారితమితి. ౧.౨.౩౫

అయితే లోకంలో అర్థం ప్రాప్తించడం ప్రాప్తించకపోవడం ఎలా కలుగుతోంది? అంటే అదంతా కాలమహిమ. అందు

వల్ల పురుషుడు కాలానికి అధీనమైన ప్రవర్తనగలవాడన్న మాట.

౧-౨౩. కాలఏవ కిం పురుషా నర్థా నర్థానుబంధ యోర్జయ
పరాజయయోః సుఖదుఃఖ యోశ్చ స్థాపయతి.
౧.౨.౩౬

పైన చెప్పినది కాలవాదం. కాలవాదం అంటే ప్రపంచం అంతా కాలంమీదనే ఆధారపడిందనీ, కాలమే ప్రపంచాన్ని సృష్టిస్తోందనీ, పోషిస్తోందనీ, నాశనం చేస్తోందనీ, పురుషుడు తన ప్రయత్నంవల్ల దేన్నీ సాధించడంలేదనీ ఈ సిద్ధాంతం మీద వాదించడం అన్నమాట. ఇలా వాదించేవారు తమ సిద్ధాంతాన్ని యిలా బలపరుస్తారు. పురుషులకు భాగ్యం ప్రాప్తించినా, దరిద్రం ప్రాప్తించినా, జయం సమకూడినా, అపజయం సమకూడినా, సుఖం లభ్యమయినా, దుఃఖం లభ్యమయినా అదంతా కాలమహిమేకాని మరొకటి కాదు.

౧-౨౪. కాలేన బలిరింద్రః కృతః, కాలేన వ్యవరోపితః,
కాలఏవ పునరప్యేనం కర్తేతి కాలకారణికాః.
౧.౨.౩౭

తుచ్ఛమైన కుత్సిత స్వభావం కలవాడైనా బలిని కాలమే యింద్రుణ్ణి చేసింది. మరల ఆ కాలమే ఆతనిని ఆ యింద్ర పదవినుంచి భ్రష్టుణ్ణిచేసింది. తిరిగీ ఆ కాలమే ప్రేరేపించి అతన్నే ఆ యింద్రపదవికి రప్పించవచ్చు. కాబట్టి కాలమే సర్వానికీ మూలం. ఇది కాలవాదుల సిద్ధాంతం.

౧-౨౫. పురుషకార పూర్వకత్వాత్సర్వ ప్రవృత్తీనా ముపాయః ప్రత్యయః. ౧.౨.౩౭

పై సిద్ధాంతంలో కాలవాదులు, "దేనికైనా ఉపాయపూర్వకమైన పురుషప్రయత్నం అనవసరం కాబట్టి ఇప్పుడు శాస్త్ర నిర్మాణంకూడా అనవసరం" అంటూ శాస్త్ర నిర్మాణానికే మోసం తెస్తుంటే, శాస్త్రకారులు సమాధానం చెపుతున్నారు. ప్రపంచంలో ఉన్న అన్ని వ్యాపారాలూ కూడా పురుష ప్రయత్నంమీదనే ఆధారపడిఉంటాయి. ఆపురుషప్రయత్నం కూడా ఉపాయంలేనిది ఫలవంతంకాదు. అంటే అన్ని వ్యాపారాలకూ ఉపాయం ముఖ్యం అన్నమాట. పురుషప్రయత్నం యెప్పుడూ ఉపాయంలేకుండా అర్థసాధనానికి కారణం కాదు.

౧-౨౬. అవశ్యం భావినోఽర్థస్య ఉపాయపూర్వకత్వా దేవన నిష్కర్మణోభద్రమస్తీతి వాత్స్యాయనః. ౧.౨.౩౮

ఎప్పుడైనా ఒకవేళ యాదాలాపంగా అర్థసిద్ధి ప్రాప్తించినా, అదికూడా యాదృచ్ఛికమైన ఉపాయంవల్లే సిద్ధించిందనాలి. ఎలాగంటే, తప్పని సరిగా ప్రాప్తించవలసిఉన్నా అర్థసిద్ధి ఉపాయపూర్వకం కాబట్టి ప్రయత్నలోపం ఉన్న మానవునికి లభించదని వాత్స్యాయను లన్నారు. కాబట్టి దైవమూ, పౌరుషమూ కూడా అర్థసిద్ధికి అవసరాలు. ఈ రెండూ కలిసి లోకాన్ని రక్షిస్తున్నాయి. అందువల్ల పురుషప్రయత్నానికి ఉపాయం అవసరం, ఆ ఉపాయాన్ని బోధించడానికి శాస్త్రం అవసరం.

౧-౨౭. నకామాంశ్చరేత్. ౧.౨.౪౦

ఇక మూడో పురుషార్థం అయిన కామాన్నిగూర్చి శాస్త్రం అనవసరమనేవారి వాదాన్ని చెప్పి, అవసరమనే తన వాదాన్ని బలపరుస్తూ సమాధానం చెవుతున్నారు. కామానికి సంబంధించిన ఉపాయాలను ఆచరించరాదు.

౧-౨౮. ధర్మార్థయోః ప్రధానయో రేవమన్యేషాంచసతాం ప్రత్యనీకత్వా దనర్థ జన సంసర్గ సద్వ్యవసాయమ శౌచమనాయతించైతే పురుషస్యజనయంతి.౧.౨.౪౧

ప్రపంచంలో ముఖ్యాలైన ధర్మార్థాలకూ, ఇంకా ఇతర సత్కార్యాలకూ కూడా ఈకామాలు విరోధాలు. ఎందువల్ల ననగా, ఈ కామోపాయాలు అనర్థదాయకులైన నటులూ, నర్తకులూ, గాయకులూ మొదలైనవాళ్లతో స్నేహాన్ని కల్పిస్తాయి. చెడు ప్రయత్నాలకు దారి చూపిస్తాయి. అంటే అర్ధరాత్రివేళ విటీజనంకోసం వెపరలాడడం, అభిసరించడం, మొదలైనవాటిని అలవాటుచేస్తాయి. శుచి గుణాన్ని భస్మం చేస్తాయి. ఏదైనా కాస్త ప్రజ్ఞాప్రభావాదికం ఉంటే దాన్ని కాస్తా తుడిచిపెడతాయి. మొత్తంమీద ఈ కామోపాయాలు పురుషుణ్ణి కామగర్దభుణ్ణిగా తయారుచేస్తాయి. వద్దు, వద్దు, ఈ కామోపాయాలు వేయిజన్మలకుకూడా వద్దు.

౧-౨౯. తథాప్రమాదం లాఘవమ ప్రత్యయమ ప్రాహ్యతాంచ. ౧.౨.౪౨

ఇంకా ఈ కామోపాయాలు శరీరానికి ప్రమాదంపుట్టిస్తాయి. పలువురిలో పలుచన పరుస్తాయి. పదిమందికీ అవిశ్వాసాన్ని

కల్పిస్తాయి. అగ్రాహ్యుడనీ, నీచుడనీ, పదిమందిచేతా అని
పిస్తాయి, తిరస్కరింపచేస్తాయి.

౧౩౦. బహవశ్చ కామవశగా స్సగణాఏవ వినష్టాశ్రూ
యంతే. ౧.౨.౪౩

చాలామంది జనులు కామానికి లోబడి తాము నశించడమే
కాక తమ పరివారాన్నిగూడా నాశనం చేసుకున్నట్లు పురా
ణాదులలో వినిపిస్తారు.

౧౩౧. యథా దాండక్యో నామ భోజగి కామాద్బ్రాహ్మణ
కన్యా మభిగమ్యమానగి స బంధు రాష్ట్రోవినవాశ.
౧.౨.౪౪

పూర్వకాలంలో భోజవంశంలో దాండక్యుడనే ఒక రాజు
ఉండేవాడు. ఆయన మితిమీరిన కామాసక్తిగలవాడు. ఒక
రోజున ఆయన వేటకోసం అడవికిపోయి భార్గవముని ఆశ్ర
మంలో ప్రవేశించాడు. ఆ ఆశ్రమంలో మునీశ్వరుడు లేడు.
ఆ భార్గవుని కూతురు తప్ప మరెవ్వరూకూడా లేరు. ఆమె
కన్యక. మంచి అందకత్తె. ఆమెను చూచేసరికి ఈ రాజుగారికి
మన్మథాభ్యుదయమయింది. ఒంటరిపాటున దొరకిన ఆ పిల్లను
విడుచుకోలేక వెంటనే రథంమీద బలాత్కారంగా ఎక్కించు
కుని పారిపోయినాడు. తరువాత కొంతసేపటికి సమిధలూ,
దర్భలూ తెచ్చుకోడానికి పోయిన భార్గవముని ఆశ్రమానికి
వచ్చాడు. కూతురు పర్ణశాలలోగానీ, ఆశ్రమంలోగానీ కను
పించలేదు. పిలిచాడు. పలుకలేదు. వెంటనే యోగదృష్టితో
చూచి జరిగినదంతా తెలుసుకుని కోపించి ఆ రాజును "బంధు
వులతోనూ, రాష్ట్రంతోను నశించిపొమ్మ"ని శపించాడు.

అలా ఆ రాజు నశించిపోయాడు. ఆచోటు ఇప్పటికికూడా దండకారణ్యమనే పేరుతో కనిపిస్తోంది.

౧౩-౨. దేవ రాజశ్చా హల్యా మతి బలశ్చ కీచకో ద్రౌప
దీం రావణశ్చ సీతా మపరేచాన్యేచ బహవో
దృశ్యంతే కామవశగా వినష్టా ఇత్యర్థ చింతకాః.
౧-౨.౪౫

వెనుక దేవతల రాజైన ఇంద్రుడు గౌతముని భార్య అయిన అహల్యను మోహించాడు. ఆ ముని సమిధలకు వెళ్లే వేళ చూచి ఆమెను ఎలాగో కలిశాడు. ఆసమయంలోనే గౌతము డింటికివచ్చాడు. అప్పుడు అహల్య ఇంద్రుణ్ణి తన గర్భంలోనికి జొప్పించుకుని భర్తకు కనిపించకుండా చేసింది. అప్పుడే గౌత మునికి ఎక్కడినుంచో ఆహ్వానం వచ్చింది. వెంటనే ఆయన భార్యతోగూడా ఆహ్వానింపబడినచోటికి ప్రయాణం కట్టాడు. అక్కడ ఋషిని ఆహ్వానించిన ఆయన యోగదృష్టితో ఇంద్రుడు గౌతముని ఆశ్రమంలోనికి రావడం గ్రహించాడు. వెంటనే గౌతమునికోసం మూడు ఆసనాలు సిద్ధంచేశాడు. గౌతముడు ఆ ఆశ్రమాన్ని చేరి ఆ ఆసనాలను మూటినీ చూచి "భార్యతోమాత్రమే వచ్చిన నాకు ఈ మూడో ఆసనంకూడా యెందుకు సిద్ధం చెయ్యాలి? అని శంకించి యోగదృష్టితో అంతా కనిపెట్టి కోపించి ఇంద్రుణ్ణి సహస్రభగుడవు కమ్మని శపించాడు. ఈవిధంగా కామవశుడైన యింద్రుడు వినాశంతో సమానమైన దురవస్థలో పడ్డాడు. ఇలాగే కీచకుడు ద్రౌపదిని బలాత్కరించి నశించాడు. రావణుడు సీతను అపహరించి బంధువులతోనూ, పరివారంతోనూ నశించాడు. ఇంకా చాలా

మంది ఇలాగే కామప్రవృత్తివల్ల నశించినట్లు వినబడుతున్నారు. ఈ పైన చెప్పినవన్నీ కామశాస్త్రం అక్కరలేదనేవారు చెప్పే కారణాలు. ఇక కామశాస్త్రం ఎందుకు అవసరమో ఎలా అవసరమో చెవుతున్నారు.

౧౩౩. శరీర స్థితిహేతుత్వాదాహార సధర్మాణోహి కామాః. ౧.౨.౪౬

శరీరాన్ని రోగంలేకుండా కాపాడుకోనడానికి ముఖ్యకారణాలు కాబట్టి కామాలుకూడా ఆహారంతో సమానమైనవే. ఆహారం అజీర్ణాది దోషాలను కల్పించినప్పటికీ, ప్రతిదినమూ శరీర పుష్టికి కారణం అయి ఎలా సేవింపబడుతోందో, అలాగే కామంగూడా శరీరారోగ్యంకోసం సేవింపబడుతోంది. కామాన్ని సేవించకపోతే, పిచ్చి మొదలైనజాడ్యాలు కలుగుతాయి. కాబట్టి ఆహారాన్ని సేవించినట్లు కామాన్నిగూడా సేవించాలి.

౧౩౪. ఫలభూతాశ్చ ధర్మార్థయోః. ౧.౨.౪౭

ఇంకా కామాలు ధర్మానికీ, అర్థానికీ కూడా ఫలభూతాలు. అంటే ధర్మంవల్లా, అర్థంవల్లా కామం లభిస్తుందన్న మాట. గ్రంథాంతరంలో ఇలా ఉన్నది. ధర్మంవల్ల యేర్పడ్డది స్వర్గం. అక్కడా ఉత్తమ స్త్రీలనేవాళ్లున్నారు. కాబట్టి మానవులకు ధర్మప్రియత్నంవల్ల ప్రాప్తించిన గృహస్థధర్మం (కామం) నివారించరానిదే. తప్పని సరిగా కావలసినదన్న మాట. అందువల్ల స్త్రీలు పురుషునికి చాలా విధాల హితాన్ని చేకూరుస్తున్నారు. పవిత్రమైన సంతానాన్ని యిచ్చి ఇహపరగతులకు కారణం అవుతున్నారు. గొప్ప భోగాన్ని సమకూరుస్తున్నారు.

కాబట్టి స్త్రీలు లోకోత్తరమైన భోగప్రాప్తికోసం తప్పనిసరిగా అవసరమే.

౧౩౫. బోద్ధవ్యంతు దోషేష్వేవ, నహి భిక్షుకాసంతీతి స్థాల్యోనాధిశ్రియంతే? నహిమృగా స్సంతీతియ వానోప్యంతే? ఇతి వాత్స్యాయనః. ౧.౨.౪౭

ఇలా అయితే కామశాస్త్రానికి దోషప్రసక్తియేమున్నది? అంటే శాస్త్రకారులు సమాధానం చెపుతున్నారు. ఆహారాన్ని సేవిస్తే అజీర్ణాదిదోషం ప్రాప్తించినట్లే కామంవల్ల కూడా కొన్నిదోషాలు ఏర్పడవచ్చు. ఆదోషాలను నివారించు కుంటూ కామాన్ని సేవించాలి. బిచ్చగాళ్లు ఎక్కువగా ఉన్నారని పొయ్యి తప్పేసుకుంటున్నామా? మృగాలు తిరుగు తున్నాయని పైర్లు నాటడం మానుతున్నామా? అని వాత్స్యాయనులన్నారు. సుఖాన్ని ద్వేషించే మానవుని జన్మ గడ్డిపోచకుగూడా కొరగాదు. ఎప్పటికైనా దోషాన్ని పరిహ రించుకుని సుఖాన్ని అనుభవించడం మానవుని ధర్మం.

౧౩౬. భవంతి చాత్ర శ్లోకాః—

ఏవ మర్థంచ కామంచ ధర్మంచో పాచరన్నరః
ఇహాముత్రచ నిశ్శల్య మత్యంతం సుఖమశ్నుతే.
౧.౨.౪౮

పైన చెప్పిన విధంగా మానవుడు అర్థాన్నీ, కామాన్నీ, ధర్మాన్నీ సేవించాలి. అలా సేవిస్తే ప్రమాదంలేకుండా ఇహ లోకంలోనూ, పరలోకంలోనూ ఉత్తమమైన సుఖాన్ని మిక్కి లిగా పొందుతాడు.

౧౩౭. కిం స్యాత్పరత్రే త్యాశంకా కార్యే యస్మిన్నజా
యతే, నచార్థఘ్నం సుఖంచేతి శిష్టా స్తత్ర వ్యవ
స్థితాః. ౧.౨.౫౦

ఏ పనిని చేస్తే ధర్మార్థకామాలకు ప్రమాదం కలుగుతుందనే సంశయంగూడా తోచకుండా ఉంటూందో, ఏ పనిని చేస్తే సుఖానికీ, అర్థానికీ నష్టంరాకుండా ఉంటుందో ఆపనినే శిష్టులైనవారూ, చరిత్రను ప్రేమించేవారూ చేస్తారు.

౧౩౮. త్రివర్గసాధకం యత్స్యా ద్ద్వయోరే స్యవాపునః,
కార్యం తదపి కుర్వీత నత్వే కారకాద్విబాధకం.
౧.౨.౫౧

ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే సాధారణే
ప్రథమేఽధికరణే త్రివర్గ ప్రతిపత్తి
ర్ద్వితీయోఽధ్యాయః

ఏ పని ధర్మార్థకామాలకు మూడింటికిగానీ, లేక వాటిలో రెండింటికిగానీ, ఒకటికిగానీ సాధనం అవుతుందో ఆ పని చెయ్యాలి. పై ధర్మార్థకామాలలో రెండింటిని బాధించే ఒక పురుషార్థాన్ని ఎన్నడూ సేవించరాదు.

ఈవిధంగా భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయమూర్తి చేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళ వ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను తెలుగు వాఖ్య లోని సాధారణాధికరణంలో త్రివర్గప్రతిపత్తి అనే రెండో అధ్యాయం ముగిసినది.

శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

౧. సాధారణాధికరణం

### 3. విద్యా సముద్దేశాధ్యాయం

౧౪౦. ధర్మార్థాంగవిద్యాకాలా ననుపరోధయన్ కామ
సూత్రం, తదంగవిద్యాశ్చ పురుషోఽధీయీత.
౧.3.౧

వెనుకటి అధ్యాయంలో చెప్పినవిధంగా ధర్మార్థకామాలను సేవించే దశ పొందిన మానవునికి కామసిద్ధి కలగాలంటే మొదటి ఉపాయం కామవిద్యాగ్రహణం. ఈ విద్యాగ్రహణం లేని మానవునికి తరువాత పనులు సంభవించవు. అందువల్ల ముందుగా కామవిద్యా సముద్దేశాన్ని చెప్తున్నారు. సముద్దేశం అంటే చాలా విస్తారంగా ఉన్న విషయాన్ని తక్కువచేసి చెప్పడం.

ధర్మవిద్యకూ, అర్థవిద్యకూ అంగభూతమైనది దండ విద్య. కాబట్టి ఆ ధర్మవిద్యనూ, అర్థవిద్యనూ, దండవిద్యనూ అభ్యసించే సమయంలో కాక తక్కిన సమయాలలో ఈ కామ సూత్రాన్ని, దీనికి అంగభూతాలైన సంగీతాది విద్యలనూ పురుషుడు అధ్యయనం చెయ్యాలి.

౧౮౧. ప్రాగ్యౌవనాత్ స్త్రీ. ౧.౩.౨

స్త్రీలు యవ్వనం అంకురింపకపూర్వమే ఈ కామసూత్రాన్నీ, అంగవిద్యలైన గీతాదులనూ గూడా తండ్రిగారి యింటిలోనే నేర్చుకోవాలి. సాధారణంగా పదుచుతనం పైనపడ్డ ఆడపిల్లలు వివాహితలై ఉంటారు. కాబట్టి వాళ్లకు కామసూత్రాన్ని చదవడానికి అవకాశం ఉండదు.

౧౮౨. ప్రత్తాచ పత్యు రభిప్రాయాత్. ౧.౩.౩

పతిని చేపట్టిన యువతికూడా భర్తగారి అనుమతి పొంది ఈ కామసూత్రాన్ని చదువుకోవాలి. భర్త అనుమతిలేకుండా చదివితే స్వేచ్ఛాచారిణిగా అనుమానింపబడుతుంది.

౧౮౩. యోషితాం శాస్త్రగ్రహణ స్యాభావా దనర్థక
మిహశాస్త్రే శాసన మిత్యాచార్యాః. ౧.౩.౪

స్త్రీలకు శాస్త్రాభ్యాసం చెయ్యడానికి అధికారంలేదు కాబట్టినీ, శాస్త్రగ్రహణానికి తగిన సామర్థ్యం లేనివారు కాబట్టినీ, ఈ కామశాస్త్రంలో స్త్రీల విషయమై ఈ పని చెయ్యవచ్చును, ఈ పని చెయ్యరాదు అని నియమం చెయ్యడం అనర్థకమని ప్రాచీనులైన కామశాస్త్రాచార్యుల అభిప్రాయం.

౧౮౪. ప్రయోగగ్రహణం త్వాసాం ప్రయోగస్యతు
శాస్త్రపూర్వకత్వా దితి వాత్స్యాయనః. ౧.౩.౫

ప్రయోగించే విధానాన్ని గ్రహించడం స్త్రీలకు ముఖ్యంగా అవసరం. ఆ ప్రయోగ విధానంగూడా శాస్త్రంవల్లే తెలుసుకోవాలి కాబట్టి స్త్రీలకుగూడా ఈ శాస్త్రంలో ప్రసక్తి

ఉండాలి అని శాసించడం అనర్థకం కాదు అని వాత్స్యాయనుల అభిప్రాయం.

౧౨౫. తన్న కేవల మిహైవ, సర్వత్రైవహి లోకే కతిచి దేన హి శాస్త్రజ్ఞాః. ౧.౩.౬

స్త్రీలు ప్రయోగ విధానాన్ని గ్రహించడం ఈ కామశాస్త్రం లోనే కాదు, వ్యాకరణ, జ్యోతిశ్శాస్త్రాదులలో గూడా చూడబడుతున్నది. న్యాయంగా ప్రపంచంలో శాస్త్రాన్ని గ్రహించగల సమర్థులు చాలా తక్కువమంది ఉంటారు. ప్రయోగం మాత్రం అందరు జనులకూ సంబంధించిఉంటుంది. కాబట్టి ప్రయోగ గ్రహణం ప్రధానంగా శాస్త్రంవల్లే నేర్చుకోవాలి.

౧౨౬. ప్రయోగస్యచ దూరస్థమపి శాస్త్రమేవ హేతుః. ౧.౩.౭

శాస్త్రం ఒకవేళ సామాన్య ప్రజలకు దూరంగా ఉన్నా ప్రయోగానికిమాత్రం ఈ శాస్త్రమే కారణం అవుతుంది. ఎలాగంటే, ఒకడు శాస్త్రాన్ని అభ్యసించిఉంటే, వానివలన ఒకడు ప్రయోగవిధానాన్ని నేర్చుకొనిఉంటే, వానివల్ల మరి ఒకడూ, అతనివల్ల ఇంకొకడూ ఇలా పరంపరగా ఒకరినుంచి ఒకరు ప్రయోగాన్ని గ్రహించినా మొత్తంమీద ఏ ప్రయోగానికైనా శాస్త్రమే కారణం అవుతుంది.

౧౨౭. అస్తి వ్యాకరణ మిత్యవైయాకరణాఅపి యాజ్ఞికాః ఊహం క్రతుషు ప్రయుంజతే. ౧.౩.౮

ఇక్కడ ఒక దృష్టాంతాన్ని గూడా చెవుతున్నారు. ఒక శబ్దం

ఒక మంత్రంలో ఏదో ఒక లింగంలోనూ, విభక్తిలోనూ, వచనంలోనూ ప్రయోగింపబడితే ఆ శబ్దాన్ని ప్రసంగాన్ని పట్టి తమకు అవసరమైన లింగంలోకీ, విభక్తిలోకీ, వచనంలోకీ మార్చుకోడం 'ఊహ' అని ఇక్కడ అర్థం. ఇది యుక్తి మీంద ఆధారపడిఉన్నది. పై లింగ విభక్తి వచనాల విషయం అంతా వ్యాకరణ శాస్త్రంలో ఉంటుంది. పురోహితులు ఆ వ్యాకరణ శాస్త్రాన్ని అధ్యయనం చెయ్యకపోయినా యజ్ఞాదులలో మంత్రాదులను ఉచ్చరించే సమయాలలో పై లింగ విభక్తి వచనాలను మార్పుచేసి పఠించడం అనే ఊహను ఉపయోగించడం పరంపరగావచ్చిన ప్రయోగ జ్ఞానాన్ని పట్టే జరుగుతోంది.

౧౮౮. అస్తి జ్యోతిషమితి పున్యాహేషు కర్మ కుర్వతే. ౧.౩.౯

జ్యోతిష శాస్త్రంలో ఉన్నదనే అభిప్రాయంతోనే ఆశాస్త్రాన్ని యెన్నడూ చూడనివాళ్లైనా యాజ్ఞికులు ఎలాగో అలా శుభ దినాన్ని తెలుసుకుని పుణ్యకర్మలు చేస్తున్నారు. ఈ శుభ దినాన్ని తెలుసుకోడంలో గూడా పరంపరగా శాస్త్రమే హేతువు.

౧౮౯. యథా అశ్వారోహా గజారోహాశ్చ అశ్వాన్ గజాంశ్చ అనధిగతశాస్త్రా అపి వినయంతే.

౧.౩.౧౦

అశ్వ శాస్త్రాన్నీ, హస్తిశాస్త్రాన్నీ తెలుసుకోకపోయినా, అశ్వారోహకులూ, గజారోహకులూ ఆ శాస్త్రాలను ఎరిగి

ఉన్న వైద్యులవల్ల వాటివాటి రహస్యాలు తెలుసుకుని ఆయా జంతువులను పోషిస్తున్నారు.

౧౫౦. తథాఽస్తి రాజేతి దూరస్థాఅపి జానపదా న మర్యాదా మతివర్తంతే. ౧.౩.౧౧

'కారణం దూరంగా ఉన్నా పరంపరగా కార్యం జరుగుతూనే ఉంటుంది'. అనే న్యాయం కేవలం శాస్త్రవిషయంలోనేకాదు, లోక వ్యవహారంలోకూడా ఉన్నది. చూడండి, రాజు ఉన్నాడనే జ్ఞానంచేత అతడు దూరంగా ఉన్నా, ప్రజలు హద్దుమీరి నడవడంలేదు. అలాగే కామవిషయంలో ప్రవర్తించేవాళ్లు కూడా శాస్త్రాన్ని ప్రత్యక్షంగా చూడకపోయినా, పరంపరగా తెలుసుకుని ఈ విధానాలను అనుసరిస్తున్నారు.

౧౫౧. సంత్యపి ఖలు శాస్త్రప్రహతబుద్ధయో గణికా రాజపుత్ర్యో మహామాత్రదుహితరశ్చ. ౧.౩.౧౨

ఈ కామశాస్త్రాభ్యాసం చేసినవారు స్త్రీలలోగూడాఉన్నారు. అలాటివాళ్లు వేశ్యలూ, రాజపుత్రికలూ, మహాసామంతులూ, సామంతులూ మొదలైనవారి పుత్రికలూ అన్నమాట.

౧౫౨. తస్మా ద్వైశ్వాసికా జనా ద్రహసి ప్రయోగాన్ శాస్త్ర మేకదేశంవా స్త్రీ గృహ్ణీయాత్. ౧.౩.౧౩

పై రీతిగా ప్రయోగ గ్రహణమూ, శాస్త్రగ్రహణమూ అనేవి రెండూ తెలిసికొని ఉన్నదిన్నీ, నమ్మకస్థురాలున్నూ అయిన స్త్రీవల్ల యువతులు గ్రహణశక్తి కలిగిఉంటే శాస్త్రాన్నీ, శాస్త్రగ్రహణానికి సామర్థ్యం లేకపోతే ప్రయోగవిధానాన్నీ, మధ్యరకంవాళ్లు ముఖ్యభాగాలనూ అభ్యసించాలి.

౧౫౩. అభ్యాసప్రయోజ్యాంశ్చ చతుష్షష్టికాన్ యోగా
న్కన్యా రహస్యేకాకి న్యభ్యసేత్. ౧.౩.౧౪

అభ్యాసంవల్ల ప్రయోగించడానికి వీలైన బోధ్యక్రమమూ, భ్రమరుకమూ మొదలైన చతుష్షష్టియోగాలనూ రహస్యంగానూ, ఒంటరిగానూ కన్యక అభ్యసించాలి.

౧౫౪. ఆచార్యాస్తు కన్యానాం ప్రవృత్త పురుషసంప్రయోగా, సహసంప్రవృత్తా ధాత్రేయికా, తథాభూతా వా నిత్యయసంభాషగా సఖీ, సవయాశ్చ మాతృష్వసా, విస్రబ్ధా, తద్ధాసీయా వృద్ధదాసీ, పూర్వసంసృష్టా వా భిక్షుకీ, స్వసాచ విశ్వాస ప్రయోగాత్. ౧.౩.౧౫

ఈ కామశాస్త్రాన్ని బోధించేవిషయంలో స్త్రీ పురుషులకు గురుత్వాన్ని వహించతగిన నమ్మకస్థులెవరో నిరూపిస్తున్నారు శాస్త్రకారులు. పురుషులు స్వతంత్రులు కాబట్టి వాళ్లకు ఉపదేశించేవారు సులభంగా దొరుకుతారు. అందువల్ల వారి విషయమై వేరేచెప్ప నవసరంలేదు. ఇక కన్యకలకు ఉపదేశింప తగినవారెవరనగా, పురుషునితో సంప్రయోగంజరిపి రసాన్ని గుర్తెరిగి ఉన్నస్త్రీగానీ, తనతోపాటు ఈడుజోడుగా పెరిగిన దాది కూతురుగానీ, అలాటిదేఅయి తనతోమనసుకలిపి వర్తించే చెలికత్తెగానీ, తన ఈడుజోడైన పినతల్లిగానీ, తమయింట్లో పనులుచేసిపెడుతూ నమ్మకస్థురాలుగా ఉన్న వృద్ధదాసిగానీ, పూర్వం పురుషాభిరుచికలిగి ఉన్న భిక్షుకిగానీ, తన అప్పగానీ కన్యకలకు నమ్మకంగా ప్రయోగాలద్వారా గురుత్వాన్ని

వహించతగినవాళ్లు. కన్యకలు ఈ కామసూత్రాన్ని, అంగ విద్యలనూగూడా నేర్చుకోవాలి. ఆ అంగవిద్యలు ఇక్కడ సంక్షేపంగా తెలుపుతున్నారు. ప్రపంచంలో చతుష్షష్టికళల నేవే కామశాస్త్రానికి అంగవిద్యలు. చతుష్షష్టిఅంటే అరవై నాలుగు. ఈ అరవైనాలుగూ మూలకళలు. వీటిలో కర్మాశ్రయాలైన కళలు ఇరవైనాలుగు. జూదాసికాశ్రయాలైన కళలు ఇరవై. శయనోపచారికాలైన కళలు పదహారు. ఉత్తర కళలు నాలుగు. మొత్తం అరవైనాలుగు మూల (ప్రధాన) కళలు.

౧౫౫. ౧. గీతం. ౨. వాద్యం. ౩. నృత్యం. ౪. ఆలేఖ్యం ౫. విశేషకచ్ఛేద్యం. ౬. తండుల కుసుమబలివికారాః. ౭. పుష్పాస్తరణం. ౮. దశనవసనాంగరాగః. ౯. మణిభూమికాకర్మ. ౧౦. శయనరచనం. ౧౧. ఉదకవాద్యం. ౧౨. ఉదకాఘాతం. ౧౩. చిత్రాశ్చయోగాః. ౧౪. మాల్యగ్రథన వికల్పాః. ౧౫. శేఖరకాపీడయోజనం. ౧౬. నేపథ్య ప్రయోగాః. ౧౭. కర్ణపత్రభంగాః. ౧౮. గంధయుక్తిః. ౧౯. భూషణయోజనం. ౨౦. ఇంద్రజాలః. ౨౧. కౌచుమారాశ్చయోగాః. ౨౨. హస్తలాఘవం. ౨౩. విచిత్రశాక యూషభక్ష్యవికారక్రియా. ౨౪. పానకరసరాగాసవయోజనం. ౨౫. సూచీవానకర్మాణి. ౨౬. సూత్రక్రీడా. ౨౭. వీణాడమరుకవాద్యాని. ౨౮. ప్రహేళికా. ౨౯. ప్రతిమాలా. ౩౦. దుర్వాచకయోగాః. ౩౧. పుస్తకవాచనం. ౩౨. నాటకాఖ్యాయికాదర్శనం. ౩౩. కావ్యసమస్యాపూరణం ౩౪. పట్టికావానవేత్రవికల్పాః. ౩౫. తక్షకర్మాణి. ౩౬. తక్షణం

౩౭. వాస్తువిద్యా. ౩౮. రూప్యరత్నపరీక్షా. ౩౯. ధాతువాదః ౪౦. మణిరాగాకరజ్ఞానం. ౪౧. వృక్షాయుర్వేదయోగాః. ౪౨. మేషకుక్కుటలావక యుద్ధవిధిః. ౪౩. శుకశారికా ప్రలాపనం. ౪౪. ఉత్సాదనే, సంవాహనే, కేశమర్దనేచ కౌశలం. ౪౫. అక్షరముష్టికా కథనం. ౪౬. మ్లేచ్ఛిత కవి కల్పాః. ౪౭. దేశభాషా విజ్ఞానం. ౪౮. పుష్పశకటికా. ౪౯. నిమిత్త జ్ఞానం. ౫౦. యంత్రమాతృకా. ౫౧. ధారణమాతృకా. ౫౨. సంపాఠ్యం. ౫౩. మానసీకావ్యక్రియా. ౫౪. అభిధానకోశః. ౫౫. ఛందో జ్ఞానం. ౫౬. క్రియా కల్పః. ౫౭. భవితకయోగాః. ౫౮. వస్త్రగోపనాని. ౫౯. ద్యూత విశేషాః. ౬౦. ఆకర్షక్రీడా. ౬౧. బాలక్రీడనకాని. ౬౨. వైనయికానాం, ౬౩. వైజయంతికానాం. ౬౪. వ్యాయామికానాం విద్యానాం జ్ఞానం. ఇతి చతుష్షష్టిరంగవిద్యాః కామసూత్రస్యావయవిన్యః. ౧.౩.౧౬

తంత్రావాసానికి ఉపయోగించే అరవైనాలుగు కళలనూ ప్రదర్శిస్తున్నారు. వాటిలో మొదటిది గీతం. 1. గీతం అంటే సంగీతం అన్నమాట. గానం చేయబడేదికాబట్టి సంగీతం అన్నారు. ఇది స్వరప్రధానంగానూ, పదప్రధానంగానూ, లయప్రధానంగానూ, మనస్సుయొక్క అవధానం ప్రధానంగా లోలోపల గానంచేసేదిగానూ నాలుగు రకాలుగాఉంటుంది. 2. ఇకవాద్యం:- వాయింపతగినది గనుక వాద్యం అన్నారు. ఇదిగూడా నాలుగురకాలు. తాళాలతోవాయించేది ఒకరకం.

దీన్ని ఘనంఅంటారు. మద్దెల మొదలైనవాటితో వాయిం చేది మరోరకం. దీన్ని వితతంఅంటారు. తీగలుగలవీణ మొదలైనవాటితో వాయించేది యింకోరకం. దీన్ని తతం అంటారు. పిల్లనగ్రోవి మొదలైనవాటితో వాయించేది వేరొక రకం. దీన్ని సుషిరంఅంటారు. మొత్తం నాలుగురకాలు.

3. నృత్యం:- కరణాలనీ, అంగహారాలనీ, విభావాలనీ, భావాలనీ, అనుభావాలనీ, రసాలనీ ప్రత్యేకమైన అవయవాలుగా వీటితో కూడిఉన్నది నృత్యం. ఇది అభినయస్వరూపమైనది. అంటే విభావాలనూ, అనుభావాలనూ, భావాలనూగూడా చేతులూ, కాళ్లు, కళ్లూ మొదలైన అవయవాలతోనూ, శరీరం తోనూ ప్రకటిస్తూ రసం ఉట్టిపడేలాగా అభినయించడం అన్న మాట. ఇది నృత్యానికి సంగ్రహస్వరూపం.

4. ఆలేఖ్యం:- ఆలేఖ్యం అంటే చిత్రలేఖనం. చక్కగా సంపూర్ణంగా ఒక ఆకారాన్ని చిత్రించడం పేరు ఆలేఖ్యం అంటారు. ఇది ఆరు అంగాలు కలిగిఉంటుంది. 1. రూపభేదం, 2. ప్రమాణం. 3. భావయోజనం. 4. లావణ్యయోజనం. 5. సాదృశ్యం. 6. పుష్పాస్తరణం. 6. వర్ణికాభంగం. ఇవే చిత్రకళలో ఉన్న అంగాలు.

5. విశేషకచ్ఛేద్యం:- అనగా ముఖాన అలంకరించుకునే తిల కమూ, స్త్రీలు ఇంకా యితర స్థానాలలో అలంకరించు కునే పత్ర భంగాలూ మొదలైనవాటి చిత్రణం అన్న మాట.

6. పుష్పాస్తరణం:- పూలతో ఆసనాలూ, శయ్యాలూ తయారుచెయ్యడం.

7. తండుల కుసుమబలి వికారం:- బియ్యపు పిండితోనూ, పూలతోనూ భూతతృప్తికోసం పెట్టే ముగ్గులు.

8. దశనవసనాంగరాగం:- పళ్లకూ బట్టలకూ శరీరానికీ అందంగానూ, ఆకర్షంగానూ ఉండేట్టు రంగులు చిత్రించుకోడం.

9. మణిభూమికాకర్మ:- మణులతో బొమ్మలను తయారు చెయ్యడం.

10. శయనరచనం:- వసంతాది ఋతువుల ననుసరించి శీతోష్ణ స్థితులు గ్రహించి శయ్యలు ఏర్పరచడం.

11. ఉదకవాద్యం:- జలతరంగిణి.

12. ఉదకాఘాతం:- పిచికార్లతో నీళ్లు చిమ్మడం.

13. చిత్రయోగాలు:- రకరకాల వేషాలతో సంచరించడం.

14. మాల్యగ్రథన వికల్పాలు:- చిత్రవిచిత్రాలైన పూల చెండ్లూ, మాలికలూ కూర్చే నేర్పు.

15. శేఖరకాడయోజనం:- పూలతో కిరీటాన్నీ, తలకు చుట్టూ అలంకరించుకునే పూలనగిషీనీ తయారు చెయ్యడం.

16. నేపథ్యయోగాలు:- అలంకరించుకునే విధానాలు.

17. కర్ణపత్రభంగాలు:- ఏనుగుదంతాలతోనూ, శంఖాలతోనూ చెవులకు అలంకారాలు కల్పించుకోడం.

18. గంధయుక్తి:- అత్తరువు చేసే నేర్పు.

19. భూషణయోజనం:- సొమ్ములు పెట్టుకునే విధానాలు.

20. ఇంద్రజాలం:- చూపరుల కన్నులను భ్రమపెట్టడం.

21. కౌచుమారం:- సుభగం కరణాదియోగాలు.

22. హస్తలాఘవం:- చేతులో ఉన్న వస్తువులను మాయం చెయ్యడం మొదలైనవి.

23. విచిత్రశాక యూష భక్ష్య వికార క్రియాపానకరస రాగాసవయోజనం:- రకరకాల కూరలూ, రొట్టెలూ, భక్ష్యాలూ, పానకాలూ, షర్బతులూ, మొదలైనవి తయారుచెయ్యడం.

24. సూచీవానకర్మ:- గుడ్డలు కుట్టడం.

25. సూత్రక్రీడ:- దారాలు త్రెంచివేసి, కాల్చి, మళ్లీ ఉన్న దారాన్ని ఉన్నట్లుగా చూపించడం.

26. వీణా డమరుక వాద్యాలు:- వీణ, డమరుకము ఈ రెండు రకాలైన ప్రసిద్ధ వాద్యాలలోనూ నేర్పు.

27. ప్రహేళికలు:- సామాన్యార్థాన్నిమాత్రం పైకి కనుపరుస్తూ, గంభీరమైన అర్థాన్ని రహస్యంగా ఉండేలాగా కవిత్వం చెప్పడం.

68. ప్రతిమాల:- కట్టు పద్యాలు చదవడం.

29. దుర్వాచకయోగాలు:- విలాసంకోసం క్లిష్టంగా వ్రాసిన దాన్ని చదవడం.

30. పుస్తకవాచనం:- గ్రంథాలు రసం ఉట్టిపడేలాగా శ్రావ్యంగా చదవడం.

31. నాటకాఖ్యాయికాదర్శనం:- నాటకాలూ, గద్య గ్రంథాలూ, చంపువులూ, మొదలైనవి సమన్వయించుకోడం.

32. కావ్య సమస్యా పూరణం:- పద్యాలతో సమస్యలను పూరించడం.

33. పట్టికావేత్రవానవికల్పాలు:- పేముతో కుర్చీలూ, మంచాలూ, బుట్టలూ మొదలైనవి అల్లడం.

34. తర్కుకర్మలు:- విలాసంకోసం బొమ్మలు తయ్యారు చెయ్యడం.

35. తక్షణం:- కొయ్యలు చక్కగా చెక్కే నేర్పు.

36. వాస్తువిద్య:- ఇళ్లు కట్టడానికి కొలతలు లెక్కకట్టడం.

37. రూప్యరత్నపరీక్ష:- రూపాయలలోనూ, రత్నాలలోనూ మంచి చెడులను గ్రహించడం.

38. ధాతువాదం:- లోహాలున్న ప్రదేశాలను కనుక్కోడం.

39. మణిరాగాకరజ్ఞానం:- మణులు మొదలైనవాటి గనులను కనిపెట్టడం.

40. వృక్షాయుర్వేద యోగాలు:- చెట్ల వైద్యము.

41. మేషకుక్కుట లావక యుద్ధవిధులు:- పొట్టేళ్లూ, కోళ్లూ, లావక పిట్టలూ మొదలైనవాటితో పందెములు వేయించే పధానాలు.

42. శుకశారికాప్రలాపాలు:- చిలుకలనూ, గోరువంకలనూ పలుకరించి, వాటిచేత మాటలాడించడం.

43. ఉత్సాదనంలోనూ, సంవాహనంలోనూ, కేశమర్దనం లోనూ కౌశలం:- శరీరాన్ని మర్దించడం (ఒళ్లు పట్టడం) పాదాలు ఒత్తడం, తల అంటడం ఈ పనులలో నేర్పు.

44. అక్షరముష్టికాకథనం:- అక్షరాలను మధ్యమధ్య రాస్తూ కవిత్వం చెప్పడం.

45. మ్లేచ్ఛిత కవి కల్పాలు:- ఇతరుల కవిత్వం ఎంతమంచి దయినా, అపశబ్దపూరితమని భ్రమపెట్టడం.

46. దేశభాషావిజ్ఞానం:- దేశభాషలన్నింటిలోనూ మాట్లాడ గలగడం.

47. పుష్పశకటిక:- పూలతో రథాన్ని తయారుచెయ్యడం. (పూలరథం, పూలపల్లకి అని ఇప్పటి వ్యవహారం)

48. నిమిత్త జ్ఞానం:-శకునాలయొక్క మంచి చెడుగులను తెలుసుకోడం.

49. యంత్రమాతృక:- యంత్రాలను నిర్మించడం.

50. ధారణమాతృక:- ఒక్కమాటు విన్నదాన్ని ధారణ పట్టడం.

51. మానసీక్రియ:- మనస్సునకు సంబంధించిన అవధానమూ మొదలైన పనులు.

52. సంపాఠ్యం:- పలువురు జనులు కలిసి గొంతు కలిపి చదవడం.

53. కావ్యక్రియ:- కావ్యములను రచించడం.

54. అభిధానకోశం:- నిఘంటువులను వర్ణించడం.

55. ఛందోజ్ఞానం:- గణయతి ప్రాసాదిలక్షణాలతో కూడిఉన్న ఛందశ్శాస్త్రాన్ని (కవిత్వం చెప్పే శాస్త్రాన్ని) నేర్చుకోడం.

56. క్రియాకల్పం:- పనులయందు స్వతంత్ర శక్తి.

57. భావితకయోగం:- మాయచేసి ఒకవస్తువు స్వరూపాన్ని మరొకతీరుగా మార్చడం.
58. వస్త్రగోపనం:- గుడ్డను మాయంచేసే చిత్రాలు.
59. ద్యూతవిశేషాలు:- జూదంలోని విశేషాలను తెలుసుకోడం
60. ఆకర్షక్రీడ:- తాడులాగుతూ ఆడేఆట.
61. బాలక్రీడనకాలు:- పిల్లల ఆటవస్తువులను చాలా అందంగా తయారుచెయ్యడం.
62. వైనయికీజ్ఞానం:- గుఱ్ఱాలనూ, ఏనుగులనూ వశంచేసుకునే నేర్పు.
63. వైజయికీవిద్యలు:- విజయాన్ని సాధించే ఉపాయాలు చెప్పే శాస్త్రం.
64. వ్యాయామికీజ్ఞానం:- దేహ పరిశ్రమలనుగురించిన జ్ఞానం.

౧౫౬. పాంచాలికీచతుష్షష్టి రపరా. ౧. 3. ౧౭.

పైనచెప్పిన అరవైనాలుగు మూలకళలే కాక పాంచాలికీకళలనే పేరుతో మరొక చతుష్షష్టికళలున్నాయి. ఇవికూడా కామ శాస్త్రానికి అంగవిద్యలే వీటివల్లకూడా కామప్రవృత్తి కలుగు తుంది.

౧౫౭. తస్యాః ప్రయోగా నన్వవేత్య సాంప్రయోగికే వక్ష్యామః. ౧. 3. ౧౮.

పై పాంచాలికీకళను ప్రయోగించే విధానాలను సాంప్రయోగి కాధికరణంలో వివరించి చెవుతారు.

౧౫౮. కామస్య తదాత్మకత్వాత్ ౧. 3. ౧౯

కామంఅనేది పాంచాలికీ చతుష్షష్టిరూపమైనది కాబట్టి ఇక్కడ

కామశాస్త్రానికి ఈ కళలు అంగభూతాలని చెప్పడానికి మాత్రమే వాటిప్రసక్తిని తెచ్చారు. కాని వాటి స్వరూపాన్ని యిక్కడ చెప్పదలచుకోలేదు.

౧౫౯. ఆభిర భ్యుచ్ఛ్రితా వేశ్యా, శీల రూప గుణాన్వితా,
లభతే గణికాశబ్దం, స్థానంచ జనసంసది. ౧.౩.౨౦

ఈ పాంచాలికీ కళలలో నేర్పుగడించిన వేశ్య చాలా ఉత్కర్షను పొందుతుంది. అలా ఉత్కర్షనుపొంది, మంచిస్వభావమూ, మంచిరూపమూ, వైశికాధికరణంలో చెప్పబోయే నాయికా గుణాలూ కలిగిఉంటే ఆ వేశ్య 'గణిక' అనే బిరుదాన్ని పొంది గొప్ప ప్రఖ్యాతితో సభలలో అగ్రస్థానాన్ని పొందుతుంది.

౧౬౦. పూజితా సా సదా రాజ్ఞా, గుణవద్భిశ్చ సంస్తుతా,
ప్రార్థనీయా భిగమ్యాచ, లక్ష్య భూతా చ జాయతే. ౧. ౩. ౨౧

ఆ వేశ్య రాజులచేత గృహక్షేత్రాది దానాలతో పూజలుపొందుతూ ఎప్పుడూ గౌరవాన్ని అనుభవిస్తూఉంటుంది. బుద్ధిమంతులస్తోత్రాలకు పాత్రురాలౌతుంది. కళలను నేర్చుకోవాలనే అభిలాషకలవాళ్లకు ప్రార్థించతగినదీ అవుతుంది. నాగరకులకు మిక్కిలి లక్ష్యభూతురాలవుతుంది.

౧౬౧. యోగజ్ఞా రాజపుత్రీ చ, మహామాత్రసుతా తథా,
సహస్రాంతఃపురమపి స్వవశే కురుతే పతిం.౧.౩.౨౨

గీతం మొదలైన కళాయోగాన్ని తెలుసుకునిఉన్న రాజపుత్రిక, మహాసామంతుల పుత్రిక, వెయ్యిమంది సవతులున్న అంతఃపురంలోనైనాసరే భర్తను వశంచేసుకోగలుగుతుంది.

౧౬౨. తథా పతివియోగేచ వ్యసనం దారుణం గతా।
దేశాంతరేఽపి విద్యాభి స్సా సుఖేనైవ జీవతి.
౧.౩.౨౩

ఒకవేళ భర్త గతించి తనకు భర్తతో శాశ్వతవియోగం సంభ వించి దారుణమైనదుఃఖం ప్రాప్తించినా, ఏ దేశాంతరంలో నైనా ఈ విద్యవల్ల సుఖంగా కాలం గడపగలుగుతుంది.

౧౬౩. నరః కళాసు కుశలో వాచాల శ్చాటుకారకః. అసం
స్తుతోఽపి నారీణాం, చిత్త మాశ్వేవ విందతి.
౧. ౩. ౨౪

ఈ కళలలో నేర్పు సంపాదించినపురుషుడు ఎక్కువ విషయా లనుగూర్చి మాటలాడగలవాడుగానూ, చాతుర్యంగా సంభాషింప గలవాడుగానూ, ప్రియంగా మాట్లాడగలవాడుగానూ అవు తాడు. ఇంకా పరిచయంలేని స్త్రీల మనస్సునైనా ఇట్టే శీఘ్ర కాలంలో వశంచేసుకోగలుగుతాడు.

౧౬౪. కళానాం గ్రహణాదేవ సౌభాగ్య ముపజాయతే,
దేశకాలే త్వవేక్ష్యాసాం ప్రయోగ స్సంభవే
న్నవా, ౧. ౩. ౨౫

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాధారణే
ప్రథమేఽధికరణే విద్యాసముద్దేశ స్తృతీయోధ్యాయః.

ఈ కళలను నేర్చినందువల్లే స్త్రీ పురుషులకు లోకోత్తరమైన సౌభాగ్యం యేర్పడుతుంది. సౌభాగ్యంఅంటే, ధనప్రాప్తి, అనర్థంప్రాప్తిస్తుంటే దానికి ప్రతిక్రియచెయ్యడం, కామం, యశస్సు మొదలైనవన్నమాట ఈ కళలలో నేర్పుగడించిన

వారు దేశకాలాలను పరీక్షించుకుని సంప్రయోగం ఈ సమయంలో తగునా? తగదా? అని విచారించి ప్రవర్తించాలి.

ఈ రూపంగా భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబ సూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయమూర్తి చేత వాత్స్యాయన కామ సూత్రములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను తెలుగు వ్యాఖ్యలోని సాధారణాధికరణంలో విద్యాసముద్దేశం అనే మూడో అధ్యాయం ముగిసింది.



శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెనుఁగు వ్యాఖ్యాన సమేతం

సాధారణాధికరణం

### ౪. నాగరక వృత్తాధ్యాయం

౧౯౫. గృహీతవిద్యః ప్రతిగ్రహజయక్రయనిర్వేశాధిగతై రర్థై రన్వయాగతై రుభయైర్వా గార్హస్థ్య మధిగమ్య నాగరకవృత్తం వర్తేత. ౧. ౪. ౧

పైన చెప్పినవిధంగా సకలశాస్త్రాలూ చదివి, ఈ కామ సూత్రాన్నిగూడా పఠించినతరువాత పెండ్లిచేసుకుని భార్యతో కాపురంచేస్తూ ఉన్నా ధనం లేకపోతే నాగరకవృత్తికి తగిన గృహకృత్యాలు సాగవు. అందువల్ల ధనసంపాదనకోసం బ్రాహ్మణుడు దానాదులను గ్రహించి ధనాన్ని సంపాదించాలి. రాజపుత్రుడు జయంవల్లా, వైశ్యుడు వ్యాపారంవల్లా, శూద్రుడు వ్యవసాయాదులవల్లా ధనాన్ని సంపాదించాలి. గృహస్థులైన అన్ని వర్ణాలవారికీ ఈ కామసూత్రం వ్రాస్తున్నారు. ఈ శాస్త్రానికి ఈ ప్రకరణం శరీరంవంటిది. మానవుడు తాను చదివిన శాస్త్రాలను గృహస్థాశ్రమాన్ని స్వీకరించిన తరువాత ఆచరణలో పెట్టగలుగుతాడు.

౧౬౬. నగరే పత్తనే ఖర్వాటే మహతివాసజ్జనాశ్రయే
స్థానం. ౧. ౪. ౨

గృహస్థుడు నగరంలోగానీ, పట్టణంలోగానీ, ఖర్వాటంలోగానీ, అంతకంటె పెద్దదైన ద్రోణముఖంలోగానీ సజ్జనులు ఎక్కువగా నివసించే ఇతరచోట్లగానీ ఉండవచ్చు. నగరంఅంటే ఎనిమిది వందల ఊళ్లకు మధ్యఉన్న పెద్దగ్రామం అన్నమాట. పట్టణం అంటే రాజులునివసించే పెద్దనగరం. నాలుగువందల గ్రామాలకు మధ్యఉన్న పెద్దగ్రామాన్ని ఖర్వాటం అంటారు. అంతకంటె పెద్దది ద్రోణముఖం.

౧౬౭. యాత్రావశాద్వా. ౧. ౪. 3

లేక యెక్కడ జీవితంగడపడానికి అనుకూలంగా ఉంటుందో అక్కడ నివసించాలి గృహస్థు.

౧౬౮. తత్ర భవన మాసన్నోదకం, వృక్షవాటికావత్, విభక్త కర్మకక్ష్యం, ద్విధా వాసగృహం కారయేత్. ౧. ౪. ౪

ఎక్కడైనాసరే గృహస్థు గృహంలేకుండా నివాసంచెయ్యడం పొసగదు కాబట్టి నగరంలోగానీ, మరియెక్కడైనాసరే గృహాన్ని నిర్మించుకోవాలి. ఆ గృహానికి నీటివసతి బాగా దగ్గరలోఉండాలి. అంటే సమీపంలో నదిగానీ, చెరువుగానీ, భావిగానీ ఉండాలన్నమాట. ఆయింటికిదగ్గరగా ఒక తోట కూడా ఉండాలి. ఈ ఉద్యానం నీళ్లు సులువుగా లభ్యపడే దిక్కున ఉండాలి. పనీపాటులూచేసుకునే గృహం, ప్రధాన గృహానికి ఆనుకుని వేరేఉండాలి. నివాసగృహం రెండుభాగా

లుగా ఉండాలి. పడుకోడానికి ఒకటి. రతిక్రీడలకోసం వేరొకటి. ఇది నాగరకవృత్తానికి ఉపయోగించే గృహనిర్మాణవిధానం. మిగిలిన వాస్తువిధానం అంతా వాస్తుశాస్త్రంవల్ల తెలుసుకోవాలి.

౧౬౯. బాహ్యేచ వాసగృహే, సుశ్లక్ష్ణ, ముభయోప
ధానం, మధ్యేవినతం, శుక్లోత్తరచ్ఛదం శయనీయం
స్యాత్ ప్రతిశయ్యికాచ. ౧. ౪. ౫

ఇంక పనిముట్లు అమర్చుకునేవిధానం చెవుతున్నారు. ఇంటిలో పలి భాగాన్ని స్త్రీజనం శయనించడానికి అనుకూలంగా తయారుచేసుకోవాలి. ముందునైపుగాఉన్న ఇంటిలోని పూర్వ భాగాన్ని రతిక్రీడలకు శయనింపతగినదాన్నిగా ఏర్పరుచుకోవాలి. శయనగృహంలో చిత్రవిచిత్రాలైన నగిషీపనులతో దీర్చిదిద్దిన పెద్దమంచంఉండాలి. దానిపైన మెత్తనిదూదిపరుపు పరిచి ఉంచాలి. దానిమీద శుభ్రమైన తెల్లనివస్త్రంవేసి ఉంచాలి. తలకిగింద్, కాళ్లకిగిందా రెండు చక్కనిదిండ్లు ఉండాలి. ఆ గృహంలో ప్రవేశించేసరికి సువాసనలు గుప్పున వెదజల్లుతూఉండాలి. శయ్యకుమధ్యభాగం కొంచెంపల్లంగానూ, చాలామెత్తగానూ, సుఖప్రదంగానూ ఉండాలి. శయ్యపైన పరిచినవస్త్రాన్ని రోజురోజూగానీ, రెండురోజులకొక్కసారిగానీ, కనీసం మూడురోజుల కొక్కసారిఅయినా చలువ చేయించాలి. ఆ పెద్దశయ్యకు దగ్గరలోనే సంప్రయోగానంతరం శయనించడానికి కొంచెం యెత్తుతక్కువగాఉన్న మరొక శయ్య ఉండాలి. సంగమం చేసినతరువాత ఆశయ్యమీద నిద్రించరాదు.

౧౭౦. తస్యచ శిరోభాగే కూర్చస్థానం. ౧. ౪. ౬
శయ్యకు తలవైపున నేలమీద దైవప్రార్థనకోసం కూర్చాసనమనే పేరుగల ఆసనం ఉండాలి. కూర్చాసనంఅంటే జపం చేసుకునే ఆసనం అన్నమాట.

౧౭౧. వేదికాచ. ౧. ౪. ౭
ఏదో ఒకవైపున గోడకుఆనిఉండే మూరెడువెడల్పుగల అరుగు ఉండాలి.

౧౭౨. తత్ర రాత్రిశేష మనులేపనం, మాల్యం, సిక్థకరండకం, సౌగంధికపుటకా, మాతులుంగత్వచః, తాంబూలానిచ స్యుః. ౧. ౪. ౮
ఆ అరుగుమీద గడచినరాత్రి అనుభవించగా మిగిలిన, గంధాలూ, పూలమాలలూ, సుగంధద్రవ్యాలూ, చెమటను పోగొట్టి హాయినిచేకూర్చే విసనకర్ర, లవంగపుబెరడులూ, (వీటినినమలితే నోటిదుర్వాసనపోతుంది) తాంబూలాలూ ఉండాలి.

౧౭౩. భూమౌ పతద్గ్రహః. ౧. ౪. ౯
పైనచెప్పిన అరుగునకు క్రిందిభాగంలో తమ్మ ఉమ్మివేసేపాత్ర ఉంచాలి. ఆ పాత్రికు 'పతద్గ్రహం'అని పేరు.

౧౭౪. నాగదంతావసక్తా వీణా, చిత్రఫలకం, వర్తికాసముద్గకః, కురంటకమాలాశ్చ. ౧. ౪. ౧౦
అవసరాన్నిపట్టి వాయించుకునేనిమిత్తం బురఖాతోకప్పబడిన ఒకవీణ ఏనుగుదంతపుచిలుక కొయ్యకుతగిలించిఉంచాలి. తోచి

నప్పుడు చిత్రాలు వ్రాయడానికి చిత్రఫలకంగూడా అక్కడే ఉండాలి. ఈ కామసూత్రగ్రంథంగూడా అక్కడఉంచాలి. సురతసమ్మర్దం కలిగినా వాడిపోకుండా ఉంటాయిగనుక గోరింట పూలూ, పొగడపూలూ వగైరాలు కొన్ని అక్కడఉంచుకోవాలి. ఈపైన చెప్పినవస్తువులు అవసరం వచ్చినప్పుడు గ్రహించడానికి వీలుగా ఆయాచోటులలో ఉంచుకోవాలి.

౧౭౫. నాతి దూరే భూమే వృత్తాస్తరణం. ౧. ౪. ౧౧

శయ్యకుదగ్గరగా భూమిమీద పేముకుర్చీగానీ, పడకకుర్చీగానీ ఉంచుకోవాలి. ఆకుర్చీ, తలనుగూడా ఆనించుకుని విశ్రమించడానికి అనుకూలంగా ఉండాలి.

౧౭౬. ఆకర్షఫలకం, ద్యూతఫలకంచ. ౧. ౪. ౧౨

ఇంకా అద్దమూ, బొమ్మలపటాలూ, విలాసంగా ఆడుకోడానికి జూదపుపలక మొదలైనవిగూడా గోడకు తగిలించుకుని ఉంచుకోవాలి. అవసరాన్నిపట్టి వాడుకుని జాగ్రతపరుచుకుంటూ ఉండాలి.

౧౭౭. తస్యబహిః క్రీడా శకునిపంజరాణి. ౧. ౪. ౧౩

నివాసగృహానికి దగ్గరగా బయటగా ఉన్నయింటిలో వినోదంకోసం ఏనుగుదంతంలో తయారుచేయబడిన చిలుకపంజరాలుండాలి.

౧౭౮. ఏకాంతేచ తర్కు తక్షణ స్థాన మన్యాసాంప క్రీడానాం. ౧. ౪. ౧౪

కాపురండుండేఇంట్లో ఏకాంతభాగంలో కొయ్యలు కోయించ

డానికీ, చెక్కించడానికీ, క్రీడించడానికి వీలుగాఉండేస్థానం ఒకటి ప్రత్యేకించి ఉండాలి.

౧౭౯. స్వాస్తీర్ణా ప్రేంఖా దోలా వృక్షవాటికాయాం సప్రచ్ఛాయా స్థండిలపీఠికాచ సకుసుమా ఇతి భవనవిన్యాసః. ౧. ౪. ౧౫

ఉద్యానవనంలో దట్టంగాకమ్ముకునిఉన్న చల్లని చెట్లకొమ్మల క్రింద ఉయ్యాలఉండాలి. అది ఉద్యాన వనవిహారకాలంలో ఉపయోగపడుతుంది. పొదరిళ్లలో యెప్పుడూ పూలురాలుతూ ఉండేచోట ఒక మట్టి అరుగు విశ్రమించడానికి వీలుగా ఉండాలి.

౧౮౦. స ప్రాత రుత్థాయ, కృత నియతకృత్యః, గృహీత దంతధావనః, మాత్రయా అనులేపనం, ధూపం, స్రజమితి గృహీత్వా, దత్వా సిక్థక, మలక్తకంచ, దృష్ట్వా ఆదర్శే ముఖం, గృహీత ముఖవాసతాం బూలః కార్యా ణ్యనుతిష్ఠేత్. ౧.౪.౧౬

ఇక గృహస్థు ప్రతిదినమూ జరుపవలసిన కార్యక్రమాన్ని చెపుతున్నారు. గృహస్థు పొద్దుననే నిద్రలేచి, మల మూత్ర విసర్జన చేసి, దంతధావనం నెరవేర్చి, స్నానం, సంధ్య, జపం, తపం కానిచ్చుకుని, గంధం కొద్దిగా అలంకరించుకుని, ధూపాన్ని ఒంటికి పాశేలాగా చేసుకుని, పూలమాలలు ధరించి, పెదవులకు కొద్దిగా లత్తుకను తగిలించుకుని, అద్దంలో ముఖంచూచుకుని, తాంబూలం నమలి, తమ్మశ బుగ్గనపెట్టి, మళ్లీ ఉపయోగించడానికి తాంబూలపు పెట్టెను చేతపట్టి ఇక ధర్మార్థకామ కార్యక్రమానికి పూనుకోవాలి.

౧౮౧. నిత్యం స్నానం, ద్వితీయ ముత్సాదనం, తృతీయకః ఫేనకః, చతుర్థక మాయుష్యం, పంచమకం దశమ కంవా ప్రత్యాయుష్యమితి. ౧.౪.౧౭

పైన గృహస్థు నడపవలసిన దినచర్యను నిరూపించి ఇంకా కొన్ని విధులను చెవుతున్నారు. దేహానికి కాంతినీ, పరిశుభ్రతనూ ఇస్తుంది కాబట్టి ప్రతిరోజూ తప్పక స్నానంచెయ్యాలి. రోజు విడిచి రోజు ఒళ్లు పట్టించుకోవాలి. మూడురోజుల కొక మాటు అభ్యంగనస్నానం చెయ్యాలి. (తలంటి నీళ్లుపోసుకోవాలి.) నాలుగురోజులకొకసారి ఆయుష్యాన్ని వృద్ధిచేసే క్షుర కర్మను నెరవేర్చుకోవాలి. అయిదురోజులకొకసారి అధో రోమాలను తీసివెయ్యాలి. కనీసం పదిరోజులకొకసారైనా తప్పనిసరిగా ఆ పని చెయ్యాలి.

౧౮౨. సాతత్యాచ్చ సంవృతకక్షా స్వేదాపనోదః. ౧.౪.౧౮

ఎల్లప్పుడూ చంకలకు గాలి తగిలేలాగా చూచుకోవాలి. ఏ పనిలోనన్నా మునిగిఉండి వాటిని మూసిఉంచితే అక్కడ చెమట బాగా పడుతుంది. వెంటనే గుడ్డతో తుడిచివేసుకోడం చాలా మంచిది. లేకపోతే దుర్వాసన కొడుతుంది.

౧౮3. పూర్వాపరాహ్ణయోర్భోజనం. ౧.౪.౧౯

రాత్రింబవళ్లు రెండింటినీ ఎనిమిది భాగాలుగా విభజించి ప్రొద్దున మూడు భాగాలలోనూ గృహకృత్యాలు నెరవేర్చుకోవాలి. నాలుగోభాగంలో మళ్లీ స్నానంచేసి భోజనం చెయ్యాలి. సాయంత్రం చివరభాగంలో మళ్లీ భోజనంచెయ్యాలి.

రాత్రి వచ్చినతరువాత నన్నమాట. ఇది వాత్స్యాయనుల మతం.

౧౮౪. సాయంచారాయణస్య. ౧.౪.౨౦

మధ్యాహ్నం కాకముందున్నూ, సాయంకాలమున్నూ భోజనం చెయ్యాలని చారాయణుల మతం. ఎలాగైనా రాత్రి భోజనంకంటె సాయంకాల భోజనం బలవర్ధకమైనది కాదు.

౧౮౫. భోజనానంతరం శుకశారికా ప్రలాపన వ్యాపారాః, లావక కుక్కుట మేష యుద్ధాని, తాస్తాశ్చకళాః క్రీడాః, పీఠమర్ద విటవిదూషకాయత్తాః వ్యాపారాః దివాశయ్యాచ. ౧.౪.౨౧

మధ్యాహ్న భోజనం అయినతర్వాత చిలుకలనూ, గోరువంకలనూ మాటలాడించడం, పావురాలచేతా, కోళ్ళచేతా, పొట్టేళ్ళచేతా పోట్లాడించడం, కళలకు సంబంధించిన ప్రసంగాలూ, మొదలైనవాటిని, పీఠమర్దులూ, విటులూ, విదూషకులూ మొదలైనవారి సహాయంతో నివర్తించాలి. తరువాత పగటినిద్రకోసం పడుకోవాలి. గ్రీష్మఋతువులో పగటి నిద్ర దోషం కాదు.

౧౮౬. గృహీత ప్రసాధనస్యా పరాహ్ణే గోష్ఠీ విచారః. ౧.౪.౨౨

పైన చెప్పిన కార్యక్రమాన్ని ముగించుకుని విహారానికి తగిన వేషాన్ని ధరించి పగటియొక్క చివరభాగంలో (సాయం సమయంలో) అప్తులతోనూ, మిత్రులతోనూ విహరించాలి.

౧౮౭. ప్రదోషే సంగీతకానిచ. ౧.౪.౨౩

సంధ్యా సమయంలో (చీకటి పడిన వెంటనే) నృత్యం, గీతం, వాద్యం మొదలైన గోష్ఠులను జరపాలి.

౧౮౮. తదంతేచ ప్రసాధితే వాసగృహే, సంచారితేచ సురభిధూపే, ససహాయస్యశయ్యాయాం అభిసారికాణాం ప్రతీక్షణం, దూతీనాం ప్రేషణం, స్వయం వాగమనం. ౧.౪.౨౪

నాగరకుడైన గృహస్థు పైన చెప్పిన సంగీతాది గోష్ఠులు జరిపిన తరువాత ఊడ్చి, నీళ్లుచల్లి, చక్కగా, వింతగా, చిత్రవిచిత్రంగా పుష్పాలతోనూ, శయన రచనతోనూ అలంకారం చేయబడి, అగరు పొగలతో నిండి ఘుగ్గురుమని సువాసనలు వెదజల్లుతూ ఉన్న ముంగలి నివాస గృహంలో (రతికొరకై నిర్మింపబడిన గృహంలో) పీఠమర్ద, విట, విదూషకాదులతో ప్రవేశించి శయ్య అలంకరించి అభిసారికకోసం (నాయికకోసం) ఎదురు చూడాలి. లేక దూతికనైనా పంపాలి. తనంతట తానన్నా వెళ్లాలి. పైన చెప్పిన పీఠమర్దుడు మొదలైన సహాయకులు, నాయకుడున్న శయ్యమీద కాకుండా వేరు ఆసనాలను అలంకరించాలి. అభిసారికఅంటే నాయకునికోసం తనయిల్లు వదలి సంకేతస్థళానికి పోయే స్త్రీ అన్నమాట.

౧౮౯. ఆగతానాంచ మనోహారైరాలాపైరుపచారైశ్చ స
సహాయస్యోపక్రమాః వర్షప్రమృష్టనేపథ్యానాం,
దుర్దినాభిసారికాణాం స్వయమేవ పునర్మండనం,
మిత్రజనేనవా పరిచరణ మిత్యాహోరాత్రికం.
౧.౪.౨౫

పై సహాయకులతో కూడిఉండి నాయకుడు నాయికను మనోహరాలైన మాటలతోనూ, ఉపచారాలతోనూ, పలకరిస్తూ ఉపక్రమించాలి. మబ్బుపట్టి వర్షంకురిసే సమయంలో అభిసరించే నాయికలకు వర్షంచేత అలంకారం చెరిగిపోతే తన ప్రేమను సూచించడానికి తానే ఆమె అలంకారాలు దిద్దాలి. ఇది ఉత్తమ నాయికలకు చేసేపద్ధతి. ఇంకా ఈ అభిసారికకు పాదాలు ఒత్తడం, శ్రమపోయేలాగా విసరడం, ఈమొదలైనవి పరిచారికలద్వారా చేయించాలి. ఇవి నాగరకుడైన గృహస్థు రాత్రింబగళ్లు నడచుకోవలసిన నడతలు. ఇంక సాంప్రయోగికంలో సంప్రయోగాన్నిగూర్చి చెవుతారు.

౧౯౦. ఘటానిబంధనం, గోష్ఠీసమవాయః, సమాపానకం,
ఉద్యానగమనం, సమస్యాః క్రీడాశ్చ. ౧.౪.౨౬

పైన చెప్పినవన్నీ ప్రతిరోజూ చేయవలసిన పనులు. ఇక నైమిత్తిక క్రియలనుగురించి చెవుతున్నారు. నైమిత్తికాలంటే ఏదోఒక కారణాన్నిపట్టి అప్పుడప్పుడు జరిపే గోష్ఠులూ, మొదలైనవన్నవాట, ఘటలంటే దేవునికి చేసే ఉత్సవాలు. నాగరకులంతా అక్కడకు చేరతారు కాబట్టి దానికా పేరు వచ్చింది. ఆ ఉత్సవాలను నియమపద్ధతితో నడపడం, నాగ

రకులతోకూడి సభలు ఏర్పాటుచేసి కళలూ మొదలైనవాటిని గురించి చర్చలు జరపడం, మిత్రులతోనూ, భార్యలతోనూ కలిసి పానీయాలూ (మధువులూ, ఆసవాలూ) సేవించడం, ఉద్యానవనానికి మిత్రులతో షికారుపోవడం, నాగరకులంతా ఒక్కచోటచేరి ప్రసంగించడం, ఆటపాటలలో పాల్గొనడం, ఈ మొదలైన నైమిత్తికాలలోగూడా నాగరకుడైన గృహస్థు ప్రవర్తించాలి.

౧౯-౧. పక్షస్య మాసస్య వా ప్రజ్ఞాతేఽహని సరస్వత్యా భవనేనియుక్తానాం నిత్యం సమాజః. ౧.౪.౨౮

పైన చెప్పిన నైమిత్తిక కార్యాలలో మొదటిదైన ఘటానిబంధ నాన్ని నిరూపిస్తున్నారు. ఒక పక్షంగానీ, ఒక మాసంగానీ, పూర్తిఅయిన రోజులలోనూ, (అమావాస్య, పూర్ణిమలలో) పర్వదినాలలోనూ, సరస్వతీదేవి ఆలయంలో నాగరకులంతా తమ తమకు నియమించిన పనులను జరపడానికి సమకూడడం "ఘట" అనే పేరుతో వ్యవహరింపబడుతుంది. ఇప్పటికీ దేవాల యాలలో ఉత్సవ దినాలలో దేవునికి వివిధోపచారాలూ జరపడం ఆచరణలోఉన్నది. అక్కడకు కవులూ, గాయకులూ, వర్తకులూ, మొదలైనవారు వచ్చి తమ పనులలో పాల్గొనడం గూడా మనం చూస్తూనేఉన్నాం. వీరంతా దేవుని మాన్యా లను అనుభవిస్తూ ఈపనులు నిర్వహిస్తారు.

౧౯-౨. కుశీలవాశ్చాగంతుకాః ప్రేక్షణకమేషాం దద్యుః. ౧.౪.౨౯

పర్వదినాలలో కాకుండా తమ విద్యాప్రభావాన్ని ప్రదర్శిం

చడం కోసం దేశసంచారంచేస్తూ వచ్చిన నటులూ, నర్తకులూ, గాయకులూ మొదలైన కళాకుశలులకు ఇతర దినాలలోగూడా ప్రదర్శనాలకు తగిన యేర్పాటులు చెయ్యాలి.

౧౯-౩. ద్వితీయేఽహని తేభ్యః పూజానియతం లభేరన్. ౧.౪.౨౯

మొదటిరోజున వారిచేత ప్రదర్శనం జరిపించి, రెండవరోజున వారిని పారితోషికాదులతో సత్కరించాలి. గంధ తాంబూల వస్త్రాది సత్కారం ప్రదర్శనసమయంలో ప్రేక్షకులముందరే జరపాలి.

౧౯-౪. తతో యథా శ్రద్ధమేషాం దర్శన ముత్సర్గో వా. ౧.౪.౩౦

మళ్లీమళ్లీ ఆ ప్రదర్శనాలు చూడాలని కుతూహలం ఉంటే తిరిగీ ప్రదర్శింపచెయ్యవచ్చు. లేకపోతే మృదుమధురాలైన మాటలతో సాగనంపాలి.

౧౯-౫. వ్యసనోత్సవేషు చైషాం పరస్పరస్యైకకార్యతా. ౧.౪.౩౧

దేశయాత్రకోసం వచ్చిన నటులూ, నర్తకులూ, గాయకులూ మొదలైనవాళ్లకు ప్రదర్శన దినాలలో రోగంగానీ, శోకంగానీ, ఆపదగానీ, వివాహం మొదలైన ఉత్సవాలుగానీ సంక్రమించి స్వగృహాలకు మళ్లవలసివస్తే, తమదగ్గర అంతకుపూర్వం ఆపనులలో నియమితులైఉన్న ఆ కళాకుశలులను ఆ పనులకు నియోగించి ప్రదర్శింపచెయ్యాలి.

౧౯౬. ఆగంతూనాంచ కృత సమవాయానాం పూజన,
మభ్యుప పత్తి శ్చేతి గణధర్మః. ౧.౪.౩౨

ఈ ప్రదర్శనాలు చూడడానికి వచ్చిన ప్రేక్షకులలో నాగరకా గ్రేసరులనిపించుకున్న పెద్దలను గంధ, తాంబూల, పుష్ప హారాలతో సత్కరించాలి. దీన్ని గణధర్మం అంటారు. ఇంకా తమ ఊళ్లో ఉన్న నాగరకాగ్రేసరులకు "వీరు భలానావారు, ఇలాంటివారు, మొన్న ఇలాచేశారు, నిన్న ఈ ఘనకార్యం చేశారు." అని తెలియజెయ్యడంగూడా జరపాలి.

౧౯౭. ఏతేన తం తందేవతా విశేషముద్దిశ్య సంభావిత
స్థితయో వివిధాఘటా వ్యాఖ్యాతాః ౧-౪-౩౩

పైన చెప్పిన విధానాలచేత ఆయా దేవతావిశేషాలనుబట్టి అక్కడ జరుపవలసిన ఇతర ఘటల విధానాలుగూడా స్పష్టం చెయ్యబడ్డాయి.

౧౯౮. వేశ్యాభవనే సభాయామన్య తమస్యోదవసితే
వాసమాన విద్యాబుద్ధి శీలవిత్తవయసాం సహ
వేశ్యాభిరనురూపైరాలాపై రాసన బంధో గోష్ఠీ.
౧.౪.౩౪

ఏదైనా ఒక వేశ్యాగృహంలోగానీ, చాలామంది సమావేశ మయే సభామంటపంలోగానీ, లేక ఏ నాగరకునియింటిలో గానీ, విద్యలోనూ, బుద్ధిలోనూ, స్వభావంలోనూ, భాగ్యం లోనూ, వయస్సులోనూ సమానులైన కొందరు నాగరకులు వేశ్యాజనంతో కూడి ఒకళ్లనొకళ్లు పొగుడుకుంటూ, ప్రక్క చూపులతో ప్రేమభావాలు తెలుపుకుంటూ, సయ్యాటలాడు

కుంటూ తమకుతగిన ఆసనాలను అలంకరించి వినోదించడాన్ని గోష్ఠీసమవాయం అంటారు.

౧౯౯. తత్రచైషాంగోష్ఠీ సమస్యాః కళాసమస్యాశ్చ
౧.౪.౩౫

ఆగోష్ఠులు జరిపే విధం ఇక్కడ చెవుతున్నారు.

ఆగోష్ఠులలో కావ్యాలకు సంబంధించిన సమస్యలూ,(కవిత్వానికి సంబంధంచినవన్నమాట) వాటి చర్చలున్నూ, సంగీతం,నృత్యం నాట్యం, మొదలైన కళాసమస్యల చర్చలున్నూ జరపాలి.

౨౦౦. తస్యాముజ్వలాః లోకకాంతాః పూజ్యాః, ప్రీతి సమానాశ్చ ఆహారితాః. ౧.౪.౩౬

ఆగోష్ఠిలో చర్చలు (విచారణలు) ముగిసినతరువాత ఒకళ్ల కొకళ్లు స్నేహభావాలు తెలుపుకోడంకోసం వస్త్రాదులతో కళాపూజలు నెరవేర్చుకోవాలి. నాగరకలైన వేశ్యలను ఆగోష్ఠులలో తమతమ ప్రేమకు అనుగుణంగా తమ పరిచారికలచేత తెప్పించినకానుకలు సమర్పించి పూజించాలి.

౨౦౧. పరస్పరభవనేషు చాపానకాని. ౧.౪.౩౭

ఆ సమావేశానికి హాజరయే నాయకులు ఒకళ్లయింటిలో ఒక మాటూ, మరొకళ్లఇంటిలో మరొకమాటుగా వంతులప్రకారం పక్షానికో, మాసానికో ఒక్కొక్కమాటు పానగోష్ఠులుగూడా జరపాలి.

౨౦౨. తత్రమధుమైరేయాసవాన్ వివిధ లవణ ఫలహరిత శాకతిక్త కటుకామ్లోపదంశాన్ వేశ్యాః పాయయేయురనుపిబేయుశ్చ. ౧.౪.౩౮

ఆపానగోష్ఠులలో మధువునూ, మైరేయాసవాన్నీ, అనేక విధాలైన ఉప్పు, పదార్థాలనూ, ఫలాలనూ, పచ్చని కూరగాయలనూ, పులుపూ, వగరూ, తీపీ, మొదలైన రుచులతోకూడి ఉన్న భక్ష్యవస్తువులనూ మొదలైనవాటిని వేశ్యలచేత ఆస్వాదింపచేసి తరువాత వారి ప్రార్థనమీద తాముగూడా సేవించాలి.

౨౦౩. ఏతేనోద్యానగమనం వ్యాఖ్యాతం. ౧.౪.౩౮

ఈ పైనచెప్పిన పానగోష్ఠీవిధిచేత ఉద్యానవనాల్లోజరిపే ఆపాన విధులుగూడా స్పష్టం చేయబడ్డాయి. ఆ ఉద్యానవనంలో చేసే ఆపానవిధిగూడా ఇలాగే ఉంటుందన్నమాట.

౨౦౪. పూర్వాహ్ణ ఏవస్వలంకృతాస్తురగాధిరూఢాః వేశ్యాభిస్సహ పరిచారకానుగతాగచ్ఛేయుః, దైవసికీంచ యాత్రాంతత్రా వానుభూయకుక్కుట లావకమేష యుద్ధద్యూతైః ప్రేక్షాభిరనుకూలైశ్చ చేష్టితైః కాలం గమయిత్వా, అపరాహ్ణేగృహీత తదుద్యానోపభోగ చిహ్నాస్తథైవ ప్రత్యావ్రజేయుః. ౧.౪.౪౦

ఉద్యాన వనవిహారానికి మధ్యాహ్నం కాకముందే తగిన వేషాన్నిధరించి గుఱ్ఱాలనెక్కి వేశ్యలనూ పరిచారికలనుగూడా వెంటతీసుకుని వెళ్లాలి. పక్షానికొక్కమాటో, మాసానికొక్కమాటో ఈ ప్రయాణం జరుగుతూఉండాలి. యాత్రకు వెళ్లిన

తరువాత అక్కడ రోజురోజూ జరిపే విధానాలనే అనుసరిస్తూ, కోళ్లూ, గొరువంకలూ, పొట్టేళ్లూ, మొదలైనవాటియుద్ధాలూ జూదాలూ, గానసభలూ, నాట్యసభలూ, నృత్యసభలూ, నాటకప్రదర్శనాలూ, మొదలైనవాటితో వినోదించి, అప రాహ్ణసమయంలో ఉద్యానవనవిహారం అనుభవించివచ్చినం దుకు గుర్తుగా కొన్ని పూలగుత్తులూ, ఆకులూ, పళ్లూ, ఫలాలూ, మొదలైనవి అలంకరించుకొని కొన్ని చేతపుచ్చు కొని తిరిగి ప్రియాణమై తమయిల్లు చేరుకోవాలి.

౨౦౫. ఏతేన చిత్రోద్గ్రాహకానాం గ్రీష్మేజలక్రీడా భిగ మనం వ్యాఖ్యాతం. ౧.౪.౪౧

ఈ ఉద్యానగమనవిధానం చెప్పడంవల్ల గ్రీష్మకాలంలో బావి, దిగుడుబావి, మొదలైనవాటి నీటితో జలక్రీడలాడడానికి చేసే ప్రయాణంగూడా స్పష్టీకృతమైనది.

౨౦౬. యక్షరాత్రిః, కౌముదీజాగరః, సువసంతకః, సహ కారభంజికా, అభ్యూషఖాదికా, బిసఖాదికా, నవ పత్రికా, ఉదకక్ష్వేడికా, పాంచాలానుయానం, ఏక శాల్మలీ, యవచతుర్థీ, ఆలోలచతుర్థీ, మదనోత్సవః, దమనభంజికా, హోలాకా, చూతలతికా, ఇక్షు భంజికా, కదంబయుద్ధాని, తాస్తాశ్చమహామాన్యః దేశ్యాశ్చక్రీడాజన ఏదేభ్యో విశిష్టమాచరే యురితి సంభూయక్రీడాః. ౧.౪.౪.౨

నాగరకుడు ప్రవర్తింపచేయవలసిన క్రీడలను సంగ్రహించి ఇక్కడ చెపుతున్నారు. 1. యక్షరాత్రి:- దీన్నే సుఖరాత్రి

అంటారు. నాగరకులు ఈ పర్వరాత్రియందు జూదం మొదలైన ఆటలాడుతూ సుఖంగా కాలంగడుపుతారు. 2. కౌముదీ జాగరణం:- శరత్కాలంలో చక్కని వెన్నెల రాత్రిలలో నాగరకులు చాలామంది ఒకచోటచేరి దేవతలను పూజిస్తూ కాలం గడుపుతారు. 3. సువసంతకం:- అంటే మన్మథోత్సవం:- ఈ ఉత్సవంలో నృత్యాలూ, గీతాలూ, నాట్యాలూ జరుపుతారు. 4. సహకారభంజికా:- ఆటలాడుతూ విలాసంగా తియ్యమామిడికాయలను అందుకునికోయ్యడం. 5. అభ్యూషఖాదికా:- కాయకాచిన శనగమొక్కలు తంపెటవేసి గింజలుభక్షించడం. 6. బిసఖాదికా:- లేత తామరతూళ్లను పూవులతోగూడాకోసి పూలుధరించి, ఆటలాడుతూ తూళ్లుభక్షించడం. 7. నవపత్రికా:- తొలుకరి వానలవల్ల చిగిర్చిన చెట్లగుబురులలో ఆటలాడడం. 8. ఉదకక్ష్వేడికా:- పిచ్చికార్లతో నీళ్లుచిమ్మడం. 9. పాంచాలానుయానం:- నలుగురైదుగురు స్త్రీ పురుషులు సవిలాసంగా కబుర్లు అనుకుంటూ ఆటలాడడం. 10. ఏకశాల్మలి:- అందంగాపూచిన బూరుగుచెట్టుక్రింద చేరి దానిపూలు అలంకరించుకుని ఆటలాడడం. 11. యవచతుర్థి:- వైశాఖశుద్ధ చవితిరోజున యవధాన్యాల పిండితో పరిమళద్రవ్యాలు కలిపి నాయికా నాయకులు ఒకళ్లపైనఒకళ్లు చల్లుకుంటారు. 12. ఆలోలచతుర్థి:- శ్రావణశుద్ధ చతుర్థినాడు ఉయ్యాలలుకట్టి ఊగుతూ ఆటలాడడం. 13. మదనోత్సవం:-మన్మథునిబొమ్మను పూజించడం. 14. దమనభంజికా:- నాయికానాయకులొకళ్లకొకళ్లు దమనదళాన్ని అలంకరించుకోడం. 15. హోలాకా:- ఫాల్గుణ పూర్ణిమరోజున ఈ పండుగ జరుగుతుంది. ఒకళ్లమీద

ఒకళ్లు పిచికార్లతో వసంతం చిమ్ముకుంటారు. 16. అశోకోత్తంసికా:- అశోకపత్రాలనుకోసి శిరస్సునధరించడం. 17. పుష్పావచాయికా:- పూలుకొయ్యడం. 18. చూతపల్లవా వతంసనం:- మామిడిచిరుగుకోసి జుట్టులో అలంకరించుకోడం. 19. ఇక్షుభంజికా:-చెరుకుగడను చిన్నచిన్నముక్కలుగా తరిగి హారాలు గుచ్చి ధరించడం. 20.కదంబయుద్ధం:-కడిమికాయలను కత్తులవలె చేతులలోధరించి యుద్ధంచెయ్యడం. ఇంకా ఇలాటి పలురకాల దేశ్యక్రీడలను నాగరకులు జనులకునేర్పుతూ తాము ఆచరిస్తూఉండాలి. ఇవన్నీ జనసంఘానికి సంబంధించినవిగాని ఒకరూ ఇద్దరూ ముగ్గురూ ఆడేవికావు.

౨౦౭. ఏకచారిణశ్చ విభవ సామర్థ్యాద్గణికాయాగి నాయికాయాశ్చ సహచరితమేతేన వ్యాఖ్యాతం. ౧.౪.౪౩

తానున్నచోట పై క్రీడలు ఆచరించడానికి నాగరకులు లేక ఒంటరికాడైతే తన వైభవాన్ననుసరించి పరిచారికలతో యక్షరాత్రి మొదలైన ఉత్సవాలు జరుపుకొనవచ్చునని స్పష్టం అవుతున్నది.

౨౦౮. అవిభవస్తు శరీరమాత్రో, మల్లికాఫేన కషాయమాత్ర పరిచ్ఛదగి, పూజ్యాద్దేశాదాగతగి, కళాసు విచక్షణగి, తదుపదేశేన గోష్ఠ్యాం, వేశోచితేవృత్తే, సాధయేదాత్మాన మితిపీఠమర్దగి. ౧.౪.౪౪

ఇక ఉపనాగరకుని విధానం చెప్తున్నారు. దరిద్రుడై ఉండి నాగరకచరిత్రను అనుసరించాలనుకునేవాడు, అంతవరకూ తాను శాస్త్రవేత్తలూ, కళావేత్తలూ, ఉన్న దేశంనుంచి వచ్చినవాడై

ఉంటే తన శరీరాన్ని మాత్రమే సహాయంగా ఎంచుకుని తానే ఉపదేశకుడుగాఉండి పరిజలచేత గోష్ఠీ సమావేశాలు జరిపిస్తూ వేశ్యా జనంచేతగూడా ఉచితమైన నాగరకవృత్తాన్ని అనుసరింపచేస్తూ, "మల్లికాదండపీఠ"మనే నాగరక గురుపీఠాన్ని అలంకరించి తనను కామశాస్త్రాచార్యపదవితో కృతకృత్యున్ని చేసుకోవచ్చు. ఇతనినే పీఠమర్దుడంటారు.

౨౯. భుక్త విభవస్తుగుణవాన్, సకళత్రో వేశ్యే, గోష్ఠ్యాంచ
బహుమతః, తదుపజీవీచవిటః. ౧.౪.౩౨

పడుచుతనంలో నాగరకవృత్తిని అవలంబించి, కన్నూమిన్నూ కానక, సంపదనంతా వెచ్చపెట్టుకున్నవాడైనా, ఇంకా విషయవాంఛల వదలకపోతే అలాటి నాయకుడు, తాను గుణవంతుడు, భార్యాసమేతుడు అయిఉండి, వేశ్యాజనంలోనూ, గోష్ఠులలోనూ బహుమతులుపొందుతూ, వాళ్లను అనుసరించి బ్రతుకుతూ ఉండవచ్చు. ఇతన్ని విటుడంటారు.

౩౦. ఏకదేశ విద్యస్తుక్రీడనకో విశ్వాస్యశ్చ విదూషకః
వైహాసికోవా. ౧.౪.౩౯

అచ్చగా దరిద్రుడైనా, నాగరకవృత్తిని ఆశ్రయించి దరిద్రుడైనా, కళత్రవంతుడైనా, కాకపోయినా, అక్కడివాడైనా, మరెక్కడివాడైనా, ఎలాటివాడైనాసరే. గీతం, నృత్యం మొదలైన ఏదోఒకవిద్యలో బాగా పరివేశంకలిగిఉంటే అతడు క్రీడలలో నాయకులకు నమ్మదగినవాడుగా ఉంటాడు. ఇతనినే విదూషకుడనీ, వైహాసికుడనీ అంటారు. ఇతనివృత్తి నవ్వించడం మాత్రమే.

౨౧౧. ఏతే వేశ్యానాం నాగరకాణాంచ మంత్రిణస్సంధి విగ్రహనియుక్తాః. ౧.౪.౪౩

పై వారు వేశ్యలకూ, నాగరకులకూ కామ విషయంలో మంత్రులుగా ఉండి దేశ కాలాలనుపట్టి సామాన్యంగా నాయికా నాయకులను సమకూర్చడంలోనూ, విభేదం కల్పించడంలోనూ నియోగింపబడుతూ ఉంటారు.

౨౧౨. భైక్షుక్యః విదగ్ధాః ముండావృషల్యో వృద్ధగణికాశ్చ వ్యాఖ్యాతాః. ౧.౪.౪౪

పై ఉపనాయకులతో సరిసమానం అనతగిన ఆడబిక్షుకులూ సన్యాసినులూ, దాసీలూ, వృద్ధవేశ్యలూ, మొదలైనవాళ్లను గూడా సంధి విగ్రహాలకు నియోగించవచ్చు. వీళ్లను కుట్టెనలంటారు.

౨౧౩. గ్రామవాసీవ, సజాతాన్, విచక్షణాన్, కౌతూహలికాన్ ప్రోత్సాహ్య, నాగరకజనస్య వృత్తం వర్ణయన్, శ్రద్ధాంచజనయన్, తదేవానుకుర్వీత. గోష్ఠీశ్చ ప్రవర్తయేత్. సంగత్యా జనమనురంజయేత్ కర్మసుచసాహాయ్యేన చానుగృహ్ణీయాచ్చేతి నాగరకవృత్తం. ౧.౪.౪౫

గ్రామవాసిగా ఉండే నాగరకుని వృత్తాంతాన్ని చెపుతున్నారు. తనజాతికి చెందినవాళ్లుగా ఉండి, విద్యావంతులై, తగినంత మంచి చెడుగుల విమర్శజ్ఞానంకలిగి, ఈ గోష్ఠీ విషయాలకు కుతూహలపడే యువకులను ప్రోత్సహించాలి. ఎలాగంటే "భలానా నగరంలో ఈఈ వంశీయులు ఇలాటి లోకరంజకమయిన వృత్తాన్ని అనుసరిస్తున్నారు. అలా మీరుగూడా ఎందుకు

అనుసరించరాదు?" అనిచెప్పి శ్రద్ధకలిగిస్తూ యాత్రలూ, గోష్ఠులూ, వారిచేత చేయించాలి. వారితో స్నేహంచేసి ఇతర జనులకుగూడా ఆసక్తి పుట్టించాలి. వాళ్లకుగూడా ఈక్రియలలో సహాయపడుతూ వాళ్లను అనుగ్రహించాలి.

౨౧౪. భవంతి చాత్రశ్లోకాః నాత్యంతం సంస్కృతేనైవ, నాత్యంతం దేశభాషయా,కథాంగోష్ఠీషు కథయన్ లోకే బహుమతోభవేత్. ౧.౪.౫౦

కేవలమూ శుద్ధఛాందసంగా సంస్కృతభాషనూ వాడకుండా, కేవలం దేశభాషలనూ వాడకుండా, గోష్ఠీ ప్రసంగాలలో ఉభయభాషలనూ ఉపయోగించే చమత్కారండున్న నాగరకుడు లోకంలో చాలా గౌరవాన్ని పొందుతాడు.

౨౧౫. యాగోష్ఠీ లోకవిద్విష్టా, యాచస్వైరవిసర్పిణీ, పరహింసాత్మికాయాచ, నతామవతరేద్బుధః౹౧.౪.౫౧

బుద్ధిమంతుడైనవాడు తాను గోష్ఠిని ప్రవర్తింపచెయ్యగల శక్తి లేకపోతే, ఇతరులు ప్రవర్తింపచేసే గోష్ఠులలో చేరాలి. తాను చేరబోయే గోష్ఠి ప్రజలచేత ద్వేషింపబడుతున్నా, స్వేచ్ఛగా ప్రవర్తించే స్త్రీలతోకూడిఉన్నా అందులో చేరకూడదు.

216. లోక చిత్తానువర్తిన్యా, క్రీడా మాత్రైకకార్యయా గోష్ఠ్యా సహచరన్ విద్వాన్‌లోకే సిద్ధిం నియచ్ఛతి ౧.౪.౪౨

ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే ప్రథమేఽధి కరణే నాగరకవృత్తం నామచతుర్థోఽధ్యాయః.

అయితే బుద్ధిమంతుడు ఎలాంటి గోష్ఠిలో చేరాలి ? అంటే సమాధానం చెవుతున్నారు. ఏ గోష్ఠి ప్రజల మనస్సులకు ఆహ్లాదం కల్పిస్తున్నదో, వినోదంమాత్రమే ఫలం కలదిగా ఉంటుందో అలాంటి గోష్ఠిలో ప్రవర్తించే విద్యావంతుడు స్త్రీలోకం విషయంలో సిద్ధహస్తుడౌతాడు.

ఈరీతిగా భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయు
డున్నూ, ఆపస్తంబ సూత్రుడున్నూ, అయిన
మేడిచర్ల ఆంజనేయమూర్తి చేత, వాత్స్య
యన కామసూత్రములకు జయమంగళ
వ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన
'రతిరేఖ' అను తెలుగు వ్యాఖ్యలో
సాధారణాధికరణంలో నాగరక
వృత్తం అనే నాలుగో
అధ్యాయం ముగిసింది.



శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెనుఁగు వ్యాఖ్యాన సమేతం

### సాధారణాధికరణం

### ౫. నాయక సహాయదూతీకర్మ విమర్శాధ్యాయం.

౨౧౭. కామశ్చ తుష్షువర్ణేషు సవర్ణతశ్చా నన్య
పూర్వాయాం ప్రయుజ్యమానః పుత్రీయో,
యశస్యో లౌకికశ్చ భవతి. ౧.౫.౧

పూర్వం సహాయకులతో కూడిఉండి నాయకుడు నాయికదగ్గరకు దూతికను పంపాలని చెప్పిఉన్నారు. అయితే నాయకుడనగా ఎవరు? అతడు ఎలాటినాయికతో గృహస్థధర్మాన్ని స్వీకరించి నాగరకవృత్తాన్ని అనుసరించాలి? ఆ సహాయకులెలాటివాళ్లు? వాళ్ల పనియేమిటి? ఈ విమర్శ ఇక్కడచేస్తారు శాస్త్రకారులు. నాయకుడంటే నాయికానాయకులన్నమాట. దూతీకర్మ అంటే స్త్రీ దూతిక, పురుషదూత అనిగూడా అర్థం. నాలుగుజాతుల పురుషులూ తమకు సజాతీయురాలయిన కన్యకను శాస్త్రోక్తపద్ధతితో వివాహంచేసుకుని, భార్యఅని పిలువబడే ఆ స్త్రీయందు ప్రయోగించే కామం వంశాభివృద్ధినీ, కీర్తిలాభాన్నీ, లోకసమ్మతాన్నీ, కల్పిస్తుంది.

౨౧౮. తద్విపరీత ఉత్తమవర్ణాసు, పరపరిగృహీతా సుచ ప్రతిషిద్ధః ౧.౫.౨

పైన చెప్పినవిధంగా కాకుండా తలక్రిందుగా ఉత్తమవర్ణస్త్రీలను అవరవర్ణ పురుషులు పరిణయం ఆడరాదని నిషేధింపబడ్డది.

౨౧౯. అవరవర్ణాస్వ నిరవసితాసు వేశ్యాసుపునర్భూషుచ నశిష్టో నప్రతిషిద్ధః సుఖార్థత్వాత్. ౧.౫.3

కులంలో నుంచి వెలిపడనిదిన్నీ, తన కులంకంటె తక్కువ కులంలో పుట్టినదిన్నీ అయిన స్త్రీయందున్నూ, వేశ్యయందున్నూ, పునర్భువునందున్నూ, ప్రయోగింపబడే కామం శిష్టసమ్మతం కాదు. ఆ కామం కేవలం సుఖంకోసమే ప్రయోగింపబడుతున్నది.

౨౨౦. తత్రనాయికాస్తిస్రః కన్యా, పునర్భూః, వేశ్యాచ ౧.౫.౪.

ఇలా ఫలితాన్ని విభాగం చెయ్యడంవల్ల నాయికలు "కన్యక. పునర్భువు, వేశ్య" అని మూడురకాలుగా యేర్పడుతున్నారు. కన్యలుగూడా "పుత్రఫలప్రదలనీ, సుఖఫలప్రదలనీ రెండు రకాలు. అంటే పుత్రులను ఇచ్చేకన్యకలు ఒకరకం, సుఖాన్ని ఇచ్చేకన్యకలు మరొకరకం అన్నమాట. ఈ పుత్రులను ఇచ్చే కన్యక తనకులంలోనిదైతేనే ఉత్తమకక్ష్యకు చెందుతుంది. ఇక సుఖాన్ని ఇచ్చేకన్యక ఇతరకులంలోదైతే అధమం. ఆ అధమత్వంలో పునర్భువుగూడా అయితే వేరే చెప్పవలెనా! ఈ పునర్భువు చరిత్ర భార్యాధికారంలో చెప్పబడుతుంది.

౨౧. అన్యకారణ వశాత్పరగృహీతాపి పాక్షికీ చతుర్థీతి గోణికాపుత్రః. ౧.౫.౫

పుత్రులకోసమూ, సుఖంకోసమూ, కాక వేరే కారణంవల్ల సంక్రమించే పరస్త్రీగూడా నాలుగోరకం నాయికగా పరిగణింప బడవచ్చునని గోణికాపుత్రుల మతం.

౨౨. సయదా మన్యతే స్వైరిణీయమన్యతోఽపి బహుశో వ్యవసిత చారిత్రా, తస్యాం వేశ్యాయామివ గమనముత్తమ వర్ణిన్యామపి నధర్మపీడాం కరిష్యతి. ౧.౫.౬

పరదారను, స్వేచ్ఛగా పలువురితో కూడేదాన్నిగా నాయకుడు గ్రహించినప్పుడు, ఆమె ఉత్తమకులంలో పుట్టినదైనా వేశ్యను అనుగమించినట్లు అనుగమిస్తే ధర్మబాధలేదు.

౨౩. పునర్భూరియం అన్య పూర్వావరుద్ధానాత్ర శంకాస్తి. ౧.౫.౭

ఈ పునర్భూనాయిక ఇంతకుముందుగా మరి ఒకనిచేత పరిగ్రహింపబడినది కాబట్టి ఈమెతో అనుగమించడం ధర్మహాని గదా? అని సందేహపడ నక్కరలేదు.

౨౪. పతిం వా మహాంత మశ్వర మస్మదమిత్ర సంసృష్ట మియమవ గృహ్య ప్రభుత్వేన చరతి. సా మయా సంసృష్టా స్నేహాదేనం వ్యావర్తయిష్యతి. ౧.౫.౮

ఈ పునర్భువుతో సంగమించడానికి కల కారణాలు చెవుతున్నారు. ఒక నాయిక. ఆమెకు ఒక భర్త. ఆ భర్తకు ఒక స్నేహితుడు. ఆ స్నేహితునికి ఒక గర్భశత్రువూ ఉంటే ఈ

గర్భశత్రువు ఆ నాయికతో సంగమించాలని ప్రయత్నిస్తూ ఉంటాడు. ఎందుకంటే, తన శత్రువునకు ఆమె భర్త మిత్రుడు. అతడు భాగ్యవంతుడుకూడానూ, ఆ నాయిక తన భర్త స్నేహితునితో సంగమిస్తోంది. అతని ప్రోత్సాహంవల్ల ఆమె తన భర్తచేత నాకు అపకారం చేయిస్తుందేమో? అందుకు ప్రతిగా ఆమెతో నేను సంగమిస్తే నామీది ప్రేమచేత ఆమె తన భర్త మిత్రుడైన నా శత్రువుని తన భర్తనుండి వేరు చేస్తుంది. అనే ఊహతోనూ పునర్భూగమనం సాగుతుంది.

౨౨౫. విరసంవామయిశక్తం అపకర్తు కామంచ ప్రకృతి మాపాదయిష్యతి. ౧.౫.౯

"ఏదో పనిలో ఉన్నారు కాబట్టి నాకు అపకారం చెయ్యలేదు గాని, వీలుచూచుకుని నాకు ప్రతిక్రియ చేయనేచేస్తాడు." అని తలచి తన శత్రువు భార్యను (పరసంగ మాశకలదాన్ని) మెల్లగా చేపడితే ఆమె తన భర్తకు నామీద ఉన్నకోపాన్ని శాంతింపచేస్తుంది." అనే ఊహతోగూడా పునర్భూగమనం జరుగుతుంది.

౨౨౬. తయావా, మిత్రీకృతేన, మిత్రకార్య, మమిత్రప్రతీఘాతం, అన్యద్వా, దుష్ప్రతిపాదకం, కార్యంసాధయిష్యామీతి. ౧.౫.౧౦

అధికారంతో ప్రవర్తించే ఆ పునర్భువుతో రమిస్తే ఆమె తన భర్తద్వారా మిత్రుణ్ణిగా ఉన్న నాపనులన్నీ (అంటే శత్రువులను అవమానించడం, ఇతరులకు సాధ్యంగాని పనులుంటే అనాయాసంగా చెయ్యడం మొదలైనవన్నీ) సాధించిపెడు

తుంది. అనే ఊహతోనైనా పునర్భూగమనం జరుగుతుంది.

౨౭. సంసృష్టోవా అనయా హత్వా అస్యాః పతిమస్మ
ద్భావం తదైశ్వర్యమేవమధిగమిష్యామి. ౧.౫.౧౧

సంప్రయోగంద్వారా ఆమె స్నేహాన్ని సాధించి రహస్యాలు తెలుసుకుని ఆమె భర్తను చంపి నేను అనుభవించవలసిన అతని భాగ్యాన్ని ఈవిధంగా పొందుతాను. ఇతడు మా వంశాన్ని నిర్మూలంచేసినా ఆ స్తిని అపహరించాడు. అందువల్ల ఈ ఉపాయం పన్నడం అధర్మంకాదు. అనే ఊహతోనైనా పునర్భూగమనం జరుగుతుంది.

౨౮. నిరత్యయం వాస్యాగమన, మర్థానుబద్ధం, అహంచ నిస్సారత్వాత్క్షీణ వృత్త్యుపాయః, సోహమనేన ఉపాయేన తద్ధన మతి మహద కృచ్ఛ్రదను గమిష్యామి. ౧.౫.౧౨

ఈ పునర్భువుతో సంగమిస్తే అపాయంలేని భాగ్యం నాకు చేకూరుతుంది. నేనుగూడా ధనహీనుణ్ణిగా ఉన్నాను. ఏదో నీచవృత్తి నాశ్రయించి బ్రతుకుతున్నాను. ఇలాటి నేను ఈ ఉపాయంతో ఆ గొప్ప సంపదను అనాయాసంగా పొందగలను. అనే ఊహతోనూ పునర్భువుతో సంగమించడం జరుగుతుంది.

౨౯. మర్మజ్ఞా వామయి దృఢమభి కామాసామా మని
చ్ఛంతం దోషవిఖ్యాపనేనదూషయిష్యతి. ౧.౫.౧౩

ఈ పునర్భువు నా రహస్యాలన్నీ తెలుసుకుని నన్నెక్కువగా ప్రేమిస్తోంది. నేను ఈమెను పొందడానికి ఇష్టపడకపోతే

స్వయంగా గానీ, ఇతరులద్వారాగానీ నన్ను దోషాలు కల వాణ్ణిగా ప్రకటిస్తుంది. ప్రకటింపచేస్తుంది అనే భయంతో గూడా పునర్భువుతో సంగమింపవలసివస్తుంది.

౨౩౦. అసద్భూతం వా దోషం శ్రద్ధేయం దుష్పరిహారం మయిక్షేప్స్యతి. స్వయంవాత్తై స్సహ సంప్రజ్యేత.
౧.౫.౧౫

ఈ పునర్భువు తనతో రాలేదనే కోపంతో లోకం నమ్మేలాగా నున్నా, పోగొట్టుకోడానికి వీలులేకుండానున్నా నామీద నింద మోపుతుంది. అందువల్ల నేను సర్వనాశనం అయి పోతాను. అనే భయంతోగూడా పునర్భూగమనం సాగుతుంది.

౨౩౧. ఆయతిమంతం వా వశ్యం పతిం మత్తో విభిద్య ద్విషతస్సంగ్రాహయిష్యతి, స్వయం వా త్తైస్సహ సంసృజ్యేత.
౧.౫.౧౫

ఈమెతో సంగమించకపోతే ముందు ముందు అభివృద్ధికి రాగలవాడున్నా, తన చెప్పుచేతలలో ఉండేవాడున్నా అయిన తనభర్తను నానుండిచీలదీసి,నాశత్రుపక్షంలో చేరుస్తుంది. లేకపోతే తనంతటతానే వాళ్ళతో సంగమిస్తుంది. అటు తరు వాత నన్ను నశింపచేస్తుంది. అనే భయంతోగూడా పునర్భూ గమనం సాగుతుంది.

౨౩౨. మదవరోధానాం దూషయితా పతిరస్యాః, తదా అహమప్యస్య దారానేవదూషయన్ ప్రతికరిష్యా మితి.
౧.౫.౧౬

నా అంతఃపురజనాన్ని ఈమె భర్త వంచించి దూషితంగా

చేశాడు. ఇప్పుడు నేనుగూడా ఇతని భార్యను భ్రమపెట్టి దూషితురాలినిగాచేసి ప్రతిక్రియ కల్పిస్తాను. అనే ఊహతో గూడా పునర్భాగమనం జరుగుతుంది.

౨౩౩. రాజ నియోగాచ్చాంతర్వర్తినం శత్రుం వాస్యాహ నిష్యామి. ౧.౫.౧౭

రాజుచేత గూఢచారిగా నియమింపబడ్డాను. కాబట్టి ఉపాయాంతరాలు లేవు. అందువల్ల నాశత్రువునకు ఉంపుడుకత్తెగా ఉన్న ఈమెతో సంగమించి దానిద్వారా నా శత్రువును సంహరింపగలను. అనే ఊహతోగూడా పునర్భాగమనం సాగుతుంది.

౨౩౪. యామన్యాం కామయిష్యే సాస్యా వశ గాతామనేన సంక్రమేణ అధిగమిష్యామి. ౧.౫.౧౮

నేను కామిస్తున్న స్త్రీ ఈమె వశంలో ఉన్నది. కనుక ముందు ఈమెతో సంగమించి, ఈమెద్వారా ఆమెను పొందగలను. అనే ఊహతోగూడా పునర్భాగమనం జతపడుతుంది.

౨౩౫. కన్యామలభ్యాం వా ఆత్మాదీనాం అర్థరూపవతీం మయి సంక్రామ యిష్యతి. ౧.౧.౧౯

ధనహీనుణ్ణి కాబట్టి ఆ కన్యక నాకు లభించదు. అందువల్ల ఈమెను స్వాధీనం చేసుకుంటే ఈమె తన స్వాధీనంలోఉన్న ఆ ధనవంతురాలూ, రూపవతీఅయిన కన్యను నాకు లభింప చేస్తుంది. అనే ఊహతోగూడా పునర్భాగమనం సాగుతుంది.

౨౩౬. మమా మిత్రోఽస్యాః పత్యాస హైకీభావ ముప
గతస్తమనయా రసేన యోజ యిష్యామీత్యేవమా
దిభిః కారణైః పరస్త్రీ మపి ప్రకుర్వీత. ౧.౫.౨౦

నా శత్రువు ఈమె భర్తతో ఏకీభావాన్ని పొందినాడు. కాబట్టి నేను ఈమెతో కలిసి నా శత్రువును ఈమెద్వారా విష ప్రయోగం చేయించి చంపించగలను. అనే ఊహతోగూడా పునర్భాగమనం జరుగుతుంది. ఇలాటి కారణాలున్నప్పుడు పునర్భాగమనం జరుగుతుంది. కాని ఇందంతా దుర్జనుల పద్ధతిగాని సజ్జనులకు యోగ్యమైనదికాదు. శాస్త్రం సమగ్ర విషయబోధకం కావాలి గనుక అన్ని విషయాలూ (ఉత్తమ, మధ్యమ, అధమ విషయాలు) ఇందులో చూపిస్తున్నారు. ఒక్కొకప్పుడు ఉత్తములకుగూడా నీచులతో శత్రుత్వం ప్రాప్తించవచ్చు. కాబట్టి ఈ దుష్టలోకం తీరులు అర్థంచేసుకుని ఉంటే ఉత్తముడు తన ఉత్తమత్వానికి భంగం రాకుండా తప్పించుకోగలుగుతాడు. ఉత్తములు గూడా ఈ విషయాలు తెలుసుకునిఉండడం స్వయంరక్షణద్వారా క్షేమంకరము.

౨౩౭. ఇతి సాహసిక్యం న కేవలం రాగాదేవేతి పర పరి
గ్రహ గమన కారణాని. ౧.౫.౨౧

ఈ పునర్భాగమనం కేవలం అనురాగంతోనే కూడిఉండలేదు. పై వివిధ కారణాలవల్లా జరుగుతూఉంటుంది. గొప్ప సాహసంతో కూడిఉన్నది.

౨౩౮. ఏత్తై రేవ కారణైః, మహామాత్ర సంబద్ధా వా తత్రై, కదేశచారిణీకా చిదన్యావా కార్య సంపాదినీ విధవా పంచమీతి చారాయణః ౧.౨.౨౨

పై కారణాలచేతనే మంత్రుల ఉంపుడుకత్తెలూ, రాజుల ఉంపుడుకత్తెలూ, ఆ రాజకుటుంబాలకు సంబంధించిన నాయికలూ, కార్యసాధకురాండ్రైన అన్యస్త్రీలూ, విధవలూ, వీరంతా అయిదోరకం నాయికలుగా పరిగణింపబడతారని చారాయణులన్నారు.

౨౩౯. సైవప్రవ్రజితా షష్ఠీతి సువర్ణనాభః ౧.౫.౨౩

పైన చెప్పబడిన విధవ, రాజుకుగానీ, మంత్రికిగానీ, వాళ్లకు సమానులైన భాగ్యవంతులకుగానీ సంబంధించిఉంటే ఆమెను ఆరవనాయికనుగా సువర్ణనాభుడు పరిగణించాడు.

౨౪౦. గణికాయాదుహితా పరిచారికా వా అనన్యపూర్వా సప్తమీతి ఘోటకముఖః. ౧.౫.౨౪

పురుషసంపర్కంలేని బోగంపిల్లగానీ, దాసీపుత్రికగానీ, పడుపువృత్తి లేకుండా నాయకునితో పాణిగ్రహణంచేస్తే, అలాటి స్త్రీని ఏడవరకం నాయికనుగా ఘోటకముఖుడు పరిగణించాడు.

౨౪౧. ఉత్క్రాంత బాల భావా కులయువతిరుపచారాన్యత్వా దష్టమీతి గోనర్దీయః. ౧.౫.౨౫

బాల్య భావాన్ని విడిచిన కులయువతి ఉపచారభేదాన్నిపట్టి ఎనిమిదో నాయికగా పరిగణించి గోనర్దీయుడు చెప్పాడు.

౨౮౨. కార్యాంతరాభావా దేతా సామపి పూర్వాస్వే
వోప లక్షణం, తస్మాదేతా ఏవ నాయికా ఇతి
వాత్స్యాయనః. ౧.౫.౨౬

కన్య, పునర్భువు, వేశ్య, పరదార, అనే నాయికాభేదాలలోనే ఇతర కామశాస్త్ర ప్రవక్తలు చెప్పిన పై ప్రభేదాలుగూడా చేరుతాయి కనుక నాయికలు పైన చెప్పిన నాలుగు తెగలవారే గాని వేరుగాలేరు. ఒకవేళ ఇతర నాయికా భేదాన్ని అంగీకరించినా నలుగురు నాయికలకన్న విశేషకార్యాలేమీసాధింపబడవు. అని వాత్స్యాయనులన్నారు.

౨౮౩. భిన్నత్వా త్తృతీయా ప్రకృతిః పంచమీత్యేకే.
౧.౫.౨౭

స్త్రీ కాకుండా, పురుషుడు కాకుండా ఉండే నపుంసకునివల్ల కూడా ఔపరిష్టికాది కార్యాలద్వారా సుఖ లాభం ఉంటుంది గనుక ఆ నపుంసవ్యక్తినిగూడా అయిదో నాయికగా కొందరు చెప్పారు.

౨౮౪. ఏక ఏవతు సార్వ లౌకికో నాయకః. ౧.౫.౨౮

ఇక నాయకుణ్ణిగూర్చి విమర్శ చేస్తున్నారు. నాయికలవలె భేదాలు లేకపోవడంచేత లోకంలో నాయకుడు ఒక్కడుగానే యెన్నికకు వచ్చాడు.

౨౮౫. ప్రచ్ఛన్నస్తు ద్వితీయః విశేషలాభాత్. ౧.౫.౨౯

విశేషమైన సుఖ లాభంకోసం పరస్త్రీల విషయంలో రహస్యంగా ప్రవర్తించేవాడు రెండోనాయకుడు. ఇతనిని ప్రచ్ఛన్నుడంటారు.

౨౮౬. ఉత్తమాధమ మధ్య మతాంతు, గుణాఽగుణతో విద్యాత్. ౧.౫.౩౦

సంపూర్ణ గుణవంతుణ్ణి ఉత్తమునిగానున్నూ, కొన్ని గుణాలు మాత్రమే ఉన్నవానిని మధ్యమునిగానున్నూ, మిక్కిలి తక్కువ గుణాలు కలవానిని అధమునిగానున్నూ తెలుసుకోవాలి.

౨౮౭. తాం స్తూభయో రపి గుణాన్ వైశికే వక్ష్యామః. ౧.౫.౩౧

ఆ నాయికానాయకుల గుణాలను వైశికాధికరణంలో చెవుతారు.

౨౮౮. అగమ్యాస్త్వే వైతాః కుష్ఠినీ, ఉన్మత్తా, పతితా, భిన్న రహస్యా, ప్రకాశప్రార్థినీ, గతప్రాయయౌవనా అతిశ్వేతా, అతికృష్ణా, దుర్గంధా, సంబంధినీ, సఖీ, ప్రవ్రజితా, సంబంధినీసఖీ, శ్రోత్రియ రాజ దారాశ్చ. ౧.౫.౩౨

పైన నాయికల స్వరూపాన్ని చెప్పినా, వారిలో ఎవ్వరు పొంద తగినవారు? ఎవ్వరు పొందతగనివారు? అనే విచారం ఇక్కడ చేస్తున్నారు. ఈ క్రింద చెప్పబోయే స్త్రీలను నాయకుడు పొందగూడదు. కుష్ఠురోగం కలదాన్నీ, పిచ్చిదాన్నీ, కుల భ్రష్టురాలినీ, రహస్యాలను బయటపెట్టే స్వభావంకలదాన్నీ, ఎదుట తియ్యని మాటలాడి రహస్యంగా ద్రోహంచేసేదాన్నీ, యవ్వనం ఉడిగిపోయినదాన్నీ, బొల్లి రోగం కలదాన్నీ, మిక్కిలి నల్లగా ఉండేదాన్నీ, దుర్వాసన వేసేదాన్నీ, చుట్టరికం కలదాన్నీ, భార్య చెలికత్తెనుగానీ, సన్యాసినినిగానీ,

విధవనుగానీ, విద్యలోగానీ, రాజకీయంలోగానీ, సంబంధం కల దాన్నీ, శ్రోత్రియుని భార్యనూ, రాజుభార్యనూ, కామ వ్యాపారంకోసం ఉపయోగించుకోరాదు. ఇలా చెప్పిన వాత్స్యాయనుల సూత్రంవల్ల అసలు పరదారగమనమే అనర్థదాయక మని చెప్పినట్లైనది.

౨౭౯. దృష్టపంచ పురుషానాఽ గమ్యా కాచిదస్త్రీతి వాత్స్యాయనః. ౧.౫.౩౩.

"తన భర్త కాక యింకా అయిదుగురితో రమించిన స్త్రీలు పైన చెప్పిన కారణాలవల్ల అందరికీ పొందదగినవారే." అని బాభ్రవీయుల మతం.

౨౫౦. సంబంధి సఖి శ్రోత్రియ రాజదార వర్జమితిగోణికా పుత్రః. ౧.౫.౩౪

చుట్టాల భార్య, తన భార్య చెలికత్తె, శ్రోత్రియుని భార్య, రాజు భార్య, మినహాగా తక్కిన స్త్రీలను అందరినీ పొంద వచ్చునని గోణికాపుత్రుల మతం.

౨౫౧. సహపాంసు క్రీడిత ముపకారసంబద్ధం సమాన శీల వ్యసనం, సహాధ్యాయినం, యశ్చాస్య మర్మాణి రహస్యానిచ విద్యాత్, ద్యస్యచాయం విద్యాద్వా, ధాత్ర్యపత్యం సహసం వృద్ధ మిత్రం. ౧.౫.౩౫

ఇక నాయకునికి సహాయంగాఉండే పురుషుల విషయం చెపు తున్నారు. దూతలను మూడు విషయాలను పట్టి నిర్ణయించుం కోవాలి. 1. స్నేహం, 2. గుణం, 3. జాతి, వీరిలో మొదటి రకం దూతనుగూర్చి చెపుతున్నారు. చిన్నతనంనుంచీ తనతో

ఆటపాటలలో పాల్గొని స్నేహభావాన్ని వెలిబుచ్చేవాడూ, ఉపకారబుద్ధికలవాడూ, స్వభావంలోనూ, దశలోనూ, తనతో సమానుడూ, తనకు సహాధ్యాయుడుగా ఉన్నవాడూ, తన రహస్యాలు అతనికీ, అతని రహస్యాలు తనకూ తెలియపరుచుకునే స్నేహం కలవాడూ, తనతోపాటు స్నేహితునిలాగా పెరిగిన దాదికొడుకూ, మొదలైనవాళ్లను మిత్రులనుగా ఉంచుకోవాలి. పైవిధంగా స్నేహంవల్ల లభించే సహాయకులు తొమ్మిది రకాలు.

౨౫౨. పితృపైతామహావిసంవాదక మదృష్టవైకృతం వశ్యం ధ్రువమ లోభ శీలమ పరిహార్యమ మంత్ర విస్రావీతి మిత్ర సంపత్. ౧.౫.౩౬

తాతల తండ్రుల నాటినుంచీ స్నేహాన్ని పొందుతూఉన్న వంశంలో పుట్టిన తన యీడుజోడువాణ్ణీ, తనతో మనస్సు విప్పి మాట్లాడేవాణ్ణీ, వ్యభిచారదోషం లేనివాణ్ణీ, తాను చెప్పినట్లు వినేవాణ్ణీ, ఎలాటి సమయంలోనూ తనను విడువనివాణ్ణీ, ఆశ లేనివాణ్ణీ, ఇతరులకు స్వాధీనం కానివాణ్ణీ, రహస్యాలు బయటపెట్టనివాణ్ణీ మిత్రవర్గంలో చేర్చుకోవాలి.

౨౫౩. రజక, నాపిత, మాలాకార, గాంధిక, సౌరిక, భిక్షుక, గోపాలక, తాంబూలిక, సౌవర్ణిక, పీఠమర్ద, విటవిదూషకాదయో మిత్రాణి. ౧.౫.౩౭

చాకలీ, మంగలీ, పూలమాలలు కట్టేవాడూ, సుగంధ ద్రవ్యాలు తయారుచేసేవాడూ, పానీయాలు అమ్మేవాడూ, బిచ్చం ఎత్తుకునేవాడూ, పాలేరూ, తములపాకులు అమ్మే

వాడూ, కంసాలీ, క్షీరమర్దుడూ, విటుడూ, విదూషకుడూ, మొదలైనవారు మిత్రులుగా పరిగణింపతగినవారు.

౨౫౪. తద్యోషిన్మిత్రాశ్చ నాగరకాస్స్యురితి వాత్స్యాయనః.
౧.౫.౩౭

పైన చెప్పినవాళ్ళ స్త్రీలున్నూ, వాళ్ల స్నేహితులున్నూ, ఈ విషయంలో నాగరకులే (నేర్పరులే) అని వాత్స్యాయను లన్నారు.

౨౫౫. యదుభయోస్సాధారణ ముభయత్రోదారం విశేషతో నాయికాయాః సువిస్రబ్ధంతత్ర దూతకర్మ.
౧.౫.౩౮

ఎవరు నాయికా నాయకులకు అనుకూలంగా ఉండి, ఇద్దరికీ మేలు చేకూర్చేవారై, నాయికకు ఎక్కువ విశ్వాసపాత్రులుగా ఉంటారో వారే దూతకృత్యానికి అర్హులు. వారే కార్యసాధన సమర్థులు.

౨౫౬. పటుతా, ధార్ష్ట్య, మింగితాకారజ్ఞతా, అనుకూలత్వం, పరమర్మజ్ఞతా, ప్రమాణతా, ప్రతారణం, దేశజ్ఞానం, కాలజ్ఞ, తా, విషహ్య బుద్ధిత్వం, లఘ్వీ ప్రతిపత్తిః, సోపాయాదూతగుణాః.
౧.౫.౪౦

దూతల గుణాలు ఇలా ఉండాలి. చమత్కారంగానూ, తెలివి తేటలుగానూ మాట్లాడడం, అన్నివిషయాలలోనూ నెగ్గి రావడం, నాయికానాయకులభావాలను అలాగ్గా గ్రహించడం, ఎలాటి సమయంలోనూ తొందరలేకుండా ఉండడం, ఇతరుల రహస్యాలు తెలుసుకోగలగడం, ప్రతిపనీ చెప్పినప్రకారం

జరపడం, ఇతరులను వంచించే నేర్పు, ప్రదేశాన్ని కనిపెట్టి జాగ్రతగా మెలగడం, కాలాన్ననుసరించి ప్రవర్తించగలగడం, కార్యక్రమాన్ని జరుపడంలో సూక్ష్మమార్గాన్ని ఆలోచించి ప్రవర్తించడం, సుళువుగా పనులు చేసివెయ్యడం, ఇవి ఉపాయ పూరితాలైన దూత గుణాలు.

౨౫౭. భవంతి చాత్ర శ్లోకాః—

ఆత్మవాన్, మిత్రవాన్, యుక్తః, భావజ్ఞో, దేశ
కాలవిత్, అలభ్యామప్రయత్నేన స్త్రియం సంపాద
యేన్నరః. ౧.౫.౪౧

ఇతి శ్రీ వాత్స్యాయనీయే, కామసూత్రే, సాధారణే,
ప్రథమేధికరణే, నాయక సహాయ దూతీకర్మ
విమర్శః, పంచమోధ్యాయః, సాధారణః,
ప్రథమాధికరణ స్సమాప్తః.

---

ఈ అధ్యాయంలో ఉన్న విషయాలు మనస్సులో ఉంచుకుని మిత్ర సంపదతో గూడి నాగరకుడై, నాయిక భావాన్ని గుర్తిస్తూ, దేశకాలాలను కనిపెట్టి ప్రవర్తించే బుద్ధిమంతుడు

ఎంత వశంకాని స్త్రీనైనా ప్రయత్నం లేకుండానే సంపాదింప కలుగుతాడు.

ఈ మోస్తరుగా భారద్వాజ గోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయమూర్తిచేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళ వ్యాఖ్య ననుసరించి 'రతిరేఖ' అను తెలుగు వ్యాఖ్యలోని సాధారణాధికరణంలో నాయక సహాయ దూతీకర్మ విమర్శ అనే అయిదో అధ్యాయం పూర్తి అయినది.



శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెనుగు వ్యాఖ్యాన సమేతం

### ౨. సాంప్రయోగికాధికరణం

### ౧. రతావస్థాపనాధ్యాయం.

౨౹౧౹౧. శశో వృషోఽశ్వ ఇతి లింగతో నాయక విశేషాః.

౨.౧.౧

పై ప్రకరణం చివర స్త్రీని సంపాదించాలని చెప్పారు. ఆ స్త్రీ సంపాదనమే ఆవాపం అంటే ఆ ఆవాపంకూడా ఈ కామ సూత్రం తెలుసుకొననివానికి కుదరదు. అందువల్ల ఆ ఆవాపాన్ని చెప్పబోతూ ముందుగా స్త్రీపురుషుల లింగ ప్రమాణాన్నిపట్టీ, భావాలనుపట్టీ, కాలాన్నిపట్టీ రతిని నిరూపిస్తున్నారు శాస్త్రకారులు. ఇది స్త్రీ, వీడు పురుషుడు అని దేనివల్ల తెలుసుకుంటామో దానికి లింగం అని పేరు. ఆ లింగం మగవానికి ముందుకు సాగి పొడుగుగానూ, ఆడదానికి లోతుగా లోపలభాగంలోనూ ఉంటుంది. ఇక వాటి కొలతలు కామశాస్త్రంవల్లగానీ, వ్యవహారంవల్లగానీ, తెలుసుకోవాలి. ఈ లింగంయొక్క హెచ్చుతగ్గులను పట్టి నాయకులు శశజాతి వాడనీ, వృషజాతివాడనీ, అశ్వజాతివాడనీ మూడు రకాలు.

లింగం పొట్టిగా వున్న నాయకుడు శశజాతివాడు. అంత పొడుగూ గాకుండా అంత పొట్టీ కాకుండా మధ్యరకంగా ఉన్న నాయకుడు వృషజాతివాడు. ఉండవలసినవానికి మించి ఉన్న పురుషుడు అశ్వజాతివాడు.

౨౪౯. నాయికా పునర్మృగీ, బడబా, హస్తినీచేతి.

౨. ౧. ౨

నాయికలుగూడా మృగి, బడబ, హస్తిని అని మూడువిధాలు. పురుషులలో శిశ్నంయొక్క హెచ్చుతగ్గులనుపట్టి శశాదిజాతులు నిర్ణయించినట్లే, స్త్రీలలోగూడా యోనియొక్క లోతులోని హెచ్చుతగ్గులనుపట్టి మృగి మొదలైన జాతులను నిర్ణయించాలి.

శశ జాతి పురుషునికి అంగం ఆరు అంగుళాల పొడుగు ఉంటుంది. మృగీజాతి నాయికకు యోని ఆరంగుళాల లోతు కలిగిఉంటుంది. వృషజాతి పురుషునికి అంగం తొమ్మిది అంగుళాల పొడుగు కలిగిఉంటుంది. బడబజాతి నాయికకు కూడా యోని తొమ్మిది అంగుళాల లోతు కలిగిఉంటుంది. అశ్వజాతి పురుషునికి శిశ్నం పన్నిండంగుళాల పొడవు కలిగి ఉంటుంది. హస్తినీజాతి నాయికకు యోని పన్నెండంగుళాల లోతు కలిగి ఉంటుంది.

ఇక్కడ కొక్కోకుడు తన గ్రంథంలో పద్మినీ, చిత్రిణీ, శంఖిణీ, హస్తినీ, అని నాయికను నాలుగువిధాలుగా విభజించాడు. ఈయన అంగప్రమాణాలనుపట్టి జాతులను నిర్ణయించినట్లు కనుపడదు. ఈ నాయికలలో మొదటి పద్మినీ జాతి నాయిక ఉత్తమురాలనీ, చిత్రిణీ మధ్యమ అనీ, శంఖిని అధమ అనీ, హస్తిని అధమాధమఅనీ ఆయన నిర్ణయం. ఆ

నాయికల లక్షణాలుగూడా ఈ క్రింద సంగ్రహంగా వ్రాయ బడుతున్నాయి.

1. పద్మినీ జాతి నాయికకు శరీరం తామరమొగ్గలాగా మెత్తగా ఉంటుంది. శరీరమూ, రతిజలమూ కూడా పద్మం యొక్క సువాసన కలిగిఉంటాయి. కళ్లు తళతళా మెరుస్తూ లేడి కళ్లతో పోలిక కలిగిఉంటాయి. ముక్కు నువ్వుపువ్వు లాగా అందాలు కులుకుతూ ఉంటుంది. చన్నులు మారేడు పండ్లలాగా ముచ్చట గొలుపుతూ ఉంటాయి. ఆమె మనస్సు బ్రాహ్మణ పూజలోనూ, గురు పూజలోనూ, దేవతాపూజ లోనూ ఆసక్తిని పొందిఉంటుంది. శరీరం కలువపూవు కాంతి తోగానీ, సంపంగి పూవు కాంతితోగానీ, పోలికను పొంది శోభిస్తూఉంటుంది. మదనమందిరము తామరరేకులాగా చక్కని ఆకారం కలిగిఉంటుంది. నడకలు హంసనడకలను మరిపిస్తూ ఉంటాయి. నడుము చాలా సన్నగా ఉంటుంది. చక్కగా మృదుమధురంగా మాట్లాడుతుంది. పరిశుభ్రమై మధురమైన ఆహారాన్ని కొద్దిగా భుజిస్తుంది. తెల్లని చీరలమీద చాలా మోజుపడుతుంది. మాధుర్యాల కన్నిటికీ ఉనికిపట్టు అయి ఉంటుంది. పూర్ణిమనాటి చంద్రునిలాగా ముఖం నవ్వు వెన్నె లలు చిమ్ముతూ కళకళలాడుతూ ఉంటుంది. శరీరం నల్ల కలువ వలె శోభిస్తూ శుభ్రత కలిగిఉంటుంది. సద్గుణాలకు పుట్టినిల్లై మంచి చరిత్రను ప్రేమిస్తూఉంటుంది. సత్యభాషిణిగా ఉం టుంది. ఎఱ్ఱని పెదవి, ఎఱ్ఱని చిగురుటాకులవలె మెత్తనైన చేతులు, కలిగిఉంటుంది. సంగీతం అంటే చాలా ఇష్టపడు తుంది. ధర్మబుద్ధి కలిగిఉంటుంది. పలుకులు చిలుకపలుకులు

లాగా ఉంటాయి. మణిహారాలను అలంకరించుకుంటుంది. నాలుగోజామున (తెల్లవారుజామున) రతికేళి చెయ్యగోరు తుంది. పాంచాలజాతివానినే కేళికోసం కోరుతుంది. మనోహరమైన చూపు కలిగి అంతులేని ప్రేమతో సంకోచించ కుండా బాగా రతి సలుపుతుంది. ఆ సుఖసమయంలో ఆనంద పారవశ్యంచేత తన పురుషుని బాగా హత్తుకుని ఆయా సుఖావస్థలలో కన్నులు మూస్తూ ఉంటుంది. రమించడానికి చాలా యోగ్యురాలుగా ఉంటుంది. ఇది పద్మినీనాయిక చరిత్ర.

2. చిత్రిణీ నాయికకు నడుము చాలా సన్నగా ఉంటుంది. మంచి నడక, అభిమానపూరితమైన చూపూ కలిగి ఉంటుంది. చన్నులూ, పిరుదులూగూడా చాలా పెద్దవిగా ఉంటాయి. పిక్కలు గుండ్రిగా పెద్దవిగా ఉంటాయి. పెదవులు కొంచెం పెద్దవిగా ఉంటాయి. రతి జలం కొద్ది దుర్వాసనకలిగి ఉంటుంది. కంఠం శంఖంలాగా మూడు రేఖలు కలిగిఉంటుంది. చకోరపు పక్షిలాగా మాట్లాడుతుంది. నృత్యం, గీతం, మొదలైన వాటిలో చాలా నేర్పు కలిగిఉంటుంది. మదనమందిరం గుండ్రినై లోతు కలిగి జలం ఊరుతూ మెత్తగా ఉండి కొద్దిగా రోమాలు కలిగిఉంటుంది. చపలదృష్టి కలిగి బాల్యంనుంచీ సంభోగంమీద ఆసక్తురాలై ఉంటుంది. పులుపు వస్తువులు తిన గోరుతుంది. మధ్యరకంగా ఆహారం భుజిస్తుంది. పలురంగులు గల చీరలు కట్టగోరుతుంది. చిత్రవిచిత్రాలైన తళుకు చూపులతో చూస్తుంది. శరీరానికి కమ్మని సుగంధపు పూవులు పెట్టుకుంటుంది. వన్నెలూ, చిన్నెలూ ఉట్టిపడే చేష్టలు చేస్తూ ఉంటుంది. ముంగురులు ఉంగరాలు తిరిగిఉంటాయి. ఎన్నడూ

కోపం పూనదు. చౌశీతి బంధాలతో చిత్రరతులు చెయ్యగోరు తుంది. తిప్పటఅంటే ఉబలాటపడుతుంది. మాటిమాటికీ మోహపడుతూఉంటుంది. కిచకిచా నవ్వుతుంది. కాని ఎక్కడా ప్రేమ నిలువదు. వలపు అనేది తెలియకుండా ఉంటుంది. ఆటపాటలు చూడబోతుంది. కొత్త మనుష్యులను కోరుతుంది. కాని స్వాధీనపడదు. గాఢ రతిలో మనసిచ్చి కరిగిపోతుంది. చిత్రిణిఅంటే అందగాళ్లకు తంగేడు చెట్టున ఉన్న జున్నువంటిదన్నమాట. అనగా చాలా సులభంగా లభిస్తుందని సారాంశం. రతి కేళి సమయంలో కడుపు చూపి స్తుంది. కాళ్లూ నడుమూ పైకెత్తుతుంది. క్రిందుమీదు అవు తుంది. తొడలతో పురుషుణ్ణి మాటిమాటికీ నొక్కిపడుతుంది. ముచ్చటతో తానే పైకిచేరుతుంది. లోలోపల భర్తను తిడుతూఉంటుంది. రాత్రి తొలిజామున రతిని అడుగుతుంది. కూచిమారుడనే నాయకుణ్ణి కోరుతుంది. రతి సమయంలో కళ్లు ఎక్కువగా ఆరుస్తుంది. వియోగాన్ని సహించదు. చమత్కారపు చేష్టలతో తియ్యని మాటలతో పలుకుతూ ఉంటుంది. ఇది చిత్రిణి లక్షణం.

3. శంఖినీజాతి నాయిక ఒడ్డూ పొడుగూ, బలుపూ గల దేహం, పెద్దపెద్ద పాదాలూ, ఎప్పుడూ కోపస్వభావం, పూవులంటే అమితమైన అపేక్షా, పెదవిని అందుకొనబోతే అదురుపాటూ, రతిగృహందగ్గర దట్టంగా వెంట్రుకలూ, కలిగిఉంటుంది. భర్త అభివృద్ధిని కోరుతుంది. సంయోగ సమ యంలో రతి జలం ఎక్కువగాఉండదు. భర్తమీద నఖక్షతాలు చేస్తుంది. శరీరం వెచ్చదనం కలిగిఉంటుంది. ఆహారం మధ్య

రకంగా ఉంటుంది. ఎవరి దోషాలైనా వినడానికి ఉబలాట పడుతుంది. కంఠం గ్రామ్యంగా ఉండదు. గొంతు ఎత్తితే గార్దభస్వరం. మిక్కిలీ పైత్యంగల మనిషిలాగా ఉంటుంది. కుటిలస్వభావంతో ఎప్పుడూ ఏదో వాగుతూ ఉంటుంది. నడుము సన్నగానూ, పెదవి అనుకూలమైనదిగానూ, చూపులు కుటిలంగానూ ఉంటాయి. మృదువైన సంభాషణమూ, నున్నని శరీరమూ, బాగా ఎత్తుగా ఉన్న చన్నులూ, విశాల నేత్రాలూ, మెత్తదనంలేని పాదాలూ, శంఖంవంటి కంఠమూ, చక్కని కనుబొమలూ, నల్లని జుట్టూ, కలిగి సంభోగంకోసం ముచ్చట పడుతూ ఉంటుంది. కారపు వస్తువులను బాగా ఆరగిస్తుంది. సువాసన ద్రవ్యాలను ఎక్కువగా కోరుతుంది. భర్త అంటే వెఱ్ఱి నమ్మకం కలిగిఉంటుంది. సంభోగం జరిపేందుకు నీలపు చీరను కట్టి సిద్ధపడుతుంది. భర్త ఏ వింత మాటలు మాట్లాడినా సంభోగం చెయ్యగోరుతుంది. కాని మదనమందిరాన్ని దాచుకోదు. భర్తను మాటికీ బెదరిస్తూ వుంటుంది. రతికోసం నాథుని కౌగిట్లో తనంతటతానే చేరుతుంది. పురుషాయితంకోసం వెంపరలాడుతుంది. శశాంకుడనే నాయకునితో కూడడానికి ఇష్టపడుతుంది. మూడవజాముని రతిచెయ్యడం ఈమెకు ఇష్టం.

4. హస్తినీజాతి నాయిక:- తిన్నగా నడవడం చేత కాదు. కాని వేళ్లు వంకరగానూ, పొడుగుగానూ వుంటాయి. పాదాలు చాలా పొట్టివి. నల్లని జుట్టూ, ఏ పని చేసినా క్రూరస్వభావం చిందులు తొక్కుతూ వుంటుంది. శరీరం చాలా చిన్నదిగా వుంటుంది. ఏనుగు మదంలాగా శరీరంగానీ

మదనమందిరంగానీ, కంపుకొడుతూఉంటుంది. బాగా తిండి పోతుగా ఉంటుంది. పెద్ద పెదవులు. గద్గదమైన కంఠం, స్వాధీనంకాని మనస్సూ కలిగిఉంటుంది. మదనమందిరం రోమాలు తక్కువగా ఉండి చాలా లోతుగానూ, చాలా వెడల్పుగానూ ఉంటుంది. గాఢ రతిలో గాని బాగాకరగదు. బంగారు కడవలలాంటి చన్నులు, చంకలు గబ్బు కంపు. మనస్సు చాలా మృదువు. నుదురు మెరక. పొట్టి వెంట్రుకలు. నడుమూ, తొడలూ, చాలా బరువుగా ఉంటాయి. నడుమూ పొట్టా చాలా పెద్దవి. శరీరంగూడా లావే. తియ్యని మాట లతో మెత్తపడుతుంది. కన్నులు చాలా విశాలం. శ్రావ్య మైన కంఠం. కపటం ఎరుగదు. బాగా రతిచేసే ప్రియుణ్ణి బాగా ప్రేమిస్తుంది. మామిడిచిగురు రంగు చీరలు కడుతుంది. సాధారణంగా మదనమందిరాన్ని బయటపెట్టదు. సంయోగ సమయంలోగూడా మోహం ఉన్నట్లు కనుపించదు. రాజ పురుషులను సొంపుగా చూస్తుంది. ఆలింగనం చెయ్యగోరు తుంది. రెండోజాములో రతి కోరుతుంది.

౨౬౦. తత్రసదృశ సంప్రయోగే సమరతానిత్రీణి. ౨.౧.3

అంగాలు సరిసమానంగా ఉన్న నాయికానాయకుల రతాన్ని సమరతం అంటారు. ఆ సమరతాలు మూడు రకాలు. శశజాతి పురుషునికి మృగిజాతి నాయికతోనూ, వృషజాతివానికి బడబ తోనూ, అశ్వజాతివానికి హస్తినితోనూ సంప్రయోగం జరిగితే సమరతాలు ఏర్పడతాయి. సమరతం అంటే స్త్రీయొక్క రంధ్రానికి పురుషుని సాధనం సరిగా సరిపోవడం.

౨౬౧. విపర్యయేణ విషమాణిషట్. ౨.౧.౪

శశజాతి పురుషునికి బడబతోనూ, హస్తినితోనూ, వృషజాతి పురుషునికి మృగితోనూ, హస్తినితోనూ, అశ్వజాతిపురుషునికి మృగితోనూ, బడబతోనూ జరిగిన సంప్రయోగాలను విషమ సంప్రయోగాలంటారు. దీనికి స్త్రీపురుషుల రహస్యేంద్రియాల హెచ్చుతగ్గులే కారణం. పై విధంగా విషమరతాలు ఆరు.

౨౬౨. విషమేష్వపి పురుషాధిక్యం చేదనంతర సంప్రయోగే ద్వే ఉచ్చరతే. ౨.౧.౫

పైన చెప్పిన విషమ రతులలోగూడా మరొక విశేషముంది. పురుషుని అంగం ఎక్కువ పొడుగుగా ఉండి స్త్రీ అంగం లోతు తక్కువగా ఉంటే సంయోగంవల్ల పురుషుని మేహనం స్త్రీ యోనిని చించుకుని లోపలికి వ్యాపిస్తుంది. అలాటి రతాన్ని ఉచ్చరతం అంటారు. అవి రెండు విధాలు. 1. అశ్వజాతి పురుషునికి బడబజాతి స్త్రీతోనూ, 2. వృషజాతిపురుషునికి మృగీ జాతి స్త్రీతోనూ సంప్రయోగం జరిగితే పై రెండు విధాల ఉచ్చరతాలూ ఏర్పడుతాయి.

౨౬౩. వ్యవహితమేక ముచ్చతర రతం. ౨.౧.౬

వ్యవహితం అంటే చివరజాతి పురుషుడు మధ్యజాతి స్త్రీతో కాకుండా మొదటిజాతి నాయికతో సంప్రయోగం జరపడం. దీన్ని ఉచ్చతర రతం అంటారు. ఇది ఒకటే రకం.

౨౬౪. విపర్యయే ద్వే పునర్నీచరతే. ౨.౧.౭

పైన చెప్పిన క్రమానికి తలకిందుగా జరిగితే, అంటే చాలా పొట్టి సాధనం గల శశజాతి పురుషుడు అంతకంటె కొంచెం

లోతైన భగం కల బడబజాతి నాయికతో కలిసినా, వృష జాతివాడు, హస్తినీజాతి నాయికతో కలిసినా నీచరతులు ఏర్పడతాయి. ఇవి రెండు రకాలు. ఇవి సమరతాలకంటె నీచరతాలు. పురుషుని సాధనం యోనికి చాలకపోవడంచేత వీటిని నీచరతాలన్నారు.

౨౬౫. వ్యవహిత మేకం నీచతర రతం. ౨.౧.౮

నీచతర రతం అనేది ఇంకొకటున్నది. ఇది పై ఉచ్చతర రతం లాంటిది. చివరజాతిస్త్రీతో మొదటిజాతి పురుషుడు సంగమిస్తే నీచతర రతం ఏర్పడుతుంది. ఇదీ ఒకటే రకం.

౨౬౬. తేషు సమాని శ్రేష్ఠాని. ౨.౧.౯

ఈ ఆరు విషమ రతాలకంటె, భగ లింగాలు సరిసమానంగా ఉండి స్త్రీ పురుషుల కిద్దరికీ వర్ణనాతీతమైన సుఖాతిశయాన్ని కలిగించడంచేత సమరతాలు చాలా శ్రేష్ఠమైనవి.

౨౬౭. తరశబ్దాంకితే ద్వేకనిష్ఠే. ౨.౧.౧౦

"తర" అనే శబ్దం చేర్చబడిన ఉచ్చతర రతమూ, నీచతర రతమూకూడా అధమాలు. ఈ రతాలలో మొదటిదైన ఉచ్చతర రతం స్త్రీ మానానికి బాధాకరంగనుకనూ, రెండవదైన నీచతర రతంలో స్త్రీకి స్పర్శసుఖం అసలే ఉండదు గనుకనూ వీటిని అధమ రతాలుగా పరిగణించారు శాస్త్రకారులు.

౨౬౮. శేషాణి మధ్యాని. ౨.౧.౧౧

ఇక మిగిలిన నాలుగున్నూ మధ్యరతాలు. అంటే ఉచ్చరతాలు రెండూ, నీచరతాలు రెండూ అన్నమాట.

ఈ క్రింది పట్టిక చూడండి.

సమరతాలు—3

1. శశజాతి నాయకుడు మృగీజాతి నాయిక.
2. వృషజాతి " బడబ "
3. అశ్వజాతి " హస్తిని "

విషమరతాలు—6. ఈ ఆరు విషమరతాలలోనూ, మధ్య రతాలు నాలుగు. ఆ నాలుగు మధ్యరతాలలోనూ ఉచ్చరతాలు రెండు. నీచరతాలు రెండు. ఉచ్చతర రతం ఒకటి. నీచతర రతం ఒకటి. మొత్తం విషమరతాలు ఆరు.

మధ్య రతాలు—4

విషమ రతాలలోని మధ్య రతాలలో ఉచ్చరతాలు.

1. అశ్వజాతి నాయకుడు ... బడబజాతి నాయిక
2. వృషజాతి నాయకుడు ... మృగీజాతి నాయిక

విషమ రతాలలోని మధ్యరతాలలో నీచరతాలు.

1. శశజాతి నాయకుడు ... బడబజాతి నాయిక
2. వృషజాతి నాయకుడు ... హస్తినీజాతినాయిక

విషమ రతాలలో అధమరతాలు—2

1. ఉచ్చతర రతం:- అశ్వజాతి నాయకుడు-మృగీజాతినాయిక.
2. నీచతర రతం:- శశజాతి " హస్తినీ "

సమరతాలు మినహా తక్కిన పై ఆరు రతాలు విషమాలు. సమరతాలతో కూడా కలిసి మొత్తం రతాలు తొమ్మిది.

౨౬౮. సామ్యేప్యుచ్చాంకం నీచాం కాజ్ఞ్యాయ ఇతి ప్రమాణతో నవరతాని. ౨.౧.౧౨

ఆ మధ్య రతాలలో మరొక విశేషాన్ని చెవుతున్నారు. ఈ మధ్యరతాలలో అట్టే హెచ్చుతగ్గులు లేకపోయినా నీచ రతం కంటె ఉచ్చరతం మంచిదని శాస్త్రకారుల అభిప్రాయం. ఎలాగంటే, ఉచ్చరతంలో ఆడది ఉత్ఫుల్లకాదులచేత భగాన్ని తెరుచుకుని ఉంటే పురుషుని సాధనం భగంయొక్క లోతు కంటె ఎక్కువ పొడుగుగా ఉండడంవల్ల స్త్రీకి తృప్తి కలిగించడానికి సమర్థం అవుతుంది. ఇక నీచరతంలోనో? సంపుటికాదులచేత ఆడది యోనిని ముడుచుకునిఉన్నా, సాధనం చాలని కారణంచేత తృప్తిపరచలేదు స్త్రీని. అందువల్లే "చిన్న అంగం కలవాడు ఎంత కామోద్రేకం కలిగిఉన్నా, ఎంతసేపు మైధునం చెయ్యగలిగినా, స్త్రీయొక్క కామాన్ని అణచలేని కారణంచేత స్త్రీలకు ప్రియుడు కాలేడు." అని పెద్దలు చెవుతున్నారు.

౨౬౯. యస్య సంప్రయోగ కాలే ప్రీతి రుదాసీనా, వీర్యమల్పం, క్షతానిచ న సహతే. సమంద వేగః.

౨.౧.౧౩

పైన స్త్రీ పురుషుల అంగాలయొక్క హెచ్చుతగ్గులకు సంబంధించిన రతివిశేషాలు చెప్పారు. ఇక స్త్రీ పురుషుల భావాలను పట్టి రతిని నిరూపిస్తున్నారు. స్త్రీ పురుషుల స్ఖలనకాలంకంటె ముందుది కాబట్టి భావప్రాప్తిని ముందు చెవుతున్నారు. ఈ భావం రెండువిధాలు. సంభోగించాలనే కోరికను కామితం

అంటారు. ఇది ముందు ముందు పొందబోయే సుఖానికి కారణం. ఈ కారణరూపమైన భావం ఒక రకం, ఇక సురతానికి చివర సమయంలో (స్ఖలనం కాబోయే ముందు) పుట్టే భావం మరొక రకం. ఈ భావం ఫలసిద్ధిరూపమైనది. అందువల్ల ముందుగా ఈ రెండు రకాలైన భావాలద్వారా రతిని స్థాపిస్తున్నారు. ఈ భావ సురతం మృదువనీ, మధ్యమం అనీ, అధికం అనీ మూడు రకాలు. వాటిలో మొదటి మృదు భావాన్నిగూర్చి చెవుతున్నారు. సంగమం చేద్దామనే ఉత్సాహం ఎవనికి తక్కువగా ఉంటుందో, వీర్యం అల్పంగా ఉంటుందో, ఎవడు నాయికయొక్క నఖక్షతాలకూ దంతక్షతాలకూ ఓర్చలేకపోతాడో ఆపురుషుని మంద వేగుడంటారు.

౨౭౦. తద్విపర్యయే మధ్యమచండవేగౌ భవతః. ౨.౧.౧౪

సంభోగం జరుపుదామనే ఉత్సాహమూ, వీర్యమూ, మధ్యరకంగా ఉండి కొద్దికొద్దిగా నఖక్షతాదులను సహించేవాడెవడో వానిని మధ్యవేగుడంటారు. పై విషయాలు ఎక్కువగా ఉంటే చండవేగుడు.

౨౭౧. తథా నాయికా అపి. ౨.౧.౧౫

పైన చెప్పినవిధంగానే స్త్రీల విషయంలో కూడా చూచుకోవాలి. అంటే సంభోగంమీద తక్కువ భావం కలిగి, రతిజలం తక్కువగా ఉండి, నఖక్షతాదులను సహించలేకపోతే మందవేగ అనీ, ఈ లక్షణాలు సామాన్యంగా ఉంటే మధ్యవేగ అనీ, ఎక్కువగా ఉంటే చండవేగ అనీ అంటారు.

౨౭౨. అత్రాపి ప్రమాణ వదేవ నవరతాని. ౨.౧.౧౬
ఈ భావ విషయంలోకూడా లింగంయొక్క హెచ్చుతగ్గులను పట్టి తొమ్మిది రతాలను ఎలానిర్ణయించారో అలాగే తొమ్మిది రకాలూ ఏర్పడతాయి.

౨౭౩. తద్వత్కాలతోఽపి శీఘ్ర మధ్య చిరకాలా నాయకాః. ౨.౧.౧౭
భావంయొక్క హెచ్చుతగ్గులను పట్టి ఎలా తొమ్మిది రతాలను నిర్ణయించారో, అలాగే కాలాన్నిపట్టికూడా తొమ్మిది రతాలను గూడా చూచుకోవాలి. అంటే శీఘ్రంగా స్ఖలనంఅయితే వాడు శీఘ్రవేగుడు. మధ్యరకంగా స్ఖలనం అయితే వాడు మధ్యవేగుడు. చాలా కాలానికి స్ఖలనం అయితే చిరవేగుడు అంటారు. స్త్రీల విషయంలోగూడా ఇలాగే చూచుకోవాలి.

౨౭౪. తత్రస్త్రియాం వివాదః. ౨.౧.౧౮
ఇక్కడ స్త్రీల విషయంలో పెద్ద మతభేదం ఉన్నది.

౨౭౫. న స్త్రీపురుష వ దేవభావ మధిగచ్ఛతి. ౨.౧.౧౯
ఔద్దాలకి మతాన్ని ముందు చెవుతున్నారు. వీర్యం ఒదిలే సమయంలో ఎలాటి అభిమానరూపమైన భావ సుఖాన్ని పురుషుడు పొందుతున్నాడో, అలాటి భావ సుఖాన్ని స్త్రీ పొందటంలేదు. ఆమెకు వీర్యమనేది లేకపోవడమే కారణం.

౨౭౬. సాతత్యాత్త్వస్యాః పురుషేణ కండూతిరప నద్యతే. ౨.౧.౨౦
అలా అయితే స్త్రీ పురుషునితో యెందుకు సంభోగిస్తుంది? అంటే సమాధానం చెవుతున్నారు ఔద్దాలకులు. స్త్రీ యోని

స్వతస్సిద్ధంగా చిన్న చిన్న పురుగులచేత వ్యాపింపబడిఉంటుంది. కనుక అందులో ఎప్పుడూ దురద ఉండడం సహజం. పెద్దలు కూడా "రక్తంవల్ల పుట్టి మృదుశక్తీ, మధ్యశక్తీ, ఉగ్రశక్తీ కల పురుగులు స్త్రీల మదనమందిరంలో చాలా చిన్నచిన్నవిగా ఉండి తమ బలాన్ని పట్టి దురదను కల్పిస్తూఉంటాయి" అన్నారు. ఆ దురద పురుషునివల్ల నివారణం అవుతోంది. ఎలాగంటారా? ఎల్లప్పుడూ పురుషుడు తన మేహన సాధనాన్ని స్త్రీ యోనిలోనికి జొప్పించి అక్కడి దురదను పోగొడు తున్నాడు. అలా చెయ్యకపోతే ఆ దురద ఎక్కువఅవుతుంది.

౨౭౭. సా పునరాభిమానికేన సుఖేన సంపృక్తా రసాంతరంజనయతి. ౨.౧.౨౧

అయితే కేవలం దురద పోగొట్టుకొనడానికి పురుషునితో సంగమించడం యెందుకూ? ఆ మాత్రం పనికి సాధనాలు వేరే దొరుకకపోయినాయా? అంటే సమాధానం చెవుతున్నారు శ్వేద్దాలకులు. పుల్లతో చెవిలో దురద పోగొట్టుకున్నట్లు పురుషుని మేహనంవల్ల దురద ఒదుల్చుకుంటూ, నేను ఈ పురుషునిచేత ముద్దుపెట్టుకోబడుతున్నాను. గిచ్చబడు తున్నాను. రక్కబడుతున్నాను, గాగిలించుకోబడుతున్నాను, సంభోగించబడుతున్నాను," అని తనతో సంభోగిస్తున్న పురుషుని భావించుకుంటూ, అతనియందును మమతపెట్టుకుని సుఖిస్తోంది. దీన్నే ఆభిమానికసుఖం అంటారు. పైన చెప్పిన దురద ఒదుల్చుకొనడం రూపమైన సుఖం ఈ ఆభిమానిక సుఖంతో కలిసి వేరొక సుఖాన్ని కల్పిస్తున్నది. తీపి తింటే

ఒక రకమైన రుచీ, పులుపుతింటే మరొకరకమైన రుచీ, ఈ రెండూ కలిసిన పులుసుతింటే ఇంకొకరకమైన రుచీ కలిగినట్లే అన్నమాట.

౨౮౮. తస్మిన్ సుఖ బుద్ధిరస్యాగి. ౨.౧.౨౨

ఆ విశేష సుఖం కలిగినప్పుడుగాని స్త్రీ వ్యక్తి సుఖించా ననుకోదు. అలాటి సుఖం ఏ సాధనంతోనో దురద పోగొట్టుకున్నంతమాత్రంచేత కలుగదు. ఆ విశేష సుఖమే స్త్రీలకు ప్రధానమైనది. స్త్రీలకు శుక్రమనేది లేదుగనుక స్ఖలనరూపమైన సుఖం వాళ్లకు లేదు. పైన చెప్పిన సుఖం వాళ్లకు సురతం ప్రారంభించిన క్షణంనుంచీ దురద ఒదుల్చుకొనుట ద్వారా కలుగుతోంది. పురుషుని సుఖంమాత్రం స్ఖలనంతో పూర్తిఅవుతుంది. అందువల్ల స్త్రీపురుషులకు సుఖస్వరూపాన్ని పట్టీ, కాలాన్ని పట్టీ, సామ్యం ఎక్కడా లేదుగనుక, కాలానికీ, భావానికీ సంబంధించిన తొమ్మిది రతాలూ లేనేలేవు.

౨౮౯. పురుషప్రీతేశ్చా న భిజ్ఞత్వాత్. ౨.౧.౨౩

"పురుషుడు పొందే రతి సుఖాన్ని స్త్రీ పొందుటలేదు" అని ఎలా తెలుసుకొనగలం? పురుషుని ప్రేమగూడా మనస్సుకే సంబంధించినది గనుకనూ, ఇంద్రియాలకు గోచరం కానిదాన్ని ప్రత్యక్ష్యంగా తెలుసుకోలేముగనుకనూ, స్త్రీపురుషుల ప్రేమ భావాలను ఎవడు తెలుసుకోగలడు?

౨౯౦. కథంతే సుఖమితి ప్రష్టుమశక్యత్వాత్. ౨.౧.౨౪

స్త్రీ పురుషులు "నీసుఖం ఎలాటిది? అంటే, నీసుఖం ఎలాటిది?"

అని ఒకళ్లను ఒకళ్లు ప్రశ్నించుకుంటే స్ఖలనరూపమైన సుఖాన్ని స్త్రీ ఎరుగదు కాబట్టిన్నీ స్త్రీ పొందే సుఖ విశేషాన్ని పురుషుడు ఎరుగడు గనుకనున్నూ, ఆ విషయం ఇలా ఉంటుం దని చెప్పడమే కుదరదు. ఇక వ్రాయడం ఎలా? అందువల్లే పురుషుడు పొందే స్ఖలన సుఖాన్ని స్త్రీ పొందుటలేదు.

౨౮౧. కథమే తదుపలభ్యేత ఇతిచేత్, పురుషోహిరతి మధి
గమ్య స్వేచ్ఛయా విరమతి, నస్త్రీయమపేక్షతే,
సత్వేవం స్త్రీత్యౌద్దాలకిః. ౨.౧.౨౫

పై నిశ్చయానికి ఆధారం ఏమిటి? అంటే, పురుషుడు రతిచేసి స్ఖలనసుఖాన్ని అనుభవించి స్వేచ్ఛగా రతిచెయ్యడం ఆపి వేస్తున్నాడు. ఆ సమయంలో స్త్రీ తనంతటతాను కోరినా పురుషుడు రతి చెయ్యడానికి మళ్లీ కోరడంలేదు. స్త్రీ అలా కాదు. ఆమెకుగూడా పురుషునికివలె స్ఖలనసుఖం ఉంటే, ఆ సుఖం కలిగినవెంటనే పురుషుని వదలవచ్చునుగదా? ఒక పురుషుడు విరమించినప్పుడు, మరొక పురుషుని కోరుతూనే ఉంటుంది స్త్రీ బుద్ధి. ఒకనితో రతిచేసి అతడు విరమించిన తరువాత అలా ఉండే ఇతరులతోగూడా సంభోగం నెరపినట్లు అక్కడక్కడ వింటున్నాం. పెద్దలుకూడా "అగ్ని కట్టెలతో తృప్తిపడనిరీతిగా, సముద్రుడు నదులతో తృప్తిపడనివిధంగా, భూతాల నన్నింటినీ దిగమింగినా అంతకుడు తృప్తిపడనట్లుగా, ఎంతమంది పురుషులతో కూడినా స్త్రీలు తృప్తిపడరు." అన్నారు. అందువల్లే స్వేచ్ఛగా స్ఖలన సుఖాన్నిపొంది రతి నుండి విరమించడం అనేది లేదుగనుక స్ఖలనానికి పూర్వం

పురుషుడు పొందే సుఖం స్త్రీకి లేదు. ఇంతవరకూ ఔద్దాలకి మతం.

౨౮-౨. తత్రైతత్స్యాత్, చిరవేగేనాయకే స్త్రియోఽను రజ్యంతే, శీఘ్రవేగస్య భావమనాసాద్య అవసానే అభ్యసూయినోఽ భవంతి. తత్సర్వం భావప్రాప్తే ర ప్రాప్తేశ్చ లక్షణం. ౨.౧.౨౮

"భావాన్ని పట్టీ, కాలాన్ని పట్టీ తొమ్మిదివిధాల రతాలు ఏర్పడ తాయి" అన్న మతాన్ని ఖండించి ఔద్దాలకి "స్త్రీలకు పురుషు నకు వలె స్ఖలన సుఖంలేదు." అని సిద్ధాంతం చేశాడు. దీనిమీద సామాన్యంగా వచ్చే ప్రశ్న, తరువాత సమాధానమూ చెపుతున్నారు.

స్త్రీలు తమంతట తాము సురతంనుంచి విరమించరు కాబట్టి వారికి స్ఖలనసుఃఖం లేకపోతే లేకపోనీ, అనురాగాన్ని చూచినప్పుడైనా విసృష్టి సుఖం ఉన్నదనవచ్చుగదా ? ఎలా గంటారా ! చాలాసేపు రతిచేసి స్ఖలనసుఖాన్ని పొందిన నాయకుని స్త్రీ ఎక్కువగా అభిమానిస్తోంది. చాలా తక్కువ కాలం రతిచేసి విరమించే నాయకుణ్ణి రతి అయిన తరువాత స్త్రీ ద్వేషిస్తోంది. పై రెండు రకాల నాయకులనూ ప్రేమించ డమూ, ద్వేషించడమూ చూస్తే భావం కలిగేవరకూ రతి చేస్తే సంతోషమూ, భావం కలుగకముందు విరమిస్తే దుఃఖమూ జనిస్తున్నాయని తేలింది. స్త్రీ చాలాసేపు పురు షాయిత బంధంతో రమించి విరమించినప్పుడు చాలాసేపు రతి చేయగలిగిన నాయకుడు సంతోషిస్తున్నాడు. ఇక క్షణం

లోనే విరమించిన నాయికవల్ల దుఃఖాన్ని పొందుతున్నాడు. అందువల్ల పై రకంగా సుఖదుఃఖాలు స్త్రీ పురుషుల కిద్దరికీ సమానంగానే కనుపిస్తున్నాయి. కాబట్టి పురుషునిలాగే స్త్రీకి గూడా స్ఖలనసుఖం ఉన్నదనే తోస్తుంది. ఇది సామాన్యా శంక.

౨౮౩. తచ్చన. ౨.౧.౨౭

అనురాగ ప్రదర్శనం భావప్రాప్తికి (విస్పష్టిసుఖానికి) లక్షణం యెన్నడూ కాదు. ఈ అనురాగం అనేది స్త్రీ పురుషులకిద్దరికీ సాధారణంగా కనిపిస్తూనే ఉన్నది.

౨౮౪. కండూతి ప్రతికారోఽపిహి దీర్ఘకాలం ప్రియ ఇతి. ౨.౧.౨౮

ఎక్కువసేపు దురద ఒదల్చడం స్త్రీలకు చాలా ఇష్టం కావడమే కాక స్ఖలనసుఖాన్నికూడా కల్పిస్తుంది.

౨౮౫. ఏతదుప పద్యత ఏవ. ౨.౧.౨౯

ఇది కొంతవరకు బాగానేఉన్నది. పైవిధంగా చెప్పకపోతే స్ఖలన సుఖాన్ని పొందినా, దురదను పోగొట్టడం జరుగలేదు గనుక అనురాగం జనించలేదనవలసివస్తుంది. కాని మళ్ళీ ఒక్క సందేహంమాత్రం ఈ పక్షంలో తప్పటంలేదు. ఏమంటారా? చూడండి. స్త్రీకి స్ఖలనసుఖా పొందటంవల్ల అనురాగం జనిస్తోందా? లేక దురదను పోగొట్టడంవల్ల జనిస్తోందా? ఇలాగే స్త్రీ మందవేగునిద్వారా, స్ఖలనసుఖాన్ని పొందకపోవడంవల్ల విరక్తురాలౌతోందా? ఇదీ సందేహం.

౨౮౬. తస్మాత్సందిగ్ధత్వాద లక్షణ మితి. ౨.౧.౨౯

పై అనురాగ విరక్తులనే రెండు విషయాలలోనూ, సందేహం ఏర్పడడంచేత స్త్రీలకు స్ఖలనసుఖం ఉన్నదనిగానీ, లేదనిగానీ ఈ వాదం నిర్ణయించలేదు. కాబట్టి స్వేచ్ఛగా రతినుండి విరమించడం విరమించకపోవడం అనేవే, స్ఖలనసుఖం ఉన్నదా? లేదా? అనే విషయాన్ని తేల్చాలి. స్త్రీలయందు ఆ స్వేచ్ఛగా విరమించడం కనుపించడంలేదు. స్వేచ్ఛగా విరమించకపోవడమే కనుపిస్తోంది. అందువల్ల పురుషునిలాగా స్త్రీ భావప్రాప్తిని పొందుటలేదని స్పష్టమైనది.

౨౮౭. సంయోగే యోషితః పుంసాం, కండూతిరపనుద్యతే
తచ్చాభిమాన సంసృష్టం, సుఖ మిత్య భిధీయతే
౨.౧.౩౧

ఈ మతాన్నే ఔద్దాలకి చెప్పిన శ్లోకాన్ని చూపి స్పష్టం చేస్తున్నారు వాత్స్యాయనులు. సంయోగ సమయంలో పురుషునిచేత స్త్రీయొక్క భగంలో ఉన్న దురద నివారింపబడుతున్నది. ఆ సుఖం అభిమానంతో కూడిఉంటుంది. కారణంలోనే కార్యధర్మం కనుపిస్తోంది గనుక దాన్నే ఆభిమానిక సుఖం అన్నారు. ఇంతవరకూ ఔద్దాలకి మతం.

౨౮౮. సాతత్యాద్యువతి రారంభాత్ప్రభృతి భావ మధి
గచ్ఛతి, పురుషః పునరంత ఏవ. ౨.౧.౩౨

ఇక బాభ్రవ్యుని మతాన్ని చూపిస్తున్నారు. స్త్రీపురుషులిద్దరూ స్ఖలనసుఖం అనుభవిస్తున్నారు. స్త్రీ రతి ప్రారంభిం

చిన క్షణంనుంచీ తెంపులేకుండా పురుషునిచేత రమింపబడుతూ, చిల్లులు పడిన కుండలాగా కొద్దికొద్దిగా రతి జలాన్ని వదులుతూ ఉంటుందనే సంగతి అనుభవసిద్ధమేకదా ? అందువల్ల రతిని ప్రారంభించినప్పటినుంచీ, ఆభిమానిక సుఖరూపమైన భావాన్ని పొందుతూ, పురుషునిలాగా స్ఖలనసుఖాన్నిగూడా పొందు తుంది. పురుషుడు స్ఖలనం కాబోయే సమయంలో మాత్రం ఆభిమానిక సుఖభావాన్ని అనుభవిస్తున్నాడు.

౨౮. ఏతదుపపన్నతరం. ౨.౧.౩౩

ఇది ఔద్దాలకి మతంకంటె సప్రమాణంగా ఉన్నది గనుక కొంతవరకు బాగానేఉన్నది. అయినా ఈ మతంలోకూడా స్త్రీపురుషులకు స్ఖలన సుఖంలోని సామ్యం అంగీకరింపబడు తోంది గనుక భావాన్నిపట్టి తొమ్మిది రతాలూ ప్రాప్తించినా, నాయికానాయకులకు స్ఖలనకాలంలో భేదం యేర్పడుతోంది గనుక కాలంవల్ల ఏర్పడే నవరతాలూ ఏర్పడటంలేదు.

౨౯. సత్యాపత్యాం బావప్రాప్తే గర్భసంభవః. ఇతి బాభ్రవీయాః. ౨.౧.౩౪

ఇంకా బాభ్రవీయు లేమంటున్నారో చూడండి. యోని ఒక కారణం వంటిది. అది కదిలించినప్పుడు చెమ్మగిలుతూఉంటుంది. స్ఖలన సుఖం పొంది బాగా తృప్తిపొందిన స్త్రీ గర్భాన్ని ధరిస్తోంది. ఈ గర్భధారణ లక్షణాలను చరకు డిలా చెప్పాడు. "మాటిమాటికీ ఉమ్మి వెయ్యడమూ, కాళ్ళూచేతులూ బరువుగా ఉండడమూ, ఎక్కువ సంతోషం పూనడమూ, మనస్సులో గుబులుగా ఉండడమూ, సురతాన్నిగూర్చి చాలనిపించడమూ

యోని లోపలికి వీర్యాన్ని గ్రహించడమూ" ఇవి గర్భ లక్షణాలు. ఇక తృప్తి అంటే భావం అన్నమాట. ఆ భావప్రాప్తి రేతస్సును విడిస్తేగాని కలగదు. స్త్రీ శోణితాన్నే విడుస్తుంది కాని, శుక్రాన్ని విడువదని కొందరంటున్నారు. ఇందుకే పెద్దల వాక్యాలుగూడా ప్రమాణంగా చూపిస్తున్నారు. "కామాగ్ని సంతప్తచిత్తులైన స్త్రీపురుషుల భగలింగాల రాపిడి వల్ల అరణిదండాల రాపిడివల్ల అగ్ని పుట్టినట్లు శుక్లశోణితాలు ఉద్భవిస్తాయి." అయితే స్త్రీ విడిచేది శుక్లం కాకపోతే గర్భం ఎలా ధరిస్తున్నది? పురుషునితో కలియడంవల్ల గర్భాన్ని ధరించినట్లే స్త్రీతో కలిసి కూడా స్త్రీ గర్భాన్ని ధరిస్తుంది. దీనికే ప్రమాణంగా సుశ్రుతంలో "ఆడదీ, ఆడదీ సంగమిస్తే ఇద్దరూ విడిచిన శుక్లంవల్ల బొమికలు లేని పిండం ఉద్భవిస్తుంది." అని ఉన్నది. అందువల్ల రసధాతువువల్ల ఉత్పన్నమయిన అసృగ్ధాతువే ఒకానొక అవస్థలో ఆర్తవంగా మారుతుంది. శుక్లధాతువుమాత్రం మజ్జధాతువువల్ల ఉద్భవిస్తుంది.

౪౧. అత్రాపితా దేవ ఆశంకా పరిహారే. ౨.౧.౩౪

పై బాభ్రవ్యుని మతంలోకూడా ఔద్దాలకి మతంలో వచ్చిన ప్రశ్నా సమాధానాలు సంభవిస్తూనే ఉన్నాయి. ఆరంభం నుంచీ, ...... ఈ మొదలైన ఆశంకా పరిహారాలు ఏర్పడుతున్నాయి. అయితే అనురాగం ఉన్నది గనుక పురుషునివలె భావప్రాప్తినీ, అసూయ ఉన్నదనడంవల్ల మొదటినుంచీ భావప్రాప్తి పొందకపోవడమున్నూ, సమాధానం అని చెప్ప

డానికి వీలులేదు. ఎక్కువ కాలం దురద ఒదల్చుకోనడం గూడా ఇష్టమేగనుక, ఆ పని ఎక్కువకాలం లేకపోతే శీఘ్ర వేగుని విషయంలో ద్వేషమున్నా, కలుగుతున్నది. ఎలా గంటే, భావప్రాప్తి ఉన్నా కండూతి ప్రతీకారం ఎక్కువ కాలం లేదుగనుక, లేక చాలాకాలము భావప్రాప్తి కూడా ఇష్టమని కండూత్యపనోదనంతో కలపాలి. ఇలాగే శీఘ్రవేగుని విషయంలో విరక్తులౌతున్నారు. ఎందువల్ల? చాలాకాలం భావప్రాప్తి లేదుగనుక. సాధారణంగా స్త్రీలు చాలాకాలం భావప్రాప్తిని కల్పించే పురుషుని ఎక్కువగా కోరుతున్నారు. ఎందువల్ల? వారికి కామం పురుషునికంటె ఎనిమిదిరెట్లు ఎక్కువ గనుక. ఇలా అయితే, ఇక స్త్రీలు పురుషునివల్ల తృప్తిపడడమే జరుగదు. ఎందువల్ల? స్త్రీలకంటె పురుషులకు కామం ఎనిమిది వంతులు తక్కువగనుక. అనే సమాధానం చెప్పాలిగాని విసృష్టి సుఖం లేదు గనుక అని చెప్పరాదు. అందువల్ల తిరిగీ పైఆ శంకాపరిహారాలు వస్తూనే ఉన్నాయి.

- ౨౯—౨. తత్రైతత్స్యాత్ సాతత్యేసరప ప్రాప్తావారంభకాలే మధ్యస్థచిత్తతా, నాతిసహిష్ణుతాచ, తతః క్రమే ణాధికో రాగః, శరీరే నిరపేక్షత్వం, అంతేచ విరామాభీప్సేత్యేతదనుప పన్నమితి. —౨.౧.౩౬—

రతి ప్రారంభించేసమయంలో చిత్తం మధ్యస్థంగా ఉండడమూ, నఖక్షతాదులను ఎక్కువగా సహించలేకపోవడమూ, తరువాత క్రమక్రమంగా బాగా అనురాగాన్ని పొందడమూ, నఖక్ష తాదులను మైదుకువులో బాగా సహించడమూ, రతిసమాప్తి

పొందేకాలంలో విరమింతామనే కోరిక కలుగడమూ, అనే ఈ క్రమం ఆరంభంనుంచీ భావప్రాప్తి కలుగుతున్నట్లయితే అసంభవమౌతుంది.

౨౯౩. తచ్చన. ౨.౧.౩౭

ఇలా అవడం బాగుండలేదు. ఎందుకు అసంభవమౌతుంది? ఈ క్రింద చూడండి.

౨౯౪. సామాన్యే పిభ్రాంతి సంస్కారే కులాలచక్రస్య భ్రమరకస్య వాభ్యాన్తావేవ వర్తమానస్య, ప్రారంభే మండవేగతా, తతశ్చక్రమేణ పూరణం వేగస్యే త్యుపపద్యతే. ౨.౧.౩౮

భ్రమరకం అంటే కొయ్యతో తయారైన బొంగరం అనే పిల్లల ఆటవస్తువు. దాన్ని పొడుగాటి తాడుతో చుట్టి విసురుతారు పిల్లలు. అప్పుడది గిఱ్ఱున తిరుగుతుంది. ఇలాగే కుమ్మరికూడా తన కుమ్మరిసానను కొంతసేపుత్రిప్పి ఒదిలిపెడతాడు. ఇలా తిరగడం అనేగుణం మొదట్లో సామాన్యంగా కలిగిఉన్నా, అలా తిరుగుతూనే బొంగరమూ, కుమ్మరిసానాగూడా ఆరంభంలో కొద్దివేగంకలిగి క్రమంగా బాగావేగాన్ని పొందుతున్నాయి. ఇలాగే స్త్రీలుకూడా పురుషుడుచేసే, తాకుట, కౌగిలించుకొనుట, ముద్దుపెట్టుకొనుట, గిచ్చుట, నొక్కుట, మొదలైన చేష్టలతో సామాన్యమైన స్థలన సుఖాన్ని పొందినా, రతారంభంలో మందవేగమూ, మృదువైనరతీ, ఒకమాదిరి ఉత్సాహమూ, నఖక్షతాలను ఓర్చకపోవడమూ, పొంది,

తరువాత క్రమంగా వేగాన్ని పెంపుచేసి గాఢమైన రతినిపొం దుతూ, ఎక్కువ ఉత్సాహంతో శరీరాన్ని మరుస్తారు.

౭౯. ధాతుక్షయాచ్చ విరామా భీప్సేతి. ౨.౧.౩౯

అయితే తెంపులేకుండా భావప్రాప్తి కలుగుతుంది అంటున్నారు గదా! మళ్లీ విరమించాలనేకోరిక ఎందుకు కలగాలి? అంటారా! వినండి. సంగమిద్దామనేభావం (కామితం) ఉదయించినవెంటనే శుక్లధాతువు తన స్థానంనుంచిజారి తాను స్రవించే నాడుల ద్వారా బయలుదేరి రతి ప్రారంభం అయిన క్షణంనుంచీ కొద్దికొద్దిగా స్రవిస్తూ, పూర్తిగా ధాతువు క్షీణించినప్పుడు విరమిద్దామనేబుద్ధి పుడుతుంది.

౭౯౬. తస్మాదనాపేక్ష ఇతి. ౨.౧.౪౦

అందువల్ల పైనచెప్పిన బాభ్రవ్యులమతంలో ఆక్షేపణఏమీలేదు

౭౯౭. సురతాంతే సుఖం పుంసాం, స్త్రీణాంతు సతతం సుఖం, ధాతుక్షయనిమిత్తాచ విరామేచ్ఛోప జాయతే. ౨.౧.౪౧

పై సిద్ధాంతాన్నే బాభ్రవ్యులు వ్రాసిన శ్లోకాన్నిచూపి స్పష్టం చేస్తున్నారు వాత్స్యాయనులు. పురుషులకు రతిపూర్తి అమే కాలంలో (స్ఖలనకాలంలో) మాత్రమే సుఖంలభిస్తుంది. స్త్రీలకుమాత్రం రతిప్రారంభించిన క్షణంనుంచీ రతిపూర్తి అమే దాకా తెంపులేనిసుఖం కలుగుతుంది. ఎప్పుడు ధాతువు పూర్తిగా క్షయం అవుతుందో అప్పుడు స్త్రీకి రతినుంచి విర మిద్దామనేకోరిక పుడుతుంది.' ఇంతవరకూ బాభ్రవ్యునిమతం.

౨౯౮. తస్మాత్పురుషవ దేవయోషితోఽపి రసవ్యక్తిర్ద్రష్టవ్యా. ౨.౧.౪౨

ఈవిధంగా ఔద్దాలకి మతాన్నీ, బాభ్రవ్యుని మతాన్నీ చెప్పి ఇక వాత్స్యాయనులు తమసిద్ధాంతాన్ని స్పష్టంచేస్తున్నారు. పై వివాదాలు ఈ రీతిగా ఉన్నాయి గనుక పురుషునకువలెనే స్త్రీకిగూడా స్ఖలనసుఖం ఉన్నది.

౨౯౯. కథంవా సమానాయా మేవాకృతావేకార్థ మభిప్రపన్నయోః కార్యవైలక్షణ్యం? ౨.౧.౪౩

అయితే స్త్రీ పురుషుల ఆకారంలో భేదం లేకపోయినా, భోజనాది విషయాలలోవలెకాక, ఒక్క రతివిషయంలో మాత్రమే కలిగి ప్రవర్తిస్తున్నప్పుడు ఫలితంలో తేడా ఎందుకుకలుగుతుంది?

౩౦౦. స్యాదుభయవైలక్షణ్యాదభిమానవైలక్షణ్యాచ్చ. ౨.౧.౪౩

తేడా ఎందువల్లనంటారా? వినండి. ఉపాయంలోనూ, అభిమానంలోనూగూడా తేడాఉంది గనుక ఫలితంలోగూడా తేడా కలుగుతుంది.

౩౦౧-౩౦౨. కథం? ఉపాయవైలక్షణ్యంతు సర్గాత్కర్తాహి పురుషః, అధికరణం యువతిః. ౨.౧.౪౫.౪౬

అదెలా కుదురుతుంది? స్త్రీ పురుషులకు ఉపాయభేదాన్ని ఎంతగా నిరూపించినా ఆభేదం స్త్రీ పురుషులు కలిసిచేసే వ్యాపారానికి వ్యతిరేకంమాత్రం కాదు. స్త్రీ పురుషులకు ఉపాయ భేదం సృష్టికి ఆదినుంచీ వస్తోంది. పురుషుడు కర్తగానూ, స్త్రీ ఆధారంగానూ, సృష్టింపబడుతున్నారు.

303. అన్యథాహి కర్తాక్రియాం ప్రతిపద్యతే. ౨.౧.౪౭

ఇలా అనకపోతే మరో బాధకూడా ఉన్నది. ఏమంటే కర్త ఎప్పుడూ క్రియనే పొందుతుంది. ఆధారంమాత్రం కర్త చేసే క్రియను పొందుతుంది. అంటే ఒకరిసాధనం పొడుగుగానూ, మరిఒకరిది లోతుగానూ, ఉంటుంది. అనగా ఒకటి ఇముడ్చుకో తగినదిగానూ, మరిఒకటి ఇముడ్చుకునేదిగానూ, ఉంటాయి, అందువల్ల క్రియలోగూడా భేదం ఒప్పుకోవలసివస్తుంది.

304. తస్మాచ్చోపాయ వైలక్షణ్యాత్, సర్గాదభిమానవై లక్షణ్యమపిభవతి. ౨.౧.౪౮

కాబట్టి ఉపాయభేదంవల్ల మీరుచెప్పిన అభిమానభేదమే కాకుండా, కార్యభేదంకూడా ప్రాప్తిస్తున్నది.

305. అభియుక్తాహమితిపురుషోఽనురజ్యతే. అభియుక్తాహమనేనేతియువతిరితి వాత్స్యాయనః. ౨.౧.౪౯

పురుషుడు నేను ఈమెతో రమిస్తున్నాను అని అభిమానిస్తూ సంతోషాన్ని పొందుతున్నాడు, సుఖిస్తున్నాడు, ఆడది నేను ఈతనిచేత రమింపబడుతున్నాను, అని అభిమానాన్ని పొందుతూ సంతోషిస్తున్నది, సుఖిస్తున్నది. కాబట్టి అభిమానంతోనూ, అనురాగంతోనూ, సంయోగవిషయంలో మగువైనా స్త్రీ పురుషులు, కాలాన్నిపట్టీ, స్వరూపాన్నిపట్టీ సమానమైన భావాన్ని పొందుతున్నారేకాని, క్రియా భేదమాత్రంచేత సుఖభేదాన్ని పొందుటలేదు. అందువల్ల స్త్రీ పురుషుల అభిమానాలలో మాత్రమే భేదం ఉంటోంది. కార్యంమాత్రం భేదించడంలేదనే

అభిప్రాయంతోనే శాస్త్రకారులైన వాత్స్యాయనులు తమ పేరుతోగూడా తమ అభిప్రాయాన్ని వ్యక్తపరిచారు. ఇక్కడ కార్యంఅంటే సుఖం.

౩౦౯. తత్రైతత్స్యాదుపాయవైలక్షణ్యా దేవహికార్యవైల
క్షణ్య మపికస్మాన్నస్యాదితి. ౨.౧.౪౦

ఇక్కడ ఒక సందేహంఉన్నది. ఏమంటే స్త్రీ పురుషులరతికి సంబంధించిన వ్యాపారాలలో భేదం ఉన్నప్పుడు, అలాగే సుఖవిషయంలోకూడా భేదం యెందుకుఉండదు? అంటే.

౩౧౦. తచ్చన. ౨.౧.౪౧

రతి వ్యాపారంవల్లనే ఈ సుఖం పుట్టినదన్నప్పుడు ఇక సుఖంలో భేదమేఉండదు. కాబట్టి, ఒకరు రతిచేశేవారూ, ఒకరు రతి చేయబడేవారూ గనుక స్త్రీ పురుషుల రతివ్యాపారాలలోనే తేడా ఉన్నది.

౩౧౧. హేతు మదుపాయవైలక్షణ్యం. ౨.౧.౪౨

స్త్రీ పురుషుల రతివ్యాపారంలో ఉన్నతేడా సహేతుకంగా ఉన్నది. కాబట్టి వ్యాపారంలోనే భేదంగాని సుఖంలో భేదం లేదు.

౩౧౨. తత్రకర్త్రాధారయోర్భిన్న లక్షణత్వాత్. ౨.౧.౪౩

ఆ ఉపాయభేదం రావడానికి, కర్తా, ఆధారమూ వేరువేరు లక్షణాలుకలిగి ఉండటమే కారణం.

౩౧౧. అహేతువృత్త్వాత్కార్యవైలక్షణ్యమివాభ్యం స్యాత్.
౨.౧.౪౪

సుఖం స్త్రీ పురుషుల రతివ్యాపారంవల్ల పుట్టినదని చెప్పినా కారణం ఉన్నదికాబట్టి ఆ వ్యాపారాలలో భేదంఉన్నదని చెప్పారు. కారణంలేకుండా స్త్రీ పురుషుల సుఖాలలో తేడా ఉన్నదని చెప్పడం తెలివితక్కువ మాట.

౩౧౨. ఆకృతేరభేదాత్ ఇతి. ౨.౧.౪౫

పూర్వం చెప్పిన తమయుక్తినే జ్ఞాపకం చేస్తున్నారు వాత్స్యాయనులు. సమానమైన లక్షణాలుగలిగిఉన్న మనుష్యజాతిలోని స్త్రీ పురుషుల ఒండొరుల అపేక్షతో కూడిఉన్న వ్యాపారాలు కాలంచేతనూ, స్వరూపంచేతనూ, సమానమైన సుఖాన్నే పుట్టిస్తున్నాయి.

౩౧౩. తత్రైతత్స్యాత్, సంహత్య కారకైరేకోఽర్థోభి నిర్వర్త్యతే. పృథక్ పృథక్ స్వార్థసాధకే పునరిమే, తదయుక్తమితి. ౨.౧.౪౬

ఇంకా ఇలా చెప్పవచ్చు. దేవదత్తుడు కట్టెలతో పాత్రయందు అన్నమును వండుతున్నాడు. ఈ వాక్యంలో దేవదత్తుడు కర్త. కట్టెలు కరణాలు (సాధనాలు) పాత్ర ఆధారం. ఈ పైనచెప్పిన కర్త,కరణం, ఆధారంఅనే కారకాలుకలిసి అన్నమును తయారు చెయ్యడం అనే కార్యాన్ని సాధించడం మనకు తెలిసిందే. ఇలాగే తమ సుఖం అనేపనిని నెరవేర్చుకునే స్త్రీ పురుషులలో ఆడది ఆధారంగాఉండి పురుషునియొక్క రతిచెయ్యడం అనే వ్యాపారాన్ని అపేక్షించి ఆ వ్యాపారంవల్ల లభించిన సంతానం

ద్వారా, సుఖంఅనే స్వార్థాన్ని సాధిస్తున్నది. పురుషుడుగూడా తాను కర్తగాఉండి స్త్రీయొక్క రతిపొందడం అనే వ్యాపారాన్ని అపేక్షించి దానివల్ల లభించిన సంతానంద్వారా సుఖం అనే స్వార్థాన్ని సాధిస్తున్నాడు. కాబట్టి కారకాలు కొన్ని కలిసి ఒక ఏరకమైన పనిని సాధిస్తాయిగాని వేరువేరు కార్యాలను ఎన్నడూ సాధించవు. ఎలా స్త్రీ పురుషులనే కారకాలు స్త్రీ సుఖం, పురుషసుఖం అనే వేరువేరు కార్యాలను సాధిస్తున్నారో, అలాగే సమానాకారం కలిగిఉన్నా, కాలంచేతా స్వరూపంచేతా, భేదాన్ని పొందని ఆ కార్యరూపమైన సుఖాన్ని పొందుతున్నారు.

౩౧౩. తచ్చున. ౨.౧.౫౭

ఇది అయుక్తంకాదు, యుక్తమే.

౩౧౪. యుగపద నేకార్థసిద్ధి రపిదృశ్యతే, యథా మేషయో రభిఘాతేకపిత్థయోర్భేదే మల్లయో ర్యుద్ధ ఇవ. ౨.౧.౫౮

ఒక్కమాటుగా చాలాకార్యాలు సిద్ధించడంగూడా చూస్తున్నాం. ఎలాగంటే, పొట్టేళ్లుడీకొన్నప్పుడు ఒక్కమాటుగానే రెండింటికీ దెబ్బతగలడమనే రెండుకార్యాలు సిద్ధిస్తున్నాయి. ఇలాగే వెలగకాయలను ఒకదానితో ఒకటిని కొట్టినప్పుడున్నా, ఒక్కమాటుగా పగులుట అనేరెండు కార్యాలు జనిస్తున్నాయి. ఇల్లాగే మల్లయుద్ధంలోగూడా ఇద్దరు మల్లులూ తలపడ్డప్పుడు ఇద్దరికీ ఒక్కమాటుగా దెబ్బతగలడమనే రెండు కార్యాలు సిద్ధిస్తున్నాయి. అలాగే కారకాలైన స్త్రీ పురుషు

లకు సమానస్వరూపంగల సుఖం ప్రత్యేక ప్రత్యేకంగా కలగడంలో ఆశ్చర్యంలేదు. ఇక్కడ పొట్టేళ్లనూ, వెలగకాయలనూ మల్లులనూ ఉదాహరణగా గ్రహించడం, పశువులలోనూ, అచేతనాలలోనూ, మనుష్యులలోనూ, కూడా ఈ న్యాయం ప్రాప్తిస్తుందని వ్యక్తపరచడానికన్నమాట.

౩౧౫. నతత్రకారకభేద ఇతిచేత్. ౨.౧.౫౯

పొట్టేళ్లూ మొదలైన ఉదాహరణలలో రెండూకర్తలే గనుక కారకభేదం లేదంటారా?

౩౧౬. ఇహాపి నవస్తుభేదః. ౨.౧.౬౦

అయితే స్త్రీపురుషులలోకూడా యథార్థంగా కారకభేదం లేనేలేదు. స్త్రీపురుషులనే ఇద్దరు కర్తలుకలిసి ఒక కార్యాన్ని సాధిస్తున్నారు. ఇక ఒకరు కరణమూ, ఒకరు అధికరణమూ అనేభేదం కేవలంగా వ్యవహారంకోసం బుద్ధిచేత కల్పింపబడినది.

౩౧౭. ఉపాయవైలక్షణ్యాంతు సర్గాదితి తదభిహితం పురస్తాత్. ౨.౧.౬౧

ఇలా పూర్వం "స్త్రీపురుషులకు ఉపాయభేదం సృష్టిలోనే ఉన్నదన్నదాన్ని బాగా స్పష్టం చేశారన్నమాట. ఇక కర్త, ఆధారమూ, అనేలక్షణాలు కలవాటికే అలా ఉంటుందని మున్ముందు నిరూపిస్తున్నారు.

౩౧౮. తేనోభయోరపి సదృశీ ప్రతిపత్తిః. ౨.౧.౬౨

ఇలా ఒకరిని కర్తకుగానూ, ఒకరిని ఆధారంగానూ కల్పించడంవల్లే స్త్రీపురుషుల కిద్దరికీ కాలస్వరూపాలచేత సమానమైన

సుఖం కలుగుతోంది. ఇలా కాకపోతే స్త్రీపురుషుల అనురాగ జ్వరం ఎలా శాంతిస్తోంది? ఆ గొప్ప ఆనందావస్థను కల్పిస్తోంది కనుకనే భగలింగాలను ఆనందేంద్రియాలని గానం చేస్తున్నారు విజ్ఞులు.

౩౧౯. జాతే రభేదాద్దంపత్యోః సదృశం సుఖమిష్యతే,
తస్మాత్తదోపచర్యా స్త్రీ యథాగ్రే ప్రాప్నుయా ద్రతిం.
౨.౧.౬౩

ఈ పైన చెప్పిన విషయాన్నే సూత్రకారులు శ్లోకంలో సారాంశంగా చెవుతున్నారు. రతి సుఖమనే ఒక్కటే విషయాన్ని కోరుతున్న స్త్రీపురుషు లిద్దరికీగూడా జాతిభేదంలేదు కాబట్టి సుఖము సమానంగానే కలుగుతోంది. అందువల్ల స్త్రీ ఎలా చేస్తే ముందుగా రతిని పొందుతుందో అలా ఉపచరించాలి. అంటే స్త్రీ పురుషులలో స్త్రీ జాతిభేదాన్ని పట్టి ఆమెకు కలిగే దురద తీరడమనే సుఖమూ, భగం స్రవించడంవల్ల కలిగే సుఖమూ స్త్రీకి ముందుగా కలిగేట్లు పురుషుడు రతి చెయ్యాలన్నమాట, స్ఖలనసుఖంమాత్రం పురుషునిలాగా రతి యొక్క అంత్యకాలంలోనే పొందుతుంది. దీనికే పెద్దలిలా చెవుతారు. "దురద ఒదలడంవల్లా, తెంపులేకుండా స్రవించడం వల్లా, స్త్రీలకు సుఖం రెండు విధాలు. ఇక స్ఖలనంలోగూడా కేవలం చెమ్మగిలడంవల్ల క్లిన్నత్వమనే సుఖమున్నూ, మధించడంవల్ల విసృష్టిఅనే సుఖమున్నూ, కలుగుతాయి. పై రెండు రకాల స్ఖలన సుఖాలుగూడా మధ్యరతిలో ప్రాప్తిస్తాయి స్త్రీలకు. ఇక రతి పూర్తికాబోయే సమయంలో పురుషుని

లాగానే స్త్రీకిగూడా స్ఖలనం జరుగుతుంది." స్త్రీ పురుషులకిద్దరికీ రతి చివరకాలంలో ఒక్కమాటుగా స్ఖలనం అయితే ఆ రతిని ఉత్తమం అంటారు. అలా కాకుండా పురుషునికి ముందుగా జరిగితే మేహనం వాలిపోతుంది. తరువాత స్త్రీ భావాన్ని పొందలేదు. అందువల్ల విషమ రతులలో స్త్రీని, ముద్దులూ, ఆలింగనాలూ, మొదలైనవాటిచేత, ఉపచరించి ముందుగా ఆమెకు భావప్రాప్తి కలిగేలాగా చూడాలి పురుషుడు. స్త్రీ ముందుగా భావప్రాప్తినిపొందితే వెంటనే పురుషుడు వేగాన్ని అనుసరించాలి. అప్పుడు తాను భావప్రాప్తిని పొందవచ్చు.

> ౩౨౦. సదృశత్వస్య సిద్ధత్వాత్, కాలయోగిన్యపిభావతోఽపి కాలతిః ప్రమాణవ దేవ నవరతాని.
>
> —౨.౧.౬౮

సారాంశం ఏమంటే స్త్రీ పురుషులకు కాలాన్నిపట్టీ, భావాన్ని పట్టీ కూడా సామ్యం తేలిందిగనుక, కాలసంబంధం కల రతాలూ కూడా తొమ్మిది రకాలని సిద్ధాంతం అయినది.

> ౩౨౧. రసో, రతిః, ప్రీతి, ర్భావో, రాగో, వేగః సమాప్తి రితిరతి పర్యాయాః, సంప్రయోగో రతంరంహః, శయనం మేహనం ఇతి సురత పర్యాయాః.
>
> —౨.౧.౬౯

రసమూ, రతీ, ప్రీతీ, భావమూ, రాగమూ, వేగమూ, సమాప్తీ, అనే ఈ పదాల కన్నిటికీ రతి అని అర్థం. 'ఇది భావానికి సంబంధించినది. అనురాగం అన్నమాట. ఇక సంప్రయోగం అన్నా, రహస్సు అన్నా, శయనం అన్నా, మేహనం

అన్నా, ఇవన్నీ సురతక్రియకు పర్యాయపదాలు. అంటే ఈ శాస్త్రంలో ఆయా అర్థాలలో ఆయా పదాలను వాడతారన్నమాట.

3_22. ప్రమాణకాల భావజానాం సంప్రయోగాణాం ఏకైకస్య నవవిధత్వాత్తేషాం వ్యతికరేసురత సంఖ్యా నశక్యతే కర్తుమతిబహుత్వాత్. 2.1.66

స్త్రీ పురుషుల అంగపరిమాణాలనుపట్టీ, స్ఖలనకాలాన్నిపట్టీ, జరిగే సంప్రయోగాలలో ఒక్కొక్క రకానికి తొమ్మిదిరతాలు ఏర్పడితే మొత్తం ఇరువదిఏడు రతాలు. ఆ రతాలుగూడా రెండు రకాలు. 1. శుద్ధం, 2. సంకీర్ణం. శుద్ధరతాన్ని చెప్పడం అసంభవం కాబట్టి సంకీర్ణ రతాలనుమాత్రమే శాస్త్రకారులు చెవుతున్నారు. పైన చెప్పిన ఇరవైయేడు సురతాలకూ వ్యతికరం కలిగినప్పుడు సురతసంఖ్యను చెప్పడం విస్తారం కావడం వల్ల చాలా కష్టం.

3_23. తేషుతర్కా ద్యుపచారాన్ ప్రయోజ యేదితి వాత్స్యాయనః 2.1.67

ఇలా అనేక విధాలుగా విభేదాన్ని పొందిన సంకీర్ణరతాలలో ఉపచారాలను ఊహను పట్టి ప్రయోగించాలని వాత్స్యాయనులన్నారు.

3_24. ప్రథమరతే చండవేగతా, శీఘ్రకాలతా, చ పురుషస్య తద్విపరీత ముత్తరేషు, యోషితః పునరేతదేవ విపరీత మదాతుక్షయాత్. 2.1.68

సాధారణంగా మొదటి రతిలో పురుషునికి ఎక్కువ ఉత్సాహ

మున్నూ, త్వరలో స్ఖలనమున్నూ జరుగుతూఉంటాయి. ఇక రెండవ రతిలో ఉత్సాహం తక్కువా, ఆలస్యంగా స్ఖలనం కావడమూ, జరుగుతాయి. స్త్రీలకు మాత్రం మొదటి రతిలో ఉత్సాహం తక్కువా, ఆలస్యంగా భావప్రాప్తి కలగడం ఉంటాయి. రెండో రతంలో ఉత్సాహం ఎక్కువా తొందరగా స్ఖలనమూ ఉంటాయి. ఇలా ధాతువు (వీర్యము) క్షీణించే వరకూ స్త్రీ పురుషుల ఉత్సాహ నిరుత్సాహాలూ, శీఘ్ర స్ఖలన చిరస్ఖలనాలూ చూసుకోవాలి.

3_౨౫. ప్రాక్చస్త్రీ ధాతుక్షయాత్పురుష ధాతుక్షయ ఇతి ప్రాయోవాదః. —౨.౧.౬౯

స్త్రీకంటె ముందుగా పురుషునికి ధాతువు క్షయం (స్ఖలనం) అవుతుందనేమాట అంత సరిఅయినది కాదు. అంటే యుక్తి యుక్తం కాదన్నమాట.

3_౨౬. మృదుత్వాదుప మృదుత్వాన్ని సర్గాచ్చైవ యోషితః, ప్రాప్నువంత్యాశుతాఃప్రీతి, మిత్యాచార్య వ్యవస్థితాః. —౨.౧.౭౦

నాయికలు శీఘ్రవేగ, మధ్యవేగ, చివరవేగ అని పూర్వం చెప్పారు. ఆ నాయికలెవరో చెవుతున్నారు. స్త్రీలు మృదు స్వభావం కలవారుకనుకనున్నూ, చుంబనాదులచేత ఉపమృగ్య మానలు కావడంవల్లనున్నూ, స్వభావంవల్లాగూడా తొందరగా రతిని (ప్రీతిని) పొందుతున్నారు. అని శాస్త్రకారులు చెప్పిఉన్నారు.

3_౨౭. ఏతావదీవయుక్తానాం, వ్యాఖ్యాతం సాంప్ర యోగికం, మందానామవబోధార్థం, విస్తరోతః ప్రవక్ష్యతే, ఇతి ప్రమాణ, కాల, భావేభ్యోరతా వస్థాపనం నామషష్ఠం ప్రకరణం. ౨.౧.౭౧

బుద్ధిమంతులకోసం ఈవిధంగా రతీవస్థాపనంతో మాత్రమే సాంప్రయోగికాన్ని సంక్షేపంగా చెప్పినాము. ఇంక, మంద బుద్ధులకు సులువుగా తెలియడంకోసం విస్తరించి చెప్ప బోతున్నాం. ఇది ప్రమాణ, కాల, భావములనుపట్టి రతిని స్థాపించడం అనే ఆరో ప్రకరణం.

3_౨౮. అభ్యాసా దభిమానాశ్చ, తథా సంప్రత్యయాదపి, విషయేభ్యశ్చతంత్రజ్ఞాః ప్రీతిమాహుశ్చతుర్విధాం. ౨.౧.౭౨

ఈ కామతంత్రజ్ఞులు ప్రీతిని నాలుగువిధాలుగా చెతువున్నారు. ప్రీతి అభ్యాసంవల్లా, అభిమానంవల్లా, సంప్రత్యయంవల్లా, విషయాలవల్లా, లభిస్తుంది.

3_౨౯. శబ్దాదిభ్యో బహిర్భూతా, యా కర్మాభ్యాస లక్షణా, ప్రీతిస్సాభ్యాసకీజ్ఞేయా, మృగయాదిషు కర్మసు. ౨.౧.౭౩

అభ్యాసంవల్ల పుట్టిన ప్రీతి ఇలా ఉంటుంది. వేట మొదలైన వ పనులు చేస్తున్నప్పుడు సంగీతమూ మొదలైన శబ్దాలవల్ల బహిర్గతమైన, కర్మాభ్యాసం లక్షణంగా కలిగిఉన్న ప్రీతిని అభ్యాసకీ ప్రీతి అంటారు.

౩౩౦. అనభ్యస్తేష్వపిపురా, కర్మస్వవిషయాత్మికా, సం
కల్పాజ్జాయతేప్రీతి ర్యాసాస్యాదాభిమానికీ.
౨.౧.౭౮

పూర్వం అభ్యసించకపోయినా, అభ్యసించినా, మనస్సులోని సంకల్పంవల్ల విషయాత్మికమైన ప్రీతియే కర్మయందైనాప్పుడతే దాన్ని అభిమానికప్రీతి అంటారు.

౩౩౧. ప్రకృతేర్యా తృతీయాస్యాగ స్త్రియాశ్చైవోప
రిష్టకే, తేషు తేషు చవిజ్ఞేయా, చుంబనాదిషు
కర్మసు. ౨.౧.౭౯

ఆ అభిమానికప్రీతి ఈ శాస్త్రంలో యెలా సంభవిస్తుందో చెవుతున్నారు. నపుంసకునికీ, ముఖచాపల్యంగల స్త్రీకీ, ఔప రిష్టిక రతిమీాదా, ఇంకా చుంబనమూా, ఆలింగనమూా, మొద లైన కర్మలవల్లా కలిగే ప్రీతిని అభిమానిక ప్రీతి అంటారు.

౩౩౨. నాన్యోయమితియత్రస్యా, ధన్యస్మిన్ ప్రీతికారణే,
తంత్రజ్ఞైః కధ్యతేసాపి ప్రీతిస్సంప్రత్యయాత్మికా.
౨.౧.౮౦

స్త్రీగానీ, పురుషుడుగానీ, ఏ పురుషునితోగానీ, ఏ స్త్రీతోగానీ, రమిస్తూా, తమ చిత్తం నిలిచిన పురుషునిగానీ, స్త్రీనిగానీ, భావిస్తూా, అతడే ఇతడనిగానీ, ఆమెయే ఈమె అనిగానీ, ఆరో పించుకుని ప్రీతిని పొందుటను సంప్రత్యయం అంటారు.

౩౩౩. ప్రత్యక్షాలోకతస్సిద్ధా, యా ప్రీతిర్విషయాత్మికా,
ప్రధాన ఫల వత్వాత్సా, తదర్థాశ్చేతరాఅపి.

ప్రత్యక్షంగా లోకంవల్ల లభించే శబ్దాది విషయస్వరూపమైన

ప్రీతి ప్రధానఫలం కలది కనుక దీన్ని విషయప్రీతి అన్నారు. ఇంకా ఇతర ప్రీతిజ లం అంతా దీనికి అంగప్రాయం.

33౪. ప్రీతిరేతాః పరామృశ్య శాస్త్రతశ్శాస్త్రలక్షణాః
యో యథా వర్తతేభావ, స్తంతథైవ ప్రయోజ
యేత్. ౨.౧.౭౮

ఇతి శ్రీ వాత్స్యాయనీయే, కామసూత్రే, సాంప్ర
యోగికే, ద్వితీయేఽధికరణే, ప్రమాణ భావకా
లేభ్యో, రతావస్థాపనం, ప్రీతి విశేషా ఇతి ప్రథ
మోధ్యాయః.

శాస్త్రాన్ననుసరించి ఈ ప్రీతి విశేషాల్ని పరామర్శించి ఎవరి భావం ఏ ప్రీతికి అపేక్షపడితే ఆభావాన్ననుసరించాలని చెప్తున్నారు శాస్త్రకారులు.

ఈ క్రమంగా భారద్వాజ గోత్రుడున్నూ, యజుశ్శాఖీయు
డున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ, అయిన మేడిచెర్ల
ఆంజనేయమూర్తిచేత వాత్స్యాయన కామసూత్ర
ములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయ-
బడిన 'రతి రేఖ' అను తెలుగు వ్యాఖ్యలోని
సాంప్రయోగికాధికరణంలో ప్రమాణ
కాల భావాలవల్ల రతావస్థాపనం
చెయ్యడం అనే మొదటి
అధ్యాయం
ముగిసినది.

---

శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెనుగు వ్యాఖ్యాన సమేతం

### ౨. సాంప్రయోగికాధికరణం

### ౧. ఆలింగన విచారాధ్యాయం.

33౭. సంప్రయోగాంగం చతుష్షష్టి రిత్యా చక్షతే చతుః షష్టి ప్రకరణత్వాత్. ౨.౧.౧

పైవిధంగా రతి స్థాపనం అయినతరువాత దానికి అంగభూతమైన సంప్రయోగాన్ని చెప్పబోతూ, దానికి అంగభూతమైన మరొక చతుష్షష్టిని చెవుతున్నారు. సంప్రయోగంఅంటే సంయోగం. అది అరవైనాలుగు ప్రకరణాలతో ఒప్పుతూ ఉంటుంది. కనుక దాన్ని చతుష్షష్టి అన్నారు. ఆ చతుష్షష్టికి అంగభూతమైనదిగూడా చతుష్షష్టి అనే ప్రాచీనాచార్యులు అంటారు. అందువల్ల ఆ చతుష్షష్టినే ఇక్కడ చెవుతున్నారు.

33౮. శాస్త్రమే వేదం చతుష్షష్టి రిత్యాచార్యవాదః.

౨.౨.౨

అసలు సంప్రయోగానికి అంగభూతమైన తంత్రావాపకునే

పేరుగల ఉపాయశాస్త్రమే అరవైనాలుగు అనే సంఖ్యకలది కాబట్టి దీన్ని చతుష్షష్టి అన్నారని మన వాత్స్యాయనుల వాదం.

> ౩౩౭. కళానాం చతుష్షష్టిత్వా త్తాసాంచ సంప్రయోగాంగ భూతత్వా త్కళాసముద్దేశో వా చతుష్షష్టిరితి. ౧.౧.౩

ఇంకా అసలుకళలు చతుష్షష్టికాబట్టినీన్నీ, ఆ కళల యొక్క సమూహమే సంప్రయోగానికి అంగం కనుకనున్నూ ఆ కళలను సంగ్రహించి చెప్పిన స్వరూపమే చతుష్షష్టి అని చెప్పినా చెప్పవచ్చు.

> ౩౩౮. ఋచాం దశతయీనాంచ సంజ్ఞితత్వా దిహాఽపి తదర్థసంబంధాత్ పాంచాలసంబంధాచ్చ బభ్రవ్యైరేషా పూజార్థం సంజ్ఞా ప్రవర్తితే త్యేకే. ౧.౧.౪

ఆలింగనమూ, చుంబనమూ, దంతక్షతమూ, నఖక్షతమూ, సీత్కారమూ, పాణిఘాత, సందశనమూ, ఉపసృతమూ, ఉపసృప్తమూ,వరాయితమూ అనే పది అంగాలతోనూ చెప్పబడిన ఋగ్వేదంలోని ఋక్కులకు చతుష్షష్టిఅని సంజ్ఞ ఉన్నది. ఇక్కడకూడా ఆ విషయంతో సంబంధం ఉన్నది గనుకనున్నూ, ఋగ్వేదంలో పంచాలుడనే మహర్షి అనేక ఋక్కులతో ఈ చతుష్షష్టిని చెప్పడంవల్లనూ, పాంచాల దేశీయుడైన బాభ్రవ్యుడు తన సాంప్రయోగ గ్రంథంలో ఆ చతుష్షష్టిని చెప్పడంచేతనూ, ఆ పంచాలఋషికీ, ఈ బాభ్రవ్యునికీ

గోత్రసంబంధం ఉన్నది గనుకనున్నూ, గౌరవంకోసంగాను ఈ సంజ్ఞ ఏర్పడినదని కొందరంటున్నారు.

౩౩౯. ఆలింగన, చుంబన, నఖచ్ఛేద్య, దశనచ్ఛేద్య సంవే శన, సీత్కృత, పురుషాయి, తౌపరిష్టకానామ ష్టానా మష్టధా వికల్పభేదా దష్టావష్టకాశ్చతుష్షష్టి రితి భాభ్రవీయాః. ౨.౨.౫

బాభ్రవ్యుని శిష్యులు ఈ చతుష్షష్టి అనేపేరును మరి ఒకతీరుగా సమర్థిస్తున్నారు. ఆలింగనమూ, చుంబనమూ, నఖచ్ఛేద్యమూ, దశనచ్ఛేద్యమూ, సంవేశనమూ, సీత్కృతమూ, పురుషాయితమూ, ఔపరిష్టమూ, అనే ఈ ఎనిమిదన్నీ ఒక్కొక్కటి ఎనిమిది విధాలుగా భేదం పొందటంవల్ల ఎనిమిది ఎనుముదులు అరవైనాలుగు గనుక వీటికి చతుష్షష్టి అని పేరు వచ్చినది అన్నారు.

౩౪౦. వికల్పవర్గాణాం అష్టానాం న్యూనాధికత్వ దర్శనాత్ ప్రహణన, విరుత, పురుషోపసృప్త, చిత్రరతాదీ నామన్యేషామపి వర్గాణాం ఇహ ప్రవేశనాత్ ప్రాయోవాదోఽయం, యథా సప్తపర్ణో వృక్షః, పంచవర్ణో బలిరితి వాత్స్యాయనః. ౨.౨.౬

ఆలింగనమూ మొదలైన ఎనిమిదింటిలోనూ, ఒక్కొక్కటి బాభ్రవీయులు చెప్పినట్లు నియతంగా ఎనిమిదివిధాలు కావుటలేదు. పురుషాయితంలో భేదాలు తక్కువ, ఆలింగనాదులకు భేదాలు ఎక్కువ. ఈ ఎక్కువ తక్కువ భేదాలు కనిపించడంచేతనూ, ప్రహణనమూ, విరుతమూ, పురుషోప

స్పృష్టమూ, చిత్రరతమూ మొదలైన ఇతర వర్ణాలుగూడా వీటిలో చేరతాయిగనుకనూ, ఈ చతుష్షష్టి అనే పేరు, ఏడాకుల చెట్టూ, అయిదు వర్ణాలతో బలికర్మ, అన్నట్లు సామాన్యంగా వచ్చినదేకాని అర్థవంతమైనది కాదు అని వాత్స్యాయను లన్నారు.

౩౮౧. తత్రాసమాగతయోః ప్రీతిలింగ ద్యోతనార్థం ఆలింగన చతుష్టయం, స్పృష్టకం, విద్ధకం, ఉద్ఘృష్టకం, పీడితకమితి. ౨.౨.౭

ఇక పాంచాలికీ చతుష్షష్టి కళలను చెపుతున్నారు. చుంబనంకంటె ఆలింగనం ముందు చెయ్యవలసినదిగనుక ఆ ఆలింగనవిచారం చేస్తున్నారు. అంతకుపూర్వం ఆలింగన సుఖాన్ని పొందకుండా కౌగిలించుకోవాలనే కుతూహలంతో ఉన్న స్త్రీ పురుషులు పరస్పరమూ తమతమ ప్రేమను సూచించుకోడానికి ఉపయోగించే కౌగిలింతలు. 1. స్పృష్టకము. 2. విద్ధకము. 3. ఉద్ఘృష్టము. 4. పీడితకము. అని నాలుగురకాలు.

౩౮౨. సర్వత్ర సంజ్ఞార్థే నైవ కర్మాతిదేశః. ౨.౨.౮

ఈ శాస్త్రంలో అన్నిచోట్లా అర్థాన్ని అనుసరించే పేర్లు నిర్ణయించారు. అంటే వాటిపేర్లే ఆయా పనులను సూచిస్తాయన్నమాట.

౩౮౩. సంముఖాగతాయాం ప్రయోజ్యాయాం అన్యాపదేశేన గచ్ఛతో గాత్రేణ గాత్రస్య స్పర్శనం స్పృష్టకం. ౨.౨.౯

నాయిక తనకు ఎదురుగావచ్చునప్పుడు, ఏదోపనిమీద పోతున్నట్లు ఆమె ప్రక్కనుంచిపోతూ ఆమె శరీరానికి తనశరీరం రాచుకునేట్లుగా తాకడాన్ని స్పృష్టకం అంటారు. దీనివల్ల ఒళ్లంతా ఇద్దరికీ గల్తరిస్తుంది. ప్రేమ వృద్ధి అవుతుంది.

౩౮౪. ప్రయోజ్యం నాయికా స్థిత ముపవిష్టం వా విజనే
కించిద్గృహ్ణాతి పయోధరేణ విధ్యేన్నాయికోపి తా
మవపీడ్య గృహ్ణీయాదితి విద్ధకం. ౨.౦.౧౦

నాయిక, విజనస్థలంలో నాయకుడు నిలుచుని ఉన్నప్పుడుగానీ, కూరుచున్నప్పుడుగానీ, అతనిదగ్గర ఏదో వస్తువును అందుకునేదానిలాగా సమీపించి అతన్ని చంటితో కుమ్మాలి. నాయకుడుగూడా ఆనాయికను గట్టిగా నొక్కాలి. దీన్ని విద్ధకం అంటారు.

౩౮౫. తదుభయ మనతిప్రవృత్త సంభాషణయోః.
౨.౨.౧౧

పైనచెప్పిన రెండురకాలైన ఆలింగనమున్నూ, అంతకు పూర్వం మాటలు బాగాకలవని క్రొత్త దంపతులు ఉపయోగించుకునేది. వీటిలో మొదటిది నాయకుడు ప్రయోగించవలసినది. రెండవది నాయిక ఉపయోగించవలసినది. మాటలు బాగాకలిసిన నాయికా నాయకుల కివి కుదరవు.

౩౮౬. తమసి జనసంబాధే విజనే వాథ శనకైర్గచ్ఛతో
ర్నాతి హ్రస్వకాల ముద్ఘర్షణం, పరస్పరస్య
గాత్రాణా ముద్ఘృష్టకం. ౨.౨.౧౨

జనసమ్మర్దం ఎక్కువగాఉన్నా, జనశూన్యంగా ఉన్నా, చీకటిలో ఇతరులచేత శంకింపబడరు కాబట్టి నాయికా నాయకులు, నెమ్మదినెమ్మదిగా కలిసినడుస్తూ, ఒకళ్లనొకళ్లు చాలసేపు శరీరాలు తగినవిధంగా రాచుకోడాన్ని ఉద్ఘర్షణం అంటారు. నాయికను నాయకుడూ, నాయకుణ్ణి, నాయికా ఒకళ్ల శరీరాలను ఒకళ్లు గట్టిగా రాచుకోడాన్ని ఉద్ఘృష్టకం అంటారు.

౩౮౭. తదేవ కుడ్యసందంశేన స్తంభసందంశేనవా స్ఫుట మవపీడయేదితి పీడితకం. ౨.౨.౧౩.

పైనచెప్పిన ఉద్ఘృష్టక ఆలింగనమే గోడకుగానీ, స్తంభానికిగానీ ఆనించి ఆచరిస్తే, దాన్ని స్ఫుటకం అంటారు. దాన్నే ఇంకా గాఢంగా నొక్కిచేస్తే పీడితకం అంటారు.

౧౮౮. తదుభయ మవగత పరస్పరాకారయోః. ౨.౨.౧౪

ఈ రెండు ఆలింగనాలూ నాయికా నాయకులలో ఒకళ్లసంగతు లొకళ్లకు తెలిసినతరువాత నిర్భయంగా జరిపేవి.

౩౮౯. లతావేష్టితకం, వృక్షాధిరూఢకం, తిలతండులకం, క్షీరనీరకమితి చత్వారి సంప్రయోగకాలే. ౨.౨.౧౫

1. లతావేష్టితకం, 2. వృక్షాధిరూఢకం, 3. తిలతండులకం, క్షీరనీరకం, అనేనాలుగు ఆలింగనాలూ నాయికా నాయకులు సంగమించేసమయంలో జరిగేవి. మొదటిరెండూ నాయికచేత ఉపయోగింపబడతాయి. తక్కిన రెండూ ఇద్దరివల్లా ఉపయోగింపబడవచ్చు.

౩౫౦. లతేవ సాల మావేష్టయంతీ చుంబనార్థం ముఖమవ నమయే, దుద్ధృత్య మందసీత్కృతా తమాశ్రితా వా కించిద్రామణీయకం పశ్యే త్తల్లతావేష్టితకం.

౨.౨.౧౬

వాటిలో మొదటిదైన లతావేష్టితకాన్ని చెప్తున్నారు. తీగపాద చెట్టునుచుట్టుకున్నట్లు నాయిక, నాయకుణ్ణి ఎదురుగాఉండి కౌగిలించుకుని అతనిముఖాన్ని ముద్దుపెట్టుకునే కుతూహలంతో అతన్ని ఎగ(ప్రాకుతూ, తనముఖం పైకెత్తి అతనిముఖాన్ని క్రిందకువంచి మందమందంగా సీత్కారంచేస్తూ, అతనిని బాగాహత్తుకుని ఏదైనా ఒక అందమైన వస్తువును చూస్తూఉన్నట్లయితే దాన్ని లతావేష్టితకం అంటారు.

౩౫౧. చరణేన చరణమాక్రమ్య ద్వితీయ చరణే నోరుదేశ మాక్రమంతీ, వేష్టయంతీ వా తత్పృష్ఠ సక్తైకబాహు ర్ద్వితీయే నాంస మవనమయంతీ ఈ షన్మందసీత్కృతకూజితా చుంబనార్థ మే వాధిరోఢు మిచ్ఛే దితి వృక్షాధిరూఢకం.

౨.౨.౧౭

నాయిక ఒక తనకాలితో నాయకునికాలిని నొక్కిపట్టి, రెండకాలితో అతనితొడమీదుగా నడుమును చుట్టుకునిగానీ, కమ్ముకునిగానీ నిలిచిఉండి ఒక బాహువుతో అతనిని వీపువైపుగాచుట్టి కౌగిలించుకుని, రెండవబాహువుతో అతని మెడవంచుతూ కొద్దికొద్దిగా సీత్కారంచేస్తూ ముద్దుపెట్టుకోడానికి చెట్టునెక్కినట్లు నాయకుణ్ణి ఎక్కడానికి ప్రయత్నిస్తే దాన్ని వృక్షాధిరూఢకం అంటారు.

౩౫౨. తదుభయం స్థితకర్మ. ౨.౨.౧౮

పైనచెప్పిన రెండు ఆలింగనాలూగూడా నాయికా నాయకులు తమతోతమకు బాగా అనురాగం వృద్ధికావడానికి నిలుచుండి ఆచరించేవి.

౩౫౩. శయనగతావేవ ఊరువ్యత్యాసం భుజవ్యత్యాసంచ ససంఘర్ష మివ ఘనం సస్వజేతే తత్తిలతండులకం. ౨.౨.౧౯

నాయికా నాయకులు పక్కమీద ఒకరివైపునకు ఒకరును ఎదురుగా ఒత్తిగిలి పరుండి ఒకరితొడతో ఒకరినీ, ఒకరి బాహువుతో ఒకరినీ, గట్టిగా బిగువుగా కౌగిలించుకుని ఉంటే దాన్ని తిలతండులకం అంటారు.

౩౫౪. రాగాంధా వనపేక్షితాత్యయే పరస్పర మనువిశత ఇవ ఉత్సంగ గతాయా మభిముఖోపవిష్టాయాం శయనేవేతి క్షీరజలకం. ౨.౨.౨౦

ప్రేమాధిక్యంచేత మైమరచి బాధలు విరుగుతాయని కూడా పరిగణించకుండా నాయిక తొడమీద ఉన్నప్పుడైనా, ఎదురుగాకూర్చుని ఉన్నప్పుడైనా, శయనించియున్నా ఒకరిని ఒకరు గాఢంగా కౌగిలించుకోడాన్ని క్షీరజలకం అంటారు.

౩౫౫. తదుభయం రాగకాలే. ౨.౨.౨౧

ఈ పై రెండు కౌగిలింతలూకూడా పురుషుని అంగం సంసిద్ధమై స్త్రీయోనిద్రవించేసమయంలో రతి ప్రారంభించక పూర్వం చేసే ఆలింగనాలు.

౩౫౬. ఇత్యుపగూహన యోగా భ్రాభవీయాః.

౨. ౨. ౨౨

ఈ పై ఆలింగనాలు బాభ్రవ్యులు చెప్పినవి.

౩౫౭. సువర్ణనాభస్య త్వధిక మేకాంగోపగూహన చతుష్టయం. ౨. ౨. ౨౩

ఇవిగాక సువర్ణనాభుని మతంలో ఒక అవయవంతో మాత్రమే చేసే ఆలింగనాలు అధనంగా ఉన్నాయి.

౩౫౮. తత్రోరు సందేశే నైక మూరు మూరు ద్వయం వా సర్వప్రాణం పీడయే ది త్యూరూపగూహనం. ౨. ౨. ౨౪

నాయకుడు తన రెండుతొడలతోనూ నాయికయొక్క ఒక్క తొడనుగానీ, రెండు తొడలనుగానీ, తన ఓపికకొలది గట్టిగా బిగించి నొక్కితే దాన్ని ఊరూపగూహనం అంటారు.

౩౫౯. జఘనేన జఘనమవపీడ్య ప్రకీర్యమాణ కేశ హస్తా నఖదశన ప్రహణన చుంబన ప్రయోజనాయ తదు పరి లంఘయే త్తజ్జఘనోపగూహనం. ౨. ౨. ౨౫

ఉపగూహనం అనేది రెండువిధాలు. మొదటిదానిలో నాయికానాయకులు ఒత్తిగిలిపడుకుని ఉంటే నాయిక నాయకుని మేహనాన్ని పట్టుకుని తనభగానికి తాకించుకుంటూ ఉన్నది ఒకరకం. భగలింగ ప్రసంగం ఉన్నా లేకపోయినా, నాయకుని బొడ్డుకంటె క్రిందిభాగాన్ని నాయిక గట్టిగా తొడలతోబిగించిపట్టి ఆ సంతోషాతిశయంలో జుట్టు విడిచిపోయినదని గూడా తెలుసుకోకుండా, నఖక్షతాల కోసమూ, దంతక్షతాల

కోసమూ, ప్రణయతాడనలకోసమూ నాయకునిమీదికి దూకితే దాన్ని జఘనోపగూహనం అంటారు. ఈరెండు ఉపగూహనాలలోనూ స్త్రీయోని ఎక్కువ శృంగారంగా ఉంటుంది గనుక బాగా శోభిస్తుంది. యోనిని స్త్రీ దాచకుండా స్పష్టం చేస్తే ఇంకా మంచిది.

౩౬౦. స్తనాభ్యా మురసి ప్రవిశ్య తత్రైవ భార మారోపయే దితి స్తనాలింగనమ్. ౨.౨.౨౬

నాయకుడు కూర్చుని ఉన్నా ఒత్తిగిలి పరుండి ఉన్నా నాయిక అతనివైపు తిరిగి తన వెన్ను వెనుకకు విరిచి తనచన్నులతో అతని రొమ్మును అదిమి అతని కౌగిట్లోచేరి అతనిరొమ్ముమీద తన స్తనభారాన్ని ఆరోపిస్తే దాన్ని స్తనాలింగనం అంటారు.

౩౬౧. ముఖే ముఖ మాసజ్యాక్షిణీ అక్ష్ణో ర్లలాటేన లలాట మాహన్యా త్సా లాలాటికా. ౨.౨.౨౭

ముఖంలోముఖం పెట్టి కళ్లతోకళ్లూ, ఫాలభాగంతో ఫాలభాగాన్ని మోపి ఉంచడాన్ని లాలాటికం అంటారు.

౩౬౨. సంవాహన మప్యుపగూహనప్రకార మిత్యేకే మన్యంతే సంస్పృష్టత్వాత్. ౨.౨.౨౮

చర్మకూ, మాంసానికీ, బొమికలకూగూడా, సుఖాన్ని ఇస్తుంది గనుక, కాళ్లుపిసుకుటమొదలైన సంవాహన క్రియనుగూడా మరోరకమైన ఉపగూహనప్రకారంగా కొందరు చెపుతున్నారు. ఇందులో స్పర్శసుఖం బాగా ఉంటుంది.

౩౬౩. పృథక్కాలత్వా ద్భిన్నప్రయోజనత్వా దసాధారణత్వా న్నేతి వాత్స్యాయనః. ౨.౨.౨౯

సుఖాన్ని ఇస్తోంది గనుక స్పర్శసుఖంలో భేదం లేకపోయినా, ఇది ఉపగూహనసమయంలో కాకుండా, వేరుకాలంలో ఉపయోగింప బడుతుంది గనుకనున్నూ, దీనిప్రయోజనం గూడా వేరుకాబట్టిన్నీ సంవాహనం ఉపగూహనంలో చేరదు. ఉపగూహనం యెప్పుడూ దంపతులలో ఎవరిచేత ప్రయోగింప బడినా, ఇద్దరికీ సుఖాన్ని కల్పిస్తుంది. ఇక సంవాహనమో పురుషుడు చేస్తే స్త్రీకి సుఖమూ, స్త్రీ చేస్తే పురుషునికి సుఖమూ. అందువల్లే దాన్ని అసాధారణం అన్నారు.

> ౩౬-౮. పృచ్ఛతాం శృణ్వతాం వాపి, తథా కథయతా
> మపి, ఉపగూహవిధిం కృత్స్నం, రిరంసా జాయతే
> నృణాం. ౨. ౨. ౩౦

ఈఆలింగన విధాలు తెలుసుకునే కోరికతో అడిగేవాళ్లకున్నూ, అలా చెపుతుంటే ప్రక్కన ఉండి వినేవాళ్లకున్నూ, అలా విని వాటిని ఇతరులకు చెప్పేవాళ్లకూ గూడా రతిచెయ్యాలనే కోరిక పుడుతూఉంటే, ఇక వీటిని రతిసమయంలో ఆచరించే నాయికానాయకులకు రతియందు కోరిక పుడుతుందని వేరే చెప్పవలెనా?

> ౩౬-౯. యోఽపి హ్యశాస్త్రితాః కేచిత్ సంయోగా రాగ
> వర్ధనాః ఆదరేణైవ తేఽప్యత్రప్రయోజ్యాః
> సాంప్రయోగికాః. ౨. ౨. ౩౧

అనురాగాన్ని వృద్ధిచేసే మరికొన్నిరకాలైన కౌగిలింతలు ఈ శాస్త్రంలో చెప్పబడనివి కూడా లోకంలో ఉండవచ్చు. వాటిని

ఆదరంతో తమతమ ఇష్టాలను పట్టి ప్రయోగించుకొనవచ్చు. అవిగూడా సాంప్రయోగికాలే అవుతాయి. అంటే సంయోగానికి ప్రోత్సాహకరాలు అవుతా యన్నమాట.

౩౮౮. శాస్త్రాణాం విషయ స్తావత్, యావన్మందరసా నరాః, రతిచక్రే ప్రవృత్తేతు, నైవ శాస్త్రం నచ క్రమః. ౧.౧.౩౧

ఇతి శ్రీ వాత్స్యాయనీయే, కామసూత్రే, సాంప్రయోగికే, ద్వితీయే౽ధికరణే, ఆలింగన విచారో నామ, ద్వితీయో౽ధ్యాయః.

శాస్త్రంలో చెప్పనివాటిని ప్రయోగించడం ఎలా ధర్మం? అంటే, శాస్త్రం అనేది మనస్సునకున్న తెలియకపోవడం అనేదాన్ని ఒదిల్చి మందమతులను చురుకుకలవాళ్లనుగా చెయ్యడానికే గాని రతివిషయంలో ప్రవేశించినతరువాత ఈ ఉపదేశాలూ అవసరంలేదు. ఈ క్రమమూ అక్కరలేదు.

ఈ పద్ధతిగా భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ, అయినమేడిచెర్ల ఆంజనేయమూర్తిచేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యలోని సాంప్రయోగికాధికరణంలో ఆలింగనవిచారం అనే రెండవ అధ్యాయం ముగిసింది.

---

శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుఁగు వ్యాఖ్యాన సమేతం

౨. సాంప్రయోగికాధికరణం

### ౩. చుంబన వికల్పాధ్యాయం

౩౬౭. చుంబన నఖ దశనచ్ఛేద్యానాం పౌర్వాపర్య మస్తి రాగయోగాత్. ౨.౩.౧

పైఅధ్యాయంలో చెప్పినవిధంగా నాయికను ఆలింగనంచేసుకుని ముద్దుపెట్టుకోవాలి. అయితే ముందు ముద్దుపెట్టుకోవాలా? నఖ క్షతాలుచెయ్యాలా? దంతక్షతాలు చెయ్యాలా? అంటేవీటిని ఉపయోగించడంలో క్రమం ఏమీ అవసరంలేదు. అనురాగం వృద్ధి పొందినతరువాత ఈవిషయాలలో నాయకుడు క్రమాన్ని పాటించకలుగుతాడా?

౩౬౮. ప్రాక్సంయోగా దేషాం ప్రాధాన్యేన ప్రయోగః, ప్రహణసీత్కృతయోశ్చ సంప్రయోగే. ౨.౩.౨

సంయోగంఅంటే పురుషుని లింగాన్ని యోనిలో చేర్చడం. సంయోగంకంటె ముందుగా ముద్దులను ఎక్కువగా ప్రయోగిస్తే స్త్రీకిఅనురాగం పెంపు చెందుతుంది.సంయోగసమయంలో ముఖ్యంగా ప్రణయతాడనాలూ, సీత్కృతాలూ చెయ్యాలి. అనురాగం ఎక్కువగా ఉన్నప్పుడు చిరుదెబ్బలనుగూడా ఓర్చ కలుగుతారు కాముకులు. వాటినే ప్రణయతాడనా లంటారు.

చిన్న చిన్న దెబ్బలు ఎక్కువగా ప్రయోగిస్తే సీత్కారాలు గూడా బయిలుదేరతాయి. ఇది కొందరి మతము.

౩౬౯. సర్వం సర్వత్ర రాగస్యానపేక్షితత్వా దితి వాత్స్యాయనః. ౨.౩.౩

చుంబనాది పంచకాన్ని సంయోగానికి ముందుగా ప్రయోగించాలి. చాలాకాలం రతి చెయ్యగలిగిన నాయకుడు ప్రధానంగా గానీ, అప్రధానంగాగానీ, చుంబనాదిపంచకంయొక్క ప్రయోగాన్ని తప్పకుండా కోరతాడు. ఇక మందవేగుడూ, మధ్యవేగుడూ మాత్రం ముందుగానే ప్రయోగించాలి. అని వాత్స్యాయనులన్నారు.

౩౭౦. తాని ప్రథమరతే నాతివ్యక్తాని విస్రబ్ధికాయాం వికల్పేనచప్రయుంజీత. తథాభూతత్వాద్రాగస్య. ౨.౩.౪

ఈక్రింద చెప్పబోయే విశేషం మాత్రం రెండు పక్షాలలోనూ సమానమే. చుంబనాదిపంచకాన్ని రతి ప్రారంభింపగానే ఎక్కువ స్పష్టంకాకుండా ప్రయోగిస్తూ తొందరపడకుండా నాయిక కొంచెం అనుకూలురాలైన తరువాత, "ఇదికావాలా? అదికావాలా?" అని అడిగి ఒప్పిస్తూ చుంబనాదులను హెచ్చించి ప్రయోగించాలి. అనురాగంగూడా రతిప్రారంభ కాలంలో కొద్దిగా ఉండి క్రమక్రమంగా వృద్ధిపొందుతుంది. ఇవిగూడా దాన్ని పట్టే వృద్ధిపొందుతాయి.

౩౭౧. తతఃపర మతిత్వరయా విశేషవ త్సముచ్చయేన రాగసంధుక్షణార్థమ్. ౨.౩.౫

రతి ప్రారంభించినప్పటికంటె మధ్యకాలంలో అనురాగం ఎక్కువగా ఉంటుంది. మైమరపు జనిస్తుంది. కాబట్టి దానికి తగినట్లుగా తొందర తొందరగా, అధికంగా ముద్దులూ, నఖక్షతాలూ, దంతక్షతాలూ, ప్రహణనాలూ, సీత్కృతాలూ ప్రయోగించాలి. అలా ప్రయోగిస్తే అనురాగం ఎక్కువ అవుతుంది. లేకపోతే రసం విచ్ఛిన్నం అయిపోతుంది. ఈ విధంగా ఒకళ్లమీద ఒకళ్లకు నమ్మకం కుదిరిన తరువాత నాయికా నాయకులు రతిచేసేసమయంలో చుంబనాదులు ప్రయోగించడానికి ఏదిముందు, ఏదివెనుక అనే సందేహం అక్కరలేకుండానే ఇష్టం వచ్చినట్లు భోగిస్తారు. క్రొత్తనాయికను నమ్మించడానికి మాత్రం క్రమాన్ని ఆశ్రయించాలి. కాని బెదిరిపోయేలాగా తనతొందరనంతా ఒక్కమాటు చూపరాదు.

322. లలాటాలక కపోలనయనవక్షః స్తన - ఓష్ఠాంతర్ముఖేషు చుంబనమ్. 2.3.6

ముద్దులలోని విశేషాలను చెవుతున్నారు. ముద్దులు పెట్టుకునే ప్రదేశాలభేదాన్నిపట్టే ముద్దులలోగూడా తేడా ఏర్పడ్డది. ప్రాచీనులైన కామశాస్త్రకర్తలు ముద్దుపెట్టుకునేచోట్లు, నుదురూ, ముంగురులూ, బుగ్గలూ, కళ్లూ, వక్షస్థలం, స్తనాలూ, పెదవులమధ్యా, నాలుకా, అనిచెప్పారు.

323. ఊరు సంధి బాహు నాభి మూలేషు లాటానామ్. 2.3.7

గజ్జలూ, చంకలూ, భగమూగూడా ముద్దుపెట్టుకోతగిన చోట్లే అని లాటదేశీయులైన పూర్వాచార్యుల మతం. పైన చెప్పినవీ

ఇవీ కలిసి మొత్తం పదకొండు చుంబనస్థానాలు చెప్పారన్నమాట.

౩౨౮. రాగవశా ద్దేశప్రవృత్తేశ్చ సన్తితానితాని స్థానాని, నతు సర్వజన ప్రయోజ్యానీతి వాత్స్యాయనః. ౨.౩.౮

అనురాగాన్ని పట్టీ, దేశాచారాన్ని పట్టీ, ఇంకా ఆ యా స్థానాలు చాలా ఉన్నాయి. అవన్నీ అందరూ ప్రయోగించతగినవి కావని వాత్స్యాయను లన్నారు. రాగాంధులై గజ్జలూ మొదలైనచోట్ల లాటదేశీయులు చుంబనం చేస్తున్నారు. అవి అందరూ ప్రయోగించడానికి వీలైనవి కావు. శిష్టులు ప్రయోగించ తగినవి మొదటి యెనిమిది మాత్రమే.

౩౨౯. నిమితకం, స్ఫురితకం, ఘట్టితకమితి త్రీణి కన్యా చుంబనాని. ౨.౩.౯

చుంబనంఅంటే మూతిని సంపుటీకరించి తనఇష్టమైన ప్రదేశంలో సమకూర్చడం. ఇందులో కొద్దిగా శబ్దంగూడా ఉంటుంది. ఆచుంబనాన్ని సమకూర్చేస్థాన భేదాన్నిపట్టి చుంబనభేదాలు గూడా యేర్పడతాయి. చుంబనంచేసే స్థానా లన్నింటిలోనూ, పెదవులు ముఖ్యాలుకాబట్టి అక్కడ చుంబనంచేసే విధానాన్ని వ్రాస్తున్నారు. ఆఓష్ఠచుంబనాలలోగూడ అధరోష్ఠమూ, ఉత్తరోష్ఠమూ, సంపుటకమూ, అనేభేదాలవల్ల మూడు విధాలు ఏర్పడతాయి. వీటిలోగూడా ఎక్కువ కర్మ కలాపంతో కూడి ఉన్నదిగనుక అధరోష్ఠాన్ని(క్రిందిపెదవిని)గూర్చి ఈసూత్రంలో ముందుగా చెవుతున్నారు. నాయకునితో కలిసి మాట్లాడగలి

గినా అతని విషయంలో ఇంకా బాగా నమ్మకంకుదరని కారణం వల్ల క్రొత్త గృహిణి గూడా కన్యకగానే పరిగణింపబడుతుంది. ఆనాయిక నిమితకం, స్ఫురితకం, ఘట్టితకం అనే ఈ మూడు చుంబనాలనూ ప్రయోగించాలి.

> ౩౭౬. బలాత్కారేణ నియుక్తా ముఖం ముఖ మాధత్తే నతు విచేష్టిత మితి నిమితకం. ౨.౩.౧౦

నాయకుడంటే అట్టేనమ్మకం కలదికాదు గనుక సిగ్గు పొందుతూ ఉంటే ఆనాయకుడు ముద్దుపెట్టుకోమని బలవంతం చేస్తాడు. అప్పుడు నాయిక నాయకుని ముఖంమీాద తనముఖాన్ని ఉంచుతుంది గాని సిగ్గుచేత ఏమీాచేష్ట చెయ్యదు. ఇక్కడ ముఖం అంటే పెదవులు అనిఅర్థం, దీన్నే నిమితకం అంటారు.

> ౩౭౭. వదనే ప్రవేశితం చోష్ఠం మనా గవత్ర పానుగ్రహీతు మిచ్ఛంతీ స్పందయతి స్వమోష్ఠం నోత్తర ముత్సహతే ఇతి స్ఫురితకం. ౨.౩.౧౧

నాయకునిచేత అతని అధరోష్ఠము (క్రిందిపెదవి) తనవదనంలో ప్రవేశింపబడినప్పుడు దాన్నిసిగ్గుచేత జంకుతూ, గ్రహింపగోరుతూ తనక్రిందిపెదవిని కదిలిస్తుంది. పైపెదవిని కదిలించడానికి ఉత్సహించదు. దాన్నికూడా కదిలిస్తే గ్రహించినట్లే అవుతుంది. దీన్నిస్ఫురితకం అంటారు.

> ౩౭౮. ఈషత్పరిగృహ్య వినిమీలితనయనా కరేణచ తస్య నయనే అవచ్ఛాదయంతీ జిహ్వాగ్రేణ ఘట్టయతీతి ఘట్టితకం. ౨.౩.౧౨

సిగ్గు ఇంకాపూర్తిగా ఒదలనికారణంవల్ల కొద్దిగానాయకుని అధరోష్ఠాన్ని తన రెండు పెదవులతోనూ గ్రహించి, కండ్లుమూసికొని తనచేతులతో నాయకుని కళ్లుమూసి నాలుక చివర భాగాన్ని కదిలిస్తూ అధరోష్ఠాన్ని రాపిడిచేస్తే దాన్ని ఘట్టితకం అంటారు.

౩౨౯. సమం తిర్య గుద్భ్రాన్త మవపీడితక మితి చతుర్విధ
మపరే. ౨-౩-౧౩

పైన చెప్పినకన్యక గాక ఇతరనాయికలు చేసే చుంబనాలు చెపుతున్నారు. నాయిక తనపెదవులతో నాయకుని అధరోష్ఠం మీదచుంబనం చెయ్యడం నాలుగువిధాలు. వాటిలో మొదటిదిసమచుంబనం, అంటేనాయకునికి ఎదురుగాఉండి అతని అధరోష్ఠాన్ని గ్రహించడం అన్నమాట. ఇక రెండోది తిర్యక్చుంబనం. ఓష్ఠపుటాలను ముందుకుచాచి అతని అధరాన్ని చిగురంటా గ్రహిస్తే దాన్ని తిర్యక్చుంబనం అంటారు. మూడోది ఉద్భ్రాన్తం. నాయకునిగడ్డాన్ని, శిరస్సునీ రెండుచేతులతోనూ పట్టుకుని తనపెదవులు కదిలిస్తూ చుంబించడాన్ని ఉద్భ్రాంతకం అంటారు. నాలుగోది అవపీడితకం. నాయికానాయకులు ఒకళ్లపెదవులను ఒకళ్లుబాగాస్వేచ్ఛగా గ్రహించడం. ఈఅవపీడితకం రెండువిధాలు. పెదవులతో మాత్రమే అధరాన్ని గ్రహించిపీడిస్తే దాన్ని శుద్ధపీడితకం అంటారు. నాలుకచివరతో గూడా పీడింపబడితే దాన్నిచూషణం, అధరపానం అనేపేర్లతో వ్యవహరిస్తారు.

౩౮౦. అంగుళిసంపుటేన పిండీకృత్య నిర్దశనమోష్ఠపుటే నావపీడయే దిత్యవపీడితకం పంచమమపికరణం.
౨-౩-౧౮

చేతిబొటనవ్రేలితోనూ, చూపుడు వ్రేలుతోనూ నాయకుని అధరాన్ని గ్రహించి పళ్లునాటకుండా పెదవులతో మాత్రం గ్రహిస్తే దీన్నిగూడా అవపీడితకం అంటారు. ఇదిఅయిదోరకం ముద్దు.

౩౮౧. ద్యూతం చాత్ర ప్రవర్తయేత్. ౨-౩-౧౯

ఆయాపనులలో ఉండేవిశేషాలను పట్టి అధరచుంబనం అయిదు విధాలుగాచెప్పారు. ఈవిధంగా చుంబన ప్రభేదాలను సంపూర్ణంగా చెప్పి ఇక్కడి అవసరాన్ని పురస్కరించుకుని అధరచుంబనాన్నిగూర్చిన జూదాన్నిగూడా చెవుతున్నారు. ఈజూదం అనురాగాన్ని వృద్ధిపొందిస్తుంది.

౩౮౨. పూర్వమధర సంపాదనేన జితమిదంస్యాత్.
౨-౩-౧౬

నాయికానాయకులిద్దరూ ఒకళ్లపెదవిని ఒకళ్లు గ్రహించడానికి పెనగులాడతారు. ఎవరు ముందుగా ఒకరిపెదవిని గ్రహించగలిగితే వారు రెండోవారిని ఓడించారన్నమాట. ఈజూదంలో నాయికా నాయకుల కిద్దరికీ ఇష్టంగా ఉండే పందెమును చెవుతున్నారు. జూదం కపటంగానూ, కపటంలేకుండానూ ఉంటుంది. నాయికా నాయకులు సామాన్యంగా ఒకళ్ల పెదవులను ఒకళ్లు పెనగులాడుతూ చుంబనం చేస్తేదాన్ని కపటంలేని చుంబనం అంటారు. ఈకపటంలేని ద్యూతంలో నాయకుడు

బలవంతుడుగనుక అతడే నాయిక అధరాన్ని ముందుగా గ్రహిస్తాడు. కపటద్యూతంలో నాయికముందుగా జయాన్ని పొందుతుంది.

౩౮౩. తత్రజితా సార్ధరుదితం కరం విధునయాత్రణుదేద్ద శేత్పరివర్త్తయే ద్బలాదాహృతా వివదేత పునర వ్యస్తు పణమితి బ్రూయాత్, తత్రాపిజితా ద్విగుణ మాయస్యేత్. ౨-౩-౧౭

ఈజూదంలో ఒకరు జయిస్తే ఒకరుపోట్లాటకు తప్పకసిద్ధ పడ తారు. జూదంకలహాన్ని కల్పిస్తుంది. ఆకలహం నాయికా నా యకులకు పరస్పరమూ అనురాగాన్ని బాగావృద్ధిచేస్తుంది. ఈ జూదంలో నాయిక ఓడిపోయి తనఅధరానికి బాధకలిగిందని వచ్చీరాని యేడుపుతో చేతులు ఒణికించాలి. భర్తను బెదిరిం చాలి. అతని అధరాన్ని పళ్లతో నొక్కాలి. తన అధరాన్ని ఒదిలిపెట్టమని పోట్లాడాలి. 'నేనుఓడిపోలేదు. మీరే ఓడిపోయి నారు. మళ్లీపందెం వేద్దాం' అనిపేచీపెట్టాలి. రెండోఆటలో గూడా తానే ఓడి ఇంకా ఎక్కువగా చేష్టలుచెయ్యాలి.

౩౮౪. విస్రబ్ధస్య, ప్రమత్తస్య వాఽధరమవగృహ్య దశ నాంతర్గత మనిర్గమం కృత్వా హసే దుత్క్రోశే త్తర్జయే ద్వల్గే దాహ్వయే న్నృత్యే త్ప్రవర్తిత భ్రూకాచ విచలనయనేవ ముఖేన విహసంతీ తాని తానిచ బ్రూయాదితి చుంబన ద్యూతకలహః. ౨-౩-౧౮

ఇక కపటజూదాన్ని గూర్చి చెవుతున్నారు. ఆముఖచుంబన ద్యూతంలోనే నాయిక ముందుగానాయకుణ్ణి నమ్మించాలి. అతడు నమ్మి పరాకుతో ఏదో ఆలోచిస్తూఉండగా హఠాత్తుగా అతని అధరాన్ని మున్ముందు పెదవులతోనూ, తరువాత దంతాలతోనూ తప్పించుకోడానికి వీలులేకుండా గ్రహించాలి. అటు తరువాత అధరాన్ని అలాగే నొక్కిఉంచిగానీ, ఒదిలివేసిగానీ తరువాత పనులుచెయ్యాలి. ఆ కపటద్యూతంలోకూడా ప్రమాదంవల్ల స్త్రీకి జయం లభించవచ్చు. పై విధంగా కపటజయాన్ని పొంది నాయికనాయకుణ్ణి గేలిచెయ్యాలి. చప్పట్లతోగూడా గేలిచేస్తే చాలాసంతోషాన్ని కల్పిస్తుంది ఇద్దరికీగూడా. "నా చేతులో ఓడిపోయినారు. ఏం మగతనమండీ" అని ఫూత్కారంచెయ్యాలి. అతనిమిత్రులూ, తన చెలులూ వినేవిధంగా బెదిరించాలి. "దొరికారులెండి. మీపెదవి కొరికివేస్తాను" అని బలాత్కారంగా అతన్ని హడిలిపోయేలాగా బెదిరిస్తూ తన శరీరాన్ని నాజూకుగా కదల్చాలి. మీమగతనం చూపింతురుగాని రమ్మని పోట్లాటకుపిలుస్తూ కనుబొమలు ఎగురవేస్తూ చిందులుతొక్కాలి. చిట్టచివరకు ఓరగంటితో చూస్తూ నవ్వాలి. అటుతరువాత ఎలాటివిచేస్తే అనురాగం ఎక్కువ అవుతుందో అలా చుంబనాదులను జరపాలి. ప్రియంగా సంభాషించాలి. ఒకొక్కప్పుడు నాయకుడు తాను జయించినా, ఓడిపోయినా కలహం వృద్ధిపొందేవిధంగా ప్రవర్తించాలి. ఎలాగంటే, ముందుగా ఆమె అధరాన్నినొక్కి సీత్కారంతో తల కదులుస్తూ నాయిక తనను త్రోసివేస్తే బలవంతాన ఆ పనికోసం మళ్లీ పెనుగులాడాలి. కొరికితే మళ్లీ కొరకాలి. పట్టికొట్టిస్తే

మళ్లీ పట్టికొట్టించాలి. పోట్లాడితే పోట్లాడాలి. "అదిగెలిస్తే గెలిచావుగాని, ఈ రెండోపందెం గెలు" అని మళ్లీ ఆటను మొదట్లోకి తీసుకునిరావాలి. అందులోగూడా తానే జయాన్ని పొంది, పూర్వాంకంకంటెగూడా ఎక్కువగా చేష్టలు చెయ్యాలి. ఒకవేళ ఓడిపోయినా, విలక్షణంగా నవ్వాలి. "నా చేతులో ఓడిపోయారు, ఓడిపోయారు" అని ఆమె గేలిచేస్తుంటే "అబద్ధం అబద్ధం" అని తానుగూడా గేలిచెయ్యాలి. బెదిరిస్తే మళ్లీ బెదిరించాలి. తొలగిపోతే అడ్డునిలవాలి. పోట్లాటకు ఆహ్వానిస్తే తానూ ఆహ్వానించాలి. చిందులువేస్తుంటే తాళంవెయ్యాలి. వాదులాడుతుంటే తానూ వాదులాడాలి.

౩౮. ఏతేన నఖదశనచ్ఛేద్య ప్రహణన ద్యూతకలహాని వ్యాఖ్యాతాని. —౨-౩-౧౮

ఈ పై చుంబనద్యూతాన్ని చెప్పడంచేత నఖక్షతద్యూతమూ, దంతక్షతద్యూతమూ, ప్రణయతాడనద్యూతమూ, స్పష్టమయినాయి. అంటే చుంబనద్యూతంలోలాగానే ప్రవర్తించవచ్చునన్నమాట.

౩౯. చండవేగయో రేవ త్వేషాం ప్రయోగః తత్సాత్మ్యాత్. —౨-౩-౨౦

ఈ పైన చెప్పినజూదాలు చాలాసేపు రతిచేయగలిగే నాయికానాయకులే ప్రయోగించుకో గలుగుతారుగాని మందమధ్యవేగులు ప్రయోగించలేరు.

౩౭. తస్యాం చుంబంత్యా మయమవ్యుత్తరం గృహ్ణీయాదిత్యుత్తరచుంబితం. —౨-౩-౨౧

నాయిక అధరోష్ఠాన్ని చుంబనంచేస్తున్నప్పుడు నాయకుడు ఆమె పై పెదవిని చుంబనంచెయ్యాలి. ఆమె ఉత్తరోష్ఠాన్ని (పై పెదవిని) గ్రహించినప్పుడు తాను అధరోష్ఠాన్ని గ్రహించాలి. దీన్ని ఉత్తర చుంబితం అంటారు. ఇది ప్రసంగంవల్ల చెప్పబడ్డదిగాని నాసికా పుటపానంలాగా ఇదిగూడా అసహ్యమైనది కాబట్టి ప్రయోగించరాదు. అంటే ముద్దుపెట్టుకోతగినది క్రిందిపెదవేగాని పై పెదవి కాదన్నమాట.

౩౮౧. ఓష్ఠ సందంశే నావగృహ్యోష్ఠ ద్వయమపి చుంబేదితి సంపుటకం స్త్రియాగి, పుంసోవా జాతవ్యంజనస్య. ౨-౩-౨౨

ఇలాగే మీసాలురాని పురుషుడైతే అప్పుడు ఒక్కమాటుగా ఇద్దరూ చుంబనం చేసేవిధానం చెవుతున్నారు. రెండుపెదవులనుముడిచి ఒకరు మరి ఒకరినోటిలోఉంచి చుంబిస్తుంటే రెండవవారుగూడా ఆలాగే ముడిచిఉంచాలి. చుంబనం చేసేప్పుడు ఎప్పుడూ చాలాచప్పుడు చెయ్యాలి. రెండుపెదవులనూ సమకూర్చి చుంబిస్తారుకాబట్టి దీన్ని సంపుటకంఅంటారు. మీసాలు రాని పురుషుడైతే పరస్పరమూ కుదురుతుందికాని అలా కాకపోతే నాయికపెదవులు పురుషునినోటిలో ఉంచేవిధాన్ని మాత్రమే ఆచరించాలి.

౩౮౫. తస్మిన్నితరోపి జిహ్వయాఽస్యాదశనాని ఘట్టయేత్తాలు జిహ్వాచేతి జిహ్వాయుద్ధం. ౨-౩-౨౩

ఇక ఈసంపుటకచుంబనవిధానంలో చేరిన అంతర్ముఖచుంబనాన్ని చెవుతున్నారు. నాయికానాయకులలో ఎవరిపెదవులు

రెండవవారి నోటిలో ప్రవేశిస్తాయో వారు తమనాలుకతో రెండవవారి పైక్రిందిపండ్లను తాకాలి. పొడుగుగా చాచిగానీ, పొట్టిగాచాచిగానీ, ఒకళ్ళనాలుకలను ఒకళ్లు రాపిడిచేస్తేదాన్ని జిహ్వాయుద్ధం అంటారు. ఇది అంతర్ముఖచుంబనం, దశనచుంబనం, జిహ్వాచుంబనం, తాలుచుంబనం అని నాలుగువిధాలు.

౩౯౦. ఏ తేన బలాద్వదనరదనగ్రహణం దానం చ వాఖ్యాతం. ౨.౩.౨౮

ఈ జిహ్వాయుద్ధాన్ని చెప్పడంచేత బలవంతంగా పెదవులను చుంబించడం, పండ్లనుచుంబించడం, వాటిని ఒకళ్లకొకళ్లు చుంబించడానికి ఇవ్వడం అనేవిధానంగూడా స్పష్టం అయినది.

౩౯౧. సమం పీడితక మంచితం మృదు శేషాంగేషు చుంబనం స్థానవిశేషయోగాదితి చుంబన విశేషాః.

౨-౩-౨౯

పెదవులూ,నోటిలోపలాకాక,తక్కినసుదురూ, మొదలైన స్థానాలలో చేసేపనినిపట్టి సమచుంబనంఅనీ, అంచితచుంబనంఅనీ, మృదుచుంబనంఅనీ, నాలుగురకాలు. ఆచుంబనస్థానాలు పైన చెప్పబడ్డాయి. ఆ స్థానాలలో గజ్జలూ, వక్షస్థళమూ, ఈచోట్ల లోమాత్రం సమచుంబనాన్నే ప్రయోగించాలి. పీడితాన్నిగానీ, మృదుచుంబనాన్నిగానీ ప్రయోగించరాదు. స్తనాలూ, బుగ్గలూ, భగమూ ఈమూటియందూ పీడితచుంబనాన్ని ప్రయోగించాలి. చన్నులయందూ, చంకలదగ్గరా, అంచితచుంబనాన్ని చెయ్యాలి. ఫాలభాగంలోనూ, నేత్రాలమీదా,

మృదుచుంబనం చెయ్యాలి. ఇలా కర్మభేదాన్నిపట్టి వచ్చిన చుంబనభేదాలు చెప్పబడ్డాయి.

౩౯-౨. సుప్తస్య ముఖమవలోకయంత్యాగిస్వాభి ప్రాయేణ చుంబనం రాగదీపనం. ౨-౩-౨౬

నాయకుడు నిద్రపోతున్నప్పుడు అతనిముఖాన్ని ప్రేమభావంతో చూస్తూ, తనకేలా చుంబనంచెయ్యడం ఇష్టమో, అలా చుంబనంచేస్తే దాన్ని రాగదీపనం అంటారు. నాయకుడు గూడా ఆలాగే నాయిక నిద్రపోతున్నప్పుడు చుంబనంచేస్తుంటే నాయికకు నిద్రాభంగం కలిగినా ఇది సంభవించవచ్చు. అప్పు డది సాంప్రయోగికమే అవుతుంది.

౩౯-౩. ప్రమత్తస్య వివదమానస్య వాఽన్యతోఽభిముఖస్య సుప్తాభిముఖస్య వా నిద్రావ్యాఘాతార్థం చలితకం. ౨-౩-౨౭

సంగీతమూ, ఆలేఖ్యమూ మొదలైన క్రియలయందు నిమగ్నుడై ఉన్నప్పుడూ, ప్రణయకలహంలో ఉన్నప్పుడూ, మరొకవైపునకు దృష్టిమరల్చుకుని ఉన్నప్పుడూ, నిద్రపోతూ ఉన్నప్పుడుకూడా నాయకుణ్ణి ఆయాపనులనుంచి విరమింపచెయ్యడానికి చేసే చుంబనాన్ని చలితకం అంటారు.

౩౯-౪. చిరరాత్రా వాగతస్య శయన సుప్తాయాగి స్వాభిప్రాయ చుంబనం. ౨-౩-౨౮

అర్ధరాత్రివేళ నాయిక నిద్రిస్తున్నప్పుడు ఆమెను సమీపించి తన యిష్టంవచ్చినట్లు చుంబనం చెయ్యడాన్ని ప్రాతిబోధికం

అంటారు. ఈ చుంబనంలో నిద్రపోయేవ్యక్తిని మేల్కొల్ప డము ముఖ్యోద్దేశ్యము.

౩౯-౫. సాపితు భావజిజ్ఞాసార్థినీ నాయకస్యాగమనకాలం సంలక్ష్య వ్యాజేన సుప్తాస్యాత్॥ ౨-౩-౨౯

నాయికనాయకుని భావాన్ని కనిపెట్టదలచి అతడు వచ్చేకాలా న్నికనిపెట్టి అబద్ధపు నిద్రపోతూ ఉంటుంది. "అతనికి నాయందు ప్రేమఉంటే ప్రాతిబోధికచుంబనాన్ని చేయునుగాక" అనే భావంతోనిద్రిస్తూ ఉన్ననాయికను ఆ భావంనుంచి మరల్చడా నికి ఈ ప్రాతిబోధికచుంబనం బాగా ఉపకరిస్తుంది.

౩౯-౬. ఆదర్శే కుడ్యే సలిలేవా ప్రయోజ్యాయాశ్ఛాయా చుంబనం ఆకార ప్రదర్శనార్థ మేవ కార్యం.

అద్దంలోనైనా, దీపపువెలుతురుపడుతున్న గోడమీదైనా, నీటిలోనైనా నాయికనీడ ప్రతిబింబిస్తూఉంటే ఆ నీడను చుంబ నంచేస్తే దాన్ని ఛాయాచుంబనం అంటారు.

౩౯-౭. బాలస్యచిత్రకర్మణః ప్రతిమాయాశ్చ చుంబనం సాంక్రాంతిక మాలింగనంచ. ౨-౩-౩౧

తనచంకనున్న పిల్లవాణ్ణిగానీ, చిత్రఫలకాన్నిగానీ, మట్టితోనూ, రాతితోనూ, కొయ్యతోనూ తయారుచెయ్యబడిన బొమ్మలను గానీ నాయిక చూస్తూఉన్నప్పుడు చుంబించడాన్ని సాంక్రాం తికచుంబనం అంటారు. పై ఛాయాచుంబనమున్నూ, ఈ సాంక్రాంతిక చుంబనమున్నూ, మాటలూ, భావాలూ, కలి యనిదశలో ప్రయోగించేవి.

౩౯౮. తథా నిశి ప్రేక్షణకే స్వజనసమాజే వా సమీపగతస్య ప్రయోజ్యాయాహస్తాంగుళిచుంబనం, సంవిష్టస్య పాదాంగుళి చుంబనం. ౨-౩-౩౨

రాత్రివేళగానీ, నాటకపరిదర్శనం జరుగుతున్నప్పుడు ఒక్క-చోటచేరిఉన్న తన బంధుజనంలోగానీ, నాయికకు సమీపగతుడైన నాయకుడు చేతివ్రేలినిగానీ, కూర్చునిఉంటే కాలి వ్రేలినిగానీ చుంబించడాన్ని అంగుళిచుంబనం అంటారు.

౩౯౯. సంవాహికాయాస్తు నాయిక మాకారయంత్యా నిద్రావశా దకామాయా ఇవ తస్యోరోర్వదనస్య నిధాన మూరుచుంబనం, పాదాంగుష్ఠచుంబనం చేత్యాభియోగికాని. ౨-౩-౩౩

పాదాలు ఒత్తుటద్వారా నాయకునికి తనభావాన్ని తెలియపరుస్తూ నిద్రకు వశురాలై యేమీయెరుగనిదానిలాగా అతని తొడలమీద ముఖాన్ని ఆనించి చుంబించడాన్ని ఊరుచుంబనం అంటారు. కాలివ్రేళ్లు లాగుతూ ఉన్నప్పుడు ఆకాలి బొటనవ్రేలిని చుంబనం చెయ్యడం పాదాంగుష్ఠ చుంబనంఅంటారు. ఈ అంగుళీ చుంబనం మొదలైనవి స్పృష్టకాది చుంబనాలచేత కొంచెం శరీర స్పర్శకు మాత్రం అలవాటుపడి, ఆప్తే మాటలు గూడా కలవని సమయంలో ప్రయోగించేవి. వీటిని ఆభియోగికాలంటారు.

౪౦౦. కృతే ప్రతికృతం కుర్యా త్తాడితే ప్రతితాడితం,
కరణేనచ తేనైవ చుంబితే ప్రతిచుంబితం.

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాంప్రయోగికే ద్వితీయేఽధికరణే ఆలింగన విచారో నామ తృతీయోఽధ్యాయః.

సంయోగ కాలంలోనూ, అభియోగ కాలంలోనూ (పరిచయం చేసుకునేకాలంలో) నాయకుడు ఏవి ప్రయోగిస్తే వాటినే నాయికకూడా ప్రయోగించాలి. నాయకుడు ఏపని చేస్తే తానుగూడా ఆపని చెయ్యాలి. ఆలా చెయ్యకపోతే ఆ స్త్రీని నాయకుడు మొద్దులాగా భావిస్తాడు. ఆమె విషయంలో విరక్తుడౌతాడు.అందువల్ల ఆసంప్రయోగం నీచం ఔతుంది కాబట్టి నాయకుడు ప్రణయతాడనాన్ని చేస్తే తానూ ఆలా ప్రతితాడనం చెయ్యాలి. చుంబనం చేస్తే మళ్ళీ చుంబనం చెయ్యాలి.

ఈపద్ధతిగా భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ,
ఆపస్తంబ సూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయ
మూర్తిచేత వాత్స్యాయన కామసూత్రములకు జయ
మంగళ వ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన
'రతిరేఖ' అను తెలుగు వ్యాఖ్యలోని సాంప్ర
యోగికాధికరణంలో ఆలింగన విచారం
అనే మూడో అధ్యాయం ముగిసింది.

---



శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

౨. సాంప్రయోగికాధికరణం

### ४. నఖజాత్యధ్యాయం

४౦౧. రాగవృద్ధౌ సంఘర్షాత్మకం నఖవిలేఖనం. ౨-४-౧.
పై అధ్యాయంలో చెప్పిన విధంగా చుంబనాలతో ఉపక్రమించి అంతకంటె ఎక్కువగా అనురాగాన్ని వృద్ధిపొందించే నఖక్షతాలతో ఉపక్రమింప చెయ్యడానికి ఈ అధ్యాయాన్ని చెవుతున్నారు. నఖక్షతాలంటే గోళ్ళరక్కులన్న మాట. అనురాగం బాగా జనించిన తరువాత గోళ్ళతో ఆయా స్థానాలలో గిచ్చడాన్ని నఖవిలేఖనం అంటారు.

४౦౨. తస్య ప్రథమ సమాగమే, ప్రవాస ప్రత్యాగమనే,
క్రుద్ధ ప్రసన్నాయాం, మత్తాయాంచ ప్రయోగో
ననిత్య మచండవేగయోః. ౨-४-౨

ఆ నఖవిలేఖనాలను ఎక్కడ ప్రయోగించాలి? ఎప్పుడు ప్రయోగించాలి? అన్న ప్రశ్నకు సమాధానం చెవుతున్నారు. ఈనఖ

విలేఖనాలు మందవేగులు, మధ్యవేగులు ఎల్లప్పుడు ప్రయో గించరాదు. మొట్టమొదటి సమాగమ సమయంలో గానీ, దేశాంతరంనుంచి తిరిగివచ్చినప్పుడుగాని, దూరదేశానికి నాయి కను విడచిపోయే సమయంలోగాని, కోపాన్ని పూని ఉన్నప్పుడు నాయికను ప్రసన్నురాలినిగా చేసుకునేప్పుడు గాని ప్రయోగిం చాలి. చాలాసేపు రతిచేయగలిగిన వారి విషయంలో ఎప్పుడైనా ఏలాగైనా వీటిని ప్రయోగించవచ్చు.

౮౦౩. తథాదశనచ్ఛేద్యస్య సాత్మ్యవశాద్వా. ౨-౪-3

పై నఖక్షతాలలాగానే అనురాగం వృద్ధిపొందినతరువాత దంత క్షతాలను ప్రయోగించాలి. అనురాగం ఎక్కువగాఉంటే దంతాలతో తేలికగా నొక్కాలి. అనురాగం తక్కువగాఉంటే దంతాలతో ఎక్కువగా నొక్కాలి. మందమధ్యవేగులు వీటిని బాగా సహించలేరుగనుక వారి విషయంలో ప్రయోగించ రాదు.

౮౦౪. తదాచ్ఛురితక మర్ధచంద్రోమండలం, రేఖా, వ్యాఘ్ర నఖం, మయూరపదకం, శశప్లుతక, ముత్పలపత్రకమితి రూపతోష్టవికల్పం. ౨-౪-౪

నఖక్షతాలు రూపవత్ అనీ, అరూపవత్ అనీ రెండురకాలు, ఏదైనా ఒకవస్తువు ఆకారాన్ని అనుకరిస్తూ ప్రయోగించే నఖ క్షతాలు రూపవత్తులు. ఏ వస్తువు ఆకారాన్ని అనుకరించ కుండా చేసే నఖక్షతాలను అరూపవత్తులంటారు. అవి మృదు, మధ్య, అతిమాత్రలనే భేదంచేత మూడురకాలు. రూపవత్తు

లను ముందుగా ఇక్కడ చెవుతున్నారు. అవి ఆచ్ఛురితకం, అర్థచంద్రాకారం, మండలాకారం, రేఖాకారం, వ్యాఘ్రనఖం, మయూరపదకం, శశప్లుతకం, ఉత్పలపత్రకం అని ఎనిమిది రకాలు.

౪౦౫. కక్షౌస్తనౌగళః పృష్ఠం జఘన మూరూచస్థానాని.

ఈ నఖక్షతాలు, చంకలూ, స్తనాలూ, కంఠమూ, కటిభాగమూ (పిరుదులూ) తొడలూ, అనే ఆరుచోట్ల మాత్రమే ప్రయోగించుకోవాలి నాయికానాయకులు. అలా ప్రయోగిస్తే దంపతులకు రతిసుఖం బాగా కలుగుతుంది. ఇది పూర్వాచార్యులమతం. పైనచెప్పిన స్థానాలవిషయంలో కొంచెం విశేషం ఉన్నది. కంఠంఅంటే కంఠానికి ప్రక్కభాగాలని అర్థం చేసుకోవాలి. కటిభాగంఅంటే పిరుదులూ, పొత్తికడుపూ అని అర్థం చెప్పుకోవాలి.

౪౦౬. ప్రవృత్తరతి చక్రాణాం నస్థానమస్థానం వా విద్యతే
ఇతి సువర్ణనాభః. ౨-౪-౬

రతిక్రియకు ఉపక్రమించిన కాముకులకు ఇది నఖక్షతంచేసే తావనిగానీ, ఇది తావు గాదనిగానీ విచక్షణ అవసరంలేదు. అని సువర్ణనాభులంటున్నారు.

౪౦౭. తత్రసవ్యహస్తాని ప్రత్యగ్రశిఖరాణి ద్విత్రిశిఖరాణి చండవేగయో ర్నఖానిస్యుః. ౨-౪-౭

ఈ నఖక్షతాలనేవి గోళ్లవల్ల చేయవలసినవి గనుక వాటికి ఆశ్రయాలేమిటో, ఎలాకల్పించాలో, ఎలాఉండాలో, ఎంత

ప్రమాణం కలిగిఉండాలో ఆ విధాన్ని చెపుతున్నారు. సాధారణంగా ఈ నఖక్షతాలకోసం ఎడమచేతిని ఉపయోగించాలి. ఆ చేతిగోళ్లు కొసలు తేలిఉండాలి. ఆ కొనలుగూడా రంపపు పళ్లవలె రెండుమూడుపళ్లు కలిగిఉండాలి. అవి చాలాసేపు రతిచెయ్యగలిగినవాళ్లే ప్రయోగించాలని పూర్వమే చెప్పి ఉన్నారు.

౪౦౮. అనుగతరాగరాజి,సమముజ్జ్వల మమలిన మవిపాటితం వివర్ధిష్ణు మృదుస్నిగ్ధ దర్శన మితినఖగుణాః.

ఆగోళ్లు ఎలా ఉండాలో చెపుతున్నారు. పలురకాలైన రంగు రంగుల రేఖలుగలిగి, సమానమైన వెనుక భాగంకలిగి, మట్టి మొదలైన మురికి చేరకుండా, ప్రకాశవంతమయి, చీలికలు లేకుండా, బాగా పెరిగే స్వభావంగలిగి, మెత్తదనంతో చూడడానికి అందంగా ఉండాలి గోళ్లు.

౪౦౯. దీర్ఘాణి హస్తశోభీన్యాలోకేప యోషితాం చిత్తగ్రాహీణి గౌడానాం నఖానిస్యుః. ౨-౪-౯.

గౌడదేశంలో ఉండేవాళ్ళ గోళ్లు పొడవుగానూ, హస్తానికి అలంకారంగానూ, ఆడవాళ్ళ మనస్సునకెంతో ఆహ్లాదం చేకూర్చేవిగానూ, ఉంటాయి. కాని ఇవి నఖక్షతాలకు పనికిరావు.

౪౧౦. హ్రస్వాని కర్మసహిష్ణూని వికల్పయోజనాసుచ స్వేచ్ఛావపాతీని దాక్షిణాత్యానాం. ౨-౪-౧౦.

దక్షిణ దేశీయులగోళ్లు పొట్టిగానూ, క్షతాలు చెయ్యడానికి వీలుగానూ, పలురకాలైన క్షతాలను చెయ్యడానికి అనుకూలంగానూ ఉంటాయి.

౪౧౧. మధ్యమా న్యుభయభాంజి మహారాష్ట్రికాణా
మితి. ౨-౪-౧౧

మహారాష్ట్రీల గోళ్లు పొడుగూ, పొట్టీ, కాకుండా మధ్యరకం గా ఉంటాయి.

౪౧౨- తైగిసుభియమిత్తైగి హనుదేశే, స్తనయోరధరే వా
లఘుకరణ, మనుద్గత లేఖం, స్పర్శమాత్రజననా
ద్రోమాంచకర మంతేసంనిపాతవర్ధమాన శబ్ద
మాచ్ఛురితకం. ౨-౪-౧౨.

ఇక అచ్ఛురితకమూ మొదలైన నఖక్షతాల స్వరూపాలనూ, వాటిని ప్రయోగించే ప్రదేశాలను గూడా వివరిస్తున్నారు. పై విధంగా చక్కని గుణాలతో ఒప్పుతూ ఉన్న గోళ్ళను అయిదింటినీ, ఒక గుత్తిలాగా ముడిచి, బుగ్గలమీదగాని, స్తనాల మీదగాని, అధరంమీదగాని, తేలికగా, గిచ్చుపడకుండా స్పృశిస్తే దాన్ని అచ్ఛురితకం అంటారు. ఈ నఖక్షతంలో స్పర్శమాత్రం చేతనే ఒంటినిండా గగుర్పాటు జనిస్తుంది. ఈ నఖక్షతం చెయ్యడం చేత కొద్దిగా నాయిక ముఖంనుంచి సీత్కారం బయలుదేరుతుంది.

౪౧౩. ప్రయోజ్యాయాంచ తస్యాంగసంవాహనే, శిరసి
కండూయనే, పిటకభేదనే, వ్యాకులీకరణే, భీషణేప
ప్రయోగః. ౨-౪-౧౩

పైనచెప్పిన నక్షతాల్ని అవస్థాభేదాన్నిపట్టి ఇతరచోట్లగూడా ప్రయోగించాలి. నాయిక కన్యకఅయినప్పుడు నాయకుడు ఆమెను విశ్వసింపచెయ్యడానికి ఈ నఖక్షతాన్ని ప్రయోగిం

చాలి. ఇంకా ఈ నఖక్షతాన్ని ఎక్కడెక్కడ సంవాహనం చేస్తే అక్కడల్లా ప్రయోగించవచ్చు. తలలోని దురదను ఒదల్చడానికీ, కురుపు చిదపడానికీ, చక్కిలిగింత పెట్టడానికీ భయపెట్టడానికీ ప్రయోగించవచ్చు. వీటిని నాయికా నాయకులు ఇద్దరూ పరస్పరమూ ప్రయోగించుకోవచ్చు.

౪౧౪. గ్రీవాయాం స్తనపృష్ఠేచ వక్రోనఖపదనివేశో౽ర్ధ చంద్రకః. ౨-౪-౧౪

కంఠానికి ప్రక్కభాగాలలోనూ, స్తనాలకు వెనుకభాగం లోనూ, అర్ధచంద్రాకారంగా నఖక్షతాలు చెయ్యాలి. ఇలా చేస్తే దాన్ని అర్ధచంద్రకం అంటారు.

౪౧౫. తావేవద్వౌ పరస్పరాభిముఖౌ మండలం. ౨-౪-౧౫.

పైనచెప్పిన నఖక్షతాలనే రెండింటిని ఒకదానికొకటి ఎదురుగా ఉండేట్టుచేస్తే దాన్ని మండలం అంటారు.

౪౧౬. నాభిమూలకకుందర వంక్షణేషు తస్యప్రయోగః.

పైనచెప్పిన మండలకాన్ని బొడ్డుదగ్గరా, పిరుదులపైనా, గజ్జల లోనూ, ప్రయోగించాలి.

౪౧౭. సర్వస్థానేషు నాతి దీర్ఘ కాలే. ౨-౪-౧౭

ఇంకా యితరప్రదేశాలలో అన్నిచోట్లా ఎక్కువ పొడుగు రేఖలులేని నఖక్షతాలు చెయ్యాలి.

౪౧౮. సైవ వక్రా వ్యాఘ్రనఖక మాస్తనముఖం.

స్తనంయొక్క చివరభాగంనుంచి పై భాగంలో వంకరగా నఖక్షతంచేస్తే దాన్ని వ్యాఘ్రనఖకం అంటారు.

౪౧౯. పంచభి రభిముఖై ర్నఖై ర్లేఖా చూచుకాభిముఖీ మయూరపదకం. ౨-౪-౧౯

బొటనవ్రేలి గోటిని చనుముక్కునకు క్రిందిభాగంలోనూ తక్కిన నాలుగువ్రేళ్లగోళ్లనూ చూచుకానికి పై భాగంలోనూ నాటేట్టు నఖక్షతంచేస్తే దాన్ని మయూరపదకం అంటారు. ఈ మయూరపదకంలో అయిదుగోళ్లూ చూచుకానికి (చనుముక్కునకు) చుట్టుకుని అభిముఖంగా ఉంటాయి.

౪౨౦. తత్సంప్రయోగశ్లాఘాయాగి స్తనచూచుకేసంని కృష్టాని పంచనఖపదాని శశప్లుతకం. ౨-౪-౨౦

పై మయూరపదకం ప్రయోగించినమీదట అనురాగాన్ని పొందుతూఉన్న నాయికను నాయకుడు ఆమె స్తనచూచుకానికి దగ్గరగా తనచేతిగోళ్ల చివళ్లను అయిదింటినీ ఒకచోటికి చేర్చి ఆనించి క్షతంచెయ్యాలి. దాన్ని శశప్లుతకం అంటారు. ఈ శశప్లుతకం స్త్రీలకు చాలా ఇష్టమైనది. సామాన్యంగా స్త్రీలందరూ స్తనాగ్రంమీద అయిదు నఖాగ్రాలనూ ఆనించి నఖక్షతంచేస్తే చాలా మెచ్చుకుంటారు.

౪౨౧. స్తనపృష్ఠే మేఖలాపథే చోత్పలపత్రాకృతీత్యుత్పలపత్రకం. ౨-౪-౨౧

నాయికయొక్క స్తనాగ్రానికి వెనుకభాగంలోనూ, కటిభాగం లోనూ, నల్ల కలువ రేకులాగా గోళ్ల అగ్రాలనుఆనించి గిచ్చితే దాన్ని ఉత్పలపత్రకం అంటారు.

౪_౨_౨. ఊరోర్వాఁ స్తనపృష్ఠేచ ప్రవాసం గచ్ఛతః స్మరణీయకం సంహతాశ్చతస్ర స్తిస్రోవా లేఖాః, ఇతి నఖకర్మాణి. ౨-౪-౨౨

నాయకుడు దేశాంతరానికి పోయేసమయంలో, నాయికయొక్క తొడమీద, "చాలాకాలం వియోగం కలుగకుండుగాక" అనే భావంతో మంగళంకొరకుగానూ, గుర్తుగానూ, నాలుగుగానీ, మూడుగానీ, రెండుగానీ నఖక్షతాలు చెయ్యాలి. ప్రవాసం ఎక్కువకాలం చెయ్యబోతుంటే ఎక్కువగానూ, తక్కువకాలం చెయ్యబోతుంటే తక్కువగానూ ఈనఖక్షతాలు చెయ్యాలన్న మాట. నాయికతో వియోగం జరగబోయేసమయంలో జ్ఞాపకంకోసం ఈ నఖక్షతాన్ని చేస్తారుగనుక దీన్ని స్మరణీయకం అంటారు.

౪_౨౩. ఆకృతి వికారయుక్తా న్యన్యాన్యపి కుర్వీత.

ఇంకా పక్షులూ, పుష్పాలూ, పాత్రలూ, ఆకులూ, తీగెలూ, మొదలైన ఆకారాలతోగూడా నఖక్షతాలు చెయ్యవచ్చు. ఇలా చెప్పడంవల్ల నఖక్షతాలు నాయికానాయకుల యిష్టాలను పట్టి చాలా యెక్కువ విధాలుగా ప్రయోగించుకోవచ్చు, నని స్పష్టమయింది.

౪_౨౪. వికల్పానా మనంతత్వా దానంత్యాచ్చకౌశలవిధే రభ్యాసస్య చ సర్వగామిత్వా ద్రాగాత్మకత్వా చ్ఛేదస్య ప్రకారాన్ కోఽభిసమీక్షితు మర్హతీ త్యాచార్యాః. ౨-౪-౨౪

మొత్తంమీద నఖక్షతాలు ఎనిమిదిరకాలే అగుగాక. అయినా వాటిలో మరలమరల ఏర్పడే ప్రభేదాలకు లెక్కలేదు గనుక నున్నూ, వీటిలో నేర్పూ అభ్యాసమూ కారణంగా అనేక భేదాలు పుట్టవచ్చును గనుకనున్నూ, నఖక్షతాలనేవి ప్రేమకు గుర్తులుగనుకనున్నూ, వీటిలో ఇన్ని ప్రభేదాలు పుడతాయని ఎవడుచెప్పగలడు? అని పూర్వాచార్యులమతం.

౪_౨౫. భవతి హి రాగోఽపి చిత్రాపేక్షా వైచిత్ర్యాచ్చ పరస్పరం రాగో జనయితవ్యో, వైచక్షణ యుక్తాశ్చ గణికా స్తత్కామినశ్చ పరస్పరం ప్రార్థనీయా భవంతి,ధనుర్వేదాదిష్వపిహి శస్త్రకర్మశాస్త్రేషు వైచిత్ర్యమేవ అపేక్ష్యతే, కిం పునరిహేతివాత్స్యాయనః. ౨-౪-౨౫

ఇక వాత్స్యాయనులు తమ మతాన్ని వివరిస్తున్నారు. నాయికానాయకుల అనురాగసమయంలోనూ, అనురాగంలేని సమయంలోనూగూడా ప్రయోగింపబడతాయి గనుక ఈ నఖక్షతాలు అనంతాలుగా ఉండడం సహజమే. అసలు అనురాగంఅనేది స్వతసిద్ధమయినా, కల్పితం అయినా క్రొత్తక్రొత్త విచిత్రాలులేనిదే జనించదు. అలాటి విచిత్రాలు ఎఱిగి బాగా విమర్శతో ప్రయోగించేశక్తిగల "దేవదత్త" మొదలైన

వేశ్యలూ, విశేషరతికోసం అపేక్షపూనిన "మూలదేవుడూ," మొదలైనవారి విటులూ, ఒకళ్లనొకళ్లు ప్రార్థించుకోతగిన వారయి ఉన్నారు. అందువల్ల కామినీ కాముకులకు వైచిత్ర్యం అనురాగాన్ని పుట్టిస్తుంది. ఇలాటి వైచిత్ర్యాన్ని అపేక్షించడమూ, అలాటి వైచిత్ర్యంకలవారిని ఆ విద్యకోసం అనుసరించడమూ ఇతర శాస్త్రాల్లోగూడా కనిపిస్తోంది. ధనుర్వేదమూ మొదలైన కుంతములూ, ఖడ్గాలూ, అస్త్రాలూ, శస్త్రాలూ, మొదలైనవాటి ప్రయోగాన్ని నేర్పే శాస్త్రాలలోగూడా విచిత్రప్రయోగమే అనుసరింపబడుతుంటే, ఇక ఎప్పటికప్పుడు క్రొత్తదనపు అనురాగాలకోసం, చేష్టలకోసం, అనుభవాలకోసం వెంపరలాడే నాయికానాయకులకు బోధించే ఈ కామసూత్రంలోని వైచిత్ర్యాన్నిగూర్చి వేరే చెప్పవలెనా? ఈ శాస్త్రంలో వైచిత్ర్యమే ముఖ్యం. అలా లేకపోతే అనాగరకునికీ, నాగరకునికీ భేదం ఏమున్నది?

౪౨౬. నతు పరపరిగృహీతా స్వేవం కుర్యాత్, ప్రచ్ఛన్నేషు ప్రదేశేషు తాసామనుస్మరణార్థం రాగవర్ధనాచ్చ విశేషాన్ దర్శయేత్. ౨-౪-౨౬

పరస్త్రీలు ఎంతగా వైచిత్ర్యాన్నికోరేవారైనా, విచిత్రరతులతో రహస్యంగా ఉపభోగింపవలసినవారు గనుక వారికి తొడలూ, కటిభాగమూ, గజ్జలూ, మొదలైన రహస్యస్థానాలలో మాత్రమే జ్ఞాపకంకోసం ఈ నఖక్షతాలను విటులు ప్రయోగించాలి. ఈ నఖక్షతాలలోని విశేషాలను చూచుకుని తమ విటులను స్త్రీలు స్మరించుకుంటారు. వారికి రోజరోజూ, సమా

గమం కుదరదుగదా? అవి చూచినప్పుడల్లా సంతోషాధిక్యాన్ని కల్పించి స్ఖలనసుఖానికిమూలమైన విశేషప్రీతిని చేకూరుస్తాయి స్త్రీలకు.

౪౨౭. నఖక్షతాని పశ్యంత్యా గూఢస్థానేషు యోషితః,
చిరోత్సృష్టాప్యభినవా ప్రీతిర్భవతి పేశలా.

స్త్రీలు తమ సొగసుగాళ్లు రహస్యప్రదేశాలలో చేసిన నఖక్షతాలను చూచుకుని చాలాకాలంనుంచీ వియోగాన్ని పొంది ఉన్నా, కృత్రిమంలేని క్రొత్తక్రొత్త ప్రేమలను పూనుతారు.

౪౨౮. చిరోత్సృష్టేషు రాగేషు ప్రీతిర్గచ్ఛే త్పరాభవం
రాగాయతన సంస్మారియదివస్యా న్నఖక్షతం.

నాయికానాయకులకు చాలాకాలంక్రిందట సమాగమాన్ని పొంది విడిపోవడంవల్ల ప్రేమ నశించిపోయినా, రూపాన్నీ, యౌవనాన్నీ, గుణాలనూ, ఈ నఖక్షతాలు జ్ఞాపకం చేస్తాయి. కాబట్టి ఇవి ముఖ్యంగా అవసరాలు.

౪౨౯. పశ్యతో యువతిం దూరాన్నఖోచ్ఛిష్ట పయోధరాం
బహుమానః పరస్యాపి రాగయోగశ్చ జాయతే.

తన వల్ల స్తనాలమీద నఖక్షతాలను పొంది ఉన్నవనిత దూరంనుంచి కనుపించినా, ఆ నాయకునికి ఆ స్త్రీ అంటే అభిమానమూ, అనురాగమూ జనిస్తాయి.

౪౩౦. పురుషశ్చ ప్రదేశేషు నఖచిహ్నైః ర్విచిహ్నితః,
చిత్తం స్థిరమపిప్రాయః చలయత్యేవ యోషితః.

పురుషుడు స్త్రీవల్ల నఖక్షతాలుపొంది ఆమెను చూచినప్పుడేలా చంచలుడవుతున్నాడో అలాగే స్త్రీగూడా పురుషుని నఖక్షతాలుపొంది తరువాత తరువాత వ్రతానుష్ఠానాదులలో ఉన్నా, అతనిని చూచినప్పుడు చలిస్తూనే ఉంటుంది.

४३०-४३१. నాన్యత్పటుతరం కించి దనురాగ వివర్ధనం,
నఖదంతసముత్థానాం కర్మణాం గతయో యథా.

ఇతి శ్రీ వాత్స్యాయనీయే, కామసూత్రే, సాంప్రయోగికే, ద్వితీయేఽధికరణే, చతుర్థోఽధ్యాయః.

స్త్రీ పురుషులకు అనురాగాన్ని వృద్ధిపొందించడంలో ఈ నఖక్షతాలూ, దంతక్షతాలూ ఉపకరించినట్లు మరి యేకర్మలూ ఉపకరించవు.

ఈపద్ధతిగా భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబ సూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయ మూర్తి చేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను తెలుగు వ్యాఖ్యలోని సాంప్రయోగికాధికరణంలో నఖక్షతం అనే నాలుగో అధ్యాయం ముగిసింది.

---

శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

౨. సాంప్రయోగికాధికరణం

### ౫. దశనచ్ఛేద్యాధ్యాయం

౮౩౩. ఉత్తరోష్ఠ మంతర్ముఖం నయనమితి ముక్త్వా చుంబనమితి రదనస్థానాని. ౨-౫-౧

పై అధ్యాయంలో చెప్పినవిధంగా నఖక్షతాలతో ఉపక్రమించి అంతకంటె ఎక్కువగా అనురాగాన్ని వృద్ధిచేసే దంతక్షతాలతో ఉపక్రమించడానికి దంతక్షతవిధులుగూడా ముఖ్యావసరం. అవిగూడా ఆయా దేశానికి అనుకూలమైనవి ప్రయోగిస్తేనే అనురాగాన్ని కల్పిస్తాయి. ఆ దంతక్షతాలు ప్రయోగించ తగిన స్థానాలు చెవుతున్నారు. పై పెదవీ,నాలుకా,నేత్రాలూ, వదలి చుంబనానికి చెప్పిన పది స్థానాలూ దంతక్షతాలకు కూడా ఉపయోగపడతాయి. అంటే నుదురూ, అధరమూ, కంఠమూ, చెక్కిళ్లూ, వక్షస్థలమూ, చన్నులూ, ఈ పదీ దంతక్షతాలకుకూడా యోగ్యాలన్నమాట. గజ్జలూ,చంకలూ, భగమూ అనేవి లాటదేశీయుల చుంబనాలకూ దంత

క్షతాలకూ స్థానాలయినా అందరుజనులూ ఆస్థానాలను చుంబించకూడదు. అక్కడ దంతక్షతం చెయ్యరాదు.

౪౩౪. సమాః స్నిగ్ధచ్ఛాయా రాగగ్రాహిణో యుక్త ప్రమాణా నిశ్ఛిద్రాస్తీక్ష్ణాగ్రా ఇతి దశ రదనగుణాః

ఇక దంతాలు ఎలాఉండాలో నిరూపిస్తున్నారు. గొగ్గులులేకుండా, సమంగానూ, నునుపుగానూ, తళతళలాడుతూ, తాంబూలరాగంగలిగి, తగినపొడవూ వెడల్పూకలిగి, సందులు లేకుండా, వాడికలిగి, మొనలు తేలిఉంటే ఆ పళ్లు దంతక్షతాలకు చాలా శ్రేష్ఠాలు. దంతాలు ఇలా ఉండాలన్నమాట.

౪౩౫. కుంఠా, రాజ్యుద్గతాః, పరుషాః, విషమాః, శ్లక్ష్ణాః, పృథవో, విరళా ఇతి చ దోషాః. ౨-౫-౩

ఇంక దంతాలలోని లోపాలను చెపుతున్నారు. మొక్కపోయి ఉన్నా, మధ్యమధ్య చారలుకలిగిఉన్నా, కరుకుతేలిఉన్నా, గొగ్గిగాఉన్నా, తొట్టిగాఉన్నా, పెద్దపెద్దవిగాఉన్నా, బాగా సందులుకలిగిఉన్నా, ఆ పళ్లు ముఖానికి అలంకారాలు కాకపోగా దంతక్షతాదులకుగూడా పనికిరావు. ఈ పైన చెప్పినవి పండ్లకుండే ప్రధానదోషాలు.

౪౩౬. గూఢక, ముచ్ఛూనకం, బిందు, ర్బిందుమాలా, ప్రవాలమణి, ర్మణిమాలా, ఖండాభ్రకం, వరాహ చర్వితకమితి దశనచ్ఛేదన వికల్పాః. ౨-౫-౪

గూఢకమూ, ఉచ్ఛూనకమూ, బిందువూ, బిందుమాలా, ప్రవాళమణీ, మణిమాలా, ఖండాభ్రకమూ, వరాహచర్వితకమూ, అని దంతక్షతాలు ఎనిమిదికాలు.

౪౩౭. నాతిలోహితేన రాగమాత్రేణ విభావనీయం గూఢకం. ౨-౫-౫

పైనచెప్పిన గూఢకమూ మొదలైన దంతక్షతాలస్వరూపమూ, వాటిని ప్రయోగించతగిన స్థానాలూ చెవుతున్నారు. ఎక్కువ ఎరుపు ఏర్పడకుండా పంటిమొనతో నొక్కితే దాన్ని గూఢకం అంటారు. ఇందులో శ్రేష్ఠమై అందమైన పంటితో ఎక్కువ నొప్పి కలుగకుండా నొక్కడంమాత్రమే జరుగుతుంది.

౪౩౮. తదేవ పీడనా దుచ్ఛూనకం. ౨-౫-౬

పైన చెప్పినదానికంటె మరికొంచెం గట్టిగానొక్కితే దాన్ని ఉచ్ఛూనకం అంటారు. ఇందులో నొక్కినచోట కొంచెం పొక్కుతుంది.

౪౩౯. తదుభయం బిందు రధరమధ్య ఇతి. ౨-౫-౭

పైనచెప్పిన గూఢకమూ, ఉచ్ఛూనకమున్నూ, ముందు చెప్పబోయే బిందువూ అనే యీ మూడూగూడా అధరానికి మధ్యభాగంలో ప్రయోగించాలి.

౪౪౦. ఉచ్ఛూనకం ప్రవాళమణిశ్చ కపోలే. ౨-౫-౮

ఉచ్ఛూనకమూ, ముందుచెప్పబోయే ప్రవాళమణీ అనే రెండూ బుగ్గలమీద ప్రయోగించాలి. అక్కడ వాటిని ప్రయోగించడానికి చాలా అనుకూలంగా ఉంటుంది.

౪౪౧. కర్ణపూరచుంబనం నఖదశనచ్ఛేద్య మితి సవ్యకపోల మండనాని. ౨-౫-౯

అయితే యే బుగ్గమీద వీటిని ప్రయోగించాలి? అంటే చెవుతున్నారు. కర్ణాలంకారాన్ని ముద్దుపెట్టుకోడమూ, నఖక్ష

తాలుచెయ్యడమూ, దంతక్షతాలుచెయ్యడమూ ఇవన్నీ ఎడమ కపోలానికి (బుగ్గకు) అలంకారాలు.

౨౨౨. దంతోష్ఠ సంయోగాభ్యాస నిష్పాదనా ప్రవాళ మణిసిద్ధిః. ౨-౫-౧౦

పై పళ్లనూ, క్రిందిపెదవినీగానీ, క్రిందిపళ్లనూ, పై పెదవినిగానీ క్షతంచేసే స్థానంలో సమకూర్చి మాటిమాటికీ అభ్యసిస్తూ, బాధకల్పిస్తే దాన్ని ప్రవాళమణిసిద్ధి అంటారు. ఈ అభ్యాసం వల్ల ప్రవాళమణిలాగా పల్లునాటి జేవురింపక దంతాలూ పెదవీ వాటి విన్యాసమాత్రమే జరుగుతుంది.

౨౨౩. సర్వస్యేయం మణిమాలాయాశ్చ. ౨-౫-౧౧

ఈ మణిమాలగూడా పై ప్రవాళమణిసిద్ధిలాగానే దంతాలతోనూ, పెదవితోనూ జనింపచేసేదే. ఇక దానికీ దీనికీ భేదం ఏమంటే ఒక్కచోటమాత్రం చేస్తే మొదటిదీ, వరుసగా చాలాచోట్ల అలాచేస్తే మణిమాలా అవుతాయి.

౨౨౨. అల్పదేశాయాశ్చ త్వచోదశనద్వయ సందంశజా బిందుసిద్ధిః. ౨-౫-౧౨

కంఠప్రదేశంలో మినపగింజంతగానూ, అధరోష్ఠంమీద నువ్వుగింజంతగానూ పై పంటితోనూ, క్రిందిపంటితోనూ క్షతంచేస్తే దాన్ని బిందుసిద్ధి అంటారు. ఇందులో ముంగలినాలుగు పండ్లతోనూ కొద్దిగా ఒక్కమాటుగా కొరకడం సంభవిస్తుంది.

౨౨౫. సర్వైర్బిందుమాలాశ్చ. ౨-౫-౧౩

పైనచెప్పిన బిందుక్షతాన్ని చాలాచోట్లచేస్తే దాన్ని బిందుమాల అంటారు.

౨౨౬. తన్మాల్మాలాద్వయమపిగళకక్ష వంక్షణ ప్రదేశేషు.
పైనచెప్పిన మణిమాల, బిందుమాలలు కంఠంమీదా, చంకల లోనూ, గజ్జలలోనూ ప్రయోగించవచ్చు.

౨౨౭. లలాటే చోర్వోర్బిందుమాలా. ౨-౫-౧౫
నుదురుమీదా, తొడలమీదాకూడా బిందుమాలను ప్రయోగించవచ్చు.

౨౨౮. మండలమివ విషమకూటక యుక్తం ఖండాభ్రకం స్తనపృష్ఠ ఏవ. ౨-౫-౧౬
కొన్నిపళ్లు బాగా నాటేరీతిగానూ, కొన్నిపళ్లు కొద్దిగానాటే రీతిగానూ, కొన్నిపళ్లు మరీకొద్దిగా నాటేరీతిగానూ, గుండ్రని ఆకారంగా చన్నులమీద దంతక్షతంచేస్తే దాన్ని ఖండాభ్రకం అంటారు. ఈ దంతక్షతం స్తనాలమీద చెయ్యడానికి చాలా వీలుగా ఉంటుంది.

౨౨౯. సంహతాః ప్రదీర్ఘా బహ్వ్యోదశన పదరాజ యస్తామ్రాంతరాళా వరాహచర్వితకం స్తనపృష్ఠ ఏవ. ౨-౫-౧౭
చంటికి ఒకవైపునుంచి మరొకవైపుదాకా చర్మను పండ్లతో బాగానొక్కి లోతుగానూ, ఎఱ్ఱగా గంట్లుపడేరీతిగానూ నాలుగైదువరుసలు కల్పిస్తే దాన్ని వరాహచర్వితకం అంటారు. దీనికిగూడా చన్నుయొక్క వెనుకభాగమే అనుకూలంగా ఉంటుంది.

౨౩౦. తదుభయమపిచ చండవేగయోః ఇతి దశనచ్ఛేద్యాని. ౨-౫-౧౮
పైనచెప్పిన ఖండాభ్రకమూ, వరాహచర్వితకమూ, అనే

రెండురకాలైన దంతక్షతాలూ, కూడా చాలాసేపు రతిచెయ్య గలిగినవానికి ప్రయోగించతగినవి. వీటినే నాయికకూడా ప్రయోగించవచ్చు. స్త్రీకి చన్నులమీద చెయ్యతగినవన్నీ పురుషునికి వక్షస్థలంమీద చెయ్యవచ్చు. శాస్త్రాధికారం స్త్రీ పురుషులకిద్దరికీ ఉన్నదిగనుక స్త్రీలు వీటిని ప్రయోగించ డానికి జంకుపడనవసరంలేదు. దేశాచారాన్నిపట్టీ,కాలాన్నిపట్టీ కొన్నిమాత్రం స్త్రీలకు చెయ్యరానివిగా ఉంటాయి. అలాగే పురుషులకునూ, స్త్రీ పురుషులు ఒకళ్లమీదఒకళ్లు ప్రయో గించుకునే దంతక్షతాలు ఇవిమాత్రమే ఇక్కడ చెప్పారు. ఇవిగూడా సంయోగానికి బాగా ప్రోత్సాహాన్నిస్తాయి.

౨౫౧. విశేషకే కర్ణపూరే పుష్పాపీడే తాంబూలే పలాశే తమాలపత్రేచేతి ప్రయోజ్యాగామిషు నఖదశన చ్ఛేద్యాదీన్యాభియోగికాని. ౨-౫-౧౮

భూర్జపత్రాలూ, మొదలైన ఆకులతో కల్పించిన తిలకాల మీదా, తలమీదా,చెవులమీదా, అలంకరించుకునే పూలమీదా, పూలచెండ్లమీదా, చక్కని తములపాకుమీదా, మోదుగు ఆకుమీదా, తాపింఛపత్రముమీదా, నాయికలదగ్గరకు పోయే నాయకులు తమ భావాలను సూచించడానికి గోళ్లతోనూ, పళ్లతోనూ కొన్ని ఆకారాలను సృష్టించడాన్ని ఆభియోగికం అంటారు. అంటే పరిచయంకోసం చేసే పనులన్నమాట. ఈ వస్తువులమీద నఖక్షతాలూ, దంతక్షతాలూ, కల్పించి పరి మళద్రవ్యాలతో గుమగుమలాడించి దూతికద్వారా నాయిక దగ్గరకు పంపాలన్నమాట.

౪౫_౨. దేశ సాత్మ్యాచ్చ యోషితః ఉపచరేత్. ౨-౫-౨౦.
ఆచారమనేది దేశాచారమనీ, తనకు స్వతస్సిద్ధంగా ఇష్టమైన ఆచారమనీ రెండురకాలు. ఈ రెండురకాలైన ఆచారాలతోనూ, స్త్రీలను ఉపచరించవచ్చు. అలాగే స్త్రీలుగూడా పురుషులను ఉపచరించవచ్చు. ఉపచరించడంఅంటే రంజింపచెయ్యడమూ, లేక, తృప్తిపరచడమూ అని అర్థం.

౪౫౩. మధ్యదేశ్యా ఆర్యప్రాయాః శుచ్యుపచారాశ్చుంబన నఖ దంత పద ద్వేషిణ్యః. ౨-౫-౨౧

మధ్యదేశం అంటే హిమవత్పర్వతానికీ, వింధ్యపర్వతానికీ మధ్యభాగంలోనూ, వినశనానికి తూర్పుగానూ, ప్రయాగకంటె కొంచెం పడమరగానూ ఉన్న దేశం అన్నమాట. ఇది భృగుపుమతం. మరికొందరు గంగాయమునానదుల మధ్యదేశం అంటున్నారు. ఇది వసిష్ఠునిమతం. భృగువు చెప్పినమతమే శాస్త్రకర్తలకుగూడా ఇష్టం. ఆ మధ్యదేశంలో పుట్టిన ఆచారాలే మధ్యదేశ్యాలు. అవి పవిత్రాలైన ఆచారాలు. వాటిని లోకోత్తర పవిత్రచరితులైన ఆర్యులు ఆచరిస్తారు. వారిస్త్రీలు ముద్దులనూ, నఖక్షతాలనూ, దంతక్షతాలనూ ద్వేషిస్తారు. కేవలం ఆలింగనాన్ని మాత్రమే కోరతారు. ప్రణయతాడనాల విషయంలో మధ్యరకం అభిలాష కలిగిఉంటారు.

౪౫౪. బాహ్లీకదేశ్యా ఆవంతికాశ్చ. ౨-౫-౨౨

బాహ్లీకదేశం అంటే ఉత్తరాపథం. అవంతికమంటే ఉజ్జయినిలో ఒకభాగం. ఈ రెండుదేశాలలోని స్త్రీలున్నూ చుంబనాలనూ, నఖదంతక్షతాలనూ ద్వేషిస్తారు.

౪౫౫. చిత్రరతేషుత్వాసామభినివేశః ౨-౫-౨౩
ముస్ముందు చెప్పబోయే చిత్రరతాలలో వాళ్లకు చాలా అభి
లాష ఉంటుంది.

౪౫౬. పరిష్వంగ చుంబన నఖదంత చూషణ ప్రధానాః
క్షతవర్జితాః ప్రహణనసాధ్యాః మాలవ్యః అభీర్యశ్చ.
పూర్వమాళవదేశంలోనూ, శ్రీకంఠక్షేత్రంలోనూ, కురుక్షే
త్రంలోనూ పుట్టినస్త్రీలు ఆలింగనాలనూ, ముద్దులనూ, నఖ
క్షతాలనూ, దంతక్షతాలనూ, చాలా ముఖ్యంగా కోరతారు.
కాని గంట్లుపడేలాగా నొక్కడానికీ గిచ్చడానికీ ఒప్పుకోరు.
ప్రణయతాడనాలవల్ల బాగా చొక్కి వశం అవుతారు.

౪౫౭. సింధు షష్ఠానాంచ నదీనా మంతరాళీయా ఔప
రిష్టిక సాత్మ్యాః. ౨-౫-౨౫
సింధునదీ, వినాట్ నదీ, శతద్రునదీ, ఇరావతినదీ, చంద్ర
భాగానదీ, వితస్తానదీ అనే ఆరునదులయొక్క మధ్యభాగంలో
పుట్టినస్త్రీలు పైనచెప్పిన ఆలింగనాలూ, చుంబనాలూ, దంత
క్షతాలూ, నఖక్షతాలూ, ప్రణయతాడనాలూ, సీత్కృ
తాలూ, ఉన్నా తృప్తిపడక పురుషుని మేహనాన్ని నోటితో
గ్రహించి ఔపరిష్టిక క్రియనుగూడా ఆచరిస్తేనేగాని తృప్తిపడ
రు. దీన్నే ముఖరతి అంటారు. ఈ అపేక్షగల నాయికను
ముఖచపల అంటారు.

౪౫౮. చండవేగా మందసీత్కృతా అపరాంతికా లాట్యశ్చ.
పడమటి సముద్రంఒడ్డునఉన్న దేశాన్ని అపరాంతదేశం
అంటారు. అక్కడ పుట్టినస్త్రీలు ఆపరాంతికలు. అపర మాళ

వదేశంకంటె పడమరగాఉన్న లాటదేశంలో పుట్టినస్త్రీలు లాటస్త్రీలు. ఈ రెండుదేశాలలో పుట్టినవారు చాలా బలవంతులు కావడంవల్ల చాలాసేపు రతిచెయ్యగలుగుతారు. కొద్దికొద్దిగా సీత్కారాలుచేస్తారు. కొద్దికొద్దిగా నఖక్షతాలనూ, దంతక్షతాలనూగూడా సహిస్తారు. ప్రణయతాడనాలను గూడా ఓరుస్తారు. శ్రీకృష్ణుడు అవతారాన్ని చాలించినతరువాత ఆయన అంతఃపురజనాన్ని అర్జునుడు వెంటపెట్టుకునివస్తూఉంటే బలవంతులైన ఈ అపరాంతదేశీయులే కొల్లగొట్టినట్లు చెవుతున్నారు.

౨౯౯. దృఢప్రహణనయోగిన్యః ఖరవేగా ఏవ, అపద్రవ్యప్రధానాః స్త్రీరాజ్యే కోసలాయాంచ. ౨-౫-౨౭

వంగదేశానికీ, ప్రిరక్తదేశానికీ పడమరగాఉన్న దేశాన్ని స్త్రీరాజ్యం అంటారు. ఆ స్త్రీరాజ్యంలోనూ, కోసలదేశంలోనూ పుట్టినస్త్రీలు ఆలింగనాలూ, చుంబనాలూ, నఖక్షతాలూ, దంతక్షతాలూ, ఉన్నావాటితోనేకాక గాఢమైన ప్రణయతాడనాలతోగాని తృప్తిపడరు, సంగమించరు. వీరినే ఖరవేగలంటారు. దురద ఒదుల్చుకోడంకోసం ఎక్కువగా రతికోరడాన్ని ఖరం అంటారు. ఈ దేశాలలోని స్త్రీలు కండూతిని పోగొట్టుకోడంకోసం కృత్రిమసాధనాలను ఎక్కువగా ఉపయోగించుకుంటారు.

౨౭౦. ప్రకృత్యా మృద్వ్యో రతి ప్రియాః అశుచిరుచయో నిరాచారా శ్చాంధ్ర్యః ౨-౫-౨౮

నర్మదానదికి దక్షిణంగాఉన్న దేశాన్ని దక్షిణాపథం అంటారు.

ఆ దక్షిణాపథంలోని కర్ణాటదేశంకంటె తూర్పుగా ఉన్నది ఆంధ్రదేశం. అక్కడ పుట్టిన స్త్రీలు స్వభావసిద్ధంగా చాలా సుకుమారంగా ఉంటారు. ప్రణయతాడనాలూ, నఖక్షతాలూ, దంతక్షతాలూ, మొదలైనవి సహించరు. కేవలమూ రతిని మాత్రమే కోరతారు. తుచ్ఛమార్గాలను అనుసరిస్తారు. ఆచారం చాలాతక్కువ. హద్దుమీరి చరిస్తారు.

౨౬౧. సకలచతుష్షష్టి ప్రయోగరాగిణ్యో అశ్లీల పరుష వాక్యప్రియాః శయనేచ సరభసోపక్రమా మహారాష్ట్రికాః. ౨-౫-౨౯

నర్మదానదికిన్నీ కర్ణాటదేశానికిన్నీ మధ్యభాగంలో ఉన్న దేశం మహారాష్ట్రదేశము. అక్కడ పుట్టినస్త్రీలు గీతమూ మొదలైన అరవైనాలుగు కళలతోనూ, పాంచాలికీ చతుష్షష్టితోనూ, సంప్రయోగం జరిపితేనేగాని అనురాగం పొందరు. కాబట్టి వారు కళలయందు ఎక్కువ అభిలాష కలవారన్న మాట. అశ్లీలపుబూతుమాటలూ, గ్రామ్యపుపలుకులూ, కరుకుపలుకులూ, కఠినపుపలుకులూ పలుకుతూఉంటారు. ప్రియులు అలామాట్లాడితే సహిస్తారు. సంయోగసమయంలో చాలా తొందరపాటు చూపుతారు. ధూర్తలుకాబట్టి పురుషునికంటె ముందే సంయోగానికి ఉపక్రమిస్తారన్నమాట.

౨౬౨. తథావిధా ఏవ రహసి ప్రకాశంతే నాగరికాః.

పాటలీపుత్రంలో పుట్టినస్త్రీలు పై మహారాష్ట్ర స్త్రీలవంటివారే. అంటే వారుగూడా అన్ని చతుష్షష్టికళలనూ ప్రయో

గిస్తూ రతిసలిపితేగాని బాగా కరిగిపోరు. బూతుమాటలూ మొదలైనవి తాము మాట్లాడడం, వాటిని తమప్రియులు మాట్లాడుతుంటే సహించడం ఈ మొదలైనవి రహస్యంగా ఏకాంతసమయంలో బాగా ఆచరిస్తారు. మహారాష్ట్ర స్త్రీలు పదిమందిలోనూ, రహస్యంగానూగూడా పైరీతిగా ప్రవర్తిస్తారు. శయనంలో పురుషునికంటె ముందు తొందరపడటం రెండు దేశాలవారికీ సమానమే.

౨౬౩. మృద్యమానాశ్చాభియోగాన్ మందంమందం ప్రసించంతే ద్రావిడ్యః. ౨-౫-౩౧

కర్ణాటదేశానికి దక్షిణంగాఉన్నది ద్రవిడదేశం. అక్కడ పుట్టినస్త్రీలు రతిక్రియకుముందుగా ఆలింగనాలూ, చుంబనాలూ, మొదలైన అభియోగాలచేత బయటా లోపలాగూడా బాగా మర్దింపబడుతూ మెల్లమెల్లగా తృప్తిపడతారు. తరువాత తరువాత తొందరతొందరగా స్ఖలనసుఖాన్ని అనుభవిస్తారు.

౨౬౪. మధ్యవేగాఃసర్వంసహాః స్వాంగప్రచ్ఛాదిన్యః పరాంగహాసిన్యః కుత్సితాశ్లీల పరుష పరిహారిణ్యో వానవాసిక్యః. ౧-౫-౩౨

కోంకణదేశానికి తూర్పుగాఉన్నది వనవాసదేశం. అక్కడ పుట్టినస్త్రీలు భావాన్నిపట్టీ, కాలాన్నిపట్టీ మధ్యవేగం కలవారై ఆలింగనాదులనన్నింటినీ సహిస్తారు. తమ శరీరాన్ని ఎక్కువగా దాచుకోడానికి ప్రయత్నిస్తారు. ఇతరులనుచూచి హాస్యంచేస్తారు. కపటవ్యవహారం కలవాళ్లతోనూ, అసహ్యంగానూ, గ్రామ్యంగానూ, కరుకుగానూ, కఠినంగానూ మాట్లా

డేవాళ్లతోనూ, సంయోగంచెయ్యరు. అలాటివాళ్లను ద్వేషిస్తారు.

౭౬౫. మృదుభాషిణ్యో అనురాగవత్యో మృద్వంగ్యశ్చ గౌడ్యః. ౨-౫-౩౩

తూర్పుదేశాన్ని గౌడదేశంఅంటారు. ఆ దేశంలో జనించిన స్త్రీలు మధురంగానూ, మృదువుగానూ మాట్లాడతారు. పురుషుణ్ణి బాగా ప్రేమిస్తారు. సుకుమారమైన దేహం కలిగి ఉంటారు.

౭౬౬. దేశసాత్మ్యాత్ప్రకృతి సాత్మ్యం బలీయ ఇతి సువర్ణనాభో, నతత్ర దేశ్యా ఉపచారాః. ౨-౫-౩౪

సువర్ణనాభుడు దేశాచారంకంటె స్వభావసిద్ధమై తన హృదయంలో జనించిన ఆచారమే మంచిదనీ, బలవంతమయినదనీ, అన్నాడు. అంటే దేశాచారానికీ తన స్వభావసిద్ధమైన ఆచారానికీ విరోధం జనిస్తే దేశాచారాన్నివదలి తన ఊహకు తోచిన ఆచారాన్నే అనుసరించాలన్నమాట.

౭౬౭. కాలదేశాచ్చ దేశా ద్దేశాంతర ముపచార వేష లీలాశ్చ అనుగచ్ఛంతి తచ్చవిద్యాత్. ౨.౫.౩౫.

కాలంయొక్క సంబంధాన్నిపట్టి ఒక దేశానికి సంబంధించిన ఆచారాలు మరిఒకదేశానికి సంక్రమించవచ్చు. ఉపచారాలలోనూ, వేషాలలోనూ, విలాసాలలోనూ ఒక దేశంలోని జనులు మరి ఒక దేశంలోని ప్రజలను అనుసరించడంలో ఆశ్చర్యంలేదు. కాబట్టి ఆయా ఆచారాలను దేశాంతరంనుంచి

సంక్రమించినవా ? లేక స్వతస్సిద్ధాలా ? అని తర్కించుకుని యథార్థాన్ని కనిపెట్టి జాగ్రత్తగా ప్రవర్తించాలి. అలా ప్రవర్తించకపోతే ఉపచారభేదాన్ని చూచి స్త్రీలు తమకు సరి పడకపోవడంచేత విముఖలౌతారు.

౪౬౮. ఉపగూహనాదిషుచరాగవర్ధనం పూర్వం పూర్వం విచిత్ర ముత్తర ముత్తరంచ. ౨.౫.౩౬.

ఆలింగనమూ, చుంబనమూ, నఖక్షతమూ, దంతక్షతమూ, ప్రహణనమూ, సీత్కృతమూ అనే ఆరు బాహ్యరతులలోనూ సీత్కృతంకంటె ప్రహణనమూ, దానికంటె దంతక్షమూ, దానికంటె నఖక్షతమూ, దానికంటె చుంబనమూ, దానికంటె ఆలింగనమూ అనురాగాన్ని వృద్ధిపొందిస్తాయి. స్పర్శసుఖాన్ని ఎక్కువగా కల్పిస్తాయన్నమాట. ఇలాగే ఆలింగనంకంటె చుంబనం చిత్రమైనది. దానికంటె నఖక్షతం చిత్రం, దానికంటె దంతక్షతం చిత్రం, ఇలాగే తరువాతదీ, దానితరువాత దీ చిత్రాలు.

౪౬౯. వార్యమాణశ్చ పురుషోయ త్కుర్యాత్తదనుక్షతం, అమృష్యమాణా ద్విగుణం తదేవప్రతియోజయేత్. ౨.౫.౩౭.

వద్దని అడ్డగిస్తున్నా, బలవంతంగా పురుషుడు దంతక్షతంగానీ, నఖక్షతంగానీ చేస్తే స్త్రీగూడా సహించక అలాగే అతనికంటె మరింత ఎక్కువగా ఆ క్రియను చేస్తుంది.

౪౭౦. బిందౌ ప్రతిక్రియామాలా, మాలాయాశ్చాభ్ర
ఖండకం, ఇతి క్రోధాదినావిష్టో, కలహాన్ప్రతియోజ
యేత్. ౨.౫.౩౮.

బిందువు ప్రయోగిస్తే, మాలను ప్రయోగించి బదులు తీర్చు కోవాలి. మాల ప్రయోగిస్తే అభ్రఖండకాన్ని ప్రతిక్రియగా ప్రయోగించాలి. ఈవిధంగా నాయికానాయకులు ప్రణయ కలహాలు ప్రాప్తించినప్పుడు కలహించాలి.

౪౭౧. సకచగ్రహ మున్నమ్య ముఖం తస్య తతః పిబేత్,
నిలీయేత దశేచ్చైవ తత్రతత్రామదేరితా. ౨.౫.౩౯.

అధరోష్ఠాన్ని (క్రింది పెదవిని) పానం అనే క్రియతో చుంబించ డానికి నాయకుడు ఈ క్రమాన్ననుసరించాలి. ముందుగా నాయిక ఒకచేత్తో నాయకుని తలనూ, రెండవచేత్తో గడ్డాన్నీ పట్టి పైకెత్తి అప్పుడు అమృతరసోసమానమైన అధరసుధా రసాన్ని ఆస్వాదించాలి. అప్పుడు నాయకుణ్ణి బాగా కౌగలించి అతనిలో ఐక్యం అయిపోవాలి. ఇంకా ఆయాచోట్ల దంతక్షతాలూ, నఖక్షతాలూ మొదలైనవి పరవశమై చెయ్యాలి.

౪౭౨. ఉన్నమ్య కంఠే కాంతస్య, సంశ్రితా వక్షసస్థలీం,
మణిమాలాం ప్రయుంజీత, యచ్చాన్యదపి లక్షితం.
౨.౫.౪౦.

మరి ఒకతీరు చెవుతున్నారు. ఒక బాహువుతో నాయకుణ్ణి అక్కున హత్తి గట్టిగా సందులేకుండా కౌగిలించికొని కంఠాన్ని ఎత్తి రెండవ చేతితో అతని గడ్డాన్ని పట్టి మణిమాలను ప్రయో

గించాలి. ఇంకా కంఠభాగంలో ప్రయోగించవలసిన నఖక్షతాలనుగూడా చిత్రవిచిత్రంగా ప్రయోగించవచ్చు.

౪౭౩. దివాపి జనసంబాధే నాయకేన ప్రదర్శితం, ఉద్దిశ్య
స్వకృతం చిహ్నం హసేదన్యైరలక్షితా. ౨.౫.౪౧.

రాత్రివేళ రతిక్రీడా సమయాలలో నాయిక చేసిన దంతక్షతాదులను నాయకుడు పగలు జనసమాజంలో సంచరిస్తూ ఇతరులకు తెలియకుండా నాయికకు చూపించాలి. దాన్ని చూచి నాయిక "ప్రాయశ్చిత్తం కావలసిందే" అనే భావాన్ని సూచించేలాగా నవ్వాలి.

౪౭౪. వికూణయంతీవముఖం, కుత్సయంతీవ నాయకం,
స్వగాత్రస్థాని చిహ్నాని సాసూయేవ ప్రదర్శయేత్.
౨.౫.౪౨.

నాయిక హుళక్కి ముద్దుకోసం ముఖాన్ని ముడుస్తున్నట్లు చేష్ట చేస్తూ కనుబొమ్మలూ, కన్నులూ, వింతగా త్రిప్పుతూ "మీ అపరాధానికి ప్రతిచెయ్యలేను లెండి" అనే అసూయ వ్యక్తమయేలాగా తన శరీరంమీద నాయకుడు చేసిన గుర్తులను ఇతరులకు తెలియకుండా అతనికే తెలిసేట్టు చూపించాలి.

౪౭౫. పరస్పరానుకూల్యేన తదేవం లజ్జమానయోర్హి,
సంవత్సర శతేనాపి ప్రీతిర్న పరిహీయతే. ౨,౫.౪౩.

ఇతి శ్రీ వాత్స్యాయనీయే, కామసూత్రే, సాంప్రయోగికే, ద్వితీయేఽధికరణే, దశనచ్ఛేద్యవిధయో, దేశ్యాశ్చోపచారాః, పంచమోఽధ్యాయః.

పైవిధంగా నాయికానాయకులు తమలో తమకు బాగా

అనుకూలంగా ఉండే సిగ్గులను అభినయించుకుంటూ, ప్రవర్తిస్తే వారి పరస్పర ప్రేమ నూరు సంవత్సరాలైనా (బ్రతికి ఉన్నంత కాలమూ) మరుపురాకుండా ఉంటుంది.

ఈతీరుగా భారద్వాజ గోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ,
ఆపస్తంబ సూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయ
మూర్తిచేత వాత్స్యాయన కామసూత్రములకు జయ
మంగళ వ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన
'రతిరేఖ' అను తెలుగు వ్యాఖ్యలోని
సాంప్రయోగికాధికరణంలో దశ
నచ్ఛేద్య విషయమూ, దేశ్యా
లైన ఉపచారాలూ అనే
అయిదో అధ్యాయం
ముగిసింది.

శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

౨. సాంప్రయోగికాధికరణం

### ౬. సంవేశన చిత్రరతాధ్యాయం

౪౭౬. రాగకాలే విశాలయంత్యేవ జఘనం మృగీ సంవిశే
దుచ్చరతే. ౨.౬.౧.

పైన చెప్పిన విధంగా దేశాచారాన్నిపట్టీ, స్వభావసిద్ధమైన ఆచారాన్నిపట్టీ లభించిన ఆలింగనాదులవల్ల అనురాగాన్ని వృద్ధిపరుచుకున్నతరువాత, నాయికానాయకులు, సంభోగించడానికి సిద్ధపడే అర్హతను సంపాదిస్తారు గనుక ఆ విధానాన్ని ఇక్కడ చెవుతున్నారు. సంభోగించడానికి సిద్ధపడుటనే సంవేశనం అంటారు. (స్త్రీ యోనిలో పురుషుని మేహనాన్ని ప్రవేశపెట్టడం అన్నమాట) అందులో విశేషాలను చెప్పే అధ్యాయానికి చిత్రరతాధ్యాయం అంటారు. పై రెండు విషయాలూ ఈ అధ్యాయంలో నిరూపిస్తున్నారు.

రాగకాలం అంటే పురుషుని సాధనమూ, స్త్రీ భగమూ సంయోగానికి సిద్ధపడే కాలం అన్నమాట. ఆ సమయంలో వృషజాతి నాయకునితో సంభోగించే మృగీ నాయిక తన తొడలను రెండిటినీ ప్రక్కలకు చాచి భగాన్ని విచ్చేట్టుచేస్తూ

శయనించాలి. ఉచ్చతరరతంలోగూడా ఇదేవిధానం. అంటే మృగీ నాయిక హస్తినీజాతి నాయకునితో కలిసేసమయంలో గూడా నన్నమాట.

౮౭౭. అవక్రాసయంతీవ హస్తినీ నీచరతే. ౨-౬-౨

హస్తినీనాయిక, వృషజాతినాయకునితో రతిచేస్తే దాన్ని నీచ రతి అంటారు. ఈ నీచరతిలో నాయిక తనతొడలను కలిపి ఉంచి, భగాన్ని ముడుచుకుని ఉండేట్లుచేస్తూ శయనించాలి. శశజాతి పురుషునితో హస్తినికి సంయోగం జరగబోతుంటే ఆ నీచతర రతంలోగూడా నాయిక ఇలాగేచెయ్యాలి.

౮౭౮. న్యాయ్యో యత్రయోగ స్తత్సమపృష్ఠం. ౨-౬-3
నాయికానాయకుల భగలింగాలు న్యాయంగా, సరిసమానంగా సరిపడితే దాన్ని సమరతంఅంటారు. ఆ సమరతంలో స్త్రీ తన తొడలను బాగా చాచనక్కరలేదు. బాగా ముడవనూ అక్కరలేదు. సామాన్యంగా ఉంచవచ్చు.

౮౭౯. ఆభ్యాం బడబా వ్యాఖ్యాతా. ౨-౬-౪

పైనచెప్పిన నాయికల విధానాలవల్ల బడబజాతినాయిక చేయవలసిన విధానంగూడా స్పష్టమయింది. అంటే బడబనాయిక అశ్వజాతిపురుషునితో సంగమించబోయే సమయంలో తన తొడలను బాగాచాచి భగం బాగా తెరుచుకునేట్టుగా శయనించాలి. శశజాతి నాయకునితో సంగమించబోతుంటే తొడలను బాగాకలిపి భగాన్ని ముడిచి శయనించాలి. ఇక వృషజాతి నాయకునితో సంయోగం జరుపబోతూఉంటే సరిసమానంగా

న్యాయంగా శయనించవచ్చు. ఈ పై విధానాలనుపట్టి మృగీ నాయిక విధానమూ, హస్తినీనాయిక విధానమూ, చూచుకో వచ్చు. గ్రంథాంతరంలోగూడా "నాయిక ఉచ్చరతంలో తొడలు బాగా వెలుపుచేసిన్నీ, నీచరతంలో బాగా కలిపిన్నీ, సమరతంలో సరిసమానంగానున్నూ ఉంచి శయనించా"లని ఉన్నది.

౨౮. తత్రజఘనేన నాయకం ప్రతిగృహ్ణీయాత్.

నాయిక అలా శయనించడానికి నాయకుని మేహనాన్ని భగం లోనికి గ్రహించడమే ఫలంకాబట్టి ఆమె పైన చెప్పిన విధానా లలో తనకు తగినదాన్ననుసరించి శయనించి పలురకాలైన సంవేశనాలతోనూ, తన మదనమందిరంతో, అతని మదనధ్వ జాన్ని గ్రహించాలి.

౨౯. అపద్రవ్యాణిచ సవిశేషం నీచరతే. ౨-౬-౬

బడబనాయిక శశజాతి నాయకునితోగానీ, హస్తిని వృషజాతి నాయకునితోగానీ సంభోగించవలసివస్తే కృత్రిమలింగాలను కల్పించుకుని వాటితో సంప్రయోగం జరిపించుకోవాలి.

౨౩. ఉత్ఫుల్లకం,విజృంభితకం, ఇంద్రాణికం చేతిత్రితయం ప్రాయేణ. ౨-౬-౭

పైన నాయిక ఉచ్చరతంలో తొడలుతెరిచి శయనించాలనీ, నీచరతంలో తొడలుకలిపి శయనించాలనీ చెప్పారు. అలా శయనించడానికి ఉపాయాలు చెవుతున్నారు. సమరతంలో శయ నించేఉపాయం శాస్త్రంలో చెప్పబడలేదు. చెప్పే అవసరం పట్టలేదన్నమాట. కాని లౌకికమైనయుక్తే చెప్పబడ్డది. ఆ

లౌకికయుక్తులనే నిరూపిస్తున్నారు. నాయిక పరుండిఉన్నప్పుడు రెండురకాలైన సంవేశనాలూ, ఒత్తిగిలి పరున్నప్పుడు ఒక రకమైన సంవేశనమూ, లోకంలో ప్రసిద్ధంగాఉన్నాయి. ఈ మూడువిధాలూ సమరతంలో సంభవిస్తాయి. గ్రంథాంతరంలో వాటి స్వరూపం ఇలాఉన్నది. "సంభోగంకోసం కూర్చునిఉన్న నాయకుడు తనతొడలను నాయిక తొడలమీదఉంచి రతిచేస్తే దాన్ని గ్రామ్యం అంటారు. నాయికతొడలను నాయకుడు తన తొడలమీద ఉంచుకొని రతిచేస్తే దాన్ని నాగరకంఅంటారు." ఉత్ఫుల్లకమూ, విజృంభితకమూ, ఇంద్రాణికమూ, అనే మూడురకాలైన సంవేశనాలూ సాధారణంగా మృగీజాతి నాయికకు అనుకూలిస్తాయి.

౧౮౩. శిరోవినిపాతొర్ధ్వం జఘన ముత్ఫుల్లకం. ౨-౬-౮

నాయిక సంయోగసమయంలో శయ్యమీద వెల్లకిలపరుండి తలను శయ్యమీదనే ఉంచి నడుమును పైకెత్తుతూఉంటే దాన్ని ఉత్ఫుల్లకం అంటారు. అది సురతసమయంలో సహజంగా సంభవించినా భగంబాగా విస్తరించడంకోసం నడుమును బాగా పైకెత్తి నాయిక తన రెండుచేతులతోనూ తనభగాన్ని వెలుపుచేసి మేహనాన్ని ప్రవేశపెట్టుకోవాలి. పురుషుడు తన చేతులతో ఆమె స్తనాలను మర్దిస్తూఉండాలి. అప్పుడు ఆమె పాదాలూ, మడమలూగూడా నాయకుని నడుమునకు వెనుక భాగంమీద ఉంటాయి. ఇలా నాయిక నడుముపైకెత్తి భగాన్ని బాగా విస్తృతంచేసి ఉంచుతుందిగనుక దీనికి ఉత్ఫుల్లకం అని పేరువచ్చింది.

౭౮౪. తత్రాపసారం దద్యాత్. ౨-౬-౯

పైనచెప్పిన ఉత్ఫుల్లకబంధంలో నాయకుడు తన మేహనాన్ని యోనిలో ప్రవేశపెట్టినతరువాత నాయిక తన నడుమును గుండ్రగాతిప్పాలి. లేదా నాయకుడైనా తన నడుమును నెమ్మదినెమ్మదిగా గుండ్రగాతిప్పాలి. ఈ క్రియ యోనికొద్దిగా ద్రవించేవరకుమాత్రమే చెయ్యాలి. ఈ బంధంలో నాయకుడేమాత్రమూ తొందరపడరాదు. అలా తొందరపడితే స్త్రీకి బాధ కలుగుతుంది. నాయకుని మేహనంపైన ఉన్న చర్మగూడా నలుగుతుంది. ఇలాటి నలుగుళ్లకు వైద్యశాస్త్రంలో 'అవపాటిక' అని పేరు పెట్టారు.

౭౮౫. అనీచే సక్థినీ, తిర్యగవసజ్య ప్రతీచ్ఛేదితి విజృంభితకం. ౨-౬-౧౦

అలాగే నాయిక వెల్లకిలపరుండి తనతొడలను అడ్డంగా పైకి ఎత్తి నిలిపిఉంచి నాయకునిరతిని అపేక్షిస్తే దాన్ని విజృంభితకం అంటారు. ఉత్తాన బంధంలోగూడా ఇలా పాదాలు పైకి చాచడం ఉంటుందిగాని దానిలో పాదాలు అడ్డంగాచాచడం సంభవిస్తుంది. కాబట్టి అదీ ఇదీ ఒకటికాదు. ఈ విజృంభితక బంధంలో తొడలు చాచడంచేత నాయిక భగం బాగా తెరిచి ఉంచిననోరులాగా తెరుచుకునిఉంటుంది.

౭౮౬. పార్శ్వయోః సమ మూరూ విన్యస్య పార్శ్వయోః జానునీ నిదధ్యా దిత్యభ్యాసయోగా దింద్రాణీ.

నాయిక తనతొడలను పిక్కలతో కలిపిఉంచి సమానంగా ప్రక్క-భాగాలలోఉంచి మోకాళ్లుగూడా ప్రక్కకుఉండేలాగా

అభ్యసించి తన వగకాణ్ణి రతిచెయ్యమనికోరితే దాన్ని ఇంద్రాణిబంధం అంటారు. ఇందులో చంకలతో మోకాళ్లనునొక్కిపట్టడం సంభవిస్తుంది గనుక నాయికభగం పైబంధాలలోకంటె గూడా తెరుచుకుంటుంది. ఈ బంధం ఒక్కమాటుగా చెయ్యడానికి సాధ్యంకాదు. అలాచేస్తే ప్రమాదం సంభవిస్తుంది. కాబట్టి క్రమంగా అభ్యాసంచేసి సాధించాలి. ఇది దేవేంద్రుని భార్య అయిన శచీదేవి కనిపెట్టినది కాబట్టి ఇంద్రాణిఅని దీనికి పేరువచ్చింది.

౨౮౭. తయోచ్చతరరతస్యాపి పరిగ్రహః. ౨-౬-౧౨

ఈ ఇంద్రాణీ బంధాన్ని మృగీనాయిక వృషనాయకునితో గూడే సమయంలోనేకాక మృగీనాయికకు అశ్వజాతినాయకుడు ప్రియుడైనప్పుడుకూడా ఉపయోగించవచ్చు. అంటే ఉచ్చతర రతంలోకూడా నాయిక ఉపయోగించవచ్చునన్నమాట. పైన చెప్పిన ఉత్ఫుల్లక జృంభితక బంధాలతోమాత్రం మృగీనాయిక వృషనాయకుణ్ణి కూడాలి. అలాగే బడబనాయికకూడా అశ్వజాతిపురుషుణ్ణి కూడే సమయంలోగూడా పై రెండుబంధాలనే ఉపయోగించాలిగాని ఇంద్రాణీబంధాన్ని ఉపయోగించరాదు.

౨౮౮. సంపుటేన పరిగ్రహో నీచరతే. ౨-౬-౧౩

హస్తినీనాయిక వృషజాతినాయకునితో సంబంధాన్ని పొందగోరితే నీచరతం ఏర్పడుతుంది గనుక ఆ ప్రియుణ్ణి సంపుట బంధంతో గ్రహించాలి. ఈ సంపుటబంధానికి లక్షణం మున్ముందు చెపుతారు.

౪౮౯. ఏతేన నీచతరరతేపి సంపుటకం, పీడితకం, వేష్టితకం, బాడబకమితి హస్తిన్యాః. ౨-౯-౧౪

ఇలా చెప్పడంచేత హస్తినీ నాయిక శశజాతి నాయకునితో కూడవలసి వచ్చినప్పుడుకూడా సంపుటకమూ, పీడితకమూ, వేష్టితకమూ, బాడబకమూ అనే బంధాలను ఉపయోగిస్తే తృప్తి కలుగవచ్చు.

౪౯౦. ఋజు ప్రసారితా వుభావప్యుభయో శ్చరణావితి సంపుటః. ౨-౬-౧౫

సంపుటకబంధాన్ని చెవుతున్నారు. నాయికా నాయకులు తమ కాళ్లను సాపుగాచాచి రతికి ఉపక్రమిస్తే దాన్ని సంపుటక బంధం అంటారు.

౪౯౧. సద్విధః, పార్శ్వసంపుట, ఉత్తానసంపుటశ్చ, తథా కర్మయోగాత్. ౨-౬-౧౬

ఆ సంపుటబంధం పార్శ్వసంపుటమనీ, ఉత్తానసంపుటమనీ రెండువిధాలు. అలా ఉండి రతిచేస్తారు గనుక వాటికాపేర్లు వచ్చినాయి. పక్కకుఒత్తిగిలి రతినిప్రారంభిస్తే దాన్ని పార్శ్వ సంపుటకం అంటారు. స్త్రీ వెల్లకిల పరుండినీన్నీ పురుషుడు ఆమె పైన బోర్లగాపరుండినీన్నీ రతిచేస్తే దాన్ని ఉత్తానసంపుటం అంటారు. పురుషుడు వెల్లకిలపరుండగా అతనిపైన స్త్రీ బోర్లగా పరుండి పురుషునివలె రతిచేస్తే దాన్ని రెండో ఉత్తాన సంపుటబంధంగా కొందరు చెవుతున్నారు. ఈ బంధంలో మేహనం భగంలో ఎలా ప్రవేశిస్తుంది? అనే సంశయం అక్కర లేదు. అలాచెయ్యడం చాలా సులువే. ప్రక్కకు ఒత్తిగిలిచేసే

సంపుటకంలో నాయకునినడుము దిండుమీదా, నాయికనడుము పక్కమీదా ఉండాలి. ఇలా మెరకపల్లాలుగా ఉండకపోతే రతిసమయంలో నాయకానాయకుల భగలింగాలు విడిపోవచ్చు.

౪౯౨. పార్శ్వేణతు శయానో, దక్షిణేన నారీ మధిశయీ
తేతి సార్వత్రికమేతత్. ౨-౬-౧౭

నిద్రించడానికి నాయికకు కుడివైపున నాయకుడూ, అతనికి ఎడమవైపున నాయికయున్నూ శయనించాలి. ఈ విధానం నిద్రాసమయంలో అన్నిజాతుల నాయకులకూ, నాయికలకూ గూడా సమకూడుతుంది. రతి సమయంలో హస్తినీ నాయికకు మాత్రమే ఎడమవైపున నాయకుడూ, అతనికి కుడివైపున నాయికా పరుండాలి. హస్తినీ నాయికకు నాయకుడు చేత్తో భగసంస్పర్శనాదులు చెయ్యవలసి వస్తుంది గనుక అలా పరుండాలన్నమాట. ఈ ఆచారాన్ని హస్తినీనాయిక విషయంలో పెద్దలు ఒప్పుకుంటున్నారు.

౪౯౩. సంపుటక ప్రయుక్తయంత్రైవ దృఢ మూరూ పీడ
యేదితి పీడితకం. ౨-౬-౧౮

ఉత్తానసంపుటకంతోగానీ, పార్శ్వ సంపుటకంతోగానీ భగాన్ని మేహనంతో సమకూర్చుకుని నాయిక తన రెండుతొడలనూ గట్టిగా కలిపినొక్కితే దాన్ని పీడితకం అంటారు.

౪౯౪. ఊరూ వ్యత్యస్యే దితి వేష్టితకం. ౨-౬-౧౯

పై ఉత్తానసంపుటంతోగానీ, పార్శ్వ సంపుటంతోగానీ నాయకునికలిసి నాయిక తన కుడితొడను ఎడమతొడమీదా, ఎడమ

తొడను కుడితొడమీదా ఉంచితే దాన్ని రెండువిధాలా వేష్టితకం అంటారు. ఇందులో పై పీడితకంలోకంటె నాయిక భగము బాగా ముడుచుకుంటుంది.

౮౯౫. బడజేవ నిష్ఠురం మవగృహ్ణీయాదితి బాడబక మాభ్యాసికం. ౨-౬-౨౦

ఆడగుఱ్ఱంలాగా నాయిక కదలకుండాఉండి నాయకుని మేహనాన్ని భగంతో గట్టిగా నొక్కిపడితే దాన్ని బాడబకం అంటారు. ఇది క్రిమాభ్యాసంవల్లగాని లభించదు. ఒక్కమాటుగా ప్రయోగించడం కుదరదు.

౮౯౬. తదాంధ్రీషు ప్రాయేణేతి సంవేశన ప్రకారా బాభ్రవీయాః. ౨-౬-౨౧

ఆంధ్రదేశంలో పుట్టినస్త్రీలు అభ్యాసంమీద ఆసక్తికలవారు గనుక ఈ బాడబకబంధాన్ని తరుచుగా వారు ఉపయోగించుకుంటారు. ఆ అభ్యాసంగూడా సంప్రదాయం తెలిసినవాళ్ల వల్ల గాని లభ్యపడదు. మొత్తంగా యీ యేడు సంవేశనవిధాలూ బాభ్రవీయులు చెప్పినవి.

౮౯౭. సౌవర్ణనాభస్తు ఉభావప్యూరూ ఊర్ధ్వావితి తద్భుగ్నకం. ౨-౬-౨౨

సువర్ణనాభులు ఇంకా ఇలాచెప్పారు సంవేశనవిధాలు. హస్తినీ నాయిక వెల్లకిలపడుండి తన రెండుతొడలనూ పైకిచాపితే నాయకుడు ఆమెతొడలను కౌగలించుకుని రతిచెయ్యడం జరుగుతుంది. దాన్ని భుగ్నకం అంటారు.

౮౯౮. చరణావూర్ధ్వం నాయకోఽస్యా ధారయేదితి జృంభితకం. ౨-౬-౨౩

నాయికతనపాదాలను పైకిచాచితే నాయకుడు ఆమె మోకాళ్ల వెనుకభాగాలను తనభుజాలమీద ధరించి తొడలను కౌగిలించి రమిస్తే దాన్ని జృంభితకం అంటారు.

౪౯. తత్కుంచితా వుత్పీడితకం. ౨-౬-౨౪

నాయికనాయకుని వక్షస్థళంమీద తన రెండుపాదాలూ ఆనించాలి. అప్పుడు నాయకుడు తన బాహువులతో నాయిక మెడ కౌగిలించుకుని రమించాలి. దీన్ని ఉత్పీడితకం అంటారు. ఇందులో నాయిక మోకాళ్లు బాగా మణిగి ఆమె బుజాలు దగ్గిఱకి చేరతాయి.

౫౦. తదేకస్మిన్ ప్రసారితేఽర్థపీడితకం. ౨-౬-౨౫

పై రీతిగా నాయిక తన ఒక పాదాన్నిమాత్రమే నాయకుని వక్షస్థళంమీద ఆనించి రెండవపాదాన్ని సాఫుగాజాపితే, నాయకుడు పై ఉత్పీడితకంలోవలె రతిచేస్తే దాన్ని అర్థపీడితకం అంటారు. కుడిపాదాన్ని ఎడమప్రక్కనూ, ఎడమపాదాన్ని కుడిప్రక్కనూ నాయకునిరొమ్మున ఆనించి పైరీతిగా రతిచేసే దాన్ని రెండోరకమైన అర్థపీడితకం అంటారు.

౫౧. నాయకస్యాంసే ఏకో ద్వితీయకః ప్రసారిత ఇతి పునః పునర్వ్యత్యాసేనవేణుదారితకం. ౨-౬-౨౬

రతిసమయంలో నాయకుని బుజాలమీద నాయిక తన ఎడమ పాదాన్ని ఒక్క క్షణం ఉంచి వెంటనే ఆ పాదాన్ని యథాప్రకారంగా క్రిందికిజాపితే ఒకరకమైన వేణుదారితకం ఔతుంది. అలాగే రతిసమయంలో నాయిక తన ఎడమపాదాన్ని నాయ

కుని కుడిభుజంమీద క్షణకాలంఉంచి యథాప్రకారంగా క్రిందికి జాపితే దాన్ని రెండోరకప్పు వేణుదారితకం అంటారు.

౫౦-౨. ఏక శ్శిరసి ఉపరి గచ్ఛేద్ద్వితీయః ప్రసారిత ఇతి శూలాచితక మాభ్యాసికం. ౨-౬-౨౭

నాయిక తన ఎడమపాదాన్నిగానీ, కుడిపాదాన్నిగానీ నాయకుని తలపైన ఉంచాలి. అలాగే ఎడమపాదాన్నిగానీ, కుడిపాదాన్నిగానీ చాచిఉంచాలి. అప్పుడు నాయకుడు తన మదనధ్వజాన్ని గూటంలాగా నాయికభగంలో దిగవెయ్యాలి. దీన్ని శూలాచితకం అంటారు. ఇదిగూడా చాలా అభ్యాసం వల్లగాని సిద్ధించదు.

౫౦౩. సంకుచితౌ స్వ వస్తి దేశే నిదధ్యాదితి కార్కటికం. ౨-౬-౨౮

ముడిచిఉంచిన నాయిక పాదాలను రెండిటినీ, నాయకుడు తన బొడ్డునకు రెండుప్రక్కలా ఆనించుకుని రమిస్తే నాయిక కాళ్లు బాగా ముడతపడడం జరుగుతుంది. దీన్ని కార్కటికం అంటారు.

౫౦౪. ఊర్ధ్వౌ పూరూ వ్యత్యాస్యే దితి పీడితకం.

రతి సమయంలో నాయిక తన కుడిపాదాన్ని యెడమవైపుకీ, ఎడమపాదాన్ని కుడివైపుకీ ఎత్తి నాయకుని నడుమును నొక్కితే దాన్ని పీడితకం అంటారు.

౫౦౫. జంఘా వ్యత్యాసేన పద్మాసనవత్. ౨-౬-30

వెల్లకిలపరున్న నాయిక రతి సమయంలో తన ఎడమపాదాన్ని కుడిగజ్జకూ, కుడిపాదాన్ని ఎడమగజ్జకూ ఆనించిఉంచి

నాయకునితో రతిని పొందితే దాన్ని పద్మాసనబంధం అంటారు.

౫౦౬. పృష్ఠం పరిష్వజమానాయాగి పరాఙ్ముఖేన పరావర్తక మాభ్యాసికం. ౨-౬-౩౦

నాయకుడు యోని మేహన సంయోగాన్ని వీడకుండా తన నడుముకంటె పై భాగాన్ని వెల్లకిల త్రిప్పాలి. అలా పరాఙ్ముఖుడైన నాయకునివీపును నాయిక కౌగిలించాలి. అలా తన వీపును కౌగిలించిన నాయికతో నాయకుడు రమించాలి. దీన్ని పరావృత్తకం అంటారు. ఇది చాలా అభ్యాసంవల్ల రావలసినదేగాని తొందరపడి చెయ్యరాదు. అలాచేస్తే ప్రమాదం తప్పదు. పైది ఒకరకం. ఇలాగే నాయిక పై విధంగా భగలింగసంయోగాన్ని వీడకుండా మెలిదిరిగితే నాయకుడు ఆమె వీపును కౌగలించి రమిస్తే దాన్నిగూడా మరొక పరావృత్తకం అంటారు. ఇదిగూడా అభ్యాసంవల్ల సాధ్యపడవలసినదే.

౫౦౭. జలేచ సంవిష్టోపవిష్టస్థితాత్మకా శ్చిత్రాన్యోగాను పలక్షయేత్, తథా సుకరత్వా దితి సువర్ణనాభః.

ఈ పైన చెప్పిన సంవేశనప్రకారాలుచిత్రరతాలలోచేరవు. లోకంలో సాధారణంగా స్త్రీపురుషులు ఒకరిమీద ఒకరుగానీ, ఒకరిప్రక్కన ఒకరుగానీ శయనించడం ప్రసిద్ధమైనదే. అలాఉండి ఉపయోగించుకునేవి పైనచెప్పిన బంధాలు. వాటికంటెచిత్రమైనవి ఈ మూడు చెప్పబోయేబంధాలు. నీటిలోగానీ, నేలమీదగానీ, పరుండిగానీ, కూర్చుండిగానీ, నిలుచుండిగానీ, నాయికానాయకులుచిత్రరతాలను అనుభవించాలి. ఇలా సువర్ణనాభుడు చెప్పాడు.

౫౦౮. వార్తాంతు తచ్ఛిష్టైః రహస్యతత్వా దితి వాత్స్యాయనః. ౨-౬-33

చిత్రరతాలు నీటిలోగానీ, నేలమీదగానీ, పరుండిగానీ, కూర్చుండిగానీ, నిలుచుండిగానీ ఆచరించవచ్చుననే మాట సారంలేనిది. నీటిలోఉండి చేసేసురతాన్ని పెద్దలు నిషేధించారు. "నీటిలో మైథునంచేస్తే నరకం ప్రాప్తిస్తుంది." అని. దీనికి ప్రాయశ్చిత్తంగా "నీటిలో రేతస్సునువిడిస్తే కృచ్ఛ చాంద్రాయణాది వ్రతాలు చేస్తేగాని ఆ పాతకంపోదు." అనిగూడా చెప్పారు. కాబట్టి నీటిలో సురతంచెయ్యడం తప్పు. నేలమీద అభ్యంతరం ఉండదు.

౫౦౯. అథ చిత్రరతాని. ౨-౬-34

సంవేశన ప్రకారాలనుగూర్చి ప్రసంగించారు గనుక వాటిలోని విశేషాలైన చిత్రరతాలనుగూడా నిరూపిస్తున్నారు. ఇవి నేల మీద ప్రయోగించతగినవి.

౫౧౦. ఊర్ధ్వస్థితయోర్యూనోః పరస్పరాపాశ్రయయోః కుడ్యస్తంభాపాశ్రితయో ర్వా స్థితరతం.

ఆ చిత్రరతాలలో నిలుచుండి చేసేరతాలు చెవుతున్నారు. శయ్య మొదలైన ఆశ్రయాలుండవు గనుక నాయికానాయకులు ఒకళ్లబాహువులతో ఒకళ్లు కౌగిలించుకునిగానీ, గోడనుగాని, స్తంభాన్నిగాని ఆనుకునిగానీ, రతిచేస్తే దాన్ని స్థితరతం అంటారు.

౫౧౧. కుడ్యాపాశ్రితస్య కంఠావసక్త బాహుపాశాయాః తద్ధస్తపంజరోపవిష్టాయా ఊరుపాశేన జఘన మభి వేష్టయంత్యా కుడ్యే చరణక్రమేణ వలంత్యా అవలం బితకం రతం. ౨-౬-౩౬

గోడనుగానీ, స్తంభాన్నిగానీ నాయకుడు ఆనుకునిఉంటే అతని కంఠానికి నాయిక తన బాహువులనుచుట్టి అతని బాహుపంజ రంలో తానుచిక్కి తనతొడలతో అతని నడుమును చుట్టుకుని మాటిమాటికీ తనచేతులను నాయకుడు ఆనిఉన్నస్తంభానికో, గోడకో ఆనిస్తూ, తన నడుమును ప్రేరేపిస్తూ రతిచేస్తే దాన్ని అవలంబితకం అంటారు. ఇది ఒక చిత్రరతం.

౫౧౨. భూమేవా చతుష్పదవ దాస్థితాయా వృషలీలయా అవస్కందనం ధైనుకం. ౨-౬-౩౭

నేలమీద గోవులాగా చేతులూ, కాళ్లూఉండి ఆనించిఉన్న నాయికను వెనుకనుంచి ఆబోతులాగా నాయకుడు ఆమె నడు మును ఆశ్రయిస్తే దాన్ని ధేనుకబంధం అంటారు. మనుజులై ఉండి పశువులను అనుకరించడం కాబట్టి ఇదీ చిత్రరతమే.

౫౧౩. తత్ర పృష్ఠ మురసి కర్మ లభతే. ౨-౬-౩౮

నాయిక వెల్లకిలపరున్నప్పుడు రతి సమయంలో స్తనాదులలో చేసే ఆలింగన, చుంబన, నఖక్షత, దంతక్షతాలను ఈ ధేనుక బంధంలో నాయికయొక్క వీపుమీదే ప్రయోగించాలి.

౫౧౮. ఏతేనైవయోగేన శౌనమైణేయం, ఛాగలం,గర్దభా క్రాంతం, మార్జారలలితకం, వ్యాఘ్రావస్కందనం, గజోపమర్దనం, వరాహఘృష్టకం౹తురగాధిరూఢకం, ఇతి యత్రయత్ర విశేషో యోగోఽపూర్వ స్తత్తదుపలక్షయేత్. ౨-౬-౩౯

ఈ ధేనుకబంధాన్నిపట్టి శునకబంధాన్నీ, ఐణేయబంధాన్నీ, ఛాగలబంధాన్నీ, గర్దభాక్రాంతబంధాన్నీ, మార్జాల లలితక బంధాన్నీ, వ్యాఘ్రావస్కందనబంధాన్నీ, గజోపమర్దనబంధాన్నీ, వరాహఘృష్టకబంధాన్నీ, తురగాధిరూఢకబంధాన్నీ ఇంకా ఇలాటివిశేషయోగాలు ఏయేజంతువుల రతులలో చూడబడతాయో అలాటి క్రొత్తరతాలను ఊహించుకుని అనుభవించాలి.

శౌనకమంటే కుక్క మిథునంవలె రమించడం, ఐణేయమంటే లేళ్లవలెరమించడం, ఛాగలంఅంటే మేకలూ, గొఱ్ఱెలూ మొదలైనవాటివలెరమించడం, గర్దభాక్రాంతంఅంటే గాడిద ఆక్రమించినట్లు ఆక్రమించి నాయకుడు నాయికయు రమించడం, మార్జాల లలితకం అంటే పిల్లివలెరమించడం, వ్యాఘ్రావస్కందనం అంటే పులిలాగా రమించడం, గజోపమర్దనంఅంటే ఏనుగులాగా నాయికకు రతిసమ్మర్దం కల్పించడం, వరాహఘృష్టకం అంటే పందివలె రతిక్రియచెయ్యడం, తురగాధిరూఢకం అంటే ఆడగుఱ్ఱంలాగా ఉన్న నాయికను మగగుఱ్ఱంలాగా నాయకుడు రమించడం అన్నమాట.

౨౧౫. మిశ్రీకృత సద్భావాభ్యాం సహ సంఘాటకం రతం.

ఒక్కనాయకుడు పరస్పరమూ మిక్కిలి నమ్మకం కలిగిఉన్న ఇద్దరు నాయికలతో ఒక్కమాటుగా రమించడాన్ని సంఘాటక మనే చిత్రరతంగా చెపుతున్నారు. ఇందులో నాయికలిద్దరూ పరుండిఉంటే నాయకుడు వారిద్దరితోనూ ఒక్కమాటు రమి స్తాడు. ఎలాగంటే ఒక నాయికను భగలింగసంయోగాదుల తో తృప్తిపరుస్తూ, రెండోనాయికను చుంబనమూ, కుచ మర్దనమూ, నఖక్షతమూ, మొదలైనవాటితో అనురాగాన్ని వృద్ధిచెయ్యాలి. అటుతరువాత రెండోనాయికను భగలింగ సంయోగంద్వారా తృప్తిపరచడమూ, మొదటినాయికను మళ్లీ చుంబనాదులతో అనురాగం జనించేట్టు చెయ్యడమూ, ఈ క్రమంగా తృప్తిపరచాలి.

౨౧౬.. బహ్వీభిశ్చ సహ గోయూథికం. ౨-౬-౪౧

ఒకళ్లమీద ఒకళ్లకు బాగా నమ్మకమూ, స్నేహమూ, గాఢ ప్రేమాఉన్న చాలామంది నాయికలతో ఒక్కనాయకుడురమిస్తే దాన్ని గోయూథికమనే చిత్రరతం అంటారు. గోవులమందలో ఆబోతురమించినట్లు రమించడం గనుక గోయూథికమన్నారు.

౨౧౭. వారిక్రీడితకం, ఛాగలమైణేయ మితి తత్కర్మాను కృతియోగాత్. ౨-౬-౪౨

నీటిలో అనేక ఆడమేనుగులతో ఒక మగమేనుగు రతికేళి జరిపినట్లు, పలువురు నాయికలతో నీటియందు ఒక్కనాయకుడు రమించడాన్ని వారిక్రీడితకం అంటారు. ఇలాగే, మేకపోతు,

ఆడ మేకలమందతో రమించినట్లు నాయకుడు నాయికాసమూహంతో రమిస్తే దాన్ని ఛాగలం అన్నారు. ఇలాగే ఆడలేళ్ల గుంపుతో ఒక్క మగలేడిలాగా రమిస్తే దాన్ని ఐణేయమన్నారు. ఇలాగే ఒక్కొక్కచోట ఒక స్త్రీ ఇద్దరూ, ముగ్గురూ, పురుషులతో ఒక్కసారు రమించడంగూడా సంభవిస్తుంది.

౩౧౮. గ్రామనారీవిషయే స్త్రీరాజ్యేచ బాహ్లీకే బహవో యువానో అంతఃపురసధర్మాణ ఏకైకస్యాః పరిగ్రహభూతాః తేషా మేకైకశో యుగపచ్చయథా సాత్మ్యంయథా యోగంచ రంజయేయుః.

స్త్రీ రాజ్యానికి సమీపంగా గ్రామనారీ దేశమని ఒక దేశం ఉన్నది. ఆ దేశంలోనూ, స్త్రీ రాజ్యంలోనూ, బాహ్లీక దేశంలోనూగూడా పలువురు యువకులను ఒక్కొక్క స్త్రీ వివాహం చేసుకుని అంతఃపురంలో దాచుకుంటుంది. ఆ పురుషులు ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కడుగానూ, ఒక్కొక్కసమయంలో అందరునూ ఇష్టంవచ్చినట్లుగానూ, బంధాల ననుసరించీగూడా ఆ స్త్రీని రంజింపచేస్తూ ఉంటారు.

౩౧౯. ఏకో ధారయే దేనా మన్యో నిషేవే తాన్యో జఘనం ముఖమన్యో, మధ్యమన్యఇతి వారంవారేణ వ్యతికరేణ చానుతిష్ఠేయుః. ౨-౬-౪౪

అనేకపురుషులతో ఒక్కనాయిక ఒక్కసారుగానూ, విడివిడిగానూ రమించేవిధానం చెపుతున్నారు. ఆ నాయికను ఒకడు తొడమీద ధరించాలి. రెండోవాడు రమించాలి. మరొకడు కటి

భాగంమీద నఖక్షతాలు చెయ్యాలి. ఇంకొకడు ముఖాన్ని సేవించాలి. మరొకడు కౌగిలించుకోవాలి. ఇలా ఒక్కొక్కరు ఒక్కొక్కక్రియతో ఆమెను రంజింపచెయ్యాలి. వంతులప్రకారం ఒకరితో ఒకరోజునా, మరిఒకనితో ఒకరోజునా క్రీడించడం ప్రత్యేకవిధానం అన్నమాట. ఈ గోలంతా కుక్కలవ్యవహారంగా ఉన్నది. మానవులు చేయవలసినది కాదు.

సూ౨౦. ఏతయా గోష్ఠీపరిగ్రహో వేశ్యా రాజయోషా పరిగ్రహాశ్చ వ్యాఖ్యాతాః. ౨-౬-౪౫

పైన చెప్పినవిధంగానే ఇతర దేశాలలోగూడా పలువురు విటులచేత పరిగ్రహింపబడిన వేశ్యా, పలువురు పురుషులచేత పరిగ్రహింపబడినరాజస్త్రీగూడా పైరీతిగానే ప్రవర్తించాలన్నమాట.

సూ౨౧. అధోరతం పాయావపి దాక్షిణాత్యానా మితి చిత్రరతాని. ౨-౬-౪౬

భగరంధ్రంతోగాక అపానరంధ్రంతోగూడా దక్షిణ దేశీయులు రతిచేస్తారు. దీన్ని చిత్రరతం అన్నారు. ఇంతవరకూ చిత్రరతాలు.

సూ౨౨. పురుషోపసృప్తాని పురుషాయితే వక్ష్యామః.

సంవేశనం తరువాత అవసరంగా చెప్పవలసినవైనా పురుషోపసృప్తాలను పురుషాయితంలో చెవుతారు.

సూ౨౩. భవతశ్చాత్రశ్లోకాః:—పశూనాం మృగజాతీనాం,
పతంగానాంచ విభ్రమైః, తైస్తైరుపాయైః చిత్తజ్ఞో
రతియోగాన్ వివర్ధయేత్. ౨-౬-౪౮

బుద్ధిమంతుడైనవాడు పశువులూ, మృగజతులూ, పక్షి జాతులూ, మొదలైనవాటి రతిచేష్టితాదులనుచూచి ఆయా ఉపాయాలతో రతిబంధాలను వృద్ధిచెయ్యాలి.

గీ-౨౮. తత్సాత్మ్యద్దేశసాత్మ్యాచ్చ తైస్తైర్భావైః ప్రయోజనైః, స్త్రీణాం స్నేహశ్చ రాగశ్చ బహుమానశ్చ జాయతే. ౨.౬.౪౯.

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాంప్రయోగికే ద్వితీయేఽధికరణే సంవేశనప్రకారాః చిత్రరతాని చ షష్ఠోఽధ్యాయః.

నాయిక అభిరుచినికనిపెట్టి దేశాచారాన్ని గుర్తించి ఆమెకు భావప్రాప్తి కలుగుటకుగాను ఆయా పశుపక్ష్యాదుల రతిబంధాలను అనుసరించే నాయకునియందు నాయిక స్నేహాన్నీ, ప్రేమనీ, గౌరవాన్నీ, వృద్ధిపొందించుకుంటుంది.

ఈవరుసగా భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచర్ల ఆంజనేయమూర్తి చేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళ వ్యాఖ్యననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలోని సాంప్రయోగికాధికరణంలో సంవేశన ప్రకారాలూ, చిత్రరతాలు అనే ఆరోఅధ్యాయం ముగిసింది.

—*—

శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

౨. సాంప్రయోగికాధికరణం

### ౭. ప్రహణనయోగాలూ—సీత్కృతక్రమాలూ.

౧౨౧. కలహరూపం సురతమాచక్షతే, వివాదాత్మ
కత్వాద్వామశీలత్వాచ్చ కామస్య. ౨ ౭.౧.

పై రీతిగా పండుకునిఉన్న నాయికకు భగలింగసంయోగసమయంలో ముఖ్యంగా ప్రయోగించవలసినవిగనుక ముందుగా ప్రహణనాలూ (చిరుదెబ్బలూ) వాటివల్ల పుట్టేవిగనుక సీత్కృతాలూ ఈ అధ్యాయంలో నిరూపిస్తారు. సాధారణంగా దెబ్బ కొడితే ఎవరికైనా కోపంవస్తుందిగదా? ఆప్రహణనం సురతాని కెలాఉపయోగపడుతుంది? అంటే సమాధానం చెప్తున్నారు.

కామమనేదికూడా ఒకపోట్లాటవంటిదే. ఇందులోనూ, నాయకుడూ, నాయికాగూడా తమతమ సుఖమనే స్వార్థం కోసం ఒకరిని ఒకరు నొక్కుకుంటూ, రక్కుకుంటూ, తిరస్కరించుకుంటూ, ఎక్కిరించుకుంటూ సంభోగిస్తున్నారు. సుకుమారమైన ఒకక్రమాన్ని ఆశ్రయించడంచేత కామం ఎంత మంచిదైనా నాయికానాయకులు ఒకళ్లమీద ఒకళ్లు మర్ద

నాదులతో నిర్దయగా ప్రవర్తించడంగూడా ఎప్పుడూ ఉన్నది. అందువల్ల ఈకామం నాయికానాయకులకు ఒకవిధంగాచూస్తే ప్రతికూలస్వభావాన్నే పుట్టిస్తున్నది. సుకుమారగుణంచేత కీర్తిం పబడుతున్నా సురతంలో కామం నీచమే, అందువల్లే కామాన్ని కలహరూపంగానూ, సురతరూపంగానూ చెవుతున్నారు.

సూ౧౬. తస్య రాగవశాత్ ప్రహణాని మంగం, స్కంధే, శిరసి, స్తనాంతరం, పృష్ఠం, జఘనం, పార్శ్వ ఇతి స్థానాని. ౨.౭.౧.

అసలు సురతమనేది అనురాగంమీద ఆధారపడి ఉన్నదిగనుక ఆసురతానికి ప్రేమనువృద్ధిచేసే ఈప్రహణనాలు సాధనాలు. ప్రహణనాలంటే చిరుదెబ్బలన్నమాట. బుజాలూ, శిరస్సూ, స్తనాలమధ్యా, వీపూ, కటిభాగమూ, ప్రక్కలూ, ప్రహణ నాలు ప్రయోగించతగినస్థానాలు.

సూ౧౭. తచ్చతుర్విధం, అపహస్తకం, ప్రసృతకం, ముష్టి, స్సమతలకమితి. ౨.౭.౩.

ఆచిరుదెబ్బలు అపహస్తకమనీ, ప్రసృతకమనీ, ముష్టిఅనీ, సమతలకమనీ, నాలుగువిధాలు. అపహస్తకమంటే అఱచేతి వెనుకభాగంతో కొట్టడం. వ్రేళ్లుమాత్రమే తగులుతాయన్న మాట. ప్రసృతకంఅంటే ఏమిటో మున్ముందు చెవుతారు. ముష్టి అంటే గుప్పిటపట్టి గుద్దడం, సమతలకం అంటే అఱచేతినిచాచి స్తనాదులను మర్దించడం, చరచడం మొదలైనవి.

సూ౧౮. తదుద్భవం చ సీత్కృతం తస్యార్తిరూపత్వాత్, తదనేకవిధం. ౨.౭.౪.

పై ప్రహణనసాధనంవల్ల పుట్టిన సీత్కృతం అనేకవిధాలుగా ఉంటుంది కనుక దాంట్లో పరిభేదాలు చాలాఉన్నాయి.

౧౨౯. విరుతానిచాష్టౌ. ౨.౭.౧.

రతికూజితాలుకూడా ఎనిమిదివిధాలు. వాటినిగూడా ఈప్రకరణంలోనే చెపుతారు. రతికూజితాలు రతిలోని సుఖవిశేషం వల్ల పుడతాయి. సీత్కృతాలుమాత్రం చిరుదెబ్బలవల్లే జనిస్తాయి.

౧౩౦. హింకార, స్తనిత, కూజిత, రుదిత, సూత్కృత, దూత్కృత, ఫూత్కృతాని. ౨.౭.౬.

ఆరతికూజితాలు హింకారమూ, స్తనితమూ, కూజితమూ, రుదితమూ, సూత్కృతమూ, దూత్కృతమూ, ఫూత్కృతమూ అని ప్రసిద్ధిపొందిఉన్నాయి. హింకారం అంటే నోరుమూసి కంఠంతోనూ, ముక్కుతోనూ సుఖాతిశయం కలిగినప్పుడు ఉచ్చరించే, హీం, హీం, హీం, హీం అనే శబ్దం అన్నమాట. స్తనితంఅంటే మేఘధ్వనిలాగా బిగ్గరగా ధ్వనిచెయ్యడం, ఇదికూడా కంఠభాగంలోనే హుం, హుం, అన్నట్లు ఉద్భవిస్తుంది. రుదితంఅంటే ఏడవడంలాగా శబ్దంచెయ్యడం. సూత్కృతం అంటే నిట్టూర్పు చెయ్యడం అన్నమాట. ఇక ధూత్కృతానికీ, కూజితానికీ, ఫూత్కృతానికీ లక్షణాలు ముందు చెవుతారు.

౧౩౧. అంబార్థాశ్శబ్దాః, వారణార్థా మోక్షణార్థాశ్చ, అలమర్థాస్తే తే చార్థయోగాత్. ౨.౭.౭.

"అమ్మ అమ్మ" అనే అర్థంగల శబ్దాలూ, "ఆగు, ఆగు" అనే అర్థంగలశబ్దాలూ, "విడు, విడు" అనే అర్థంగల శబ్దాలూ,

"చాలు, చాలు," అనే అర్థంవచ్చే శబ్దాలూ, ఇంకా ఇలాటి "చచ్చా, చచ్చా," అనే అర్థంగల శబ్దాలూ ఇందులో ప్రయోగింపబడవచ్చు.

౫౩౨. పారావత, పరభృత, హారీత, శుక, మధుకర, దాత్యూహ, హంస, కారండవ, లావకవిరుతాని,

సీత్కృత భూయిష్ఠాని,వికల్పశః ప్రయుంజీత.౨.౭.౮

పావురాలలాగా, కోకిలలలాగా, తీతువులలాగా, చిలుకలలాగా, తుమ్మెదలలాగా, గిడ్డంగిపిట్టలలాగా, హంసలలాగా, కారండవ పక్షులలాగా, గోరువంకలలాగా వినడానికి ఇంపుగా ఉండే ధ్వనులను ప్రహణనసమయంలో మార్చి మార్చి గమ్మత్తుగా ప్రయోగించాలి.

౫౩౩. ఉత్సంగోపవిష్టాయాః పృష్ఠే ముష్టిఘాతః.౨.౭.౯.

నాయకుడు, తనతొడమీద కూర్చుండిఉన్న నాయికను వీపు మీద పిడికిలితో కుమ్మాలి.

౫౩౪. తత్ర సాసూయాఇవ స్తనిత, రుదిత, కూజితాని ప్రతీఘాతశ్చస్యాత్. ౨.౭.౧౦.

నాయకుడు పిడికిలితో కుమ్మినప్పుడు దాన్ని సహించనిదాని లాగా బాధను వ్యక్తంచేసేందుకు స్తనితాన్నీ, కూజితాన్నీ, రుదితాన్నీ నాయిక చెయ్యాలి. తిరిగి అతనివీపుమీద పిడికిలితో కుమ్మాలి.

౫౩౫. యుక్తయంత్రాయాః స్తనాంతరే అపహస్తకేవ ప్రహరేత్. ౨.౭.౧౧.

రతిసమయంలో భగలింగసంయోగం కలిగిఉన్నప్పుడు నాయకుడు నాయిక చన్నులమధ్యభాగంలో అరచేతివెనుకభాగంతో నెమ్మదిగా కొట్టాలి.

౫౩౬. మందోపక్రమం వర్ధమానరాగ మాపరిసమాప్తేః.

రతి ప్రారంభించేసమయంలో కొద్దికొద్దిగా ప్రారంభించి అనురాగం వృద్ధిఅయినకొలదీ ఈప్రహణనాలను హెచ్చిస్తూ రతి పూర్తిఅయేదాకా చేస్తూఉండాలి.

౫౩౭. తత్ర హింకారాదీనా మనియమేనాభ్యాసేన వికల్పేన చ తత్కాలమేవ ప్రయోగః. ౨.౭.౧౩.

మెల్లగా చన్నులమధ్య నాయకుడు నాయికను కొట్టినప్పుడు బాధనుసూచించే హింకారమూ మొదలయిన సీత్కృతాలన్నీ రతిప్రారంభకాలంలో కొద్దిగానూ, రతిమధ్యకాలంలో కొంచెం హెచ్చుగానూ, రతి అంత్యకాలంలో చాలా ఎక్కువగానూ అభ్యాసంచేసి ప్రయోగించవచ్చు.

౫౩౮. శిరసి కించిదాకుంచితాంగుళినా కరేణ వివదంత్యాః ఫూత్కృత్య ప్రహణనం తత్ప్రసృతకం. ౨.౭.౧౪.

నాయకుడు, తనతో నాయిక వివాదం చేస్తున్నప్పుడు వేళ్లు కొంచెంవంచి అరచేతి వెనుకభాగంతో ఆమె తలమీద ఫూత్కారంచేస్తూకొట్టాలి. దీన్ని ప్రసృతకం అంటారు.

౫౩౯. తత్రాంతర్ముఖేన కూజితే ఫూత్కృతం. ౨.౭ ౧౫.

పైనచెప్పిన ప్రసృతకమనే ప్రహణనాన్ని నాయకుడు ప్రయోగించినప్పుడు నాయిక తాళలేనిదానిలాగా ఫూత్కృతం అనే

సీత్కారం చెయ్యాలి. ఫూత్కారం అంటే నోరుమూసుకుని ముక్కుతోనూ, కంఠంతోనూ కూసేకూత అన్నమాట.

౫౪౦. రతాంతేపశ్వసిత రుదిత వేణోరివ స్ఫుటతః శబ్దాను కరణం దూత్కృతం. ౨.౭.౧౬.

రతియొక్క చివరకాలంలో ధాతుక్షయం అవుతుంది గనుక కొంచెం శ్రమకలిగి నాయిక, శ్వసితాన్నీ, రుదితాన్నీ ఎంతో వినసొంపుగా కోరి ప్రయోగించాలి. నాయకుడు దంతక్షతమో, నఖక్షతమో చేసినప్పుడు చొక్కిపోయి కంఠంనుంచి వెలువరించేశబ్దాన్ని దూత్కృతం అంటారు. ఈధ్వని వెదురుబొంగును బద్దలుచేసినప్పుడుపుట్టే శబ్దం అన్నమాట.

౫౪౧. అప్సుబదరస్యేవనిపతతః ఫూత్కృతం. ౨.౭.౧౭.

నీటిలో రేగిపండు పడినప్పుడు పుట్టేధ్వనివంటిధ్వనిచేస్తే దాన్ని ఫూత్కృతం అంటారు. ఇది దవడల పైభాగాన్ని నాలుకతో అంటిఉచ్చరిస్తే పుడుతుందట.

౫౪౨. సర్వత్ర చుంబనాదిషూపక్రాంతాయాః ససీత్కృతం తేనైవ ప్రత్యుత్తరం. ౨.౭.౧౮.

చుంబనాదులను నాయకుడు ప్రారంభించినప్పుడు నాయికగూడా వాటినే సమాధానంగా సీత్కారంచేస్తూ బదులు చెయ్యాలి.

౫౪౩. రాగవశాత్ప్రహణనాభ్యాసే, వారణ, మోక్షాలమర్థానాం శబ్దానా, మంబార్థానాంచ సతాంత శ్వసిత రుదిత స్తనిత మిశ్రీకృతః ప్రయోగో విరుత్యాం చ రాగావసానకాలే జఘనపార్శ్వయోస్తాడనమిత్యతిత్వరయాచాపరిసమాప్తేః. ౨.౭.౧౯

ప్రేమాతిశయంచేత రతిసమయంలో నాయకుడు మాటిమాటికి ప్రణయతాడనాలు చేస్తే అప్పుడు నాయిక "వద్దు వద్దు, చాలు, చాలు, విడు, విడు" అనేశబ్దాలతో వాడినకంఠంతో శ్వసితమూ, రుదితమూ, స్తనితమూ మొదలైన సీత్కృతాలను కలిపి ప్రయోగించాలి. రతియొక్క చివరకాలంలో రతికూజితాలనుగూడా ఇలాగే ప్రయోగించాలి. అప్పుడే కటిభాగానికి ఇరుప్రక్కల త్వరత్వరగా రతిపూర్తిఅయేదాకా తాడనం చెయ్యాలి. ఇక్కడ ప్రయోగించవలసినది సమతలకం.

౧౬౮. తత్రలావక హంసవికూజితం త్వరయై వైతే స్తన ప్రహణనయోగాః. ౨.౭.౨౦.

నాయకుడు అరచేతితో సాపుగా చాచి ప్రణహనంచేస్తే గోరువంకలూ, హంసలూ, కూసినట్లు నాయిక శబ్దంచేస్తుంది. అది చాలా మనోహరంగా ఉంటుంది. అది మనోహరంగా వినిపించడంచేతనాయకుడు త్వరగా మళ్లీ ప్రహణనం చేస్తాడు. నాయిక మళ్లీ మోహనంగా త్వరగా రతికూజితం చేస్తుంది.

౧౬౯. భవతశ్చాత్రశ్లోకా—పౌరుష్యం, రభసత్వంచ పౌరుషం, తేజ ఉచ్యతే,అశక్తి, రార్తి, ర్వ్యావృత్తి, రబలత్వంచయోషితః, రాగా, త్ప్రయోగా, త్సాత్మ్యాచ్చవ్యత్యయోఽపి క్వచిద్భవేత్, నచిరం తస్య చైవాంతే ప్రకృతే రేవయోజనం. ౨.౭.౨౧

స్త్రీపురుషులలో ప్రహణనసీత్కృతాలవిషయంలో ఎవరికి ఏది సహజంగా ప్రకాశిస్తుంది?అంటే శరీరం కఠినంగా ఉండటమూ, తొందరపాటూ (గంద్రతనమూ) అనేవి రెండూ, పౌరుషమనే

తేజస్సునకు సహజధర్మాలు. ఆపౌరుషం ఉన్నవాడు పురుషుడు గనుక అతడు స్త్రీని తాడనంచేస్తాడు. తప్పి కొట్టేసామర్థ్యం లేక పోవడమూ, ఒకవేళ కొట్టినా అతిసుకుమారంగా ఉండడంచేత చేతులకునొప్పికలగడమూ, పురుషుడు ఇలా కొట్టుమని అడిగినా శక్తి చాలక నిస్త్రాణపడడమూ అనేవి స్త్రీకిధర్మాలు. అందువల్ల స్త్రీ ప్రహరించలేదు.(ప్రహణనం చెయ్యలేదు)సీత్కారంమాత్రమే చెయ్యగలుగుతుంది. ఒక్కొక్కప్పుడు అనురాగాధిక్యాన్నిపట్టీ, దేశాచారాన్నిపట్టీ స్త్రీ తనధర్మాన్ని వదలి పౌరుషతేజస్సును ధరించి దెబ్బలుకొడుతుంది పురుషుణ్ణి. అప్పుడు పురుషుడు స్త్రీని ప్రోత్సహించడానికి తనధర్మాన్ని వదలి స్త్రీధర్మాలైన సీత్కృతమూ, విరుతమూ, మొదలైనవి చెయ్యాలి. అలా ఎప్పుడూ చెయ్యనవసరంలేదు. తాను ఏ కుతూహలం తీరడంకోసం అలా స్త్రీలక్షణాల ననుసరించాడో ఆకుతూహలం తీరినతర్వాత మళ్ళీతనప్రకృతినిఆశ్రయించవచ్చు.

౫౪౬. కీలామురసి, కర్తరీంశిరసి, విద్ధాం కపోలయోః,
సందంశికాం స్తనయోః, పార్శ్వయోశ్చేతి పూర్వైస్సహ ప్రహణనమష్టవిధానీతి దాక్షిణాత్యానాం, తద్యువతీనాామురసికీలానిచ తత్కృతాని దృశ్యంతే,
దేశసాత్మ్యమేతత్. ౨౭-౨౮.

పూర్వం ప్రహణాన్ని నాలుగువిధాలుగా చెప్పారు. వాటినే ఇక్కడ ఎనిమిదివిధాలుగా చూపిస్తున్నారు. పైనచెప్పిన పిడికిలినే (ముష్టినే) చూపుడువేలుకీ, మధ్యవేలుకీ మధ్యగా బొటనవ్రేలునుదూర్చి కుమ్మితే దాన్ని "కీల" అంటారు. ఈకీలతో

మొట్టినట్లుకుమార్చాలి. దీన్ని స్తనమధ్యంలో ప్రయోగించాలి. "కర్తరి"అనే ప్రహణనం రెండువిధాలు. వేళ్ళకొద్దిగావంచి ఒక చేత్తో తాడనంచేస్తే దాన్ని భద్రకర్తరి అంటారు. రెండుచేతుల వేళ్లనూ కలిపి తాడనంచేస్తే దాన్ని "యుగళకర్తరి" అంటారు. వీటిని తలమీద ప్రయోగించాలి. చూపుడువ్రేలుకీ, మధ్యవేలుకీగానీ, మధ్యవ్రేలుకీ, అనామికకుగానీ మధ్యగా బొటనవ్రేలునుదూర్చి పిడికిలిపట్టి పొడిస్తే దాన్ని "విద్ధ" అంటారు. ఈవిద్ధకాన్ని చెంపలమీద ప్రయోగించాలి. దాన్నే చన్నులమీదగానీ, ప్రక్కభాగాలలోగానీ ఉన్న చర్మనులాగితే "సందంశిక" అంటారు. పూర్వంచెప్పిన నాలుగింటితోనూ మొత్తం ప్రహణనయోగాలు ఎనిమిది. ఈఎనిమిదిటినీ దక్షిణ దేశీయులు ప్రయోగిస్తారు. వాళ్ళు తమస్త్రీలవక్షఃస్థలంమీద కీల అనే ప్రణనాన్ని ప్రయోగిస్తున్నారు. ఇది దేశాచారాలలో చేరుతుంది.

౧౮౭. క్లిష్టమనార్యవృత్త మనాదృతమితి వాత్స్యాయనః.
౨.౭.౨౧.

పైనచెప్పిన కీలమొదలైనవి దేశాచారాన్నిపట్టి అలవాటులో ఉన్నవారికే ప్రయోగించడం ధర్మంగాని, అలవాటులేని ఇతరులమీద ప్రయోగించడం దయాశూన్యత్వమూ, దుఃఖకారణమూ, అసాధుచరిత్రమూ, ప్రాణహరమూ కాబట్టి ఆదరింపరానిది అవుతుంది,

౧౮౮. తథా అన్యదపి దేశసాత్మ్యాత్ప్రయుక్త మత్ర న ప్రయుంజీత. ౨.౭.౨౨.

ఇలా ఇతరప్రహణనాలుకూడా ఏదేశంలోనో వ్యవహారంలో ఉన్నాయని ప్రతిదేశంలోనూ ప్రయోగించరాదు.

౧౪౯. ఆత్యయికంతు తత్రాపి పరిహరేత్. ౨.౭.౨౧.
వినాశనానికీ, అంగవైకల్యానికీ కారణాలైన ప్రహణనాలను ఎక్కడా ఆచరించరాదు.

౧౫౦. రతియోగేహి కీలయా గణికాం చిత్రసేనాం చోళ
రాజో జఘాన. ౨.౭.౨౭.

ఇలాటి ప్రమాదాన్ని దృష్టాంతంగా చూపిస్తున్నారు. వెనుక చోళదేశాన్ని పరిపాలిస్తూ ఒకరాజుండేవాడు. ఆయనకు చాలా సుకుమారురాలైన "చిత్రసేన" అనే భోగస్త్రీ ఉండేది. ఆమెతో ఒకరోజున సంభోగించబోయి గట్టిగా మోటగా కౌగిలించుకున్నాడు. చాలా నాజూకురాలూ, సుకుమారంకలదీ కావడంచేత, ఆమోటైన ఆలింగనానికి అలసిపోయింది. అంతగా బాధపడుతున్నట్లు కనిపిస్తున్నా ఆరాజు కామాంధుడై నిర్దయగా, పాపం ఆసుకుమారంగా సంభోగింప వలసినఆమెమీద ఆమె అవస్థను గుర్తించక, 'కీలను' వక్షస్థలంలో ప్రయోగించి చంపాడు.

౧౫౧. కర్తర్యా, కుంతలశ్శాతకర్ణిః శాతవాహనో మహా
దేవీం మలయవతీం. ౨.౭.౨౮.

కుంతలదేశాధీశ్వరుడైన శాతకర్ణి అనేరాజు క్రొత్తగా అప్పుడే పరిచయాన్ని పొందుతున్న "మలయవతి" అనే తనపట్టపు రాణిని పసికూన అని అయినా తలచక, ఆమె మన్మథోత్సవ సమయంలో మేదో వేషంవేసుకుని కనిపించేసరికి ఒడలు పరవశ

మెత్తి ఆమెతో కూడబోయి 'కర్తరి' అనే ప్రహణనాన్ని గట్టిగా ఆమెశిరస్సుమీద ప్రయోగించి చంపాడు.

౨౨౨. నరదేవసి కుపాణిని విద్ధయా దుష్ప్రయుక్తయా నటీంకాణాంచకార. ౨.౭.౨౯.

పాండ్యరాజునొద్ద సేనాపతిగా ఉన్న నరదేవుడనే మోటుమనిషి అంతఃపురాలలో నాట్యాలు ప్రదర్శించి పేరుపొందిన "చిత్ర లేఖ" అనేనటిని నృత్యంచేస్తున్నప్పుడు చూచి మోహించి ఆమెతో సంభోగించబోయి కామాంధుడై 'విద్ధ' మనే ప్రహణనాన్ని ఆమెయొక్క నున్నని మెత్తనైన చెక్కిళ్లమీద చేతగానితనంగా ప్రయోగించాడు. దానితో ఆమె కళ్ళు పోయినాయి.

౨౨౩. భవంతి చాత్రశ్లోకాః:—నాస్త్యత్ర గణనా కాచిత్, నచశాస్త్రపరిగ్రహః, ప్రవృత్తే రతిసంయోగే రాగఏవాత్ర కారణం. ౨.౭.౩౦.

అసలు కాముకులు కామశాస్త్రాన్ని తెలుసుకున్నవాళ్లూ, తెలియనివాళ్ళూ, అని రెండురకాలు. శాస్త్రతత్వం తెలియని వానికి ప్రపంచమే తెలియదుగనుక తాత్కాలింగా కలిగే కామావేశంచేత తనకు తోచినట్లు చేస్తాడు. అది ఒక లెక్కలోదికాదు. ఇక శాస్త్రతత్వం తెలుసుకున్న పండితుడు ఎంత అనురాగండున్నా అతనికి ఇదితగును, ఇది తగదు అనే జ్ఞానం విశేషంగా ఉంటుందిగనుక ఆలోచించుకునే ప్రహణనాదులను ప్రయోగిస్తాడు. కనుక బాధలేదు.

౨౨౪. స్వప్నేష్వపి నదృశ్యంతే తే భావాస్తేచ విభ్ర
మాః, సురతవ్యవహారేషు యే స్యుస్తత్క్షణ
కల్పితాః. —౨.౨.౩౧

సురతవ్యవహారంలో పైశాస్త్రవేత్తలూ, అనాగరకులూ గూడా అప్పటికప్పుడు కల్పించుకునే విలాసాలూగానీ, భావాలుగానీ, స్వప్నంలోగూడా ఎన్నడూ ఎరిగిఉండరు. అంత క్రొత్తగా అప్పటికప్పుడు సృష్టించుకుంటా రన్నమాట. ఇలాటివిషయాలను శాస్త్రం సమగ్రంగా ఎక్కడ బోధించ గలుగుతుంది.

౨౨౫. యథాహి పంచమీంధారాం ఆస్థాయ తురగఃపథి
స్థాణుం, శ్వభ్రం, దరీం వాఽపి వేగాంధో నసమీ
క్షతే, ఏవం సురతసమ్మర్దరాగాంధౌ కామినావపి,
చండవేగౌ ప్రవర్తేతే, సమీక్షేతే నచాత్యయం.
—౨.౨.౩౩.

ధారం అంటే నడక. గుఱ్ఱానికి అయిదు రకాలైన నడకలుంటాయి. వాటికివిక్రమమూ' వల్గికమూ, ఉపకంఠమూ, ఉపజవమూ, జవమూ అనిపేర్లు. ఈ అయిదునడకలలోనూ అయిదోదైన జవమనేనడకను సాగిస్తున్న గుఱ్ఱము వాయువేగంతో పోతూ, మార్గంలో మొద్దు లున్నాయనిగానీ, మిట్ట లున్నాయని గానీ, పల్లా లున్నాయని గానీ, కందరాలున్నాయనిగానీ గుర్తించగలుగుతుందా? అలాగే నాయికానాయకులు గూడా సురతసమ్మర్దంలో ఒళ్ళు తెలియక మహావేగంతో ప్రవర్తిస్తారు గాని రాబోయే ఆపదలను గుర్తించలేరు. ఇది శాస్త్రాన్ని తెలుసుకోని అజ్ఞానుల విషయం.

౫౫౭. తస్మాన్మృదుత్వం, చండత్వం, యువత్యాబలమేవచ,
ఆత్మనశ్చబలం జ్ఞాత్వా, తథాయుంజీత శాస్త్రవిత్. —౨.౭.౩౮.

అందువల్ల శాస్త్రాన్ని తెలుసుకున్న మానవుడు అవసరాన్ని, అవకాశాన్నిపట్టి, మృదుత్వాన్ని చండత్వాన్నీ స్త్రీయొక్క బలాన్నీ తనబలాన్నీ పరీక్షించుకుని దానికి తగినట్లు వ్యవహరించాలి. ఇలా వ్యవహరించలేకపోతే శాస్త్రంనేర్చినవానికీ, నేర్వనివానికీ భేదం ఏమున్నది? "ఈకామశాస్త్రతత్త్వాన్ని తెలుసుకున్నవాడు ఎప్పుడూ కామాంధుడై ప్రవర్తించడు" అని పెద్ద లన్నారు.

౫౫౮. నసర్వదా, నసర్వాసు ప్రయోగా స్సాంప్రయోగికాః, స్థానే, దేశేచ, కాలేచ, యోగ విషాం విధీయతే. —౨.౭.౩౯.

ఇతి శ్రీవాత్స్యాయనీయేకామసూత్రే సాంప్రయోగికే ద్వితీయేధికరణే ప్రహణనయోగా స్తద్యుక్తాశ్చ సీత్కృత క్రమాః ఇతి సప్తమాధ్యాయః.

అన్నిప్పుడల్లా అందరు స్త్రీలయందూ, అన్నిరకాల సంప్రయోగాలూ, ప్రయోగించరాదు. అవి ప్రయోగించతగిన చోట్లకూ దేశానికీ, కాలానికీ గూడా ఆసంప్రయోగాలతో సంబంధం ఉన్నదో లేదో ఆలోచించి జాగ్రత్తగా ప్రవర్తించాలి.

ఈ విధానంతో భారద్వాజ గోత్రుడున్నూ, యజుశ్శాఖీ
యుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ, అయిన మేడి
చర్ల ఆంజనేయమూర్తిచేత వాత్స్యాయనకామ
సూత్రములకు జయమంగళ వ్యాఖ్య నను
సరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను
తెలుగు వ్యాఖ్యలోని సాంప్ర
యోగికాధికరణంలో ప్రహణన
యోగాలూ, సీత్కృతాలూ
అనే ఏడో అధ్యాయం
ముగిసింది.

*
* *

శ్రీ

# వాత్స్యాయనీయం

రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

---

౨. సాంప్రయోగికాధికరణం

## ౮. పురుషోపసృప్తాధ్యాయం.

౫౫౯. నాయకస్యసంతతాభ్యాసా త్పరిశ్రమముపలభ్య రాగస్యచానుపశమం, అనుమతా తేన తమధోవపాత్య పురుషాయితేన సాహాయ్యం దద్యాత్, స్వాభిప్రాయాద్వా, వికల్పయోజనార్థినీ నాయక కుతూహలాద్వా. ౨.౮.౧.

పైన చెప్పిన ప్రహణనాదులను తెంపులేకుండా ప్రయోగించి నాయకుడు శ్రమచెంది అనురాగంతో పరిపూర్ణుడై ఉన్నప్పుడు నాయిక పురుషాయితాన్ని చెయ్యాలి. పురుషుడుచేసే సురతక్రియను స్త్రీచేస్తే దాన్ని పురుషాయితం అంటారు. ఆపురుషాయితానికి ఉపయోగించేవి పురుషోపసృప్తాలు. కాబట్టి ఆపురుషాయితాన్నీ, పురుషోపసృప్తాలనూ గూడా ఈ అధ్యాయంలో చెపుతున్నారు. నాయకుడు వెంట వెంటనే చాలాసార్లు రతిచేసి బాగాశ్రమపొంది ఉన్నప్పుడు, అతడు ఇంకా అనురాగపూరితుడై ఉన్నాడనేసంగతిగ్రహించి,

నాయిక, అతని అనుజ్ఞమీద అతనిని శయ్యమీద వెల్లకిల పరుండజేసి పురుషుడు చేసేక్రియతో(పురుషాయితంతో)అతనికి సహాయం చెయ్యాలి. ఆపురుషాయితాలలో భేదాలనుగూడా తనకుతూహలాన్ని పట్టిగానీ, నాయకుని ఇష్టాన్ని పట్టిగానీ, అనుసరించవచ్చు. ఈరతులలో నాయకుని అనుమతిని నాయిక తప్పకపొందాలి. అతనికి బాగా ఇష్టమున్నదని తెలుసుకున్న మీదటనే అతడు శ్రమచెంది ఉండకపోయినా, పురుషాయిత క్రియకు పూనుకోవచ్చు. ✓

౫౬౦. తత్రయుక్తయంత్రా శైవేతరే ణోత్థాప్యమానా,
తమవపాతయే దేవంచ రతమవిచ్ఛిన్నరసం తథా
ప్రవృత్తమేవస్యాదిత్యేకోయం మార్గః, పునరారం
భేణాదిత ఏవోపక్రమేదితి ద్వితీయః. వా.సూ.౨.

పురుషాయితం చెయ్యడంలో రెండుతీరులు ఉన్నాయి. ముందు చెప్పబోయేది మొదటిపురుషాయితం. ముందు నాయిక వెల్ల కిల పరుండిఉండగా నాయకుడు రతిచేస్తూ ముక్కోణాకారంగా తాను కూరుచుండి, నాయికను భగలింగాలకు ఎడబాటుకలుగ కుండానే పైకి లేవదీసుకుని బాహువులతో కౌగలించుకోవాలి. అప్పుడు నాయిక అతనిమీద వాలుతుంది. అతడు శయ్యమీద వెల్లకిల ఒరుగుతాడు. ఇలా ఆదిలో ప్రారంభించినరతికి విచ్ఛి న్నం ఏర్పడకుండా ఆసుఖానికి తెంపుకలుగకుండా క్రిందు మీదై, అపేక్షతో, సంతోషంతో, పులకరంతో,ఉత్సాహం తో, రతిసుఖాన్ని అనుభవించడం,ఒకరకమైన పురుషాయితం. ఈపురుషాయితక్రమం నాయకునికి శ్రమహెచ్చినప్పుడూ,అను రాగంహెచ్చుగాఉన్నప్పుడూ సంభవిస్తుంది.

రతి ప్రారంభింపకపూర్వమే నాయిక పురుషాయితాన్ని అను సరింపదలచి ఆరతి కనుకూలంగా నాయకుణ్ణిడుంచి తాను అతనిపైకెక్కి మొదటినుంచీ రతిచేస్తే దాన్ని రెండోరకపు పురుషాయితం అంటారు. రతి రసానికి తెంపురాకుండా అనుస రించే పురుషాయితబంధాలు ఈరెండుతప్ప మరియొకటి మేదీ లేదు.

గి౬౧. సా ప్రకీర్యమాణకేశకుసుమా, శ్వాసవిచ్ఛిన్నహా సినీ, వక్త్రసంసర్గార్థం స్తనాభ్యామురసి పీడయంతీ, పునఃపునః శిరోనమయంతీ, యాశ్చేష్టాః పూర్వ మసౌదర్శితవాం స్తాఏవప్రతికుర్వీత, పాతితా ప్రతి పాతయామీతి హసంతీ తర్జయంతీ, ప్రతిఘ్నతీచ బ్రూయాత్, పునశ్చవ్రీడాం దర్శయే, చ్ఛ్రమ విరామాభీప్సాంచ పురుషోపసృప్తైరేవోపసర్పేత్.

అసలు పురుషాయితం బాహ్యం అనీ, ఆభ్యంతరం అనీ రెండు విధాలు. వాటిలో బాహ్యపురుషాయితాన్ని ముందు చెపు తున్నారు. నాయిక తనశిరస్సున ధరించినపూలు విడిపోయే లాగానూ, నవ్వుతూనవ్వుతూ ఆయాసంచేత దానికి తెంపు కలిగేట్టుగానూ, నాయకుని అధరాన్ని అందుకోడానికీ, ముఖా న్నిచుంబనంచెయ్యడానికీ తనస్తనాలతో అతనివక్షఃస్థలాన్ని నొక్కుతూ, మాటిమాటికీ సిగ్గుతో తలవంచుతూ సామాన్య రతిలో అతను తనమీంద ఎలాఎలా ఏయేచేష్టలు చేశాడో అవన్నీ తాను కసితీర్చుకొనేట్టుగా చెయ్యాలి. అతడు తనను

ఎన్ని బాధలు పెట్టాడో అన్ని బాధలూ తాను అతన్ని పెట్టాలి. అతడు పట్టి కొట్టిస్తే మళ్ళీ పట్టికొట్టిస్తానని సవాలు చేసి, నవ్వుతూ, బెదిరిస్తూ దెబ్బలుకొడుతూ విలాసంగా పలకాలి. పురుషాయితంలో ఎంత స్వేచ్ఛ ననుభవించినా నాయిక సిగ్గును మాత్రం వదలకూడదు. కులకాంతకిది అలంకారమూ, గుణమూనూ. తానింకా ఆపురుషాయితబంధనంతో రమించగోరుతున్నా, చాలించే ఊహను సూచించాలి. పురుషునిలాగా స్త్రీ రతిచేస్తే దాన్ని ఆభ్యంతర పురుషాయితం అంటారు. పైవిధంగా పురుషునిపైకిచేరి పురుషాయితబంధంతో నాయిక ప్రవర్తించాలన్నమాట.

౧౬౨. తానివక్ష్యామః. ౨.౮.౪.

ఇకముందు పురుషోపసృప్తాలంటే ఏవో చెవుతున్నారు.

౧౬౩. పురుషశ్శయనస్థాయాయోషిత స్తద్వచనవ్యాక్షిప్తచిత్తాయా ఇవ నీవీం విశ్లేషయేత్, స్థిరలింగశ్చేతత్ర తత్రైనాం పరిస్పృశేత్, ప్రథమసంగతా చేత్సంహతోర్వోరంతరే ఘట్టనం, కన్యాయాశ్చతథా,స్తనయో, స్సంహతయోః హస్తయోః, కక్షయోః, అంసయోః, గ్రీవాయామితిచ, స్వైరిణ్యాం యథా సాత్మ్యం, యథాయోగంచ, అలకే చుంబనార్థమేనాం నిర్దయమవలంబేత, హనుదేశే చాంగుళీ సంపుటేన, తత్రేతరస్యా వ్రీడానిమీలనంచ ప్రథమసమాగమే కన్యాయాశ్చ. ౨.౮.౫.

ఈ పురుషాయితసందర్భంలో పురుషుడు చేసేపనులను పురుషోపసృప్తాలంటారు. స్త్రీచేసేదాన్ని పురుషాయితం అంటారు. ముందుగా పురుషుడు చేసేపనులు చెవుతున్నారు. మున్ముందు పురుషుడు శయ్యమీద పరుండిఉన్ననాయికను మాటలసందర్భంలోకిదింపి, ఆమెమనస్సును ఆకర్షించి, నెమ్మదిగా కోకముడిని ఊడదియ్యాలి. అందుకు ఒప్పుకోకపోతే ఆమెను బుగ్గలమీద ముద్దులు ప్రయోగించి కలతపెట్టి పరవశురాలినిగా చెయ్యాలి. నిట్టనిలువుగా సిద్ధమైఉన్న తనమదనధ్వజముతో ఆమెచేతులమీదా, బుజాలమీదా, కంఠభాగంలోనూ, స్తనాలమీదా, తొడలమీదా, ఇంకా ఇలాటిచోట్ల తాకాలి. ఆమె క్రొత్తవసిత అయితే తొడలసందున మాత్రమే మేహనాన్ని నొక్కి తాకించాలి. కన్యక అయినా ఇలాగే చెయ్యాలి. చనువుపొందిన స్త్రీఅయితే ఆమెకు ఇష్టంఅయినతావులందు, తగినట్టుగా మేహనాన్ని తాకించాలి. చనువుపొందినస్త్రీని ముంగురులమీద చుంబనంకోసం నిర్దయగా ప్రవర్తించాలి. బుగ్గలమీద వ్రేళ్లతో మెలిపెట్టాలి. అలా క్రొత్తకన్యకలవిషయంలోనూ, క్రొత్తస్త్రీల విషయంలోనూ చేస్తే వాళ్ళు సిగ్గుపొందడమో, కళ్లుమూసుకోవడమో జరుగుతుంది. బాగా చనువు ఏర్పడిన స్త్రీ అయితే అలా సిగ్గూ పడదు, కళ్ళూ మూయదు. స్వేచ్ఛగా ప్రవర్తించేస్త్రీగూడా అలాగేఉంటుంది. మొత్తంమీద బాహ్యాపురుషోపసృప్తాలు కోకముడిని ఊడదియ్యడం, మేహనంతో స్పృశించడం, భగాన్ని మేహనంతో రాపిడిచెయ్యడం, ముఖాదిస్థానాలలో ముద్దులు పెట్టుకోడం అని నాలుగువిధాలుగాచెప్పారన్నమాట. పక్కనపరుండిఉన్న

స్త్రీకి చనువిచ్చి చుంబనాదులను ఆమెమీద బాగా ప్రయోగిస్తూ ఆమెను రమించాలి.

౫౬౮. యుక్తయంత్రేణోపసృప్యమాణా యతోదృష్టి మావర్తయే త్తత ఏవైనాం పీడయే దేతద్రహస్యం యువతీనామితి సువర్ణనాభః. ౨.౮.౬.

నాయకుడు తనమదనధ్వజాన్ని నాయికయొక్క మదనమందిరంలో ప్రవేశపెట్టినతరువాత నాయిక అస్పర్శసుఖాన్ని అనుభవిస్తూ తనచూపును ఏదో ఒకవైపునకు త్రిప్పుతూఉంటుంది. ఆమె ఏదిక్కుగా చూపునిలుపుతుందో ఆదిక్కుగా పురుషుడు సాధనంతో బాగా పీడించాలి. ఆవైపుగా పీడించడంవల్ల త్వరగా రతిసుఖాన్ని పొందుతుంది. స్త్రీలు దీన్ని బయటపెట్టరు కాబట్టి ఇది ఒక పెద్దరహస్యం. అని సువర్ణనాభు లన్నారు. నాయికకు మేహనంతో ఎక్కడస్పృశిస్తే సుఖంకలిగి దృష్టి భ్రమిస్తుందో అక్కడస్పృశిస్తూ ఆదిక్కున అంగాలను పీడిస్తూ రతిచెయ్యాలని కొందరూ, ఏయేచోట్ల స్పృశిస్తే స్త్రీదృష్టి సుఖాతిశయంచేత భ్రమిస్తూ ఉంటుందో ఆచోట్లలో స్పృశిస్తూ, స్తనాదులను మర్దిస్తూ' రతిచెయ్యాలని మఱికొందరూ, రతిప్రాప్తికి లక్షణాలని చెప్పారు. కాని వాత్స్యాయనులు మాత్రం సువర్ణనాభుని మతాన్నే అంగీకరించారు.

౫౬౯. గాత్రాణాం స్రంసనం, నేత్రనిమీలనం, వ్రీడానాశః, సమధికాచ రతియోజనేతి స్త్రీణాం భావలక్షణం. ౨.౮.౭.

స్త్రీలకు భావప్రాప్తి కలిగినట్లు గుర్తించడం ఎలాగంటే వాళ్ళకు భావప్రాప్తి కలిగినప్పుడు శరీరం జారిపోవడమూ, కళ్లు మూయడమూ, సిగ్గుపీడడమూ, ఎక్కువగా రతికోసం పురుషుణ్ణి హత్తుకొనడమూ, స్పష్టంగా కనుపిస్తాయి. ఈలక్షణాలను పట్టి భావప్రాప్తి గుర్తించవచ్చు.

౫౬౬. హస్తౌవిధునోతి, స్విద్యతి, దశ, త్యుత్థాతుం
పాదేనాహంతి, రతావసానేచ పురుషాతివర్తినీ.

ఇంకా స్త్రీభావప్రాప్తిని పొందబోయేసమయంలో చేతులు విదులుస్తుంది. చెమటనుపొందుతుంది. పురుషుణ్ణి కదలనియ్యకుండా లేపనియ్యకుండా కరుచుకుంటుంది. దంతక్షతాలు చేస్తుంది. పాదాలతో అతనిపాదాలను నొక్కుతుంది. పురుషునికి ముందుగా భావప్రాప్తిఅయితే తానే అతనిపైకిచేరి నడుము ఆడిస్తుంది.

౫౬౭. తస్యాఃప్రాగ్యంత్రయోగా త్కరేణసంబాధం గజ
ఇవ క్షోభయే దామృదుభావా త్తతో యంత్ర
యోజనం. ౨.౮.౯.

మదనధ్వజాన్ని యోనిలో ప్రవేశపెట్టకపూర్వం ఈమెచేష్టలు ఇలాంటివిగదా అని గుర్తించుకుని నాయకుడు ఆమెకుముందు రతిప్రాప్తికలగడానికి చేత్తో ఆమెభగాన్ని ఏనుగు తొండంతో చేసినట్లు కొద్దిగా భావప్రాప్తి కలిగేవరకూ కదల్చాలి. అటుతరువాత మేహనాన్ని ప్రవేశపెట్టాలి. భగంయొక్క ఉనికినిపట్టి ఈకదల్చడం నాలుగువిధాలుగా ఉంటుంది. సంబాధమూ, భగమూ, యంత్రమూ,అనే మూడుపదాలకూఒక

టేఅర్థం. భగంలోపల కొంతభాగం తామరపువ్వుదళంలాగానూ కొంత గుండ్రనిగుండులాగానూ, మరికొంత మెలితిరిగి, మరి కొంత ఆవునాలికలాగా గరుకుగానూ, ఉంటుంది. ఈనాలుగు భాగాలలోనూ మొదటిభాగాన్ని ఒదిలి తక్కిన మూడుభాగాలనూ దురద ఒదల్చడానికి చేత్తో క్షోభపెట్టవచ్చు. ఇలా చేత్తో కలచినతరువాత కొద్దిగా భావాన్ని పొందిననాయకతో సంగమిస్తే ఆమెకు చప్పున భావప్రాప్తి కలిగించవచ్చు. చేత్తో భగాన్ని కదల్చడం ఎలాగంటే చేతినాలుగోవేలూ (అనామిక) మూడువేలూ కలిపిపట్టి యోనిలోనికి జొనిపిస్తే ఏనుగుతొండంలాగా ప్రవేశిస్తుంది. దానితో కదల్చాలన్నమాట.

౧౬౮. ఉపసృప్తకం, మంథనం, హులః, అవమర్దనం, పీడితకం, నిర్ఘాతః, వరాహాఘాతః, చటకవిలసితం, సంపుట ఇతి పురుషోపసృప్తాని. ౨.౮.౧౦.

ఉపసృప్తకమూ, మంథనమూ, హులమూ, అవమర్దనమూ, పీడితకమూ, నిర్ఘాతకమూ, వరాహాఘాతమూ, వృషఘాతమూ, చటకవిలసితమూ, సంపుటమూ అని లింగంతోభగాన్ని సమకూర్చిచేసే ఉపసృప్తాలు పదివిధాలు.

౧౬౯. న్యాయ్యమృజుసంమిశ్రణముపసృప్తకం. ౨. ౮.౧౧.

సాపుగా భగంలోనికి మేహనాన్ని జొప్పించడం అనే ఉపసృప్తకము న్యాయమైనదీ, అజ్ఞానులకూ, జ్ఞానులకూ తెలిసినదే.

౫౭౦. హస్తేనలింగం సర్వతో భ్రమయేదితి మన్థనం.

చేత్తో లింగాన్ని పట్టుకుని భగం లోపలిభాగాన్ని అంతటా తిప్పడాన్ని మంథనం అంటారు.

౫౭౧. నీచీకృత్యజఘన ముపరిష్టా ద్ఘట్టయేదితి హూళః.

నాయకుడు తనకటిప్రదేశాన్ని క్రిందుగాఉంచి మేహనాన్ని యోనిలోనికి జొప్పించి పొడవడాన్ని హూళం అంటారు.

౫౭౨. తదేవవిపరీతం సరభసమవమర్దనం. ౨.౮.౧౪.

పైనచెప్పిన పొడవడాన్నే బాగా తొందరగాచేస్తే దాన్ని మర్దనం అంటారు.

౫౭౩. లింగేన సమాహత్య పీడయం శ్చిరమవతిష్ఠేతేతి పీడితకం. ౨.౮.౧౫.

లింగాన్ని భగంలోనికిఎంతవరకు జొప్పించడానికి వీలుంటుందో అంతవరకూ జొప్పించి వెనుకకూ ముందుకూ శక్తికలిగినంత వరకూ పీడిస్తే దాన్ని పీడితకం అంటారు.

౫౭౪. సుదూరమాకృష్య వేగేన స్వజఘన మవపాతయే దితినిర్ఘాతః. ౨.౮.౧౬.

బాగా యోనిలోనికి ప్రవేశపెట్టినలింగాన్ని చివరవరకూ వెనక్కులాగి ఒక్కమాటుగా వేగంగాజొనిపిస్తే దాన్నినిఘూ౯తంఅంటారు.

౫౭౫. ఏకతఏవభూయిష్ఠ మవలిఖేదితి వరాహఘాతః.

ఒకప్రక్కగా మాత్రమే బాగా మేహనాన్ని చొప్పిస్తేదాన్ని వరాహఘాతం అంటారు.

౪౭౬. సఏవోభయతః పర్యాయేణవృషాఘాతః. ౨.౮.౧౭
మేహనాన్ని ఒకమాటు ఒకప్రక్కకూ, రెండవమాటు రెండవప్రక్కకూ చొప్పిస్తూ గుచ్చి రతిచేస్తే దాన్ని వృషాఘాతం అంటారు.

౪౭౭. సకృన్మిశ్రితమనిష్క్రమయ్య ద్విస్త్రిశ్చతురితి ఘట్టయేదితి చటకవిలసితం, రాగావసానికం. ౨.౮.౧౯.

ఒక్కమాటు యోనిలో ప్రవేశపెట్టిన లింగాన్ని బయటకు తీయకుండా రెండు, మూడు, నాలుగుసార్లు పొడిస్తే దాన్ని చటకవిలసితం అంటారు. ఇది భావప్రాప్తికాలంలో చెయ్యవలసినది.

౪౭౮. వ్యాఖ్యాతం కరణం, సంపుటమితి. ౨.౮.౨౦.
నాయికానాయకులు కాళ్ళు సాఫుగా చాచుకుని ఇద్దరి అంగాలూ బాగా హత్తుకునేట్లు కౌగిలించుకుని కలిసిపోతేదాన్ని సంపుటం అంటారు. కరణంకూడా పూర్వం చెప్పబడ్డది.

౪౭౯. తేషాంస్త్రీసాత్మ్యాద్వికల్పేన ప్రయోగః. ౨.౮.౨౧
ఏస్త్రీకి ఏఉపసృప్తాలు సరిపడతాయో ఆమెయందు ఆయా ఉపసృప్తాలను ప్రయోగించాలి. ప్రయోగించడంకూడా రతారంభకాలంలో మృదువుగానూ, మధ్యకాలంలో మధ్యవేగంగానూ, చివరకాలంలో చండవేగంగానూ ప్రయోగించాలి. పురుషుడు బాహ్యోపసృప్తాలు కోకముడివిప్పి ప్రయోగించినట్లే స్త్రీ గూడా పురుషాయితసమయంలో నాయకునిబట్ట ఊడదియ్యడం మొదలయిన బాహ్య పురుషాయితాలు చెయ్యాలి.

౫౮౦. పురుషాయితేతు సందంశో, భ్రమరకః, ప్రేంఖో లితమిత్యధికాని. ౨.౮.౨౨.

పురుషోపసృప్తప్రకరణాన్ని చెప్పి, విశేషాలను చెప్పదలచుకుని పురుషాయితాన్ని గూర్చి చెవుతున్నారు. 'భగలింగసంయోగం తో కూడిఉన్న అభ్యంతరపురుషాయితంలో సందంశమూ, భ్రమరకమూ, ప్రేంఖోలితమూ, అని ఇంకా మూడు విశేషాలు ఎక్కువగా ఉన్నాయి.

౫౮౧. బాడబేన లింగ మవగృహ్యానిష్కర్షంత్యాపీడయం త్యా వాచిరాయస్థానం సందంశః. ౨.౮.౨౩.

నాయిక పురుషుని మేహనాన్ని చేతోపట్టుకుని దానితో భగం యొక్క ముఖాన్ని రాపిడిచేస్తూ, పీడిస్తూ చాలాసేపు ఉంటే దాన్ని సందశం అంటారు.

౫౮౨. యుక్తయంత్రా చక్రవద్భ్రమయేదితి భ్రమరక ఆభ్యాసికః. ౨.౮.౨౪.

భగంలో లింగాన్ని ప్రవేశపెట్టుకుని నాయిక కాళ్లుముడిచి కుమ్మరిసానలాగా నాయకుని శరీరంమీద చేతులుఊనుకుని తిరిగివస్తే దాన్ని భ్రమరకం అంటారు. ఇది అభ్యాసంవల్ల గాని సిద్ధించదు.

౫౮౩. తత్రేతేతరస్య జఘన ముత్క్షిపేత్. ౨.౮.౨౫.

ఈభ్రమరకంలో నాయకుడు సౌకర్యంకోసం తననడుమును పైకి ఎత్తాలి.

౫౮౪. జఘనమేవ డోలాయమానం సర్వతో భ్రామయే దితి ప్రేంఖోలితం. ౨.౮.౨౬.

నాయిక తననడుమును వెనుకకూ, ముందుకూ ఊగించి రతి చేస్తే దాన్ని ప్రేంఖోలితం అంటారు. నడుమును గుండ్రిగా అన్నిదిక్కులకూ త్రిప్పితే భ్రమితంలో చేరుతుంది గాని ఇది కాదు.

౫౮౫. యుక్తయంత్రైవ లలాటే లలాటం నిధాయ విశ్రామ్యేత్. ౨.౮.౨౭.

అటుతరువాత భగలింగపరిసంగాన్ని వీడకుండా నాయకుని ముఖంమీాద తనముఖాన్ని పెట్టి నాయిక విశ్రమించాలి.

౫౮౬. విశ్రాంతాయాంచ పురుషస్య పునరావర్తనమితి పురుషాయితాని. ౨.౮.౨౮.

అలా నాయిక అలిసినతరువాత తాను పూర్వం అలిసినప్పుడు ఎలా నాయిక తనకు సహాయంచేసిందో, అలాగే తానుగూడా ఆమెకు పైకివచ్చి సహాయం చెయ్యాలి. పురుషాయితంలో ఈ విధానాలు చాలా ఆనందాన్ని కల్పిస్తాయి.

౫౮౭. ప్రచ్ఛాదితస్వభావాపి గూఢాకారాపి కామినీ, వివృణోత్యేవభావం స్వంరాగాదుపరివర్తినీ.

నాయిక తనస్వభావాన్ని యెంతకప్పిపుచ్చుకున్నా, ఎంతగంభీరంగా బయటపడకుండా ఉండగలిగినా, పురుషాయిత సమయంలో తనభావాన్ని స్పష్టంగా వివరిస్తుంది. అసుఖభావం చేత మైమరచి తనహృదయాన్ని నాయకునిదగ్గరఏమాత్రమూ దాచక వ్యక్తపరుస్తుంది.

౫౮౮. యథాశీలాభవేన్నారీ, యథాచ రతిలాలసా, తస్యా ఏవ విచేష్టాభి స్తత్సర్వ ముపలక్షయేత్.

ఏస్త్రీస్వభావం ఎలాంటిదో, ఏస్త్రీ అభిలాషలు ఎలాటివో, తెలుసుకుని ఆయాస్త్రీలను ఆయాచేష్టలతో వారిపురుషులు తృప్తిపరచాలి. ఈసూత్రానికి ఇంకొక అర్థంగూడా చెప్ప వచ్చు. ఎలారమిస్తే తనస్త్రీ శీలవతిగా ఉంటుందో ఎలా రమిస్తే తనభార్య తనయందు మక్కువకలిగి ఉంటుందో ఆ ఉపాయాలను ఆమెచేష్టలకు తగినట్లు గ్రహించి అలా ఆమెను తృప్తిపరచాలి.

శ్లో. నర్త్వేవర్తాం, నప్రసూతాం, నమృగీం, నచగర్భిణీం,
నచాతివ్యాయతాం, నారీం యోజయేత్పురుషా
యితే. —౨.౮.౩౧.

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాంప్రయోగికే
ద్వితీయేఽధికరణే పురుషోపసృప్తాని, పురుషా
యితం చేతి అష్టమోఽధ్యాయః.

వెలపల ఉన్నదాన్ని, నీళ్ళాడినదాన్ని, మృగీనాయికనూ, కడు పుతోఉన్నదాన్ని, లావుపాటిదాన్ని పురుషాయితక్రియకు నియోగించరాదు. వెలపల ఉన్నప్పుడు పురుషాయితంచేస్తే ఆస్త్రీ గర్భాన్ని ధరించదు. మృగీనాయిక పురుషాయితంచేస్తే యోనిరంధ్రం చాలాచిన్నదిగనుక ప్రమాదం సంభవిస్తుంది. చూలింతరాలు పురుషాయితంచేస్తే గర్భం స్రవించిపోతుంది. లావుపాటిస్త్రీ పురుషాయితం చెయ్యనే లేదు.

ఈ ప్రణాళికతో భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీ
యుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడి
చర్ల ఆంజనేయమూర్తిచేత వాత్స్యాయన కామ
సూత్రములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి
వ్రాయబడిన 'రతిరేఖ'అను తెలుగువ్యాఖ్య
లోని సాంప్రయోగికమనే రెండో అధి
కరణంలో పురుషోపసృప్తాలూ,
పురుషాయితమూ, అనే
ఎనిమిదో అధ్యాయం
ముగిసింది

*

శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

౨. సాంప్రయోగికాధికరణం

### ౯. ఔపరిష్టికాధ్యాయం.

౪౯౦. ద్వివిధా తృతీయాప్రకృతిః స్త్రీరూపిణీ పురుష రూపిణీచ. ౨.౯.౧.

ఆలింగనం మొదలుకొని, పురుషాయితంవరకూ గల సాంప్రయోగికవిధానాన్నంతటినీ పూర్వంచెప్పిన నలుగురు నాయికలయందూ ప్రయోగించడానికి వీలౌతుంది. స్త్రీకాక, పురుషుడూకాకుండా ఉండే నపుంసకవ్యక్తిని అయిదోనాయికనుగా కొందరు చెవుతున్నారు అని పూర్వాచార్యులన్నారు. ఆనపుంసకవ్యక్తికి సంబంధించిన రతివిషయమే ఔపరిష్టికం అంటే. ఈనపుంసకుణ్ణి మూడవప్రకృతిగా ప్రపంచంలో పరిగణిస్తున్నారు. ఈనపుంసకులు రెండురకాలు. స్త్రీకివలె స్తనాలూ మొదలైనవిఉంటే అదిఒకరకం, గడ్డాలూ, మీసాలూ మొదలైన పురుషలక్షణాలుంటే అది రెండవరకం- వారు రతికోసం చేసేపనిని ఔపరిష్టికం అంటారు.

సూ. ౧. తత్ర స్త్రీరూపిణీ స్త్రియావేష, మాలాపం, లీలాం భావం, మృదుత్వం, భీరుత్వం, ముగ్ధతా, మసహిష్ణుతాం, వ్రీడాంచానుకుర్వీత. ౨.౯.౨.

స్త్రీలకువలె స్తనాదులు కలిగిఉన్న నపుంసకవ్యక్తి వేషమూ పలుకులూ, విలాసాలూ, భావాలూ, సౌకుమార్యమూ, భయ స్వభావమూ, ముగ్ధత్వమూ, ప్రహణనాదులను సహించలేక పోవడమూ, సిగ్గూ, ఇలాటి స్త్రీలక్షణాలను అనుకరిస్తూ ఉంటుంది.

సూ. ౨. తస్యావదనే జఘనకర్మ త దౌపరిష్టికం. ౨.౯.౩.

పైరీతిగా స్త్రీధర్మాల ననుసరిస్తున్న నపుంసకుడు స్త్రీవ్యక్తి యోనితో చేసేపనిని తాను ముఖంతో (నోటితో) చేస్తాడు. దాన్నే ఔపరిష్టికం అంటారు.

సూ. ౩. సా తతో రతిమాభిమానికీం వృత్తించలిప్సేత్ వేశ్యా నచ్చరితం ప్రకాశ్యేదితి స్త్రీరూపిణీ. ౨.౯.౪.

ఆ స్త్రీవేషాన్ని ధరించిన నపుంసకవ్యక్తి పూర్వం రతావస్థాపనాధ్యాయంలో చెప్పిన ఆభిమానికరతినీ, దానికి సంబంధించిన జీవితాన్నీ గడపాలి. అది వేశ్యయొక్క చరిత్రను అనుసరిస్తూ తాను పొందతగినవాళ్లను ఆశ్రయించి పొందుతూ భావప్రాప్తినిపొంది తృప్తిపడుతుంది.

సూ. ౪. పురుషరూపిణీతు ప్రచ్ఛన్నకామాపురుషం లిప్స మానాసంవాహక భావముపజీవేత్. ౨.౯.౫.

ఇక పురుషరూపంతో ఉన్న నపుంసకవ్యక్తి మాట చెవుతున్నారు. ఈవ్యక్తి పురుషరూపంతో ఉండి స్త్రీరూపంతో ఉన్న

దానిలాగానే ముఖంతోనే రతినిపొందుతూ, పైకి స్పష్టంకాని అభిమానికసుఖభావాన్ని హృదయంలో వుంచి పురుషునితో కలియడానికి కోరుతూ వుంటుంది. ఈవ్యక్తి పురుషులకు ఒళ్లు పట్టడం మొదలైన కర్మలలో పాల్గొని స్పర్శసుఖాన్ని పొందుతూఉంటుంది.

౫౯-౫. సంవాహనే పరిష్వజ్యమానేవ గాత్రై రూరూ నాయకస్య మృద్నీయాత్ ప్రసృతపరిచయా చోరుమూలం సజఘనమితి సంస్పృశేత్. ౨.౯.౬.

ఈనపుంసకుడు పురుషులకు ఒళ్ళు పట్టేసమయంలో అతన్ని కౌగిలించుకుంటున్నట్లు తనఅంగాలతో నాయకుని తొడలను మర్దించాలి. బాగా పరిచయం దొరికినతరువాత గజ్జలూ, కటిభాగముగూడా స్పృశించాలి.

౫౯-౬. తత్రస్థిరలింగతాముపలభ్యచాస్య పాణిమంథేవ పరిఘట్టయేత్, చాపల మస్యకుత్సయంతీవ హసేత్.

పైవిధంగా గజ్జలూ, మొదలైనచోట్ల స్పృశిస్తూ ఉంటే పురుషునికి లింగం నిష్ఠురంకావడం సహజం. అలా స్తంభంలాగా పురుషుని మేహనం నిలపడ్డప్పుడు ఆలింగాన్ని తనచేతికి తగిలేట్టుగా తట్టాలి. ఆతట్టడంచేత మరికొంత నిష్ఠురం అయితే అప్పుడు పురుషుని చాపల్యాన్నిచూచి నిందిస్తున్నట్లు అతని వంకచూచి నవ్వాలి.

౫౯-౭. కృతలక్షణేనాప్యుపలబ్ధ వైకృతేనాపి నచేద్యాత ఇతి చేత్? స్వయముపక్రమేత, పురుషేణచ చోద్యమానా వివదేత, కృచ్ఛ్రేణచాభ్యుపగచ్ఛేత. ౨.౯.౮.

లింగం నిష్ఠురంగాఉండడం అనురాగానికి లక్షణం. ఇలా లింగం నిష్ఠురంగాఉన్నా ఔపరిష్టికకార్యానికి నాయకునిచేత అనుమతినిపొందినా పొందకపోయినా తనంతటతాను ఉపక్రమించాలి. నాయకుడు ముఖచాపలం తీర్చుకోమని స్వయంగా ప్రేరేపిస్తే ముందుగా "నేనలాటివాణ్ణికాను" అని కొంతసేపు తగవులాడి చివరకు అంగీకరించాలి. ఇదే స్త్రీరూపిణి అయితే ప్రకటమైన కామం కలిగిఉంటుందిగనుక మొదటనుంచీ ఈకర్మకు ఉపక్రమింపవచ్చు.

౫౮. తత్రకర్మాష్టవిధం, సముచ్చయ ప్రయోజ్యం, నిమితం, పార్శ్వతోదష్టం, బహిస్సందంశోఽంతస్సందంశ, శ్చుంబితకం, పరిమృష్టక మామ్రచూషితకం, సంగరఇతి. ౨.౯.౯.

ఈఔపరిష్టకరతిలో ఎనిమిదిరకాలపనులు క్రమంగా చెయ్యతగినవి ఉన్నాయి. అవి నిమితకమూ, పార్శ్వతోదష్టమూ, బహిస్సందంశనమూ, అంతఃసందంశనమూ,చుంబితకమూ, పరిమృష్టకమూ, ఆమ్రచూషితకమూ, సంగరమూ, అనేపేర్లతో ఒప్పుతూ ఉంటాయి.

౫౯. తేష్వేకైక మభ్యుపగమ్య విరామాభీప్సాం దర్శయేత్. ౨.౯.౧౦.

వాటిలో నిమితమూ మొదలైనవాటిని ఒక్కొక్కదాన్నే ఆచరించి చివరకు విరమించే అభిలాషను సూచించి అతనికి అభిలాషపుట్టించి అతని ప్రార్థనమీద తాను మళ్లీ ఆకర్మలను అనుసరిస్తున్నట్లు నటించాలి.

౬౦౦. ఇతరశ్చ పూర్వస్మిన్ అభ్యుపగతే తదుత్తరమేవాపరం
నిర్దిశేత్తస్మిన్నపి సిద్ధే తదుత్తరమితి. ౨.౯.౧౧.

నాయకుడుగూడా నిమితాన్ని నపుంసకనాయిక పూర్తిచేసిన తరువాత, అటుతరువాతిదాన్ని చెయ్యమని ఆజ్ఞాపించాలి. ఆతరువాత తరువాతిదాన్నీ, ఇలా ఒకక్రియతరువాత మరొక క్రియను చెయ్యమని ఆజ్ఞాపించాలి.

౬౦౧. కరావలంబిత మోష్ఠయో రుపరి విన్యస్త ముపవిధ్య
ముఖం విధునుయాత్తన్నిమితకం. ౨.౯.౧౨.

ఆఔపరిష్టికకర్మగూడా బాహ్యమనీ, అభ్యంతరమనీ రెండు విధాలు. బాహ్యకర్మను ఇక్కడ చెవుతున్నారు. సాధనాన్ని చేతితో పుచ్చుకుని నపుంసకవ్యక్తి తనపెదవులమీద దాని అగ్రాన్ని చేర్చి పెదవులతో ఆమొనను గుండ్రిగాపట్టి తన ముఖాన్ని కదల్చాలి. ఇలాచేస్తే దీన్ని నిమితకం అంటారు.

౬౦౨. హస్తేనాగ్ర మవచ్ఛాద్య పార్శ్వతో నిర్దశనమో
ష్ఠాభ్యా మవపీడ్య భవత్యేతావదితి సాంత్వయేత్,
తత్పార్శ్వతోదష్టం. ౨.౯.౧౩.

నపుంసకవ్యక్తి పురుషుని సాధనాన్ని గుప్పిటతో పట్టుకుని పక్కగా దంతాలు తగలకుండా పెదవులతో పీడించి ఇంక చాలునని అంతటితో ఆపితే అది పార్శ్వతోదష్టం అంటారు.

౬౦౩. భూయశ్చోదితా సంమీలితౌష్ఠీ తస్యాగ్రం నిష్పీడ్య
కర్షయంతీవ చుంబేదితి బహిస్సందంశః. ౨.౯.౧౪.

తరువాతపనికి నాయకుడు ప్రేరేపిస్తే నపుంసకనాయిక తనపెదవులతో లింగంయొక్క చివరభాగాన్ని గట్టిగా నొక్కి ఒదిలితే దాన్ని బహిస్సందశం అంటారు.

౬౦౪. తస్మిన్నేవాభ్యర్థితయా కించి దధికం ప్రవిశేత్, సాపిచాగ్ర మోష్ఠాభ్యాం నిష్పీడ్య నిష్ఠీవేదిత్యం తస్సందంశః. ౨.౯.౧౫.

నాయకుని కోరికమీద లింగాన్ని మరికొంత నోటిలోనికి పోనిచ్చి పెదవులతో పైవిధంగా నొక్కి వదిలితే దాన్ని అంత స్సందశం అంటారు.

౬౦౫. కరావలంబిత స్యోష్ఠవద్గ్రహణం చుంబితకం.

మదనధ్వజాన్ని గుప్పెటతో పట్టుకొని పెదవులతో మేహనం యొక్క చివరభాగాన్ని ముద్దుపెట్టుకుంటే దాన్ని చుంబితకం అంటారు.

౬౦౬. తత్కృతాజిహ్వాగ్రేణ సర్వతోఘట్టనమగ్రేచవ్యధ నమితి పరిమృష్టకం. ౨.౯.౧౭.

పైవిధంగా చుంబితకాన్ని చేసి మేహనంయొక్క చివరభాగాన్ని నాలుకతో రాపిడిపెడుతూ, గట్టిగా నొక్కితే దాన్ని పరి మృష్టకం అంటారు.

౬౦౭. తథాభూతమేవ రాగవశాత్ అర్థప్రమృష్టం నిర్దయ మవపీడ్యావపీడ్య ముంచేదిత్యామ్రచూషితకం.

నాయకుని అభిలాషనుపట్టి పెదవులతో పైవిధంగాపట్టిన మదన ధ్వజాన్ని బాగా నోటిలోపలిభాగానికి గ్రహించి నిర్దయగా నాలుకతోనూ, పెదవులతోనూ, నొక్కినొక్కి ఒదిలితే దాన్ని ఆమ్రచూషితకం అంటారు.

౬౦౮. పురుషాభిప్రాయాదేవ గిరే, త్పీడయేచ్చాపరిసమా ప్తేరితి సంగరః. ౨.౯.౧౯.

నాయకుని అభిప్రాయాన్ని తెలుసుకున్నమీదట ఈముఖ రతితో మదనధ్వజాన్ని నాలుకతో ఆడిస్తూ, పెదవులను కదిలిస్తూ, తలను ఆడిస్తూ నొక్కిపట్టాలి. దీన్ని సంగరంఅంటారు.

౬౯. యథార్థం చాత్ర స్తనప్రహణనయోగ ప్రయోగ ఇత్యౌపరిష్టికం. ౨.౯.౨౦.

అనురాగం ఏవిధంగా మృదు, మధ్య, అతిమాత్ర భేదాలతో నిమిత్తాది ఔపరిష్టిక కార్యాలలో వృద్ధిపొందుతున్నదో, అలాగే స్తనప్రహణనాది ప్రయోగవిషయంలోగూడా తెలుసుకోవాలి. ఇలా ఔపరిష్టిక విషయాన్ని సంపూర్ణంగాచెప్పారు.

౭౦. కులటాః స్వైరిణ్యః పరిచారికాః సంవాహికా శ్చాప్యేతత్ప్రయోజయంతి. ౨.౯.౨౧.

కులంనుంచి వెలిఅయినస్త్రీలూ, ఇష్టంవచ్చిన పురుషులతో కూడినస్త్రీలూ, పరిచారికలూ, ఒళ్లుపట్టేస్త్రీలూ, ఈమొదలైనస్త్రీలుగూడా ఈ ఔపరిష్టికరతిని ప్రయోగిస్తారు.

౭౧. తదేతత్తునకార్యం సమయవిరోధా, దసభ్యత్వాచ్చ, పునరపీహ్యాసాం వదనసంసర్గే స్వయమేవార్తిం ప్రతిపద్యేతేత్యాచార్యాః. ౨.౯.౨౨.

ఈఔపరిష్టికకార్యాలను ధర్మశాస్త్రంలో గట్టిగా నిషేధించారుగనుకనూ, పెద్దలు దీన్ని ఎక్కువగా నిందించారుగనుకనూ, ఇలా ఔపరిష్టికకర్మనుచేసిన స్త్రీముఖాన్ని చుంబించడానికి తనంతటతనకే అసహ్యంగా తోస్తుందిగనుకనూ, ఎన్నడూ ఆచరించరాదని ప్రాచీనాచార్యు లన్నారు.

౬౧౨. వేశ్యాకామినః అయమదోషోఽన్యత్రోఽపి పరిహార్య స్స్యాదితి వాత్స్యాయనః. ౨.౯.౨౩.

కులభ్రష్టలు మొదలు వేశ్యలవరకూగల స్త్రీలను కామించే పురుషులకు ఔపరిష్టికకార్యము దోషంకాదనిన్నీ, కులకాంత విషయంలో ప్రయోగిస్తే దోషమనిన్నీ వాత్స్యాయను లన్నారు.

౬౧౩. తస్మాద్వేశ్యాస్త్వౌపరిష్టికమాచరంతి నతాభి స్సహ సంసృజ్యంతే ప్రాచ్యాః. ౨.౯.౨౪.

అందువల్ల ఏవేశ్యాస్త్రీలు ఔపరిష్టికకార్యాన్ని ఆచరిస్తున్నారో, వారితో ప్రాచ్యదేశీయులు రతిచెయ్యరు.

౬౧౪. వేశ్యాభిరేవ నసంసృజ్యత ఆహిచ్ఛత్రికాః, సంస్పృష్టాఅపి ముఖకర్మ తాసాం పరిహారన్తి. ౨.౯.౨౫.

అహిచ్ఛత్రదేశంలో పుట్టినపురుషులు అసలు వేశ్యలతోనే సంగమించరు. ఒకవేళ సంగమించినా వారలను ముఖకర్మనుంచి వారిస్తారు.

౬౧౫. నిరపేక్షా స్సాకేతా స్సంసృజ్యంతే. ౨.౯.౨౬.

అయోధ్యలో పుట్టినపురుషులు కుడీ, ఎడమా లేకుండా వేశ్యలతో సంప్రయోగాదిక్రియలతోనూ, ఔపరిష్టికాది క్రియలతోనూగూడా సంభోగిస్తున్నారు.

౬౧౬. నతు స్వయమౌపరిష్టికమాచరంతి నాగరకాః.

పాటలీపుత్రనివాసులైన నాగరకులు తమంతటతాము ఔపరిష్టికానికి ప్రోత్సహించరు, కాని వారిప్రార్థనలమీద వేశ్యలతో ఈరతిని సలుపుతారు.

౬౧౭. సర్వమవిశంకయా ప్రయోజయంతి శౌరసేనాః.

శూరసేనదేశీయులు సంకోచంలేకుండా ఔపరిష్టికాన్ని ప్రయోగిస్తారు.

౬౧౮. ఏవంహ్యాహుః, కోపి యోషితాం, శీలం, శౌచం, ఆచారం, చరితం, ప్రత్యయం, వచనం, వా శ్రద్ధాతు మర్హతి? నిసర్గాదేవహి మలినదృష్టయో భవంత్యేతా నపరిత్యాజ్యాః, తస్మాదాసాం స్మృతితఏవ శౌచ మన్వేష్టవ్యం. ౨.౯.౨౯.

పెద్ద లిలాఅంటారు. "స్త్రీలస్వభావాన్నీ, శుచిత్వాన్నీ, ఆచారాన్నీ, చరిత్రనూ, విశ్వాసాన్నీ, మాటలనూ, ఎవడు నమ్మగలడు? స్వభావసిద్ధంగానే స్త్రీలదృష్టి మలినపూరితమైనది. అందువలన వీరిని ఎన్నడూ నమ్మి విడువనూరాదు. విడువనట్లు ఉండనూరాదు. అందువల్ల వారినిగూర్చి స్మృతిని (ధర్మాన్ని) పట్టే శుచిగుణాన్ని నిర్ణయించాలి.

౬౧౯. శిష్టవిప్రతిపత్తేః స్మృతివాక్యస్యచ సావకాశత్వా ద్దేశస్థితే రాత్మనశ్చ వృత్తిప్రత్యయానురూపం ప్రవర్తేతేతి వాత్స్యాయనః. ౨.౯.౩౦.

శిష్టులలోగూడా దేశాచారాలనుపట్టి భేదం కనిపిస్తోంది. స్మృతికూడా స్త్రీముఖం రతిసమయంలో శుద్ధమని చెవుతున్నది. అందువల్ల దేశాచారాన్నిపట్టీ, తమఅభిలాషనుపట్టీ, నాయికానాయకులు తగినవిధంగా వర్తించవలెనని వాత్స్యాయనులన్నారు.

౬౨౦. భవంతిచాత్రశ్లోకాః — ప్రమృష్టకుండలాశ్చాపి యువానః పరిచారకాః, కేషాంచిదేవకుర్వంతి, నరాణామౌపరిష్టకం. ౨.౯.౩౧.

రతివిషయంలో ఆరితేరిన యువకులుగానీ, పరిచారికలుగానీ, కామాసక్తి ఉడిగిన ఏముదిఒగ్గులతో కూడినప్పుడో గాని, ఔపరిష్టికాన్ని ప్రయోగించరు. అంటే ఇది చాలా అరుదుగానే ఉన్నదిగాని బాగా ప్రచారంలో లేదన్నమాట.

౬౨౧. తథానాగరకాః కేచిత్, అన్యోన్యస్య హితైషిణః, కుర్వంతి రూఢవిశ్వాసాః పరస్పరపరిగ్రహం.

అలాగే కొందరు నాగరకులైనవారు తమలోతమకు హితాన్ని చేకూర్చుకోగోరి, బాగా అంతరంగికులుగాఉంటే పరస్పరంగా ఈ ఔపరిషికాన్ని ఆచరిస్తారు.

౬౨౨. పసుషాశ్చ తథాస్త్రీషు కర్మతత్కిల కుర్వతే, వ్యాసస్తస్యచవిజ్ఞేయోముఖచుంబనవద్విధిః. ౨.౯.౩౩.

స్త్రీలు ఎలా పురుషులతో ఔపరిష్టికకార్యాన్ని సలుపుతున్నారో, అలాగే పురుషులుగూడా స్త్రీలతో ఔపరిష్టికాన్ని జరుపుతున్నారు. దానికి గూడాముఖాన్నిచుంబనం చేసినట్లుగానే విధానమని తెలుసుకోవాలి.

౬౨౩. పరివర్తితదేహేతు స్త్రీపుంసే యత్పరస్పరం, యుగపత్సంప్రయుజ్యేతే, సకామః కాకిలః స్మృతః.

స్త్రీపురుషులు ఒకరికాళ్లవైపుగా ఒకళ్ళు పడుకుని ఒకళ్ల రహస్యేంద్రియాలను ఒకళ్ళు ఒక్కమాటుగా ఆస్వాదిస్తూఉంటే

ఆకామాన్ని కాకిలంఅంటారు. ఇందులో కాకి నోటితో అమే ధ్యాన్ని గ్రహించినట్లు స్త్రీపురుషులు అసహ్యాన్యవహారంలో ప్రవర్తిస్తున్నారుగనుక దీనికి కాకిలం అని పేరువచ్చింది.

౬౨౮. తస్మాద్గుణవతస్త్యక్త్వా చతురాం స్త్యాగినోవరాన్
వేశ్యాః ఖలేషు రజ్యంతే దాస, హస్తిపకాదిషు.

అందువల్లనే మంచినేర్పరులూ, త్యాగంకలవాళ్ళూ, శ్రేష్ఠులూ అయిన బుద్ధిమంతులను విడచిపెట్టి వేశ్యలూ, కులంతప్పిన భర్తలూ, బుద్ధిహీనలూ, చాకలి,మంగళ్లతోనూ, దాసులతో మావటివాళ్ళతోనూ, గుఱ్ఱపుబళ్లవాళ్లతోనూ, అనురాగాన్ని పూనితుచ్ఛంగా రమిస్తారు.

౬౨౯. నత్వేతద్బ్రాహ్మణో విద్వాన్ మంత్రీవా రాజధూర్వహః, గృహీత ప్రత్యయోవాపి కారయే దౌపరిష్టకం. ౨.౯.౩౬

విద్యావంతుడైన బ్రాహ్మణుడుగానీ, రాచకార్యాలను ముఖ్యంగా నడిపే మంత్రిగానీ, కొంచెం లోకంలో గౌరవ మర్యాదలు కావాలనుకునే పెద్దమనిషిగానీ, ఈఔపరిష్టిక కార్యానికి పూనుకొనకుందురుగాక.

౬౩౦. న శాస్త్రమస్తీత్యేతావత్ప్రయోగే కారణంభవేత్,
శాస్త్రార్థాన్ వ్యాపినో విద్యాత్, ప్రయోగాం స్త్వేక దేశికాన్. ౨.౯.౩౭.

శాస్త్రంలో ఉన్నాయిగదా అని ప్రతిపనీ చెయ్యడానికి పూను కోరాదు. శాస్త్రవిషయాలు అన్నిదేశాలకూ సంబంధించి ఉంటాయి. ప్రయోగించేవాళ్ళు ఒక్కదేశానికే చెంది

ఉంటారు. కనుక ముఖ్యంగా దేశాచారాన్నీ, స్వభావాన్నీ చూచుకుని ప్రవర్తించాలిగాని శాస్త్రంలో ఉన్నవన్నీ, ఆచరించడానికి ప్రయత్నించవద్దు.

౬౨౭. రసవీర్యవిపాకాహిశ్వమాంసస్యాపి వైద్యకే,కీర్తితా
ఇతి తత్కింస్యాద్భక్షణీయం విచక్షణైః. ౨.౯.౩౮.

తీపీ మొదలైన రుచులూ, పౌరుషమూ మొదలైన వీర్యగుణాలూ, పరిణామాదులు, మొదలు కుక్కమాంసం వరకూ గల పదార్థగుణాలన్నీ వైద్యశాస్త్రంలో కీర్తింపబడ్డాయి గదా అని విద్వాంసులు వాటినన్నిటినీ ఆలోచనలేకుండా భక్షించవచ్చునా?

౬౨౮. సంత్యేవపురుషాః కేచి త్సంతిదేశాస్తథావిధాః,సంతి
కాలాశ్చ తేష్వేతేయోగానస్యుః నిరర్థకాః.

వాటిననుసరించే పురుషులూ కొందరున్నారు. అలాటిదేశాలూ కొన్ని ఉన్నాయి. అవి ఆచరణలోకి వచ్చేకులాలూ కొన్ని ఉన్నాయి, ఆయా కాలాలలోనూ, ఆయా దేశాలలోనూ, ఆయా మనుష్యులలోనూ, ఈ ప్రయోగాలు నిరర్థకాలు కాకుండా ఉపయోగపడతాయి.

౬౨౯. తస్మాద్దేశంచ కాలంచ ప్రయోగం శాస్త్రమేవచ,
ఆత్మానంచాపి సంప్రేక్ష్యయోగాయుంజీతవానవా.

అందువల్ల బుద్ధిమంతులు దేశాన్నీ, కాలాన్నీ, శాస్త్రాన్నీ, తనను పరీక్షించుకుని ఈ యోగం తగునా? తగదా? అని వితర్కించుకుని ప్రయోగించాలి.

౬౩౦. అర్థస్యాస్య రహస్యత్వాత్, చలత్వాత్సాధనస్తథా,
కః కదా కింకుతః కుర్యాత్ ఇతి కోజ్ఞాతుమర్హతి.

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే సాంప్రయోగికే
ద్వితీయేఽధికరణే ఔపరిష్టికం నామ
నవమోఽధ్యాయః.

ఈ ఔపరిష్టికకర్మ చాలా రహస్యంగనుకనూ, మనస్సు చాలా చలించేస్వభావం కలదిగనుకనూ, ఎవడు ఎప్పుడు ఏరీతిగా ప్రవర్తిస్తాడో ఎవరు తెలుసుకోగలరు?

ఈ విధానంతో భారద్వాజగోత్రుడునూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయమూర్తి చేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను తెలుగు వ్యాఖ్యలోని సాంప్రయోగికాధికరణంలో ఔపరిష్టికం అనే తొమ్మిదో అధ్యాయం ముగిసింది.



శ్రీ

# వాత్స్యాయనీయం

రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

౨. సాంప్రయోగికాధికరణం

## ౧౦. రతారంభావసానికాధ్యాయం.

౬౩౧. నాగరకస్సహమిత్రజనేః పరిచారకైశ్చ కృతపుష్పోపహారః, సంచారితసురభిధూపే రత్యావాసే ప్రసాధితే వాసగృహే, కృతస్నానప్రసాధనాం యుక్త్యా పీతాం స్త్రియం సాంత్వనైః పునఃపానేన చోపవేశనం.

ఇంతకుపూర్వం ఔపరిష్టికంవరకూ గల రతి విశేషాలను చెప్పారు. ఆరతికి అరంభదశలో ఏమి చెయ్యాలి? చివరసమయంలో ఏమిచెయ్యాలి? అనేప్రశ్నలకు సమాధానం చెవుతున్నారు. ముందు రతిని ప్రారంభించే సమయంలో అనుసరింపవలసిన క్రమాన్ని చెవుతున్నారు.

నాగరకుడు, పీఠమర్దుడూ మొదలైన మిత్రజనంతోనూ తాంబూలం మొదలైనవాటిని అందించే సేవకులతోనూ ఉండి కలిసి పూలమాల మొదలైనవి ధరించి పరిమళధూపాలతో సువాసనలు వెదజల్లుతున్న, చక్కగా అలంకరింపబడిన నివాస

గృహంలోని రతిగృహం ప్రవేశించి, శుభ్రంగా జలకమాడి, చక్కగా అలంకరించుకుని ఉన్న స్త్రీచేత కొద్ది మద్య ద్రవ్యాన్ని తాగించి, కుశలప్రశ్నలడిగి మళ్ళీ అమద్యద్రవ్యాన్ని తాగిస్తూ శయనంమీద ఆమెతో ఉపవేశించాలి.

౬౩. ౨-౨౮౨. దక్షిణతశ్చాస్యా ఉపవేశనం, కేశహస్తే వస్త్రాంతే నీవ్యామిత్యవలంబనం, రత్యర్థం సవ్యేనబాహునాఽనుద్ధతః పరిష్వంగః, పూర్వప్రకరణ సంబద్ధైః పరిహాసానురాగైర్వచోభిరనువృత్తిః, గూఢాశ్లీలానాం చ వస్తూనాం సమస్యయా పరిభాషణం సనృత్తమనృత్తం వా గీతం వాదిత్రం, కళాసుసంకథాః పునః పానేనోపచ్ఛందనం, జాతానురాగాయాం కుసుమానులేపనతాంబూలదానేనచ శేషజనవిసృష్టిః, విజనే చయథోక్తైరాలింగనాదిభిరేనా ముద్ఘర్షయేత్, తతో నీవీ విశ్లేషణాదియథోక్తముపక్రమేతేతి అయం రతారంభః. ౨.౧౦.౨-౧౨

ఆశయ్యమీద నాయికకు కుడిభాగంలో తాను ఉపవేశించాలి. ఆమె ఎడమభాగంలో ఉపవేశించాలి. నాయకుడు తనఎడమ బాహువుతో ఆమెను కౌగిలించాలి. కుడిచేత్తో ఇద్దరికీ మధ్యగా పానపాత్రపట్టుకుని ఇద్దరూఆరగించాలి.అటుతరువాత నాయిక జుట్టునివిరి, చేతినితడివి, పమిటను సవరించి కోకముడిదగ్గరకు చెయ్యి చేర్చాలి. అటుతరువాత రతికోసం మెల్లమెల్లగా కుడిబాహువుతోగూడా కౌగిలించాలి. పూర్వప్రకరణాలలో చెప్పినట్లు పరిహాసవాక్యాలతోనూ, ప్రణయవాక్యాల

తోనూ, ప్రసంగించాలి. రహస్యాలూ, బూతులూ అయిన వస్తువులనుగూర్చి సమస్యలు కల్పించి వాటిని పూరించేవిధంగా మాట్లాడాలి. నృత్తం ఉన్నా లేకపోయినా వీణెపట్టించి సంగీతం పాడించాలి. ఆయాకళలనుగూర్చి కథలు చెప్పాలి. మళ్ళీ మద్యపానంకోసం ప్రోత్సహించాలి. ఇక్కడ మద్యపానం అని సామాన్యంగా చెప్పారు, కాని పానకాలూ, పాలూ, మొదలైనవిగూడా ఈమద్యం బదులు ఉపయోగించుకోవచ్చు. మద్యపానం నిషిద్ధంగనుక పైపానకాదులను సేవించడం క్షేమం. ఇలా నాయికకు అనురాగాన్ని కొద్దిగా కలుగజేసి అక్కడఉన్న మిత్రులనూ, పరిజనులనూ, పుష్పాలూ, గంధాలూ, తాంబూలాలూఇచ్చి పంపివెయ్యాలి. అటుతరువాత ఏకాంతంగా పైప్రకరణాలలోచెప్పినరీతిగా ఆలింగనాదులు చేసి ఆనాయికను ప్రోత్సహించాలి. అటుతరువాత కోకముడిని ఊడదియ్యాలి. ఇది రతి ప్రారంభించేక్రమం.

౬౮౩-౬౯౦. రతావసానికం రాగమతివాహ్యాసంస్తుతయో రివ సవ్రీడయోః పరస్పర మపశ్యతోః పృథక్ పృథక్ ఆచారభూమిగమనం, ప్రతినివృత్యచ వ్రీడాయమానయో రుచితదేశోపవిష్టయో స్తాంబూలగ్రహణ మచ్ఛీకృతం చందనమన్యద్వాఅనులేపనం,తస్యాగాత్రే స్వయమేవ నివేశయేత్, సవ్యేనబాహునాచైనాం పరిరభ్య చషకహస్త స్సాంత్వయన్ పాయయేత్. జలానుపానం వా ఖండఖాద్యకం మన్యద్వా ప్రకృతి

సాత్మ్యయుక్తం ఉభావప్యుపయుంజీయాతాం, అచ్ఛరసకయూష, మమ్లయవాగూం భృష్ట మాంసోపదంశాని, పానకాని, చూతఫలాని, శుష్కమాంసం, మాతులుంగ చుక్రకాణి స శర్కరాణిచ యథా దేశసాత్మ్యంచ. తత్రమధు రమిదం మృదువిశదమితిచ విదిశ్య విదిశ్య తత్త దుపాహారేత్, హర్మ్యతలస్థితయోర్వా, చం ద్రికాసేవనార్థమాసనం, తత్రానుకూలాభిః కథాభిరనువర్తేత, తదంకసంలీనాయా శ్చంద్ర మసంపశ్యంత్యానక్షత్రపంక్తివ్యక్తీకరణం, అరుం ధతీధ్రువసప్తర్షిమాలాదర్శనం చేతి రతావ సానికం. ౨.౧౦.౧౩-౨౨.

ఇక రతావసానికాన్ని చెపుతున్నారు. అనగా రతిఅయిన పిమ్మట చేసేపనులన్నమాట. పైనచెప్పినట్లు రతిసుఖాన్ని అనుభవించి నాయికానాయకులు పరిచయం లేనివాళ్ళలాగా, సిగ్గుపడుతున్నట్లుగా ఒకళ్ళవంక ఒకళ్లు చూచుకోకుండా వేరు వేరు మరుగుప్రదేశాలకు పోవాలి. ఆప్రదేశాలనుంచి తిరిగివచ్చి సిగ్గుపడుతూ ఉచితమైన ప్రదేశంలో కూర్చుని తాంబూలం సేవించి స్వచ్ఛమైన మంచిగంధాన్ని, ఇంకా అనులేపనాలనూ, నాయకుడు నాయికకు స్వయంగానే అలంకరించాలి. మళ్ళీ నాయకుడు తనఎడమబాహువుతో నాయికను కౌగిలించుకుని మద్యపాత్రను చేతపట్టి ఆమెను అనునయిస్తూ,ఆమెచేతమద్యా న్ని త్రాగించాలి. అటుతరువాత నీటినిగూడా అనుపానంగా

తాగించి ధాతువృద్ధికి ఉపయోగించే వంటకాలను పానకాలతో గూడా తమఇష్టాలైన వాటిని ఇద్దరూకలిసి భుజించాలి. తరువాత మాంసంతోనో, పిండితోనో, తయారుచేయబడినభక్ష్యాలను ఉపయోగించాలి, ఇంకాధాతువును వృద్ధిచేసే మాంస పదార్థాలూ, పిండిపదార్థాలూ, మాంసపుపోపులూ, పానకాలూ, మామిడిపళ్ళూ, ఎండుమాంసమూ, పంచదార కలిపినమాదీఫలము ముక్కలూ, దేశాచారాన్ననుసరించి సేవించాలి. వాటిని సేవించేసమయంలో "ఇది తియ్యగాఉంటుంది. ఇది మృదుమధురంగా ఉంటుంది, ఇది తినడానికి చాలా శుభ్రంగాఉంటుంది." అని వర్ణించిచెపుతూ ఆయావస్తువులను భుజించాలి. అటుతరువాత మేడపైభాగానికి వెన్నెలను అనుభవించడానికి పోయి అక్కడున్న ఆసనంమీద ఇద్దరూ కలిసి కూర్చోవాలి. అక్కడ ఆనందంగా ఇష్టగోష్ఠి నడపాలి. అప్పుడు నాయిక అతనిఒళ్లో పడుకుని అతనిలో లీనమైనట్లుగా ఉండి చంద్రునివంక చూస్తూ నక్షత్రపంక్తులను గుర్తించి చెప్పాలి. అరుంధతి, ధృవుడు, సప్తర్షులూ, మొదలైన ఉత్తమ నక్షత్రాల దర్శనం చెయ్యాలి. ఇదంతా రతిఅయిపోయిన తరువాత కార్యక్రమం.

౬౫౧-౬౫౫. అవసానేఽపి ప్రీతి రుపచారై రుపస్కృతా,
సవిస్రంభకథాయోగై రతింజనయతే పరాం,
పరస్పరప్రీతికరై రాత్మభావానువర్తనైః, క్షణా
త్క్రోధపరావృత్తైః క్షణాత్ప్రీతి విలోకితైః,
హల్లీసకక్రీడనకైః గాయనై ర్లాట్యరాసకైః,

రాగలోలార్ద్రనయనైః చంద్రమండలవీక్షణైః,
ఆద్యే సందర్శనే జాతే పూర్వం యేస్యుర్మనోరథాః,
పునర్వియోగే దుఃఖంచ తస్య సర్వస్య కీర్తనైః, కీర్తనాంతేచ రాగేణ పరిష్వంగైః స్సచుంబనైః, తైస్తైశ్చభావై స్సంయుక్తో యూనో రాగో వివర్ధతే.
౨.౧౦.౨౩.౨౭.

రతియొక్క ఆరంభదశలోనూ, అవసానదశలో గూడా నాయికానాయకులు పూలమాలలూ, గంధాలూ, పానీయాలూ, మొదలైనవాటిని ఒకళ్ళ కొకళ్ళు అందిపుచ్చుకుని సేవిస్తూ చనవుగా సరసాలాపాలతో ఇష్టగోష్ఠులు జరుపుతూఉంటే, వాటివల్లపుట్టేప్రేమ చెప్పలేనంతటి స్ఖలనసుఖాన్ని కల్పిస్తుంది. నాయికానాయకులు తమప్రేమభావాలను వృద్ధిపొందించేవీ, తమప్రేమభావాలకు అనుకూలించేవీ అయిన ప్రణయకోపాలతోనూ, క్రీగంటి చూపులతోనూ, ఒకళ్ళనొకళ్లు తృప్తిపరుచుకుంటూ తమతమ ప్రేమలను వృద్ధిచేసుకుంటారు. ఇంకా హల్లీసకమూ మొదలైన నృత్యక్రీడలతోనూ, సంగీతాలతోనూ, నాట్యాలతోనూ, రాసక్రీడలతోనూ, వినోదిస్తూ తమ అనురాగంవల్ల చిత్రంగా చలిస్తున్న చూపులతో చంద్రమండలాన్ని చూస్తూ వినోదిస్తారు. నాయికానాయకులు తమ మొట్టమొదటి దర్శనాలలో ఏయే కోరికలు తమ హృదయాల్లో ఉద్భవించాయో, వియోగం ప్రాప్తించినప్పుడు ఎలాఎలా కష్టాలను అనుభవించారో, వాటినన్నిటినీ ఒకళ్ళకొకళ్ళు చెప్పుకుంటూ కొంతసేపు వినోదిస్తారు. అటుతరువాత అప్రేమపూరితాలైన

అలింగనాలతోనూ, చుంబనాదులతోనూ, ఆయా ప్రేమభావాలతోనూకూడియున్న దంపతులప్రేమ క్రమంగా వికాసాన్ని పొందుతుంది.

౬౫౬. రాగవ, దాహార్యరాగం, కృత్రిమరాగం, వ్యవహితరాగం, పోటారతం, ఖలరతం, అనియంత్రితరతమితి రతవిశేషాః. ౨.౧౦.౨౮.

ఇక్కడ రతివిశేషాలు చెపుతున్నారు. రతాలు రాగవత్తు, ఆహార్యరాగమూ, కృత్రిమరాగమూ, వ్యవహితరాగమూ, పోటారతమూ, ఖలరతమూ, అనియంత్రితరతమూ, అని విశేషంగా చెప్పబడ్డాయి.

౬౫౭. సందర్శనా త్ప్రభృత్యుభయోరపి ప్రవృద్ధరాగయోః ప్రయత్నకృతే సమాగమే, ప్రవాసప్రత్యాగమనే వా కలహవియోగయోగే తద్రాగవత్.

పైరతవిశేషాలకు ఒక్కొక్కదానిలక్షణాన్నీ, వాటి విధానాలనూ చెపుతున్నారు. మొట్టమొదటిదర్శనం మొదలుకొని, అనురాగం వృద్ధిపొందించుకున్న నాయికానాయకులకు ప్రయత్నపూర్వకంగా కలయిక జరిగినప్పుడూ, దూరదేశం పోవడంవల్ల వియోగాన్నిపొంది తిరిగీ కలుసుకున్నప్పుడూ, ప్రణయకలహంతో ఎడబాటుపొంది తిరిగీ కలుసుకున్నప్పుడూ జరిగే రతాన్ని 'రాగవత్' అంటారు.

౬౫౮. తత్రాత్మాభిప్రాయా ద్యావదర్థంచ ప్రవృత్తిః.

ఈరాగవత్తులో నాయికానాయకులు అంతకుపూర్వం పరస్పరమూ, అనురాగాన్ని బాగా వృద్ధిపొందించుకున్నవారుగనుక

తమతమ అభిప్రాయాల ననుసరించి ఇష్టంతీరేవరకూ రతిక్రియలో పాల్గొంటారు.

౬౫. మధ్యస్థరాగయో రారబ్ధం యదనురజ్యతే తదాహార్యరాగం. ౨.౧౦.౩౧.

అంతకుపూర్వం కంటిచూపులతోనే ప్రేమించుకుంటూ హృదయాలు బాగాకలియని మధ్యస్థానురాగం కల నాయికానాయకులుచూపులతో పొందేరతాన్ని ఆహార్యరాగం అంటారు.

౬౬. తత్రచతుఃషష్టికై ర్యోగై సాత్మ్యానువిద్ధైః సంధుక్ష్య సంధుక్ష్య రాగం ప్రవర్తేత తత్కార్యహేతో రన్యత్ర సక్తయోర్వా కృత్రిమ రాగాత్.

నాయకుడు ఆఆహార్యరాగంలో తమయిష్టాన్ననుసరించి చతుష్షష్టియోగాలతోనూ భావరూపంగాఉన్న అనురాగాన్నిబాగా వృద్ధిపొందించాలి. ఈరాగం ధనాశచేతగానీ, అనర్థానికి ప్రతిక్రియచెయ్యడంకోసంగానీ, ఉపయోగిస్తుంది. ఇది నిజమైన అనురాగంకాదు. ఎందువల్లనంటే ఆపురుషుడూ మరోస్త్రీయందు ప్రేమకలిగి ఉంటాడు. ఆస్త్రీగూడా మరోపురుషునిమీద ప్రేమకలిగిఉంటుంది. అలాటి స్త్రీపురుషులకు ఇద్దరికీ ఏదోఒక లాభాన్నపేక్షించి రతి ఏర్పడుతోంది. కాబట్టి దీన్ని కృత్రిమరాగం అంటారు. ఆది చాలా నీచమైనది. సత్పురుషులు దీనిజోలికిపోవరు.

౬౭. తత్రసముచ్చయేన యోగాన్ శాస్త్రతః పశ్యేత్.

అనురాగం ఉండదుగనుక శాస్త్రంలోచెప్పిన ఆలింగనాదులనన్నింటినీ నాయకుడు దేశకాలాలనుపట్టి ప్రయోగించిచూడాలి.

౬౬౨. పురుషస్తు హృదయప్రియామన్యాం మనసి నిధా
యవ్యవహరేత్. సంప్రయోగాత్ప్రభృతి రతిం
యావదతస్తద్వ్యవహితరాగం. ౨.౧౦.౩౪.

పురుషుడు తనహృదయాన్ని ఇష్టురాలైన నాయికమీదఉంచి సంయోగం ప్రారంభించినది మొదలు రతాంతంవరకూ వ్యవహరిస్తే దాన్ని వ్యవహితరాగం అంటారు. ఇలాగే స్త్రీగూడా ప్రవర్తించాలి. ఈ రతివిషయంలోగూడా కృత్రిమరాగమే ప్రాప్తిస్తుంది గనుక పైనచెప్పినట్లుగానే శాస్త్రంలోచెప్పిన యోగాలనన్నింటినీ ఆచరించి చూడాలి.

౬౬౩. న్యూనాయాం, కుంభదాస్యాం, పరిచారికాయాం
వా యావదర్థం సంప్రయోగస్తత్పోటారతం.

నీచలైన కుంభదాసియందుగానీ, పరిచారికయందుగానీ, ఆ కాస్తకాలమూ అనురాగాన్ని నిలిపి రతిచేస్తే, దాన్ని పోటారతం అంటారు. పోటా అంటే నపుంసకం అని అర్థం.

౬౬౪. తత్రోపచారాన్నాద్రియేత. ౨.౧౦.౩౬.

ఆకుంభదాసి మొదలైనవాళ్ళను కౌగిలింతలూ మొదలైన వాటితో ఆదరించరాదు. కేవల సంగంవల్ల కలిగిన అనురాగాన్ని తీర్చుకోవాలి. అంతమాత్రమే.

౬౬౫. తథావేశ్యాయాగ్రామీణేన యావదర్థం ఖలరతం.

రూపాన్ని అమ్ముకుని బ్రతికే వేశ్యగానీ, కుంభదాసీగానీ, గాఢంగా సురతం చేసేవారు దొరకకపోతే మదం వదలేవరకూ ఏవ్యవసాయదారుణ్ణో పిలిచి అతనిచేత రతిచేయించుకుంటుంది. దాన్ని ఖలరతం అంటారు-

౬౬౬. గ్రామవ్రజప్రత్యంతయోషిద్భిశ్చ నాగరకస్య.
ఇలాగే మదించిఉన్న పల్లెపడుచులు విలాసంగాఉన్న పట్టణ వాసినిచూచి తన అక్కరతీరేదాకా వానితో గాఢంగా రమించడాన్నిగూడా ఖలరతమనే అంటారు.

౬౬౭. ఉత్పన్నవిస్రంభయోశ్చపరస్పరానుకూల్యాదయంత్రితరతమితిరతాని. ౨.౧౦.౩౯

చాలాకాలంనుంచీ చనువుతో మెలగుతూ, పరస్పరమూ అనుకూలభావాలు కల నాయికా నాయకులు రతిచేస్తే దాన్ని అయంత్రితరతం అంటారు. రతవిశేషాలు ఇంతటితో సమాప్తి అయినాయి.

౬౬౮. వర్ధమానప్రణయాతు నాయికాసపత్నీనామగ్రహణం, తదాశ్రయమాలాపం వా, గోత్రస్ఖలితం, వానమర్షయేత్, నాయక వ్యలీకంచ. ౨.౧౦.౪౦.

అనురాగాన్ని పొందించుకొన్న నాయిక తనదగ్గరనాయకుడు తనసవతియొక్క పేరెత్తినా, ఆమెనుగూర్చి మాట్లాడినా, నిద్రలో ఆమెనుగురించి కలవరించినా, అతడు అపరాధం చేసినా, ఏమాత్రమూ ఓర్పుచూపించరాదు. అతనితో కలహించాలి.

౬౬౯. తత్రసుభృశఃకలహో,రుదిత, మాయాసఃశిరోరుహాణామవక్షోదనం, ప్రహణన, మాసనా, చ్ఛయనాద్వా, మహ్యాం పతనం, మాల్యభూషణావమోక్షో, భూమౌ శయ్యాచ. ౨.౧౦.౪౧.

అలాటిసమయాలలో స్త్రీలు కలహించి యేడవడమూ, ఆయాసపడడమూ, జుట్టు విరజిమ్ముకొనడమూ, మొత్తుకొనడమూ, తానుకూరుచుండిఉన్న ఆసనంనుంచీ, శయ్యనుంచీ క్రిందపడడమూ, పూలదండలూ, సొమ్ములూ తెంపిపారవెయ్యడమూ, నేలమీద పరుండడమూ మొదలైనవి చెయ్యాలి.

౬౨౦. తత్రయుక్తరూపేణ సామ్నా పాదపతితేన వా ప్రసన్నమనాః తామనునయ న్నుపక్రమ్య శయన మారోహయేత్. ౨.౧౦.౪౨.

అప్పుడు నాయకుడు తగినట్లుగా బుజ్జగించి ఉపాయంగా చెప్పి, బ్రతిమాలి, కాళ్ళమీదపడి ప్రసన్నమైనమనస్సుతో ఆమెను అనునయిస్తూ చేతులతో ఎత్తుకునివచ్చి శయనంమీద పరుండబెట్టాలి.

౬౨౧-౨౩ తస్యాచ వచన ముత్తరేణ యోజయంతీ వివృద్ధక్రోధా సకచగ్రహ మస్యాస్య ముద్నమయ్యపాదేన బాహౌ, శిరసి, వక్షసి, పృష్ఠేవా, సకృద్ద్విస్త్రిరవహన్యాత్. ద్వారదేశం గచ్ఛేత్తత్రోపవిశ్యాశ్రుకరణమితి. అతిక్రుద్ధాపితు నద్వారదేశాద్భూయో గచ్ఛే ద్దోషవత్త్వాదితిద త్తకః.

ఇలా నాయకుడు అనునయించే సమయంలో అతనిమాటకు ఏదోసమాధానంచెప్పి కోపాన్ని రెట్టింపుచేసుకుని, అతనిజుట్టు పట్టుకుని, ముఖాన్ని పైకెత్తి, తనపాదంతో అతనిబాహువుల మీదా, వక్షఃస్థలంమీదా, శిరస్సుమీదా,వీపుమీదా,ఒకటి, రెండు మూడుఅంటూ దన్నాలి. తరువాత ఇంకా కోపంపూని వాలికి

దాకాపోవాలి.అక్కడ కూర్చుండికన్నీళ్లురాల్చాలి. ఎంతకోపం వూనినా నాయిక ద్వారదేశందాటి వీధికెక్కరాదు. అక్కడి కైనా పలుసార్లు పోరాదు. అది చాలాదోషం. అని దత్తకు లన్నారు. అయితే నాయకుణ్ణి కాలితోతన్నడం దోషం కాదా? అంటే అలాతన్నటంగూడా సౌభాగ్యానికి చిహ్నం అని నాగరకవృద్ధు లంటున్నారు.

౬౭౪. తత్రియుక్తితోఽనునీయమానా ప్రసాదమాకాంక్షే
త. ప్రసన్నాపితు సకషాయైరేవవాక్యైరేనంతుదతీ
వ ప్రసన్నా రతికాంక్షిణీ నాయకేన పరిరభ్యేత.

అలాటి సమయాలలో నాయకునిచేత యుక్తిగా బ్రతిమాల బడి ప్రసన్నురాలు కావడానికి ప్రయత్నించాలి. ఒకవేళ ప్రస న్నురాలైనా కఠినపుమాటలతోనే అతన్ని బాధిస్తూఉన్నట్లే ఉండిక్రమంగా ప్రసన్నురాలై రతిని కోరుతూ నాయకునిచేత కౌగిలింపబడాలి.

౬౭౫-౬౭౬. స్వభవనస్థాతు నిమిత్తాత్కలహితా తథావిధ
చేష్టైవ నాయకమభిగచ్ఛేత్. తత్రపీఠమర్ద,
విట, విదూషకైః, నాయకప్రయుక్తై రుపశమి
తరోషా తైరేవానునీతా తైః సహైవ తద్భవన
మధిగచ్ఛే, త్తత్రచవసేదితి ప్రణయకలహః.

ఇక వేశ్యగానీ, పరస్త్రీగాని, కలహించే విధానాన్ని చెవు తున్నారు. నాయిక తనయింట్లోనేఉండి పైనచెప్పిన కారణా లతోనే పైనచెప్పినరీతిగా కలహించాలి. అటుతరువాత అసూ యాదృష్టులతో నాయకుణ్ణి సమీపించాలి. అప్పుడు నాయ

కుని సహాయకులైన పీఠమర్దుడూ, విటుడూ, విదూషకుడూ, అనే మధ్యవర్తులచేత శాంతినిపొందింపబడి వారిచేత బ్రతిమాలబడి వారితోగూడా నాయకునియింటికిపోయి అక్కడ నివసించాలి, ఇది ప్రణయకలహానికి లక్షణం.

౬౭౭-౬౭౮. భవంతిచాత్రశ్లోకాః—ఏవమేతాం చతుష్షష్టిం బాభ్రవ్యేణప్రకీర్తితాం, ప్రయుంజానో వరస్త్రీషుసిద్ధింగచ్ఛతి నాయకః. బ్రువన్నప్యన్యశాస్త్రాణి, చతుష్షష్టివివర్జితః, విద్వత్సంసదివార్థ్యంకథాసు పరిపూజ్యతే. వర్జితోప్యన్య విజ్ఞానైరేతయాయ స్త్వలంకృతః, సగోష్ఠ్యాం వరనారీణాం, కథాస్వగ్రం విగాహతే, విద్వద్భిః పూజితామేనాం ఖలైరపి సుపూజితాం, పూజితాంగణికా సంఘైఃనందినీంకోఽవపూజయేత్. నందినీ, సుభగాసిద్ధా సుభగం కరణీతిచ, నారీప్రియేతి చాచార్యైః శాస్త్రేష్వేషానిరుచ్యతే, కన్యాభిః పరయోషిద్భిః గణికాభిశ్చ భావతః వీక్ష్యతే బహుమానేన చతుష్షష్టి విచక్షణః.

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే, సాంప్రయోగికే ద్వితీయేఽధికరణే, రతారంభావసానికం, రతవిశేషాః, ప్రణయకలహశ్చ దశమోఽధ్యాయః

బాభ్రవ్యునిచేత మిక్కిలిగా కీర్తింపబడిన ఈ పాంచాలీచతుష్షష్టిని నాయకుడు స్త్రీలయందు ప్రయోగించి సిద్ధుడౌతాడు. ఈచతుష్షష్టిని నేర్వక ఎన్ని ఇతరశాస్త్రాలు వర్ణించినా, ఆపురు

షుడు విద్వాంసులసభలో పూజింపబడును. ఇతరశాస్త్రవిజ్ఞానం లేకపోయినా, ఈశాస్త్రవిజ్ఞానాన్ని యెవడు తెలుసుకుని ఉంటాడో వాడు మానవస్త్రీల గోష్ఠులలోనూ, కథలలోనూ, అగ్రస్థానాన్ని పొందుతాడు. ఈచతుష్షష్టివిద్యను "నందిని" అనిగూడా అంటారు. విద్వాంసులచేతనూ, దుర్జనులచేతనూ, వేశ్యాసంఘాలచేతనూ, పూజింపబడుతున్న ఈచతుష్షష్టి అనే నందినిని ఎవ్వరు పూజించకుండా ఉంటారు? ఈనందినీవిద్య సుభగ అనీ, సిద్ధిఅనీ; సుభగంకరణి అనీ, నారీప్రియ అనీ ప్రాచీనాచార్యులచేత తమ కామశాస్త్రగ్రంథాలలో నిర్వచింపబడ్డది. కన్యకలచేతా, పరస్త్రీలచేతా వేశ్యలచేతా, భావవీధిలో ఈచతుష్షష్టిని ఎరిగిఉన్నపురుషుడు గౌరవంగా చూడబడతాడు.

ఇట్లు భారద్వాజగోత్రుడున్నూ, యజశ్శాఖీయుడున్నూ,
ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయ
మూర్తిచేత వాత్స్యాయన కామసూత్రములకు
జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన
పూ 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలోని, సాంప్ర ర్వ
యోగికాధికరణంలో రతారంభమూ,
భా అవసానమూ, రతవిశేషాలూ, గం
ప్రణయకలహమూ అనే
స పదోఅధ్యాయం మా
సమాప్తి అయినది.

ప్తం

శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

### 3. కన్యాసంప్రయుక్తకాధికరణం

#### ౧ వరణవిధానం.

౬౭౯. సవర్ణాయా, మనన్యపూర్వాయాం, శాస్త్రతో౽
ధిగతాయాం, ధర్మో౽ర్థః, పుత్రాః, సంబంధః,
పక్షవృద్ధిః, అనుపస్కృతారతిశ్చ, 3.౧.౧.

నాయకుడు చతుష్షష్టికళలూ నేర్చి నేర్పుగలవాడైనా, ఎంత గొప్పచాకచక్యాన్ని నేర్చుకున్నా సమాగమం అనేది లేక పోతే కలవలేదు. అందువల్ల ముందుగా సమాగమోపాయాన్ని చెవుతున్నారు. దీన్నే ఆవాపం అంటారు. ఈ ఆవాపంలో కన్యక ముఖ్యురాలు. ఆకన్యక యెట్టిదిగాఉండాలో నిరూపిస్తున్నారు. కన్యక తనవర్ణంలోపుట్టి, అంతకుపూర్వం త్రికరణాలా యెవ్వరికీ యివ్వబడనిదై శాస్త్రపద్ధతితో తన చేత స్వీకరింపబడినదిగా ఉండాలి. అలాటినాయిక లభిస్తే ధర్మం దక్కుతుంది. అర్థం ప్రాప్తిస్తుంది. పుత్రులు దక్కుతారు. సంబంధం సరిపడుతుంది. వంశంవృద్ధి అవుతుంది. కల్మషంలేని రతి ప్రాప్తిస్తుంది.

౭౦. తస్మాత్కన్యాం, అభిజనోపేతాం, మాతాపితృమతీం, త్రివర్షాత్ప్రభృతి న్యూనవయసీం శ్లాఘ్యాచారే, ధనవతి, పక్షవతి, కులే, సంబంధిప్రియే, సంబంధిభిరాకులే, ప్రసూతాం, ప్రభూతమాతాపితృపక్షాం, రూపశీలలక్షణసంపన్నాం, అన్యూనాధిక, మవినష్టనఖదంతకర్ణకేశాక్షిస్తనీం, అరోగప్రకృతిశరీరాం, తథావిధ ఏవశ్రుతవాన్ శీలయేత్.

అందువల్ల వివాహం చేసుకోబోయేపిల్ల మంచివంశంలోనిదై ఉండాలి. తల్లీ దండ్రీ సజీవులై ఉండాలి. తన కంటె అపిల్ల చిన్నదిగా ఉండాలి. కనీసం మూడేళ్ళైనా చిన్నదిగాఉండాలి. తనతో సమానమైన కులాచారాలు కలిగి ఉండాలి. ధనధాన్యసమృద్ధికలదై ఉండాలి. బంధువులంటే ఎక్కువ ఇష్టపడేబంధువులు కలదై ఉండాలి. మంచిరూపమూ, మంచిప్రవర్తనా, మంచిలక్షణాలూ కలదై ఉండాలి. తల్లివైపునా తండ్రివైపునా ఎక్కువమంది కలదై ఉండాలి. మరీ పొట్టిగా ఉండరాదు. మరీపొడుగుగానూ ఉండరాదు. చక్కని గోళ్ళూ, చక్కనిపలువరుస, అందమైనచెవులూ, చక్కని కళ్ళూ, మంచివెండ్రుకలూ, నిండైనచన్నులూ, కలదై ఉండాలి. జబ్బులేనిదై ఉండాలి. ఈవిషయాలన్నీ బాగా ఆలోచించి కన్యకను వివాహం చేసుకోవాలి.

౭౧. యాంగృహీత్వా, కృతినమాత్మానం మన్యేత, నచ సమానైర్నింద్యేత, తస్యాం ప్రవృత్తిరితి ఘోటకముఖః. ౩.౧.౩.

ఎవ్వతెను వివాహంచేసుకుంటే తనకు ధన్యుణ్ణనే అభిమానం కలుగుతుందో, తనజాతినుంచి నిందరాకుండా ఉంటుందో ఆమెనే వివాహం చేసుకోవాలని ఘోటకముఖులు చెప్పారు.

౬౮౨. తస్యాః వరణే మాతాపితరౌ, సంబంధినశ్చ ప్రయతేరన్, మిత్రాణిచ గృహీతవాక్యాని ఉభయ సంబద్ధాని. ౩.౧.౮.

కన్యకను వరించడం రెండువిధాలు. పౌరుషవిధానంతో వరించడం మొదటిది. దైవవిధానంతో వరించడం రెండవది. పౌరుషవిధానాన్ని ఇక్కడ నిరూపిస్తున్నారు. పైనచెప్పిన గుణశీలవంశాదులు కలిగిఉన్న కన్యను విచారించి నాయికానాయకల చుట్టపక్కాలూ, మిత్రులూ, మొదలైనవారు ప్రయత్నించడం.

౬౮౩-౬౮౪. తాన్యన్యేషాం వరయితౄణాం దోషాన్ప్రత్యక్షా నాగమికాంశ్చ శ్రావయేయుః. కాలాన్ పౌరుషేయాన్ అభిప్రాయసంవర్ధకాంశ్చనాయకగుణాన్ విశేషతశ్చ కన్యామాతురనుకూలాంస్తథాత్వాయతియుక్తాన్ దర్శయేయుః.

ఆబంధుమిత్రులు ప్రయత్నించే సమయంలో ఆకన్యనుగురించి మరెవ్వరైనా ప్రయత్నిస్తూఉంటే ఆవరునికిఉండే ప్రత్యక్షదోషాలనూ, సాముద్రికశాస్త్రంలోచెప్పినదోషాలనూ ఆపిల్ల తల్లిదండ్రులకు తెలియజెప్పాలి. ఇంకా తమవరునకున్న గౌరవాలూ, గుణాలూ, మంచిలక్షణాలూ, విద్య, నేర్పూ మొదలైనవాటిని వారిమనస్సులకు నచ్చేటట్టు వర్ణించి చెప్పాలి.

ఇంకా కన్యకతల్లికి అతని వైభవాన్నీ, రాబోయే భాగ్యాన్నీ ఉన్నవి ఉన్నట్లుగా వర్ణించి చెప్పాలి. ఇది పౌరుషవిధానంతో వరించేక్రమం.

౬౮౫-౬౮౭. దైవచింతకరూపశ్చ శకుననిమిత్తగ్రహలగ్న బలలక్షణదర్శనేన నాయకస్య భవిష్యంత మర్థ సంయోగం కళ్యాణ మనువర్ణయేత్. అపరే పునరస్యాన్యోన్యవిశిష్టేన కన్యాలాభేన కన్యా మాతరము న్మాదయేయుః, దైవనిమిత్తశకునోప శ్రుతీనాం అనులోమ్యేన కన్యాం వరయేత్.

ఇక దైవవిధానాన్ని చెవుతున్నారు. శకునాలూ, శుభసూచనలూ, గ్రహబలమూ, లగ్నబలమూ, అదృష్టలక్షణాలూ, పరిదర్శించి నాయకునిమిత్రులు నాయకునికి మున్ముందు రాబోయే ధనలాభం, కల్యాణాధిక్యం వర్ణించి చెప్పాలి- ఇలాగే జ్యోతిష్కులుగూడా కొందరు కన్యకతల్లిదగ్గరచేరి ఆమెతో వాళ్ళు పిల్లనియ్యబోతున్న వరుణ్ణిగురించే అధికంగా వర్ణించి చెప్పి మైమరపించాలి. దైవనిమిత్తాలూ, శకునాలూ, కనిపెట్టి వర్ణించాలి. ఆశకునానుసారంగా కన్యకనుగూడా అర్పించేటట్టు చెయ్యాలి.

౬౮౮. నయదృచ్ఛయా కేవలమానుష యేతిఘోటకముఖః.

కన్యకను వరించేసమయంలోమనుష్యప్రయత్నంతో కూడిఉన్న యదృచ్ఛతోనే వరించాలిగాని ఇతరమైన అభిప్రాయంతో మాత్రం వరించరాదు- కన్యకను ఇవ్వరాదుకూడాను. ఇలా ఘోటకముఖులు చెప్పారు.

౬౮౫-౬౯౧. సుప్తాం, రుదతీం, నిష్క్రాంతాం, వరణే పరి
వర్జయేత్. అప్రశస్తనామధేయాంచ, గుప్తాం,
దత్తాం, ఘోనాం, పృషతా, వృషభాం,
వినతాం, వికటాం, విముండాం, శుచిదూషి
తాం, సాంకరికీం, రాకాం, ఫలినీం, మిత్రాం,
స్వనుజాం, వర్షకరీంచ వర్జయేత్.

ఇక కన్యకను వరించబోయే సమయంలో కన్యకనుచూచి శకు
నం విచారించాలిగనుక ఆశకునవిషయాన్ని ఈక్రింద చెవు
తున్నారు. వరించడంకోసం చూడబోయేసమయానికి ఆకన్యక
నిద్రపోతున్నా, ఏడుస్తున్నా, ఇంటిలోనుంచి బయటకు
పోతున్నా, మంచిశకునంకాదు. ఆపిల్లను వరించరాదు. ఇంకా
అప్రసిద్ధమైన పేరుగలపిల్లను వరించరాదు. రహస్యంగా దాచ
బడినపిల్లను వరించరాదు. అంతకుపూర్వం ఎవ్వరికైనా ఇవ్వ
బడినదాన్నీ, అవలక్షణాలు కలదాన్నీ, తప్పనిసరిగా ఒదిలి
వెయ్యాలి, కపిలవర్ణంగలదాన్నీ, బొల్లి శరీరం నిండావ్యాపించి
ఉన్నదాన్నీ, పురుషులతో కలిసి తిరిగేదాన్నీ, నడుమువంగి
పోయినదాన్నీ, వంకరకాళ్లదాన్నీ, అసహ్యమైన ముఖంకల
దాన్నీ, పరపురుషసంపర్కంచేత చెడిపోయినదాన్నీ, రజస్వల
అయినదాన్నీ, మూగదాన్నీ, చిన్నతనంనుంచీ స్నేహంగా
ఉన్నదాన్నీ, దాదాపు తనకు సమానమైన ఈడుగలదాన్నీ,
కాళ్ళూ చేతులూ చెమటలుకమ్మి ఉండేదాన్నీ పెండ్లాడరాదు.
కాబట్టి ఇలాటిశకునాలను జాగ్రతగా చూచుకుని కన్యకను
వరించాలి.

౬౧-౨. నక్షత్రాఖ్యాం, నదీనామ్నీం, వృక్షనామ్నీంచ, గర్హితాం, లకారరేఫోపాంతాంచ వరణే పరివర్జయేత్. ౩.౧.౧౩.

నక్షత్రముల పేర్లుకలదాన్నీ, నదుల పేర్లు గలదాన్నీ, చెట్ల పేర్లు గలదాన్నీ, అసహ్యపు పేర్లుగలదాన్నీ ల అనేఅక్షరమూ, ర అనేఅక్షరమూ చివర అక్షరానికి ముందున్న పేరుగలదాన్నీ వరించరాదు.

౬౩-౬౪. యస్యాంమనశ్చక్షుషోర్నిబంధస్తస్యా మృద్ధిర్నేతరామాద్రియేత. తస్మాత్ప్రదానసమయే కన్యాముదారవేషాం స్థాపయేయురపరాహ్ణికంచ.

ఏకన్యకనుచూచినవెంటనే కంటికీ మనస్సుకీ తృప్తి కలుగుతుందో (భార్యగా అంగీకరించడానికి యిష్టంకలుగుతుందో) ఆమెను చేసుకుంటేనే శుభం కలుగుతుందికాని, ఇతరకన్యను వరిస్తే శుభంకలగదు. అని కొందరంటున్నారు. కాబట్టి వివాహసమయంలో కన్యకను ఆకర్షకమైన వేషంకలదాన్నిగా తయారు చెయ్యాలి. అలా వరణానికి ముందూ తరువాతా తయారు చెయ్యాలన్నమాట.

౬౫-౬౬. నిత్యం ప్రసాధితాయాః సఖీభిస్సహక్రీడా యజ్ఞవివాహాదిషు జనసంద్రావేషు ప్రాయత్నికం దర్శనం, తథోత్సవేషుచ పణ్యాపధర్మత్వాత్ వరణార్థముపగతాంశ్చభద్రదర్శనాన్ ప్రదక్షిణవాచశ్చతత్సంబంధిసంగతాన్ పురుషా

> స్సంగశైశ్చ ప్రతిగృహ్ణీయుః· కన్యాం చైషామ లంకృతా మన్యాపదేశేన దర్శయేయుః· దైవం పరీక్షణం చావధిం స్థాపయేయురాప్రదాన నిశ్చయాత్. స్నానాదిషు వియుజ్యమానావర యితారః సర్వంభవిష్యతీత్యుక్త్వా నతదహరేవ అభ్యుపగచ్ఛేయుః. ౩.౧.౧౬--౨౦.

పెండ్లి సమయాల్లో పెండ్లికూతురులాగా అలంకరించుకుని చెలికత్తెలతో పాటు ఆటలాడాలి. యజ్ఞాదుల్లోనూ, వివాహాదిఉత్సవాలలోనూజనంఎక్కువగా మూగిఉండేచోట కన్యకను చక్కగా అలంకరించి నాయకునికి కనపడేలాగా చెయ్యాలి. ఇది పణ్యంతో సమానమైనదిగనుక యుక్తధర్మమే అవుతుందిగాని అధర్మం కాదు. కన్యావరణానికివచ్చిన పెద్దలనూ, వరుని బంధువులనూ, మిత్రులనూ చక్కగా పల్కరించి మంగళద్రవ్యాలతోనూ, తూర్యనినాదాలతోనూ యెదురువెళ్లి తీసుకువచ్చి గౌరవించాలి. తరువాత చక్కగా అలంకరింపబడిన తమకన్యకను యేదోనెపంమీద వారికి కనుపించేట్టు చెయ్యాలి. కన్యాప్రదానం స్థిరపడేవరకూ వరునిపక్షంలోని పెద్దలకు గట్టిగా మాట యివ్వకుండా దైవాన్ని అడ్డుపెట్టుకోవాలి. లేదా పెద్దలతో ఆలోచించి చెపుతామనైనా మాటతప్పిస్తూఉండాలి. మంగళస్నానాదులకు నియోగించునప్పుడు వరునితాలూకువారు తొందరపడి సిద్ధపడరాదు. మెల్లమెల్లగా అయినా పూర్తిఅవుతుందని సర్దుకుంటూ ఉండాలి.

౭౦౦. దేశప్రవృత్తిసాత్మ్యాద్వా బ్రాహ్మప్రాజాపత్యార్షదైవా నామన్యతమేన వివాహ్యా శాస్త్రతఃపరిణయేదితివరణ విధానం. ౩.౧.౨౧.

ఆయా దేశాలలో ఉండేఆచారాలనుపట్టి బ్రాహ్మమనీ, ప్రాజాపత్యమనీ, ఆర్షమనీ, దైవతమనీ, చెప్పబడే వివాహాలలో యేకోరకమైన వివాహంతో శాస్త్రాన్ని అతిక్రమించకుండా కన్యకను వరించాలి. ఇది వరణవిధానం.

౭౦౧-౭౦౪. భవంతిచాత్రశ్లోకాః-సమస్యా వ్యాస్సహక్రీడాఃవివాహాస్సంగతానిచ' సమానైరేవకార్యాణి నోత్తమైర్నాపివాధమైః. కన్యాం గృహీత్వావర్తేత ప్రేష్యవద్యత్రనాయకః, తం విద్యాదుచ్చసంబంధం పరిత్యక్తం మనస్విభిః. స్వామివద్విచరేద్యత్రబాంధవైస్స్వైః పురస్కృతః, శ్లాఘ్యోహ్యాసంబంధః, సోపి సద్భిర్వినింద్యతే, పరస్పరసుఖాస్వాదా క్రీడాయత్ర ప్రయుజ్యతే, విశేషయంతీచాన్యోన్యంసంబంధస్సవిధీయతే. ౩.౧.౨౫.

వివాదాలూ, క్రీడలూ, వివాహమూ, స్నేహమూ తమతో యీడుజోడైనవాళ్ళతోనే చెల్లుతాయిగాని ఎక్కువతక్కువ వాళ్ళతో పనికిరావు. ఏకన్యకనువరించిన నాయకుడు ఆకన్యకయొద్ద సేవకునిలాగా మెలగుతూఉంటాడో అలాంటి సంబంధాన్ని గొప్పసంబంధాన్నిగా ఇతరకారణాలచేత పరిగణించినా పెద్దలు పరిత్యాజ్యంగా చెపుతున్నారు. ఇలాగే నాయికను వరించి తనబంధువులూ, తానూగూడా కన్యకు సంబం

ధించినవాళ్ళతోనూ, కన్యతోనూ ప్రగల్భాలుకొడుతూ వాళ్ళ పైనప్రభుత్వాన్ని చెలాయిస్తూఉంటాడు. ఆసంబంధంగూడా పైన చెప్పినదానివంటిదేకాకుండా హీనమనిగూడా చెప్పబడుతుంది. దాన్నిగూడా పెద్దలు ఒప్పుకోరు. ఏసంబంధంవల్ల వధూవరుల కుటుంబాలకు పరస్పరమూ సుఖాస్వాదనకలిగే వినోదాలు జరుగుతూఉంటాయో ఆసంబంధమే ఉత్తమోత్తమమని పెద్దలు కొనియాడుతున్నారు.

౭౦౫. కృతోపిచోచ్చసంబంధంపశ్చాత్ జ్ఞాతిషుసంనమేత్.
నత్వేవహీనసంబంధం కుర్యాత్సద్భిర్వినిందితం.

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే కన్యాసంప్రయుక్తకే తృతీయేఽధికరణే వరణవిధానంనామ ప్రథమోఽధ్యాయః.

పైనచెప్పిన ఉచ్చనీచవివాహాల్లో శ్రేష్ఠమైన వివాహాన్ని నిరూపిస్తున్నారు. ఉన్నతమైన సంబంధాన్నిచేసి తరువాత ధనహీనుడై జ్ఞాతిజనులకు లొంగిపోయినా పోవచ్చునుగాని, బుధమంతుల నిందలకుపాత్రమైనహీనసంబంధాన్నిమాత్రం యెన్నడ్డూచేయరాదు.

ఈపద్ధతిగా భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయ మూర్తిచేత వాత్స్యాయన కామసూత్రములకు జయ మంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలోని, కన్యాసంప్రయుక్త కాధికరణంలో, వరుణవిధానం అనే మొదటిఅధ్యాయం ముగిసింది.

శ్రీ

# వాత్స్యాయనీయం

రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

## ౩. కన్యాసంప్రయుక్తకాధికరణం

### . ౨ కన్యావిస్రింభణాధ్యాయం.

౭౦౬. సంగతాయాస్త్రిరాత్ర మధశ్శయ్యా, బ్రహ్మచ ర్యక్షారలవణవర్జమాహార, స్తథా సప్తాహం స తూర్యం మంగళస్నానం, ప్రసాధనం, సహభోజ నంచ, ప్రేక్షాసంబంధినాంచ పూజన, మితి సార్వ వర్ణికం. ౩.౨.౧.

పైప్రకరణంలో చెప్పినరీతిగా నాయికను పొందగలిగినా విశ్వాసితురాలినిగా చెయ్యకపోతే సంప్రయోగానికి పనికి రాదు. కాబట్టి కన్యకను విశ్వసించేటట్టు చెయ్యడం ముఖ్యం. ఇందుకే కన్యావిస్రింభణాధ్యాయాన్ని చెవుతున్నారు. అం దుకు ముందుగా ఒక మంగళాచారాన్ని నిరూపిస్తున్నారు శాస్త్రకారులు. వివాహవిధానంలో పరస్పరమూ సమావే శాన్నీ పరిచయభాగ్యాన్నీ పొందిఉన్న నాయికా నాయకులు అటుతరువాత అనగా వివాహానంతరం మూడురాత్రులు నేల మీద పరుండాలి. చాతుర్థికహోమం చేసేదాకా బ్రహ్మ

చర్యం అవలంబించాలి. ఉప్పూ కారం లేని ఆహారం భుజించాలి. ఇలాగే తరువాత యేడురోజులవరకూ మంగలప్రదాలైన మేళతాళాలతోనూ, నృత్యగీతాలతోనూ, కాలం గడుపుతూ ఆచివరకు మంగళస్నానాదులు చెయ్యాలి. ఈ ఏడు రోజులలోనూ నాయికానాయకులు చక్కగా అలంకరించుకుని ఉండాలి. ఆరోజులలో నాయికానాయకులు ఒకేపాత్రలో భుజించాలి. ఆభోజనంగూడా ఉప్పూ కారం లేకుండానే ఉండాలి. నృత్యాదులను ప్రవర్తింపజేసి వాటిని దర్శించి నటకులను గంధపుష్పాదులతో పూజించాలి. ఈవిధానం అన్నివర్ణాలవారికీ సమానమే.

౭౦౭-౭౦౮. తస్మిన్నేతాం నిశి విజనే మృదుభి రుపచారై రుపక్రమేత. అనుద్వేగకరైరాలాపస్పర్శనాదిభిః.౩.౨.౩.

ఇక కన్యను విస్రంభణం చేసేఉపాయాన్ని వివరిస్తున్నారు. విస్రంభణం చెయ్యడం అంటే చనువు, నమ్మకమూ కల్పించడం అన్నమాట. కన్యకలు సాధారణంగా రెండువిధాలుగా ఉంటారు. ఒకరకంవారు సంసర్గయోగ్యలు. (అనగా అప్పటికప్పుడే కలియడానికి అనుకూలవతులన్నమాట) రెండోరకం వారు అలాకాకుండా కొంచెం బెంకంగా ఉండేవారు. ఈరెండు రకాలకన్యలకీ విస్రంభణవిధానం అవసరమే. అప్పటికప్పుడే కలియడానికి అనుకూలురాలైన కన్యకను రతికోసం విస్రంభింపచెయ్యాలి. రెండోరకం కన్యకు సిగ్గూ భయమూ ఒదిలిపోవడంకోసం విస్రంభణవిధానాన్ని అనుసరించాలి. కాబట్టి విస్రంభణవిధానాన్ని ఇక్కడ ఉదాహరిస్తున్నారు సూత్రకారులు.

పైపదిరోజులలోనూ రాత్రివేళ విజనంగా ఉన్న వినోదగృహం లోచేరి నాయకుడు నాయికను మధురంగా పలకరిస్తూ నెమ్మదిగా స్పృశిస్తూ మృదువుగా ఉపచరిస్తూ ఉపక్రమించాలి.

౨౦౯-౨౧౧. త్రిరాత్రమవచనం హి స్తంభమివనాయకం పశ్యంతీకన్యా నిర్విద్యేతపరిభవేచ్చ తృతీయామివ ప్రకృతిమితి బాభ్రవీయాః, ఉపక్రమేత విస్రంభయేచ్చ నతు బ్రహ్మచర్యమతివర్తేతేతి వాత్స్యాయనః. ఉపక్రమమాణశ్చ నప్రసహ్య కించిదాచరేత్.

ఈవిస్రంభణోపాయాలు ఎందుకు ప్రయోగించాలో చెప్తున్నారు. నాయకుడు ఈవిస్రంభణోపాయాలను ప్రయోగించకుండా ఉపేక్షచేస్తే నాయిక "ఈతడెవడో ప్రపంచజ్ఞానం లేని మూర్ఖునిలాగా ఉన్నాడే. ఇలాటి మూర్ఖునిచేతిలో పడ్డానుగదా? అని చింతిస్తుంది. మీదుమిక్కిలి పరాభవిస్తుంది కూడాను. కదలడు మెదలడు. అసలితడు నపుంసకుడేమోనని పరాభవిస్తుందన్నమాట. కాబట్టి విస్రంభణం ప్రారంభించాలని బాభ్రవీయులన్నారు. ఆమూడుదినాలలో కన్యక నిర్వేదం పాలుకాకుండా విస్రంభణవిధానాన్ని ప్రయోగించాలేగాని బ్రహ్మచర్యభంగంమాత్రం చెయ్యరాదు. అని వాత్స్యాయనులన్నారు. ఉపక్రమించే సమయంలో నాయకుడు ఏపనీకూడా నాయిక యిష్టంలేకుండా బలాత్కరించి చెయ్యరాదు.

౨౧౨. కుసుమసధర్మాణో హి యోషితః సుకుమారోపక్రమాః తాస్త్వనధిగతవిశ్వాసైః ప్రసభముపక్రమ్యమాణాః సంప్రయోగద్వేషిణ్యో భవంతి తస్మాత్సామ్నైవోపచరేత్. ౩. ౨. ౭.

స్త్రీలు సౌకుమార్యంచేత పుష్పాలవంటివారు. వాళ్ళమనస్సు అంతకంటె మృదువైనది. కాబట్టి వాళ్ళతో చాలా సుకుమారంగా ఉపక్రమించాలి. బలాత్కారంగా కూడదు. నాయకుడు నాయికమనస్సుకు విశ్వాసం కలిగించకుండా బలాత్కారంగా ఉపక్రమిస్తే భయభ్రాంతయై సంయోగానికి విముఖత్వాన్ని చెందుతుంది. కాబట్టి స్త్రీలను బలాత్కరించి ఉపచరించడం కూడనిపని. సామోపాయంచేతనే ఉపక్రమించాలి. సామాన్యస్త్రీలలోనే ఇలాఉంటే కన్యకవిషయంలో వేరే ఏంచెప్పాలి?

౭౧౩-౭౧౬. యుక్త్యాపితుయతగి ప్రసరముపలభేత తేనైవా నుప్రవిశేత్. తత్ప్రియేణాలింగనేన ఆచరితేవ నాతికాలత్వాత్. పూర్వకాయేణ చోపక్రమేత విషహ్యత్వాత్. దీపాలోకే విగాఢయౌవనాయాః పూర్వసంస్తుతాయాః బాలాయా అపూర్వాయా శ్చాంధకారే. ౩.౨.౧౧.

పైనచెప్పినవిధంగా కన్యకను ఉపచరించడానికి అవకాశమే చిక్కించుకోలేకపోతే ఇంక ఆపురుషునికి ఉపచారయోగమే ఉండదు. దానికోసమే ఉపాయం ఇక్కడ ముచ్చటించ బడుతుంది. ముందుగా యేదో ఒకయుక్తి పన్నుకుని నాయికను సమీపించాలి. ఆయుక్తితోనే నాయికను వశం చేసుకోవాలి. అనగా చనువు యేర్పడడంకోసం మాటల్లోకీ, ఆటల్లోకీ నెమ్మదిగా ఆమెమనస్సును మార్చాలన్నమాట. ఇలా కొద్దిగా అవకాశం చిక్కించుకున్నతరువాత ఆలస్యం చెయ్యకుండా ఆమెకు

ఇష్టంగానూ సుఖంగానూ ఉండేలాగా ఆలింగనం చెయ్యాలి. సంపూర్ణాలింగనం పనికిరాదు. అది ఉద్రేకకారణం అవుతుంది. తనను తొందరపెడుతుంది. అందువల్ల బొడ్డుకి పైభాగంతోనే కౌగిలించాలి. వినోదగృహంలో ఉన్నప్పుడు బాగా యౌవనోద్రేకంగల నాయికగానీ, అంతకుపూర్వం ఏమాత్రమైనా పరిచయంగల నాయికగానీ అయితే దీపం ఉన్నా ఫరవాలేదు. మరీబాలికఅయినా, బొత్తిగా పరిచయం లేనిదైనా అయితే చీకటిలోనే ఉపక్రమించాలి.

౨౧౭. అంగీకృత పరిష్వంగాయాశ్చ వదనేన తాంబూల దానం, తదప్రతిపద్యమానాంచ సాంత్వనైర్వాక్యైశ్శపథైః ప్రతియాచితైః పాదపతనైశ్చ గ్రాహయేత్. వ్రీడాయుక్తాపియోషి దత్యంతక్రుద్ధాపి న పాదపతన మతివర్తత ఇతి సార్వత్రికం. ౩.౧.౧౭.

కన్యక ఆలింగనాన్ని అంగీకరించినతరువాత నాయకుడు తన నోటితో తాంబూలాన్ని ఆమెనోటికి అందించాలి. దానికి ఒప్పుకపోతే మధురాలూ, హృదయాహ్లాదకరాలూ అయిన మాటలతోగానీ, తనప్రేమను సూచించేఒట్లు మొదలైన వాటితోగానీ మరిపించి ఒప్పించి నీవుకూడా ఇలాచెయ్యి, అలాచెయ్యి అని అడుగుతూగానీ చివరకు పాదాలమీద పడి అయినా అంగీకరించేట్టు చెయ్యాలి. సాధారణంగా స్త్రీవ్యక్తి యెంతసిగ్గుకలదైనా, యెంతకోపంకలదైనా, భర్త తనపాదాల మీద పడినతరువాతకూడా అతనిమాటను అతిక్రమించి మెలగలేరు. ఇది స్త్రీజాతికి సహజగుణము.

౭౧౮-౭౨౨. తద్దానప్రసంగేణ మృదువిశదమకాహళ మస్యా
శ్చుంబనం. తత్రసిద్ధామాలాపయేత్. తచ్ఛ్రవ
ణార్థం యత్కించిదల్పాక్షరాభిధేయమజానన్ని
వపృచ్ఛేత్. తత్రనిష్ప్రతిపత్తి మనుద్వేజయన్
సాంత్వనయుక్తం బహుశఏవపృచ్ఛేత్; తత్రా
ప్యవదంతీం నిర్బధ్నీయాత్. 3.2.12.

వెనుక తాంబూలాన్ని నాయికముఖాని కందించాలని చెప్పారు. అలా తాంబూలాన్నందించే నెపంతో మృదువుగానూ, స్పర్శ సుఖంకలిగేవిధంగానూ ముద్దుపెట్టుకోవాలి. చప్పుడుమాత్రం కారాదు. అలాఅయితే సిగ్గుపడుతుంది కన్యక- అలా ముద్దాడుతున్నప్పుడు నాయిక అనుకూలంగా ఇష్టాన్నిసూచిస్తే తరువాత నాయకుడు నెమ్మదిగా నాయకుడు నెమ్మదిగా ఆమెచేత మాటలాడించడానికి ప్రయత్నించాలి. ఆమాట్లాడించడంలో నాయిక బాగాయెరిగిఉన్న యేదైనావిచిత్రమైన సంగతిని తనకు తెలియనట్లు అడగాలి. అలా అడిగినప్పుడు అతనిమాటలకు మారుపలకకుండా ఊరుకుంటే ఆమెన్ను చల్లనిమాటలతో మాట్లాడించడానికి ప్రయత్నించాలి. అప్పటికీ వశంగాకపోతే బలాత్కరించాలి.

౭౨౩-౭౨౩. సంస్తుతాచేత్సఖీ మనుకూలా ముభయతోఽపి
విస్రబ్ధాం తా మంతరాకృత్వా కథాం యోజ
యేత్. తస్మిన్నధోముఖీ విహసేత్. తాంచాతి
వాదినీమధిక్షిపేద్వివదేచ్చ, సాతు పరిహాసార్థ
మిదమనయోక్తమితి చానుక్తమపిబ్రూయాత్.

తత్ర తామపనుచ్య ప్రతివచనార్థ మభ్యర్థ్యమా
నాం తూష్ణీమాసీత, నిర్బధ్యమానాతు నాహ
మేవం బ్రవీమీతి అవ్యక్తాక్షరమవసితార్థం వచనం
బ్రూయాత్. నాయకంచ విహసంతీ కదా
చిత్కటాక్షైః ప్రేక్షేతేత్యాలాపప్రయోజనం.

నాయికను మాట్లాడించేసమయంలో ఆమెకు పూర్వం బాగా పరిచితురాలైనదీ, నాయికానాయకుల పూర్వచరిత్రలను తెలుసుకునిఉన్నదీ అయిన ఒకచెలికత్తెను అడ్డముచేసుకుని నాయికకు ఏదైనా కథచెప్పడం ప్రారంభించాలి. (చెలికత్తెకు చెవుతున్నట్లుగా నన్నమాట) అలా కథప్రారంభించి చెవుతూ ఉంటే నాయిక సిగ్గుతో తలవంచుకుని ముసిముసినవ్వులు నవ్వుకుంటూఉంటుంది. చెలికత్తె కాస్త గడుసరి అయితే దాన్ని ఆక్షేపిస్తూఉంటుంది. మీదుమిక్కిలి పోట్లాటకూడా కల్పించుకుంటుంది. అప్పుడు ఆచెలికత్తె నాయకునితో నాయిక ఇలాఅన్నది, అలాఅన్నది అని లేనిపోనిమాటలన్నీ హాస్యానికి కల్పించి చెప్పాలి. అలా వినిపించినతరువాత నాయిక యే సమాధానంచెప్పడం మొదలుపెడుతుందో అని చెలికత్తె కొంచెంసేపు ఊరుకోవాలి. ఇలా అనలేదా అని చెలికత్తె మళ్ళీ అడిగినప్పుడు, నేనిలా అనలేదని అవ్యక్తాక్షరంగానూ, అర్థం పూర్తిగా కాకుండానూ మాట్లాడాలి. ఇలామాట్లాడుతూనే నాయకునివైపుకూడా రెండు కటాక్షవీక్షణాలు విసురుతూఉండాలి. ఇది సంభాషణానికి ప్రయోజనం.

233-237. ఏవం జాతపరిచయాద అనిర్వాదంతీ తత్సమీపే యా
చితం తాంబూలం విలేపనం స్రజముత్తరీయం వా

స్యనిబధ్నీయాత్, తథా యుక్తామాచ్ఛురితకేన స్తన
ముకుళయో రుపరిస్పృశేత్; వార్యమాణశ్చత్వమపి
మాం పరిష్వజస్వ తతో నైవమాచరిష్యామీతి స్థిత్వా
పరిష్వజేత్. స్వంచహస్త మానాభిదేశాత్ప్రసా
ర్యప్రసార్య నివర్తయేత్. క్రమేణచ పీనాముత్సంగ
మారోహయేత్.

ఈవిధంగా ఆలింగనమూ, తాంబూలదానమూ, చుంబనమూ, ఆలాపనమూ మొదలైనవాటివల్ల నాయకుని పరిచయాన్ని పొందిననాయిక నాయకుడడిగినవెంటనే తాంబూల గంధమాల్యాదులను తీసుకువచ్చి యిస్తుంది. ఇలా వస్తువులందిచ్చి పూర్వపరిచయం (చనువు) ఏర్పడిందిగనుక అక్కడే నిలుచుని ఉంటుంది- అప్పుడు నాయకుడు ఆనాయికను పూర్వం చెప్పిన ఆచ్ఛురితకంతో చనుమొగ్గలను స్పర్శసుఖం కలిగేటట్లు స్పృశించాలి.ఒకవేళసిగ్గుచేతగానీ, చక్కిలిగింతచేతగానీ ఒప్పుకోకపోతే "నీవుగూడానన్నుకౌగిలించుకుంటేఇలాచెయ్యను"అనిఆస్థితిలోనే ఆలింగనంచేసుకోవాలి.అలానాయికను కౌగిలించుకుని తనచేత్తో నాయికను ఆమె నాభిప్రదేశంవరకూ మెల్లిమెల్లిగా స్పృశిస్తూ సిగ్గులేకుండా చెయ్యాలి. తరువాత క్రమంగా నాయికను తొడమీద చేర్చుకోవాలి. తరువాత తరువాత ఎక్కువగా రంజనవిధానమున కుపక్రమించాలి. అలా చెయ్యడాని కిష్టపడకపోతే నవ్వులాటకు కొద్దిగా భయపెట్టాలి.

236-238. అహంఖలుతవదంతదానికరిష్యామి స్తనపృష్ఠేచన
ఖపదం ఆత్మనశ్చ స్వయంకృత్వా త్వయాకృత

మితి తే సఖీజనస్య పురతః కథయిష్యామి, సాత్వం కిమత్రవక్ష్యసీతి బాలబిభీషికాభిః బాలప్రిత్యాయ నైశ్చ శనైరేనాం ప్రితారయేత్. సర్వాంగికం చుంబన ముపక్రమేత. 3.౨.30.

అభయపెట్టేపద్ధతులను ఇక్కడ చెవుతున్నారు. ఇంతటి పరిచయం కలిగినతరువాతకూడా ఉపక్రమించడానికి నాయిక ఒప్పుకపోతే నాయికతో చమత్కారంగా "నాపెదవిని నేనే కొరుక్కుని, నావక్షస్థలంమీద నేనే నఖక్షతాలు చేసుకుని నీవే ఇలాచేశావని నీచెలికత్తెలతో చెవుతాను." అని బెదిరిస్తూనే నెమ్మదిగా నాయికని స్వాధీనంచేసుకోవాలి. ఇది మొదటిరాత్రి నడిపే కార్యపద్ధతి. ఇక రెండోరాత్రీ మూడోరాత్రీ మరికొంత నమ్మకం పుట్టించి సర్వాంగాలనూ తడువుతూ చుంబనము మొదలుపెడితే నాయిక పరవశురాలై తనంతటతానే స్వాధీనపడుతుంది.

౭౩౯–౭౪౪. ఊరోశ్చోపరివిన్యస్తహస్తః సంవాహన క్రియాయాం సిద్ధాయాం క్రమేణోరుమూలం సంవాహయేత్. తత్రనివారితే సంవాహనేకో దోషఇత్యాకులయేదేనాం. తచ్చ స్థిరీకుర్యా త్తత్రసిద్ధాయా గుహ్యదేశాభిమర్శనం, రశనావియోజనం, నీవీస్రింసనం, వసనపరివర్తన మూరుమూలసంవాహనం చైతే చాస్యాన్యాపదేశాః. యుక్తయంత్రాం రంజయేత్ నత్వకాలే వ్రతఖండనమనుశిష్యాచ్చ, ఆత్మానురాగం దర్శయేత్, మనోరథాంశ్చ పూర్వ

కాలికానువర్ణయే, దాయత్వాంచ తదానుకూ
ల్యేన ప్రవృత్తిం ప్రతిజానీయాత్, సపత్నీభిశ్చ
సాధ్వసమవచ్ఛింద్యాత్, కాలేనచ క్రమేణ విము
క్తకన్యాభావామనుద్వేజయ న్నుపక్రమేతేతి
కన్యాపిస్రంభణం.

ఇక హస్తయోజనంచేసే విధానం చెవుతున్నారు. ముందు పూర్వకాయసంవాహనం ప్రారంభించి (కుచమర్దనం మొదలైనవి) క్రమంగా హస్తాన్ని తొడలమీదికిచేర్చి అక్కడ సంవాహనం చేస్తూ నెమ్మదినెమ్మదిగా ఊరుమూలాలలో గూడా సంవాహనం జరపాలి. తరువాత తరుత ఆఊరుమూల స్థానంలో చుంబనంచేసి నఖక్షతాలు చెయ్యాలి. అలా చెయ్యడానికినాయిక అడ్డుపెడితే "ఇందులో తప్పేమున్నది" అని కొంచెం సమాధానపరచాలి, అలాచేస్తూనే అక్కడ హస్తాన్నిస్థిరంగా ఉంచి ఆక్రియలో విజయాన్ని సాధించినతరువాత యోనిసి తమువుతూ, ఒడ్డాణం ఒదిలించి, కోకముడిసడలించి, చీరతొలగించి ఊరుమూలసంవాహనం మొదలైనవాటిని ఆమాటలూ ఈమాటలూ చెవుతూ జరపాలి. కాని తొందరపడి సంభోగంమాత్రం చెయ్యరాదు. అలాచేస్తే వ్రతభంగం అవుతుంది. ఈవ్రతభంగం కాకూడనిరాత్రులు ఈమూడు మాత్రమే. చాతుర్థికహోమం మునిసినతరువాత తొందరపాటులేకుండా సంభోగక్రియలతోకూడా అమితమైన సుఖం కలిగేలా నాయికను తృప్తిపరచాలి. కాని పై మూడు రాత్రులలోనూ వ్రతఖండనంమాత్రం చెయ్యరాదు. వ్రత

స్థితిలో ఉన్నప్పుడు తన అనురాగాన్ని తెలియచెయ్యవచ్చు. తనఅభిప్రాయాలను చెప్పవచ్చు. ఇటుపైన ఆమెవిషయమై తాను అనుసరింపబోయే విధానాన్ని చెప్పవచ్చు. సవతుల వల్ల ఆమెకున్న భయాన్ని పోగొట్టవచ్చు, ఇలా క్రమంగా కన్యాభావంనుంచి విడిపడ్డవధువును తొందరపాటు లేకుండా సంభోగంకోసం ఉపక్రమించాలి.

౭౪౫-౭౪౬. భవంతిచాత్రశ్లోకాః—ఏవం చిత్తానుగో బాలా
ముపాయేన ప్రసాధయేత్. తథాస్యసానురక్తాచ
సువిస్రబ్ధాప్రజాయతే, నాత్యంతమానులోమ్యే
ననచాతి ప్రాతిలోమ్యతః. సిద్ధింగచ్ఛతి కన్యాసు
తస్మాన్మధ్యేన సాధయేత్.

సారాంశమేమనగా పైనచెప్పినక్రమంగా నాయకుడు కన్య యొక్క చిత్తవృత్తిని గ్రహించి ఉపాయంగా ఆమెను నమ్మించాలి. అలాచేస్తే నాయిక నాయకునివిషయంలో చాలా అనురాగం కలిగిఉంటుంది. చాలా నమ్మకంకూడా కలిగిస్తుంది. ఇంకొక ముఖ్యాంశాన్ని గమనించాలి. ఆమెను నమ్మించే విషయంలో మిక్కిలీ అనుకూలుడైపోయి తరువాత గాంభీర్యాన్ని వదులుకోరాదు. మిక్కిలీ ప్రతికూలుడూ కారాదు. మిక్కిలీ అనుకూలుడైతే తృణీకరిస్తుంది. మిక్కిలి ప్రతికూలుడైతే విరక్తురాలౌతుంది. కాబట్టి అతిగా చనువీయకుండా, మిక్కిలి సరిపడనట్లుండకుండా మధ్యరకంగాఉంటే ఆకన్యక దగ్గర నాయకుడు బాగా నెగ్గుతాడు.

౭౮౭-౭౫౦. ఆత్మనః ప్రీతిజననం యోషితాం మానవర్తనం,
కన్యావిశ్రంభణంవేత్తి యస్సతాసాంప్రియోభవేత్,
అతిలజ్జాన్వితేత్యేవం యస్తుకన్యాముపేక్షతే,
సోఽనభిప్రాయవేదేతి పశువత్పరిభూయతే, సహ
సావాప్యుపక్రాంతా కన్యాచిత్తమవిందతాం, భ
యం విత్రాసముద్వేగం సద్యోద్వేషంచ గచ్ఛతి.
సాప్రీతియోగమప్రాప్తా తేనోద్వేగేన దూషితా
పురుషోద్వేజితా వాస్యాద్విద్విష్టావాతతోన్యగ్రా.

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే కన్యాసంప్ర
యుక్తే, తృతీయేఽధికరణే కన్యావిస్రంభణం
నామ ద్వితీయోఽధ్యాయః.

ఈకన్యావిస్రంభణంవల్ల కలిగే ఫలితం చెవుతున్నారు. కన్యా విస్రంభణం ప్రణయవృద్ధికి కారణం అవుతుంది. పైఉపచారా లన్నీ అభిమానవృద్ధికి ఉపకరించేవికాబట్టి పాతివ్రత్యాన్ని కాపాడుతాయి. ఈకన్యావిస్రంభణాధ్యాయం కన్యకలవిష యంలోనూ స్త్రీలవిషయంలోనూ, చెప్పబడినది కాబట్టి దీని సత్యాన్ని బాగాగ్రహించి అనుసరించేవాడు తనస్త్రీలకు మిక్కిలి ప్రీతిపాత్రుడౌతాడు. కేవలం అక్షతయోనులైన (పురుషసంపర్కములేని) బాలికలు గర్భాధానపుగదిలో సిగ్గు చేత అవకాశం ఇవ్వకపోవడంకూడాకద్దు. కాబట్టి నాయకుడు జాగ్రతతో ఆమెచిత్తవృత్తినిగ్రహించి ప్రవర్తించాలిగాని విసిగి ఉపేక్షించరాదు. అప్పుడు ఉపేక్షచేస్తే ఆనాయకుని నాయిక అభిప్రాయాన్ని కనిపెట్టలేని గొడ్డుగా భావించిపరాభవిస్తుంది.

కన్యకను బలాత్కరించిగూడా ఉపక్రమించరాదు. అలాచేస్తే ఆకన్య భయపడిపోయి, ఒకరకమైన మనోవ్యథపాలై తాత్కాలికంగా ద్వేషాన్నికూడా పూనుతుంది. ఆనాటి ఉద్వేగంవల్ల ఆనాయిక యావజ్జీవమూ పురుషుని ద్వేషిస్తుంది. లేక పరపురుషసంగమమన్నా చేస్తుంది.

ఈవిధానంతో భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయమూర్తి చేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలోని కన్యాసంప్రయుక్తకాధికరణంలో కన్యావిస్రంభణం అనే రెండో అధ్యాయం ముగిసింది.



శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

### ౩. కన్యాసంప్రయుక్తకాధికరణం

### ౩. బాలోపక్రమాధ్యాయం

౨౫౧-౨౫౬. ధనహీనస్తు, గుణయుక్తోఽపి, మధ్యస్థగుణో,
హీనాపదేశో వా, సధనో వా, ప్రాతివేశ్యః,
మాతా, పితా, భ్రాతృషుచ, పరతంత్రః,
బాలవృత్తి, రుచితప్రవేశో వా, కన్యామల
భ్యత్వా న్న వరయేత్ బాల్యాత్ప్రభృ
తి చైనాం స్వయమేవానురంజయేత్, తథా
యుక్తశ్చ మాతులకులానువర్తీ దక్షిణాపథే
బాలఏవమాత్రాచ వియుక్తః పరిభూతకల్పోధ
మోత్కర్షాదలభ్యాం మాతులదుహితరం,
అన్యస్మైవా పూర్వదత్తాం సాధయేత్. అన్యా
మపి బాహ్యాం స్పృహయేద్బాలాయామేవం
సతిధర్మాధిగమే సందర్శనం శ్లాఘ్యమితి ఘోట
కముఖః. ౩.౩.౪.

వరణవిధానంతో లభించినకన్యకను విస్రంభణం చేసేవిధానం పూర్వం చెప్పబడ్డది. ఇక అలా లభ్యంకాని కన్యను గాంధ

ర్వాదులతో వివాహం చేసుకునేవిధానం చెప్పబడుతోంది. సద్వంశీయుడూ, రూపవంతుడూ, గుణవంతుడూ, విద్యావంతుడూ అయిఉన్నా ధనహీనుడుగాఉన్న కారణంచేత తక్కువవాడుగా లెక్కింపబడతాడు. మంచిగుణములు కలిగిఉండి కూడా కులముతక్కువవాడుగా కొన్నికారణాలచేతనూ, ధనవంతుడైఉండీ సరిహద్దులగురించిన పోరాటాలు ఉండడం చేతా, తల్లిదండ్రిలూ మొదలైనవాళ్ళ అదుపాజ్ఞలలోఉన్నవాడై, ఉచితప్రవేశం కలిగి ఉన్నా, బాలుడు కావడంచేత గూడా కన్యను వరణవిధానంతో పొందడానికి వీలుండదు. అలాంటివాళ్ళు బాల్యంనుంచే కన్యను స్వయంగా రంజింపచెయ్యడానికి ప్రయత్నించాలి. నాయిక అనురక్తురాలైతే గాంధర్వవిధానంతోనైనాసరే స్వయంగా వివాహంచేసుకోడానికి సిద్ధపడుతుంది. కాబట్టి బాలికలను రంజిపంచేసే ఉపక్రమణవిధానాలు చెవుతున్నారు.ఇవి చాలావిధాలుగాఉన్నాయి. సాధారణంగా లోకంలో దక్షిణదేశీయుడు బాల్యంలోనే మాతృవిహీనుడైతే మేనమామలయింట్లోనే పెరుగుతూ మేనమామకూతురిని అంతకుముందు ఇతరులకు వాగ్దత్తం చేయబడినదైనా, కాకపోయినా వశపరచుకుంటాడు. ఆవిధంగానే పైనచెప్పిన తక్కినవారుగూడా సాధించవచ్చు. పరాయిసంబంధపుపిల్లనైనా రంజనవిధానంతో వశపరచుకోవాలి. ఘోటకముఖుడు ఇలా బాల్యంనుంచీ రంజనవిధానంతో చేసుకున్న వివాహాన్నే ఉత్తమం అన్నాడు. ఇలాటి వివాహాలను గాంధర్వాలనేపేర ధర్మసంబద్ధాలుగా పెద్దలు చెవుతున్నారు.

౨౫౨-౨౫౯. తత్రాసహ పుష్పావచయం, గ్రథనం, గృహకం, దుహితృక్రీడాయోజనం, భక్తపాకకరణం, ఇతి కుర్వీత పరిచయస్య వయసశ్చానురూప్యాత్, ఆకర్ష క్రీడా, పట్టికాక్రీడా, ముష్టిక్రీడా, ద్యూతక్షుల్లకాదిద్యూతాని, మధ్యమాంగుళిగ్రహణం, షట్పాషాణాదికానిచ దేశ్యాని తత్సాత్మ్యాత్తదాస్త దాసచేటికాభి స్తస్యాశ్చ సహానుక్రీడేత క్ష్వేడితకాని సునిమీలితకా, మారబ్ధికాం, లవణవీథికా, మనిలతాడితకాం, ధూమపుంజికా, మంగుళితాడితకాం సఖీభిరన్యానిచ దేశ్యాని. 3.3.2.

పైరీతిగా బాల్యంనుంచీ నాయికారంజనాని కుపక్రమించేవరులు రెండువిధాలు. ఒకడు బాలుడు. రెండవవాడు యువకుడు. వారిలో మొదటివరునివిధానం చెవుతున్నారు. బాలికతో గూడా కలిసిమెలిసి మాట్లాడుతూ, పూలుకొయ్యడం, బొమ్మరిళ్లుకట్టడం, కొయ్యతోనూ, మట్టితోనూ, ఆటవస్తువులు తయారుచెయ్యడం, కొయ్యలు మొదలైనవాటితో బొమ్మలు తయారుచెయ్యడం, వాటితో పెళ్లిళ్ళు మొదలైనవి జరపడం, (దీన్నే దుహితృక్రీడ అంటారు) అన్నం వండడం మొదలైన వాటితో బాలనాయకుడు తనకు ఈడుజోడుగఉన్న నాయికతో బాగా పరిచయం చేసుకోవాలి. పైనచెప్పిన క్రీడలన్నీ బాల్యతారుణ్యాలకు అనుకూలాలైనవాటినే పరిగ్రహించాలి. ఇందుకుపయోగించే ఆటలింకాఉన్నాయి. ఆకర్షక్రీడ, పట్టికాక్రీడ,ముష్టిద్యూతము,షట్పాషాణకము, క్ష్వేళితకము,సునిమీలి

తకము, ఆరబ్ధికము, లవణవీథిక, గోధూమపుంజిక, అంగుళి తాడితక, మండూకిక, ఏకపాదిక ఈ మొదలైనవి. వీటిలో ఆకర్షక్రీడ అంటే కొందరు పిల్లలు రెండుజట్లుగా ఉజ్జీలు వేసుకుని ఒకతడు రెండు కొసలూ రెండు జట్లూ పట్టుకుని లాగడం. పట్టికాగ్రథనం అంటే కళ్ళుమూసి గంతలు కట్టడం అని తోస్తుంది. చిత్రవిచిత్రాలైన రంగులతో పట్టికలను తయారుచేసి ఆడడం అని పెద్దలు వ్రాస్తున్నారు. ముష్టి ద్యూతం అంటే ఒకరు పిడికిలితో కొన్ని ఆటకాయలు గుడ్డ చాటుననుంచి తీసిచూపితే రెండోవారు వాటిలెక్క చెప్పడం. అంగుళిగ్రహణం అంటే ఒకరుచేతివేళ్ళను ఒకదాని తరువాత ఒకటిగామార్చి మార్చి, తొందరగా చూపుతూఉంటే, రెండవవారు నడిమివేలిని పట్టుకోడం. షట్పాషాణకమంటే ఆరు చిన్నచిన్న రాళ్ళను చేతి వేళ్ళమీదా, మణికట్టుమీదా, మోచేతిమీదా, మొదలైనచోట్ల పెట్టుకుని ఒక్కొక్కదాన్నే పైకెగురవేస్తూ ఒక్కరాయిగూడా క్రిందపడకుండా పట్టుకోడం. క్షేళితకం అంటే పిల్లలకు శరీరవ్యాయామంకోసం కల్పింపబడిన ఆటలన్నమాట. అలాటి ఆటలే ఇక్కడకొన్ని చెప్పబడతాయి. సునిమీలితకం అంటే దాగుడుమూత. ఆరబ్ధికంఅంటే ఇదిగూడా దాగుడుమూతవంటిదే కాని ముందు దొంగను ఎన్నుకోవడంలో పైదానికీ దీనికీ కొంచెం భేదం ఉంటుంది. లవణవీథికఅంటే కొందరుపిల్లలు చెట్టాపట్టాలు పట్టుకుని గుండ్రంగా నిలుచునిఉంటే వాళ్ళచేతులసందులలోనుంచి ఒకరు లోపలప్రవేశించి "ఇది మేవీథి" అని అడుగుతూ ప్రతి సందుదగ్గరకూ వచ్చి అడుగుతూ లోపలనుంచి బయటకు పోవ

డానికి ప్రయత్నిస్తారు. చెట్టాపట్టాలుబట్టినపిల్లలు మరుగుదొడ్డి అనిగాని, మురుగుదొడ్డి అనిగాని చెప్పి ఆదొంగను ఏడిపిస్తారు. చివరకు ఎవ్వరు పరాకుగాఉండ మంచిదొడ్డి అని చెవుతారో వారు దొంగఅన్నమాట. గోధూమపుంజిక అంటే కొన్ని గోధుమలు కుప్పగాబోసి పిల్లలందరూచేరి ఒక్కొక్కరు ఒక్కొక్క రూపాయిచొప్పున అకుప్పలో పడవైవగా ఒక్కరు కలుపుతారు. తరువాత యెంతమంది పిల్లలున్నారో అన్ని కుప్పలు చేస్తారు. ఒక్కొక్కడు ఒక్కొక్క కుప్పను వెతుక్కుంటారు. ఎవరికుప్పలో రూపాయి కనపడదో వారు ముందు తెచ్చినరూపాయికాక అదనంగా ఇంకొకరూపాయ చెల్లించాలన్నమాట. అంగుళితాడితకంఅంటేకొందరుపిల్లలు గుంపుగా చేరి ఒకరిని దొంగగా నిర్ణయించి కళ్లుమూసుకోమంటారు. అలా కళ్ళుమూసుకున్నవారి ముక్కును ఒక్కొక్కళ్ళు వేలుతో తాకి నాపేరేమిటో కనుక్కోమంటే ఆదొంగ కనుక్కోవాలి. మండూకిక అంటే కప్పయెగిరినట్లు యెగరడం అన్నమాట. ఏకపాదిక అంటే కుందడం అన్నమాట.

౭౬౦-౭౬౬. యాంచ విశ్వాస్యామస్యాం మన్యతే తయాసహ నిరంతరాంప్రీతింకుర్యాత్, పరిచయాచ్చ బుధ్యేత, ధాత్రేయికాంచాస్యాః ప్రియహితాభ్యాం అధికముపగృహ్ణీయాత్, సాహిప్రియమాణావిదితాకారాపి అప్రత్యాదిశంతీ తంతాంచ యోజయితుం శక్నుయా దనభిహితాఽపి ప్రత్యాచార్యకం. అవిదితాకారాపి హి గుణానేవ అనురాగాత్ప్రకాశ

యేత్,యథాప్రయోజ్యానురజ్యేత,యత్రచకౌతుకం ప్రయోజ్యాయాస్తదనుప్రవిశ్యసాధయేత్, క్రీడనకద్రవ్యాణియాన్యపూర్వాణియాన్యన్యాసాంవిరళశోవిద్యేరన్ తాన్యస్యా అయత్నేనసంపాదయేత్, తత్ర కందుక మనేకభక్తిచిత్రమల్పకాలాంతరితమన్యదన్యచ్చసందర్శయేత్, తథాసూత్రదారువంశగజదంతమయీభి ర్దుహితృకా మధూచ్ఛిష్టపిష్టమృణ్మయీశ్చ, భక్తపాకకార్యమస్యామహానసికస్యచదర్శనం కాష్ఠమేఢ్రకయోశ్చ సంయుక్తయోగి స్త్రీపుంసయో రజైడకానాం దేవకులగృహకానాం మృద్విదళకాష్ఠవినిర్మితానాం శుకపరభృతమదనసారికాలావక కుక్కుటతిత్తిరిపింజరకాణాం వీణకానాం, పిండోలికానాం, పటోలికానాం, అలక్తకమనశ్శిలాహరితాళకాంగుళకశ్యామవర్ణకాదీనాం తథా చందనకుసుమయోః పూగఫలానాం పత్రాణాం కాలయుక్తానాంచ శక్తివిషయే ప్రచ్ఛన్నందానం, ప్రకాశద్రవ్యాణాంచ ప్రకాశం యథాచ సర్వాభిప్రాయసంవర్ధకంఏవం మన్యేతతథాప్రయతితవ్యం, వీక్షణేచ ప్రచ్ఛన్నమర్పయేత్, తథా కథనయోజనం, ప్రచ్ఛన్నదానస్య తు కారణమాత్మనో గురుజనాద్భయం ఖ్యాపయేత్, దేవస్యచాన్యేన స్పృహణీయత్వమితి,వర్ధమానానురాగాంచ ఆఖ్యానకే మనః కుర్వతీమన్వర్థాభిః కథాభిశ్చిత్తహారిణీభిశ్చ రంజయేత్.

విస్మయేషుచ ప్రసజ్యమానం ఇంద్రజాలైః ప్రయోగైర్విస్మాపయేత్, కళాసుకౌశలినీం, తత్కౌశలేవగీతప్రియాం, శ్రుతిహారైర్గీతైః ఆశ్వయుజ్యామష్టమీచంద్రకే కౌముద్యాముత్సవేషు యాత్రాయాం గ్రహణే గ్రహచారేవా విచిత్రై రాపీడైః కర్ణపత్రభంగైః సిక్థకప్రధానై ర్వస్త్రాంగుళీయకభూషణదానైశ్చనోచేద్దోషకరాణిమన్యేత, అస్య పురుషవిశేషాభిజ్ఞాతయాధాత్రేయికయాస్యాగిపురుషప్రవృత్తాన్ చాతుష్షష్టికాన్యోగాన్ గ్రాహయేత్. తద్గ్రహణోపదేశేనచ ప్రయోజ్యాయాం రతికౌశలమాత్మనః ప్రకాశయేత్, ఉదారవేషశ్చ స్వయమనుపహతదర్శనశ్చస్యాత్, భావంచ కుర్వతీ మింగితాకారైస్సూచయేత్,యువతయోహిసంసృష్టమభీక్ష్ణదర్శనంచపురుషంప్రథమంకామయంతే కామయమానాఅపి నాభియుంజత ఇతి ప్రాయోవాదః, ఇతి బాలోపక్రమాః, తానింగితాకారాన గ్రేవక్ష్యామః. 3.3.౨౮.

పైనచెప్పినది బాలోపక్రమణవిషయం. ఇక యువకులవిషయమై చెవుతున్నారు. యువకుడైనవాడు తనను ప్రేమించుతున్న నాయికతో ఎక్కువ చనువుగా మెలగుతున్న దాసీదానితో ముందుగా పరిచయం చేసుకుని తనపనిలో సాయపడుతుందో పడదో ముందుగా తెల్సుకోవాలి. దానిద్వారా నాయిక చిత్తవృత్తిని గ్రహించాలి. తరువాత దాసీదాన్ని ఏదో ఆశ

పెట్టి తనపనిని మనస్ఫూర్తిగా చేసేలాగా వశంచేసుకోవాలి. అలా దాన్ని సంతోషపెడితే నాయిక నాయకుణ్ణి కోరుతున్న దని తాను తెలుసుకునిఉన్నా, ఇతనియీవికి మిక్కిలితృప్తిపడి నాయికకున్న సిగ్గునీ భయాన్నీ తొలగించి ఆనాయకునితో కూర్చడానికి బాగా ప్రయత్నం చేస్తుంది. నాయకునిచేత చెప్పించుకోనకుండానే అతని ఈవికారణంగా నాయికను అతనికి సమకూరుస్తుంది. అంటే నాయకునికోరిక తనకు స్పష్టంగా తెలియకపోయినా అతనిమీద నాయికకు బాగా అనురాగం కలిగేట్టు చేస్తుంది. ఆదాసినాయిక అభిరుచులనుపట్టి ఆమెను అనుసరించిఉండాలి. నాయికమనస్సుకి దర్శనమాత్రించేతనే ఆసక్తి నిపుట్టించే వింతవింత వస్తువులను ఆదాసిద్వారా నాయకుడు నాయికకు అందజేస్తూ ఉండాలి. అంటే నాయకుడు ఎంత అసాధ్యవస్తువునైనా, ఇట్టే చులకనగా సాధించగలడనే నమ్మకం నాయికకు జనింపచెయ్యడాని కన్నమాట. చిత్రచిత్రవర్ణాలతో విచిత్రంగా తయారుచేయబడినబంతులు, దారపుఅల్లికలు గలవస్తువులు, కొయ్యవస్తువులు, కొమ్ముతోనూ, దంతముతోనూ తయారైనవీ, మైనంతో తయారైనవీ అనేక బొమ్మల ఆకారాలతో తయారుచేయబడిన పిండివంటలూ మొదలైన వాటిని దాసి నాయకుడు పంపాడని నాయికకు అందిస్తూ ఉండాలి. అన్నమూ పిండివంటలూ మొదలైనవి తయారుచేసే విధానంగూడా ఆదాసినాయికకు నేర్పాలి. ఇలాగే లోకజ్ఞానాన్ని నేర్పేభగలింగప్రసంగాలతో ఒప్పేకొయ్యబొమ్మలనుగూడా తెచ్చిచూపుతూ ఉండాలి. మేకలూ, పొట్టేళ్ళూ మొదలైన జంతువుల మైథునక్రియలను సూచించే బొమ్మలూ, మట్టితో

నూ, వెదుళ్ళతోనూ, కొయ్యతోనూ, చేయబడిన చిలుకల పంజరాలూ, కోయిలలూ, మదనసారికలూ, లావకపిట్టలూ మొదలైన పక్షులగూళ్ళూ, కోళ్ళబల్లలూ, తిత్తిరిపిట్టల పంజ రాలూ, ఇంకా విచిత్రాలైన శంఖాలూ, ముత్యపుచిప్పలూ, మైనంతోనూ, వెదురుతోనూ, కొయ్యతోనూ చెయ్యబడిన నీటిపా త్రలూ, పిల్లనగోవ్రులూ, లత్తుక, మణిశిల, అర్ధళము, హింగుళ కము, శ్యామవర్ణకము మొదలైనరంగులతో చిత్రింపబడిన బొమ్మలూ, ఆభరణాలుపెట్టుకునేపెట్టెలూ, చందనమూ, కుం కుమపువ్వూ, పోకచెక్కలూ, మొదలైనవాటిని ఆదాసి తీసి కొనివచ్చి నాయికకు చూపుతూ ఉండాలి. ఇంకా రహస్యంగా ఇచ్చేవస్తువులను రహస్యంగా ఇవ్వాలి. బహిరంగంగా ఇవ్వత గినవాటిని బహిరంగంగా ఇవ్వాలి. ఇలా దాసిద్వారా నాయిక తనను ఎక్కలి సుఖపెట్టేవాణ్ణిగా తలచేలాగా ఈవస్తువులన్నీ పంపుతూఉండాలన్నమాట. అప్పుడప్పుడు నాయికను చూచే అవకాశం వస్తే పైవింతవస్తువులు తెచ్చియిస్తూ నాయకుడు నాయికతో మాటలాడడానికి ప్రయత్నించాలి. ఇలా రహస్యం గా ఈవస్తువు లివ్వడమెందుకని నాయిక అడిగితే పెద్దలవల్ల తనకున్నభయాన్ని ఉగ్గడించి స్పష్టంచెయ్యాలి. లేక ఇతరులు ఈవస్తువులను అపేక్షిస్తారని రహస్యంగా ఇస్తున్నానని చెప్ప వచ్చు. ఇలా తనమీద అనురాగాన్ని వృద్ధిచేస్తూ నాయిక హృదయానికివచ్చేలాగా శకుంతల మొదలైన ఉత్తమనాయి కలచరిత్రాంశాలను వర్ణించిచెప్పి నాయికను తృప్తిపరుస్తూ ఉండాలి. నాయిక యిష్టాన్ననుసరించి యింద్రజాల ప్రయో గాలూ, మంచిమంచి కళాప్రదర్శనాలూ, సంగీతప్రసంగాలూ,

అష్టమీచంద్రికాదులైన ఉత్సవాలూ, యాత్రలూ, మొదలైనవాటిలోనూ, గ్రహణకాలాల్లోనూ, గృహాచారాల్లోనూ, పూలదండలూ, చీరెలూ,అంగుళీయకాలూ, ఆభరణాలూఇచ్చి రంజింపచెయ్యాలి.అన్యపురుషవిశేషాలను ఎఱిగిఉన్నవ్యక్తి కాబట్టిదాసి నాయికకు పురుషుల ప్రవర్తనాలూ, అరవైనాలుగు యోగాలూ ఉపదేశించాలి. ఆమె ఉపదేశంవల్లనే నాయకుడు నాయికతో తనకున్న సురతకౌశలాన్ని చెప్పించాలి. నాయకుడు ఎప్పుడూ ఆకర్షకమైన- గంభీరంగా ఉండేవేషంతో ఉండాలి. తనంతతాను యెన్నడూ నాయికకు కనుపించరాదు. ఇలా ప్రవర్తిస్తూ నాయికకు తనయందనురాగం స్థిరమైనసంగతి గ్రహించి తనభావాన్ని నెమ్మదిగా యెఱుకపరచాలి. వేషం గంభీరంగా ఉండాలనడంలో గొప్పకారణం ఉన్నది. పడుచు పిల్లలు క్షతయోనులుగా ఉన్నప్పుడు తమతో కలిసిమెలిసి తిరుగుతూ తమకు సంతోషాన్ని కలిగించే నాయకుణ్ణే మున్ముందుగా కోరతారు. కాని కామించినవెంటనే మాత్రము కలవడానికి ఒప్పుకోరు. అని లోకంలో ఒకప్రతీతిఉన్నది. ఈపైన చెప్పినవన్నీ పెండ్లికాని బాలికను ఉపక్రమించేరీతులు. ఇక ఇంగితాకారాలు చెప్పబోతున్నారు.

౭౬ ౭-౭౮. సంముఖం నవీక్షేత, తంతువీక్షితా క్రీడాం దర్శయతి, రుచ్యమాత్మనోఽంగమపదేశేన ప్రకాశయతి, ప్రమత్తం ప్రచ్ఛన్నం నాయకం అవతిక్రాంతంచవీక్షతే, పృష్టాచకించిత్సస్మితమవ్యక్తాక్షరం అనవసితార్థంచ మందంమంద మధో

ముఖీ కథయితి, తత్సమీపే చిరంస్థాన మభినందతి, దూరేస్థితా పశ్యతుమాఋతిమన్యమానాపరిజనం సవదనవికారమాభాష తే, తం దేశం నముంచతి, యత్కించిద్దృష్ట్వా విహసితంకరోతి, తత్రకథమవస్థానార్థ మనుబధ్నాతి, బాలస్యాంకగతస్య ఆలింగనం, చుంబనంచకరోతి, పరిచారికాయా స్తిలకంచ రచయతి, పరిజనానవష్టభ్యతాస్తాశ్చ లీలాదర్శయతి, తన్మిత్రేషు విశ్వసితివచనం చైషాం బహుమన్యతేకరోతిచ, తత్పరిచారికై స్సహప్రీతిం సంకథా,ద్యూతమితిచ కరోతి, స్వకర్మసుచప్రభవిష్ణురివైతాన్నియుంక్తే. తేషుచ నాయకసంకథా మన్యస్యకథయత్స్వవహితా తాం శృణోతి, ధాత్రేయికయా చోదితా నాయకస్యోదవసితం ప్రవిశతి, తామంతరాకృత్వా తేన సహద్యూతంక్రీడన మాలాపం వా యోజయితు మిచ్ఛతి, అనలంకృతా దర్శనపథం పరిహరతి, కర్ణపత్రిమంగుళీయకం స్వయంవా తేనయాచితా సధీరమేవగాత్రాదవతార్యసఖ్యాగిహస్తేదదాతి తేనచదత్తం నిత్యంధారయతి, అన్యవరసంకథా సువిషణ్ణాభవతి, తత్పక్షకైశ్చనసంసృజ్యతఇతి.

ఒకనాయకునిపైన మోజుపడిఉన్న నాయిక ఆనాయకునికి తన భావాన్ని ఆకారాదులతో తెలియజేస్తుంది. అంటే ముఖమూ కళ్ళూ మొదలైనవాటి చేష్టలద్వారా తనఅనురాగన్ని సూచిస్తుందన్నమాట.

ఆనాయిక తనమేలుకాడు హఠాత్తున యెదురైతే సిగ్గు చెంది తల వంచుకుంటుంది, కాని పెట్టుడుగుడ్లు పెట్టుకుని తదేకదీక్షతో యెన్నడూ చూడదు. ఒకవేళ చూచినా తల వంచుకునే ఓరకంటితో చూస్తుంది. తనకు మిక్కిలి అలంకారభూతమైన అవయవాన్ని (అనగా స్తనాలనో, బాహువులనో) చమత్కారంగా పైటసర్దుకునేమిషతో వగకానికికనపడేట్టు చేస్తుంది. తనసొగసుకాడు హఠాత్తునయెదురైనప్పుడూ, ఏదైనా ఇతరకార్యంలో మునిగిఉన్నప్పుడూ; ఒంటరిగాఉన్నప్పుడూ చాలాదూరంగా నిలుచుని ఉన్నప్పుడూ అతనిదృష్టినీ మనస్సునీ తనవైపునకు ఆకర్షించుకోవడానికి చూస్తూఉంటుంది. తన అందగాడు పలకరించినప్పుడు తనప్రణయాన్ని వెల్లడించేవిధంగా ముసిముసి నవ్వులతో మొగము వంచుకుని చాలానెమ్మదిగా, వినిపించీవినిపించనట్లు, చెప్పీచెప్పనట్లుగా ఏదో చెపుతూ ఉంటుంది. ఏదో వంకపెట్టుకుని తనప్రాణప్రియునిదగ్గర కొంతసేపు నిలవడానికి కుతూహలపడుతుంది. తాను దూరంగాఉండి మనశ్చోరుడు తనను చూడాలని తలుస్తూ తనపరిజనంతో కండ్లూ మూతీ తిప్పుతూ మాటాడుతుంది. కాని యెంతసేపటికీ ఆచోటు వదలలేకుండా ఉంటుంది. అక్కడే దేన్నో చూచి నవ్వుతుంది. అక్కడ కొంచెంసేపు నిలచిఉండడానికి పరిజనంతో ఏదోకథలు చెప్పడం మొదలుపెడుతుంది. పసిపిల్లలను ఎవరి చేతులలోనుంచైనా అందుకుని తొడమీద ఉంచుకుంటుంది. ముద్దులుపెట్టుకుంటుంది. తనపరిచారికకు బొట్టు దిద్దబోతుంది. పరిజనాన్ని ఆనుకుని యేవేవోచేష్టలు చేస్తుంది. ఇంకా పెనిమిటి యొక్క పరిచారికమీద బాగా నమ్మకం కలిగిఉంటుంది. ఆ

పరిచారికమాట వింటుంది. దానిని బాగా ప్రేమిస్తుంది. దానితో ఆసక్తిగా మాట్లాడుతుంది. తనపనులకుగాను ఆదాసీనే ఉపయోగించుకుంటూ తానే వాళ్లమెడ రాణి అన్నట్లు ప్రవర్తిస్తుంది. తన మనోనాయకుని విషయాలు తనపరిచారికలు ఎవరితోనైనా చెవుతూఉంటే సావధానంగా వింటుంది. తనచెలికత్తె ప్రేరణచేత నాయకునియింట్లోగూడా ప్రవేశిస్తుంది. ఆ చెలికత్తెను అడ్డంచేసుకుని తనమోహనునితో జూదంగూడా ఆడుతుంది. అతనితో మాట్లాడడానికూ్కడా ఉబలాటపడుతుంది. అలంకరించుకోకుండా యెన్నడూ తననాయకుని కంటపడదు. అతడు తనకర్ణపత్రాన్నిగానీ వ్రేలిఉంగరాన్నిగానీ మెడలోని పూలహారాన్నిగానీ కోరితే యెంతగంభీరంగానో వెనువెంటనే తనఒంటినుండితీసి ఇవ్వమని తనచెలికత్తెకిస్తుంది. అతడిచ్చిన దాన్ని యెప్పుడూ విడువకుండా ధరిస్తుంది. పరపురుషుణ్ణిగూర్చి యెవరన్నా చెవుతూఉంటే అనిష్టాన్ని సూచిస్తుంది. ఇతరపురుషులకు సంబంధించినవారితో సహవాసం ఒప్పుకోదు.

౭౦-౭౬. దృష్ట్వైతాన్భావసంయుక్తాన్ ఆకారానింగితానిచ,
కన్యాయాః సంప్రయోగార్థంతాంస్తాన్యోగాన్విచింతయేత్. బాలక్రీడనకైర్బాలాకళాభిర్యావనే స్థితా, వత్సలాచాపి సంగ్రాహ్యా విశ్వాస్యజనసంగ్రహాత్. ౩.౩.౭౭.

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే కన్యాసంప్రయుక్తకే తృతీయేఽధికరణే బాలోపక్రమాః, ఇంగితాకారసూచనం, తృతీయోఽధ్యాయః.

ఇక పైరెండుప్రకరణాలలోఉన్న సారాంశాన్ని చెవుతున్నారు. ఈప్రకరణంలో చెప్పబడిన భావయుక్తములైన ఆకారాలూ, ఇంగితాలూ, చక్కగా పరీక్షించుకునికన్యకతనపైన అనురాగం కలిగిఉన్నదని దృఢమయితేతరువాత ఆకన్యతో సంప్రయోగం జరపడానికి ఆయాయోగాలను ఆచరించాలి. ఇక్కడ సంప్రయోగం అంటే గాంధర్వవివాహమని అర్థం. సాధారణంగా కన్యకలు బాల, తరుణి, ప్రౌఢ అనే ప్రభేదాలతో మూడు రకాలుగా ఉంటారు. పైనచెప్పిన బాలక్రీడనకాలద్వారా బాలను ఉపక్రమించాలి. చతుష్షష్టికళలద్వారా యువతిని ఉపక్రమించాలి. నమ్మకస్థురాలైన దాదిద్వారా ప్రౌఢనుఉపక్రమించాలి. ఇది యింగితాకార సూచనవిధానము.

ఇలా భారద్వాజ గోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయమూర్తిచేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలోని కన్యాసంప్రయుక్తకాధికరణంలో బాలోపక్రమమూ, ఇంగితాకారసూచనమూ అనే మూడో అధ్యాయం ముగిసింది.



శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

### ౩. కన్యాసంప్రయుక్తకాధికరణం

### ౪ ఏకపురుషాభియోగాధ్యాయం

౨౮౭-౨౯౭. దర్శితేంగితాకారాం కన్యాముపాయతోఽభియుంజీత, ద్యూతే క్రీడనకేషుచ వివదమానః సాకారమస్యాః పాణిమవలంబేత, యథోక్తంచ స్పృష్టకాదిమాలింగనవిధిం విదధ్యాత్, పత్రచ్ఛేద్యక్రియాయాంచ స్వాభిప్రాయసూచకం మిథున మస్యా దర్శయేత్, ఏవ మన్యద్వితరశ్శోదర్శయేత్, జలక్రీడాయాం తద్దూరతోఽప్సునిమగ్నః సమీపమస్యా గత్వాస్పృష్ట్వా చైనాం తత్త్రైవోన్మజ్జయేత్, నవపత్రికాదిషుచ సవిశేషం భావనివేదనం, ఆత్మదుఃఖస్య అనిర్వేదనకథనం, స్వప్నస్యచభావయుక్తస్య అన్యాపదేశేనప్రేక్షణకే స్వజనసమాజేవా సమీపోపవేశనం, తత్రాన్యాపదిష్టం స్పర్శనం, అపాశ్రయార్థంచ చరణేన చరణస్యపీడనం. ౩.౪.౧౧.

పైఅధ్యాయంలో చెప్పినట్లుగా ఇంగితాకారాలవల్ల తన అను రాగాన్ని వ్యక్తపరచిన కన్యకను ఉపాయంగా సమకూర్చు కోవాలి. నాయకులు రెండుతెగలుగా ఉంటారు. నిస్సహా యులు ఒకరకం. సహాయులు రెండవరకం. అసహాయులంటే సహాయకులు లేనివారు. వీరు ఎవరిసహాయాన్నీ కోరకుండానే తమంతటతామే నాయికతో పరిచయాన్ని సంపాదించు కుని అభియోగాన్ని పొందుతారు. సహాయులుఅంటే సహాయ కులద్వారా కన్యకను స్వాధీనంచేసుకునేవారు. ఈ ఏకపురుషాభి యోగాధ్యాయం మొదటి తెగలోని వారైన అసహాయకుల కోసమే వ్రాయబడుతున్నది. ఈఅభియోగాలు ఒక్కొక్క చోట ససహాయకులకుగూడా సంభవిస్తూ ఉంటాయి. ఈ అభి యోగాలు బాహ్యాలనీ, ఆభ్యంతరాలనీ రెండువిధాలు. ముం దుగా మొట్టమొదటి బాహ్యాభియోగాలను చెవుతున్నారు. జూదమూ, క్రీడనకమూ, మొదలైనవాటిలో వివాదపడి సాభి ప్రాయంగా నాయిక చెయ్యిపట్టుకోవాలి. ఆపాణిగ్రహణంలో "ఇతనిచేత నేను వివాహం చేసుకోబడ్డానని" నాయిక హృద యానికి భావంతగిలేలాగా ప్రవర్తించాలన్నమాట. ఇలాంటి సమయాలలోనే స్పృష్టకమూ, విద్ధకమూ, ఉద్ఘృష్టకమూ, పీడి తకమూ మొదలైనవాటినిచేసి నాయికను పరవశను చెయ్యాలి. ఇంకా తనఅభిప్రాయాలను సూచించడానికి హంసమిథునాలూ మొదలైన బొమ్మలను అందించాలి. ఇంకా ఇతరచిత్రాలు గూడా చూపిస్తూఉండాలి. ఇలాచేస్తే నాయిక నాయకుని నాగరకుణ్ణిగా తెలుస్తుంది. మిక్కిలి కుతూహలపడుతుంది. జలక్రీడలుచేసేసమయాలలో నాయకుడు నాయికకు చాలా

దూరంగా నీటిలోమునిగి ఈదులాడుతూవచ్చి నాయికను తాకి చమత్కారంచెయ్యాలి. పత్రిచ్ఛేద్యము మొదలైన దేశక్రీడలతోగూడ నాయికను రంజింపచెయ్యాలి. తనమనోవ్యధను ఆమెతో చెవుతూఉండాలి. కాని ఆమనోవ్యధను తాను లక్ష్యపెట్టలేదని తేల్పాలి. ఏదో నెపంతో తన స్వప్నగాధలు చెవుతూఉండాలి. అంటే నాయకుడు నాయికతో "నీతోసమానమైన వయోరూపలావణ్యాదులుగల బాలికను కలసినట్లు కల వచ్చిందని" చెప్పాలన్నమాట. బంధుజనంలో కూర్చునిఉన్నప్పుడూ, స్వజనగోష్ఠులు జరిగేసమయంలోనూ, నాయికకు సమీపంగా కూర్చుని ఆమె అవయవాలు తనకు తాకేలాగా యేదోమిషతో తాకుతూ ఉండాలి. తనకాలితో ఆమెకాలు నొక్కడం మొదలైనవి చెయ్యాలి.

౭౯-౮-౮౦౭. తతశ్శయానైకే కైకాం అంగులి మభిస్పృశేత్. పాదాంగుష్ఠేచనఖాగ్రాణిఘట్టయేత్. తత్రసిద్ధిః పదాత్పదమధికమీహేత క్షాంత్యర్థంచ తదేవాభ్యసేత్. పాదశౌచే పాదాంగుళి సందంశేన తదంగుళిపీడనం, ద్రవ్యస్య సమర్పణేప్రతిగ్రహేవా తద్గతోవికారః, ఆచమనాంతేచ ఉదకేనఆసేకః, విజనేతమసిచద్వంద్వమాసీనః క్షాంతింకుర్వీత, సమానదేశశయ్యాంచ తత్రయథార్థమనుద్వేజయతఃభావనివేదనం,వివిక్తేచ కించిదస్తి కథయితవ్యమిత్యుక్త్వా నిర్వచనం, భావంచ తత్రోపలక్షయేత్, యథాపారదారికే వక్ష్యామః.

పైవిధంగా చరణాన్ని నొక్కడంవలన, నాయిక అనుకూలు రాలుగా కనిపిస్తే నెమ్మది నెమ్మదిగా ఒక్కొక్క వేలినే రాపిడి చెయ్యాలి. ఈవిషయంలోగూడా సిద్ధుడై తనపాదంతో ఆమె పాదాన్ని బాగా ఆకర్షించి స్పృశిస్తూ చక్కిలిగింతపెట్టాలి. బాగా ఓప్పుకలిగేందుకుగాను క్రమక్రమంగా నడుము, తొడలు, చన్నులు మొదలైనవి స్పృశించాలి. ఇవన్నీ బాహ్యాభియోగాలు. ఇంక ఆంతరంగిక యోగాలను చెవుతున్నారు- నాయిక తనకాళ్ళు కడుగుతున్నప్పుడు తనకాలివేళ్ళతో ఆమె కాలివేళ్ళను నొక్కిపట్టాలి- తాంబూలము మొదలైనవస్తువులను గ్రహించేసమయంలోనూ, ఇచ్చేసమయంలోనూ నాయికనుగురించిన మోహవికారాన్ని చూపించాలి. పానీయంగ్రహించినప్పుడు విలాసంగా కొంచెంనీరు ఆమెమీద చిమ్ముతూ ఉండాలి. జనసమ్మర్దనం లేనిచోటా, చీకటిప్రదేశాలలోనూ, జతగా శయ్యమీదచేరి నాయికను తనచేష్టలను సహించేదాన్నిగాచేసుకోవాలి. ఉద్వేగం లేకుండాలి. ఇంకా ఒంటరిగా ఉన్నప్పుడు "మాట" అని పిలిచి దగ్గరకువచ్చినతరువాత 'ఏమిటీ?' అని అడిగితే ఏమీచెప్పకుండా మౌనంతో భావం ప్రకటించాలి. ఇంకా ఇంగితాకారవేదనవిధానాన్ని పారదారికాధికరణంలో చెప్పబోతున్నారు కాబట్టి అక్కడ చూచుకోవచ్చు.

౦౦౪-౦౧౫. విదితభావస్తు వ్యాధిమపదిశ్యైనాం వార్తాగ్రహణార్థం స్వముదవసితమానయేత్, ఆగతాయాశ్చశిరఃపీడనే నియోగః, పాణి మవలంబ్యచాస్యాః సాకారంనయనయోర్ల లాటేచనిదధ్యాత్,

ఔషధాపదేశార్థంచాస్యాః కర్మవినిర్దిశేత్, త్వ
య్యైవేవం కర్తవ్యం నహ్యేతాదృశేకన్యాయాః
అన్యేనకార్యమితి గచ్ఛంతం పునరాగమనాను
బంధమేనాం విసృజేత్, అస్యచయోగస్య త్రిరా
త్రం త్రిసంధ్యంచ ప్రయుక్తిః అభీక్ష్ణ్యదర్శనార్థ
మాగతాయాశ్చగోష్ఠీంవర్ధయేత్, అన్యాభిస్స
హాఽపి విశ్వాసనార్థం అధికమధికంచాభియుం
జీత, నతువాచానిర్వదేత్. దూరగతభావోఽపి
హికన్యాసునని ర్వేదేన్న సిద్ధమితిఘోటకముఖః.
యథాతు బహుసిద్ధాంమన్యేతతథైవోపక్రమేత,
ప్రదోషే నిశి తమసిచయోషితో మందసాధ్వ
సాస్సురతవ్యవసాయిన్యో రాగవత్యశ్చభవంతి
నచపురుషమత్యాచక్షతే, తస్మాత్తత్కాలం ప్ర
యోజయితవ్యా ఇతిప్రాయోవాదః. ౩.౪.౩౧

పైరీతిగా నాయిక భావాన్ని బాగాగుర్తించి తనకేదో తల
నొప్పిగా ఉన్నదనో, మరిమేదో రోగం వచ్చినదనో నెపంపెట్టి
నాయికను తనయింటికి రప్పించుకోవాలి. ముక్కుతూనో,
మూలుగుతూనో ఆమె వచ్చేసమయానికి బాధనభినయించాలి.
వెంటనే తల మర్దించడానికి ఆమెను నియోగించాలి. ఔషధం
తయారుచేసిపెట్టమని నెపంపెట్టి ఈఔషధం నీవలన తయారైతే
తేగాని ఫలవంతం కాదనిచెపుతూ నాయికను మళ్ళీమళ్ళీ
తనను సమీపించేలాగా చేసుకోవాలి. మళ్ళీవస్తావుకదా? అని
ఇలాటిమాటలతో సంబంధకల్పనచేసికొని పంపుతూఉండాలి.

ఈఅభియోగాన్ని మూడు రాత్రిలు మూడుసంధ్యలు చెయ్యాలి. అనేకపర్యాయములు నాయిక తనదర్శనానికి కుతూహలపడి వచ్చిపోతూ ఉన్నతరువాత క్రమంగా కళాశాస్త్రానికి సంబంధించినకథలను వినిపించడం మొదలుపెట్టాలి. తనకు పరిచితులైన యితరనాయికలచేతగూడా సమాగమం మాటిమాటికీ కల్పించినాయికను బాగా నమ్మించాలి. కాని తన అభియోగవిధానాన్ని తాననుసరిస్తున్నట్లుగానీ, వీటికర్థమిదియనిగానీ, నోటితో చెప్పరాదు. ఘోటకముఖుడు ఈవిషయాన్ని చాలా చక్కగా చెప్పాడు. కన్యక తనవిషయంలో యెంతనమ్మకం కుదుర్చుకున్నదైనా ఆమెవిషయంలో నాయకుడు ఎన్నడూ తొందరపడి మాటాడరాదు. కన్యకలెప్పుడూ ఎక్కువగా అభియోగాలద్వారా వశంచేసుకోతగినవాళ్ళుగా ఉంటారు. పలుసార్లు తనవిషయంలో నాయిక అనుకూలురాలని తేలిన తరువాత అభియోగక్రియలను మిక్కిలిగా ప్రయోగించి గాంధర్వవిధిచేత కార్యానుకూలురాలినిగా చేసుకోవాలి. ఈఅభియోగాలకు సమయం నిరూపిస్తున్నారు. సాధారణంగా సురతక్రియకు అనుకూలపడే అనురాగయుక్తలైనస్త్రీలుప్రదోష సమయాలలోనూ, అర్థరాత్రివేళలోనూ, ఎవ్వరిచేతా చూడబడరు కాబట్టి భయాదులులేకుండా అనురక్తినిపొంది పురుషునికి సులభసాధ్యలౌతారు. అందువల్లే సమయాన్ని కనిపెట్టి నాయికలు అభిగమింపతగి ఉంటారని చాలామంది చెప్పుకుంటారు. ఇంతవరకూ ఏకపురుషాభియోగాలు. అనగా నాయకుడు తనంతటతానే నాయికను స్వాధీనం చేసుకోడానికి అభియోగాలు జరిపేవిధానం చెప్పబడ్డది.

౪౧౪-౪౨౯. ఏకపురుషాభియోగానాంతు అసంభవే గృహీ
తార్థతయాధాత్రేయికయాసఖ్యావాతస్యామం
తర్భూతయా తమర్థంనిర్వదంత్యాసహైనామంక
మానాయయేత్తతో యథోక్తైవాభియుంజీత.
స్వయంవా పరిచారికాయాదావేవ సఖీత్వే
నాస్యాః ప్రణిదధ్యాత్. యజ్ఞే వివాహే
యాత్రాయాముత్సవేవ్యసనే, ప్రేక్షణకవ్యా
పృతే జనే తత్ర తత్రచదృష్టేంగితాకారాం పరీ
క్షితభావామేకాకినీముపక్రమేత. పహిదృష్టవచ
నా దృష్టభావాహియోషితః దేశేకాలేచప్ర
యుజ్యమానావ్యావర్తంత ఇతి వాత్స్యాయ
నః-ఇత్యేకపురుషాభియోగాః. మందాపదేశా
గుణవత్యపికన్యా ధనహీనాకులీనాఒపిసమానైర
యాచ్యమానామాతాపితృవియుక్తావా ప్రాప్త
యౌవనా పాణిగ్రహణం స్వయమభీప్సేత,
సాతుగుణవంతం శక్తం సుదర్శనం బాలప్రీ
త్యాఅభియోజయేత్, యంవామన్యేతమాతా
పిత్రోరసమీక్షయా స్వయమప్యయమింద్రియ
దౌర్బల్యాన్మయి ప్రవర్తయిష్యత ఇతి ప్రియహి
తోపచారైః అభీక్ష్ణసందర్శనేచతమావర్జయేత్.
మాతాచైనాం సఖీభిర్ధాత్రేయికాభిశ్చ సహిత
దభిముఖీం కుర్యాత్. 3.౪.3౯

నాయిక దూరంగా ఉన్నప్పుడు తాను ఇతరుల సహాయాన్ని
అపేక్షించకుండా అభియోగాన్ని పొందడానికి వీలుండదు,

అలాటిసందర్భాలలో నాయకుడు తమయిద్దరిభావాలనూ గుర్తెరిగిఉన్న దాదివల్లగానీ, అలాటిచెలికత్తెవల్లగానీ, సంధాన విషయంలో వివాదంలేకుండా నాయికానాయకులను ప్రోత్స హించే మఱియెవరివల్లనైనాగానీ నాయికను దగ్గరకు పిలిపించుకోవాలి. అటుతరువాత పూర్వంచెప్పినతీరుగా ద్యూతక్రీడా వివాదంమొదలైనవిధానాలతో అభియోగాలకుఉపక్రమించాలి. లేక మొట్టమొదటగానే తనపరిచారికను నాయికకు చెలికత్తెనుగా సమకూర్చాలి. దానిద్వారా తనపనిని నిర్వహించుకోవాలి. యజ్ఞయాగాదిక్రతువులూ, వివాహాలూ, యాత్రలూ, ఉత్సవాలూ, విందులూ, వినోదాలూ, క్రీడలూ, మొదలైనవి జరుగుతున్నచోట్లలో జనులు బాగామూగి ఉంటారు. అలాటి జనసంఘంలో అక్కడక్కడ ఇంగితాకారాదులతో భావాన్ని సూచిస్తూ తనయందుమాత్రమే ప్రేమపూని ఉన్నది అనే విషయాన్ని పరీక్షించి తెలుసుకున్నతరువాత నాయకుడు ఆ నాయికను గాంధర్వవిధితో పరిణయమాడాలి. "నాయికలు సాధారణంగా తాము మోజుపడ్డ పురుషునివిషయంలో అతని మాటలనూ, భావాన్నీ గుర్తించినపిమ్మట అనుకూలాలైన దేశకాలాలు సంభవించినప్పుడు ఆనాయకునితో కూడడానికి వ్యతిరేకించరు." అని వాత్స్యాయనులన్నారు. ఇవన్నీ ఏకపురుషాభియోగాలు. అనగా నాయకుడు ఇతరసహాయం లేకుండా తనంతటతానే నాయికనుస్వాధీనం చేసుకునే ఉపాయాలన్నమాట. దరిద్రాదులచేత పీడింపబడుతున్న నాయకుడు ఏవిధంగా నాయికాసంపాదనకు పైరీతిగా అనుసరిస్తున్నాడో, అలాగే కన్యక గూడా పైకారణాలచేత ఎవ్వరిచేతా వరింపబడక ఉన్నప్పుడు

స్వయంగానే నాయకుణ్ణి సుముఖుణ్ణి చేసుకోవాలి. నాయిక నాయకుణ్ణి సుముఖుణ్ణి చేసుకోడాన్ని ప్రయోజ్యోపావర్తనం అంటారు. ధర్మశాస్త్రాల్లోగూడా స్త్రీ తనంతటతాను పురుషుణ్ణి వరించవచ్చునని ఉన్నది. ఈక్రింద చూడండి "సతీత్వాన్నపేక్షించే కన్యక వ్యక్తురాలైనతరువాత మూడుసంవత్సరములవరకూచూచి అంతవరకూ తనరక్షకులు పెండ్లిచెయ్యకుండా ఉన్నా, తననెవరూ వరించలేకుండాఉన్నా, తనకు సరిసమానుడైన పతిని ప్రయత్నపూర్వకంగా వరించవచ్చు. ఇలా కన్యక భర్తనుచేపట్టేసమయంలో అతణ్ణిగుణవంతుణ్ణిగానూ, సమర్థుణ్ణిగానూ, రూపవంతుణ్ణిగానూ చూచుకుని బాలికలు ఆటలాడే సమయాల్లో వాళ్ళకెలాటిప్రేమ ఉదయిస్తుందో అలాటి ప్రేమతో వివాహమాడాలి. నాయకుడు తల్లిదండ్రుల ఉపేక్షచేతగానీ, ఇంద్రియలోపంవల్లగానీ తనమీద మోజుపడ్డాడని తెలుసుకుని నాయిక అతనికి హితోపచారాలుచేస్తూ మాటిమాటికీ కనిపిస్తూ అతణ్ణి వశుణ్ణి చేసుకోవాలి. ఇంకా నాయికయొక్క మాత తనచెలికత్తెలద్వారాగానీ, దాసులద్వారాగాని నాయకుణ్ణి తనకూతురికి అభిముఖుడయ్యేట్లు చెయ్యాలి.

౮౨-౮౩. పుష్పగంధతాంబూలహస్తయావిజనే వికాలే
చ తదుపస్థానం, కళాకౌశలప్రకాశనేవాసం
వాహనే శిరసః పీడనేచౌచిత్యదర్శనం, ప్ర
యోజ్యస్యసాత్మ్యయుక్తాః కథాయోగాః
బాలాయా ఉపక్రమేషు యథోక్తం తథాచ
రేత్, నత్వేవ త్వరాపి పురుషం స్వయమభి

యోగినీహి యువతిస్సౌభాగ్యం జహాతీత్యా
చార్యాః. తత్ప్రయుక్తానాం త్వభియోగానా
మానులోమ్యేనగ్రహణం, అంకపరిష్వక్తాచ
నవికృతింభజేత్, శ్లక్ష్ణమాకార మజానతీవప్రతి
గృహ్ణీయాత్. వదనగ్రహణే బలాత్కారగి,
రతిభావనమభ్యర్థ్యమానాయాః కృచ్ఛ్రాద్గు
హ్యాసంస్పర్శనం. అభ్యర్థితాపినాఽపివికృతా
స్వయంస్యాదనిశ్చయకాలాత్. యథాతుమ
న్యేత మయ్యనురక్తోనవ్యావర్తిష్యత ఇతి తదై
వైనమభియుంజానం బాలభావమోక్షాయత్వ
రయేత్. విముక్త కన్యాభావాచ విశ్వాస్యే
షుప్రకాశయేదితి ప్రయోజ్యస్యోపావర్తనం.

పూవులూ, సుగంధవస్తువులూ, తాంబూలమూ మొదలైనవస్తువులను తీసుకుని నాయకుడు ఏకాంతంగా ఉన్నప్పుడు సమయం చూచుకుని అతణ్ణి సమీపించాలి. తాను అలా సమీపించి తన కళాకౌశలాన్ని ప్రదర్శించడంగానీ, పాదాలు ఒత్తడం గానీ, తల మర్దించడం గానీ, చేసి తననేర్పు చూపించాలి. నాయకునికి ఇష్టాలైన కథలూ మొదలైన వాటితో అతనికి వినోదాన్ని చేకూరుస్తూ, బాలోపక్రమ విధానాలలో చెప్పినవిధంగా కూడా ఆచరించాలి. కాని నాయిక తొందరపడి పురుషుణ్ణి అభియోగింపగూడదు. స్వయంగా పురుషుణ్ణి ఉపక్రమించేవనిత సౌభాగ్యాన్ని కోల్పోతుందని కామశాస్త్రాచార్యులు గట్టిగా చెప్పారు. నాయకుడు తననుగూర్చి చేసే అభియోగాలను ఇష్టంగా గ్రహించాలి. నాయకుడు తొడలతో

కౌగిలించినప్పుడు వికారాన్ని పొందరాదు. నాయకుని భావ పూరితమైన ఆకారాన్ని అస్పష్టంగా ఎరగనట్లుగా గ్రహించాలి. మోవి చుంబింపగోరితే బలాత్కారంమీద గ్రహించాలి. నాయకుడు తనమదనమందిరాన్ని అంటి రతికోసం బ్రతిమాలితే నాయిక ప్రయాసమీద అతనిగుహ్యేంద్రియాన్ని స్పృశించాలి. నిశ్చయింపబడిన కాలాల్లోతప్ప మరెప్పుడూ కూడా నాయకుడెంతప్రార్థించినా తనఅంగాలను మిక్కిలివ్యక్తం చేసి ఉంచరాదు. నాయకుడు తనవిషయమై ఇంకయెప్పటికీ వైముఖ్యాన్ని పొందని అనురాగంతో ఉంటాడని యెప్పుడు తోస్తుందో అప్పుడు నాయిక తనను రంజింపచేస్తూఉన్న అతన్ని తనను కన్యాత్వంనుంచి తప్పించమని త్వరపెట్టాలి. ఇలా గాంధర్వవిధిని పొందినవధువు తనకీవిషయంలో సహాయలైన ధాత్రేయికలతోనూ, ఆప్తులతోనూ ఈసంగతి చెప్పాలి.

౮-౨౯-౮౩-౨. భవంతిచాత్రశ్లోకాః-- కన్యాభియుజ్యమానా తు యం మన్యేతాశ్రయం సుఖం, అనుకూలంచ వశ్యంచ తస్యకుర్యాత్పరిగ్రహం, అనపేక్ష్యగుణాన్యత్రరూపమౌచిత్యమేవచ,కుర్వీత ధనలోభేన పతిం సాపత్నకేష్వపి, తత్రయుక్తగుణం వశ్యం శక్తం బలవదర్థినం. ఉపాయైరభియుంజానం కన్యాన ప్రతిలోమయేత్.

కన్యక,ఎవ్వడు తనబాహ్యాభ్యంతరసౌఖ్యాలకుఆశ్రయుడుగానూ, అనుకూలుడుగానూ, వశ్యుడుగానూ, కనుపిస్తాడో అతని అభిమోగాన్నే కోరాలి. అతన్నే పరిగ్రహించాలి. గుణాన్ని

గానీ, రూపాన్నిగానీ, ఔచిత్యాన్నిగానీ, పాటించకుండా అనేక భార్యలుకలవాణ్ణైనాసరే డబ్బుకాసపడి వరించకూడదు. యోగ్యుడూ, గుణవంతుడూ, తనకనుకూలుడూ,సమస్తకార్యాలలోనూ సమర్థుడూ, ఏకాంతంగా తనను కోరేవాడూ, ఉపాయాలతో అభియోగాలు జరిపేవాడూ వరుడుగా దొరికినప్పుడు కన్యక యెప్పుడూ తిరస్కరించరాదు.

౮౩౩-౮౩౬- వరవంశ్యో వరిదోఽపి నిర్గుణోఽప్యాత్మధారణః,
గుణైర్యుక్తోఽపినత్వేవం బహుసాధారణః పతిః.
ప్రాయేణ ధనినాం దారాబహవోఽనిరవగ్రహాః,
బాహ్యేష్వసత్స్వుపభోగేఽపి నిర్విస్రంభాబహిస్సుఖాః.నీచోయస్త్వభియుంజీత పురుషః పలితోఽపి
వావిదేశగతిశీలశ్చనససంయోగమర్హతి.యదృచ్ఛయాఽభియుక్తోయో దంభద్యూతాధికోఽపివా,
సపత్నీకశ్చసాపత్యోన ససంయోగమర్హతి.

సాధారణంగా ధనవంతులు చాలమంది భార్యలను పెండ్లిఆడతారు. వారికి బాహ్యసుఖాలు (తిండి, గుడ్డ) సంపూర్ణంగా ఉంటాయి. కాని విస్రంభసుఖం (రతిసుఖం) చాలాతక్కువగా ఉంటుంది. అందుమూలాన అట్టిస్త్రీలు నిరంకుశంగా స్వేచ్ఛగా ప్రవర్తిస్తూఉంటారు. ఇలా పదిమందిభార్యలతో కాపురంచేసే వాణ్ణి గుణవంతుడనీ, భాగ్యవంతుడనీ పెండ్లాడడంకన్న గుణహీనుడైనాసరే, భార్యకు అనుకూలుడుగాఉండి కుటుంబాన్ని సమర్థతతో పోషించుకునే దరిద్రుణ్ణి పెళ్ళాడడంమేలు. ఇంకా అధమజాతికి చెందినవాడూ, తలనెరిసినవాడూ, విదేశాల్లో

సంచరించేవాడూ, ఎప్పుడూ సంభోగించడానికి తగడు. యుక్తాయుక్త విచారణలేకుండా స్త్రీఅనేది కనిపించినవెంటనే సంభోగించడానికి సిద్ధపడేవాడూ, అతిగర్వి, తాగుడూ, జూదమూ మొదలైన దుర్వ్యసనాలుకలవాడూ, అనేక భార్యలతో సంసారం చేసేవాడూ కన్యతో మైథునం చెయ్యడానికి అర్హుడు కాడు.

సూ 32. గుణసామ్యే అభియోక్తౄణాం ఏకోవరయితావరః,
తతాభియోక్తరి శ్రేష్ఠ్యం అనురాగాత్మకోహిసః.

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే కన్యాసంప్ర
యుక్తకే తృతీయేఽధికరణే ఏకపురుషాభియోగాః,
ప్రయోజ్యోపావర్తనం, అభియోగతశ్చ
కన్యాయాః ప్రతిపత్తిశ్చేతి
చతుర్థోఽధ్యాయః.

సమానగుణవంతులు కొందరు వరులున్నప్పుడు వారిలోయెవ్వడు వరించుటలో కుశలిగాఉంటాడో వాడే శ్రేష్ఠుడు. అనురాగరూపమైన శ్రేష్ఠత్వమే ఆవరునిలో ఉన్నవిశేషం.

ఇలా భారద్వాజ గోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయమూర్తిచేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలోని కన్యాసంప్రయుక్తకం అనే మూడోఅధికరణంలో నాలుగోఅధ్యాయం ముగిసింది.

శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

### ౩. కన్యాసంప్రయుక్తకాధికరణం

### ౫. వివాహ యోగాధ్యాయం

౮౩౮. ప్రాచుర్యేణకన్యాయాః వివిక్తదర్శనస్యాలాభే ధా
త్రేయికాం ప్రియహితాభ్యా ముపగృహ్యోప
సృశేత్. 3.౫.౧

పైఅధ్యాయంలో చెప్పినట్లు వరునిచేత రంజింపచేయబడిన నాయికను, స్వయంగా వరుణ్ణి వరించిననాయికను గాంధర్వ వివాహముతో భర్తృసహవాసం కలదాన్నిగా చెయ్యాలి. ఇంక వివాహయోగాలు చెవుతున్నారు. అనేకవిధాల తన కనుకూలుగాలుగాఉన్న యేకన్యక తఱుచుగా ఒంటరిపాటున తనకు కనిపిస్తూఉంటుందో ఆకన్యకను వరుడు తనయిష్టమైన ప్రదేశానికి గాంధర్వవిధానాన్ననుసరించితీసుకొనిపోవడంచాలా సుకరంగా ఉంటుంది. నాయిక తఱుచుగా కనిపించనప్పుడు మాత్రం ఆమెను సాధించడానికి సహాయం అవసరం. ' ఆకన్యక ఒంటరిపాటున కనిపించేసదుపాయం లేకపోతే నాయికకు ఆప్త

రాలైనదాదిని ధనాదులతో వశంచేసుకుని దానిని దూతీకర్మకు నియోగించాలి.

౮౩౯-౮౪౩. సా చైవమవిదితా నాయకస్య భూత్వా తద్గుణై రనురంజమేత్. తస్యాశ్చ రుచ్యాన్నాయకగుణాన్ భూయిష్ఠముపవర్ణయేత్. అన్యేషాం వరయిత్రూణాం దోషా, నభిప్రాయవిరుద్ధాన్ ప్రతిపాదయే, న్మాతాపిత్రోశ్చ గుణానభిజ్ఞతాం, లుబ్ధతాం, చపలతాంచ బాంధవానాం, యాశ్చాన్యా అపి సమానజాతీయాః కన్యాయాః శకుంతలాద్యాస్స్వబుద్ధ్యా భర్తారం ప్రాప్య సంప్రయుక్తా మోదంతే స్మ, తాశ్చాస్యాః పఠయేత్. మహాకులేషు సాపత్న్యకైః బాధ్యమానాః, విద్విష్టాః, దుఃఖితాః, పరిత్యక్తాశ్చ దృశ్యంతమాయతించాస్య వర్ణయేత్. సుఖమనుపహతమేకచారితాయాం నాయకానురాగంచ వర్ణయేత్. సమనోరథాయాశ్చాస్యా అపాయం సాధ్వసంవ్రీడాంచ హేతుభిరవచ్ఛిద్యాత్. దూతీకల్పంచ సకలమాచరేత్. త్వా మజానతీమివ నాయకో బలాద్గ్రహీష్యతీతి తథానుపరిగృహీతం స్యాదితి యోజయేదితి. ౩ ౫.౧౦.

ఇలా ఆదూతిక నాయకునిచేత నియోగింపబడి నాయికను సమీపించి నాయకునిపేరు ఎరుగనిదానివలె అతనిగుణాన్ని మాత్రంచెప్పి నాయికను ఉబలాటపెట్టాలి. ఆమెచెవులకు

ఇంపుగాఉండేట్టు నాయకునికి చాలా ఉదాత్తగుణాలున్నట్లు వర్ణించిచెప్పాలి. ఇంకా ఇతరవరులకుండే నాయిక అభిప్రాయాలకు విరుద్ధాలైనదోషాలను ఆమెకు వినిపించాలి. ఇంకా ఆ వరుల తల్లిదండ్రులయొక్కయు, చుట్టపక్కాలయొక్కయూ గుణఅనభిజ్ఞత, పిసినిగొట్టుతనం, చపలత్వం నిరూపించిచెప్పాలి. ఇంకా "నీకు సమానజాతివారైన శకుంతలమొదలైన కన్యకలు స్వతంత్రబుద్ధితో భర్తను స్వీకరించి వారి సంయోగ సుఖాన్ని పొంది ఆనందించారు" అని ఇలాటిచరిత్రాంశాలను నిదర్శనాలుగాచెప్పాలి. ఇంకా గొప్పగొప్పకులాలలో సవతులచేత బాధింపబడుతూ, ద్వేషింపబడుతూ దుఃఖితలై కొందరుకన్యకలు పరిత్యజింపబడినట్లు నిదర్శనాలతో నిరూపించి చెప్పినతరువాత, తానువర్ణించేగుణాలుకలిగిఉన్న నాయకునివరిస్తే ముందు ఆనాయకునికిరాబోయేవైభవాన్ని గూడా స్పష్టంగా వర్ణించి చెప్పాలి, ఏకపత్నీత్వంలోఉన్న తెంపులేనిసుఖాన్నీ, అలాటినాయకునికి ఉండేప్రేమనీ వర్ణించిచెప్పాలి. తానుచెప్పే నాయకుణ్ణి నాయిక కోరుతున్నట్లు తెలుసుకుని తరువాత ఆ దూతి ఆమె ఊహించే అపాయాన్నీ, భయాన్నీ, సిగ్గునీ చక్కనిమాటలతో సకారణంగా పోగొట్టాలి. ఆదొత్యానికి వచ్చినదాది, దూతికచేసే సమస్తవ్యవహారమూ నడపాలి. "ఇంకానీవిలాగే వెట్టిబాగులదానిలాగాఉండు. నాయకుడు నిన్ను ఎప్పుడో బలాత్కారంగా చేపడతాడు. అప్పుడు నిన్ను చక్కగాపరిగ్రహించినట్లు అవుతుంది" అని యిలాగూడాచెప్పి నాయికను అతనిమీద అనురాగమూ, కుతూహలమూ కలదాన్నిగా చెయ్యాలి.

౮౪౪-౮౪౬. ప్రతిపన్నామభిప్రేతావకాశవర్తినీం నాయక శ్రోత్రియాగారాదగ్నిమానాయ్య,కుశానాస్తీర్య, యథా స్మృతిహుత్వాచ, త్రిఃపరిక్రమేత్. అగ్నిసాక్షికాహి వివాహానివర్తంత ఇత్యాచార్యాణాం సమయః. ౩.౫.౧౩.

నాయకుణ్ణి పెండ్లాడడానికి ఇష్టపడి ఏకాంతప్రదేశాన్ని చేరి ఉన్న నాయికను నాయకుడు శ్రోత్రియునిఇంటినుండి అగ్ని హోత్రమును తెచ్చి దర్భలు పరచి స్మృతిలో చెప్పబడిఉన్నట్లు హోమముచేసి మూడుమార్లు ఆఅగ్నికి ప్రదక్షిణంచేసి కన్యచేత ప్రదక్షిణం చేయించాలి. అటుతరువాత నాయిక తల్లిదండ్రులకు తెలియపరచాలి. ఒకమాటు అగ్నిసాక్షిగా వివాహితలైనస్త్రీలు అన్యులచేత మరల వివాహం చేసుకోబడరు అని కామశాస్త్రాచార్యులు చెప్పారు.

౮౪౭-౮౫౦. దూషయిత్వా చైనాం స్వజనే ప్రకాశయేత్. తద్బాంధవాశ్చ యథాకులస్యాఘం పరిహరంతో, దండభయాచ్చ తస్మా ఏవైనాం దద్యుస్తథా యోజయేత్. అనంతరంచ ప్రీత్యుపగ్రహేణ రాగేణ, తద్బాంధవాన్ప్రీణయేదితి గాంధర్వేణ వివాహేన వాచేష్టేత. ౩.౫.౧౪

పైవిధంగా నాయికను అభిగమించి నెమ్మదినెమ్మదిగా ఆమెబంధుగులకు తా నీమెను వివాహంచేసుకున్నట్లుగా నాయకుడు ప్రకటించాలి. అప్పుడు కన్యయొక్క తల్లిదండ్రులు కులదోషాన్ని పోగొట్టుకోడానికిన్ని, రాజువలని భయంచేతనున్నూ,

ఆవరుసనకే ఈమెనిచ్చి వివాహం చేస్తారు. తరువాత నాయకుడు వారిని ప్రేమసూచకములైన వస్తువులతోనూ, స్నేహపూర్వకాలైన సంభాషణాలతోనూ, సంతోషపెట్టాలి. ఇంకా గాంధర్వవిధానం చేతనైనా వివాహం చేసుకోవచ్చు.

౨౫౧-౨౫౨. అప్రతిపద్యమానాయా మంతశ్చారిణీం కుల ప్రమదామన్యాం పూర్వసంసృష్టాం ప్రీయమాణాంచోపగృహ్య తయాసహావిషహ్యాపవకాశమేనామస్య కార్యాపదేశేన ఆనయేత్. తతశ్శోత్రియాగారాదగ్ని మానీయేతి సర్వం సమానం పూర్వేణ. ౩.౫.౧౬.

ఇక అంతరస్థవిషయం ముచ్చటించబడుతోంది. పైనచెప్పిన తీరుగా దూతీముఖాన చెప్పించినతరువాతకూడా పాణిగ్రహణానికి ఒప్పుకోనని నాయికనుగానీ, అంతరంగఅయిన కులస్త్రీనిగానీ, పూర్వం పరిచయాన్నిపొంది ఉన్న ఇతరనాయికనుగానీ, తల్లిదండ్రుల సౌజన్యాన్నిపట్టి ప్రేమించబడేదాన్నిగాని, ఉపాయంగా సంగ్రహించి ఏదోఒకపనిమిషతో ఆమెను తనయింటికి రప్పించుకోవాలి. అలా రప్పించుకున్నతరువాత శ్రోత్రియాగారంనుంచి అగ్నిని తెప్పించి పూర్వంచెప్పినట్లు చెయ్యాలి. ఈ వివాహంకూడా గాంధర్వవిధితో సమానం అయిందే అని కొందరిమతం.

౨౫౩-౨౫౪. ఆసన్నేచవివాహేమాతరమస్యాః తదభిమతాస్యపరదోషైః అనుశయంగ్రాహయేత్, తతస్తదనుమతేనప్రాతివేశ్యాభవనే నిశినాయకమానాయ్య శ్రోత్రియాగారాదగ్నిమితిసమానం పూర్వేణ.

వివాహం ఆసన్నమైనప్పుడు కన్యకయొక్క తల్లికి పిల్లనిద్దామను కునే యితరపురుషుని దోషాలనుచెప్పి పశ్చాత్తాపం కలదాన్నిగా చెయ్యాలి. పిమ్మట ఆమెయిష్టానుసారంగా రాత్రివేళ కన్యాగృహంలోనికే నాయకుణ్ణి రప్పించి శ్రోత్రియుని యింటినుంచి అగ్నిని తెప్పించి పూర్వంవలె చెయ్యాలి. ఈవివాహంలో ద్రవ్యమిచ్చి కన్యను గ్రహించడం జరుగుతుంది గనుక దీన్ని రెండోపక్షపు వివాహంగా చెవుతున్నారు.

౮౫౫-౮౫౬. భ్రాతరమస్యావా సమానవయసం వేశ్యాసుపరస్త్రీషువా ప్రసక్తమనుకరేణ సాహాయ్యదానేన ప్రీయోపగ్రహైశ్చ సుదీర్ఘకాలమనురంజయేదంతేచస్వాభిప్రాయంగ్రాహయేత్. ప్రాయేణ హియువానః సమానశీలవ్యసనవయసాం వయస్యానామర్థేజీవితమపిత్యజంతి. తతస్తేనైవాన్యకార్యాత్తా మానయేద్విషహ్యాం సావకాశామితి సమానంపూర్వేణ. 3.5.23

తనతో సమానవయస్కుడుగాఉన్న నాయికసోదరుణ్ణి ఒకణ్ణి చేరదీసి, వేశ్యావిషయంలోగానీ, పరస్త్రీవిషయంలోగానీ కష్టసాధ్యమైన అతనికోరికను తాను సహాయుడై నెరవేర్చాలి. లేకపోతే అతనియిష్టమయిన వస్తువును సమకూర్చిపెట్టి అతని స్నేహాన్ని అతడు గట్టిగాకోరేలాగా చూచుకోవాలి. అతడు తనకు ప్రాణమిత్రుడనే నమ్మకం గలిగినతరువాత తన అభిప్రాయాన్ని అతనికి సూచించాలి. యువకులైనపురుషులు తమ మిత్రునికొరకు ప్రాణాన్నైనా యివ్వడానికి వెనుతీయరు.

ఇంక సోదరిని సమర్పించడంలోనూ వెనుకాడేది. అతని అను కూలాన్ని సాధించుకున్న తరువాత ఆనాయిక సోదరుని ద్వారానే యేదో పనిమీద తనయింటికి నాయికను రప్పించు కోవాలి. పైనచెప్పనవిధానంతో పరిణయం చేసుకోవాలి.

౨౫౭-౨౫౮. అష్టమీచంద్రికాదిషుచ ధాత్రేయికామదనీయ మేనాం పాయయిత్వా కించిదాత్మనసి కార్య ముద్దిశ్య నాయకస్య విషయ్యాందేశం ఆనయేత్. తత్రైనాం మదాత్సం జ్ఞామప్రతిపద్యమానాం దూషయిత్వేతి సమానం పూర్వేణ.

పైనచెప్పనవిధంగా నాయిక సాధ్యంకానప్పుడు అష్టమీచం ద్రకాదులైన ఉత్సవాలలో పగలు ఉపవసించి పూజాపునస్కా రాలతో రాత్రిలయందు చంద్రోదయం అయేదాకా జాగ రణంచెయ్యడం. నాయికకు ఆప్తురాలుగా ఉండేదాదిద్వారా ఏదో పనిమీద నాయికను తనదగ్గరకు రప్పించుకోవాలి. ఆమె చేతనే కల్లు మొదలైన మత్తుపదార్థములను సేవింపచెయ్యాలి. ఆమత్తుపదార్థాలను సేవించడంవల్ల స్మృతి తప్పిఉన్న నాయి కతో బలాత్కారంగా కామసంగతిజరిపి పిమ్మట పైచెప్పిన తీరుగా వివాహవిధిని నెరవేర్చుకోవాలి. ఇది చాలా నీచమైన వివాహం. దీన్ని ధర్మశాస్త్రం ఒప్పదు. బుద్ధిమంతులు దీన్ని పైశాచికవివాహం అంటారు. దీన్ని యేమాత్రము దయాదా క్షిణ్యాలూ, ధర్మబుద్ధిగల మనుష్యులైనా అనుసరించలేరు.

౨౫౯. సుప్తాంచైకచారిణీం ధాత్రేయికాం వారయిత్వా సంజ్ఞామప్రతిపద్యమానాం దూషయిత్వేతి సమా నం పూర్వేణ. ౩.౫.౨౯.

నాయిక నిద్రపోతూఉండగానో, లేక ఒంటరిపాటున ఉండ గానో చూచి దానిదాదిని పారదోలి ఆమెను ఎత్తుకునిపోయి మాదకద్రవ్యాలు సేవింపచేసి పైవిధంగా వివాహం చేసుకోవాలి.

౨౬౦. గ్రామాంతరముద్యానంవా గచ్ఛంతీం విదిత్వా సుసంభృతసహాయో నాయక స్తదారక్షిణోవిత్రాస్య హత్వావా కన్యామపహరేదితి వివాహయోగాః.

ఇంకో ఘోరవివాహం చెపుతున్నారు. నాయిక గ్రామాంతరానికిగానీ, ఉద్యానవనవిహారానికిగానీ పోతూఉంటే తెలుసుకుని తగినంతసహాయంతో ఆమె రక్షకులను, పరిజనాన్ని అదరగొట్టిగానీ, చంపిగానీ ఆనాయికను ఎత్తుకుపోయి వివాహం చేసుకొనడం మరోరకమైన ఘోరవివాహం. ఇవిరాక్షసవివాహాలు. శాస్త్రం సమగ్రవిషయాన్ని బోధించాలిగనుక ఇవన్నీ చెప్పారు.

౨౬౧. పూర్వః పూర్వః ప్రధానంస్యాత్ వివాహేధర్మ సంస్థితేః,పూర్వాభావే తతః కార్యః యోయ ఉత్తర ఉత్తరః. ౩.౫.౨౮.

వివాహాలు ఎనిమిదివిధాలు. ఆయెనిమిదిరకాలైన వివాహాలలోనూ తరువాత తరువాత వివాహాలకంటె మొదటి మొదటి వివాహాలు ధర్మసంబద్ధాలు కావడంచేత ఉత్తమాలుగా చెప్పబడతాయి. పూర్వాలు లభ్యంకాకపోతే తరువాత వాటిని అనుసరించాలి.

౮౬౨. వ్యూఢానాం హి వివాహానాం అనురాగః ఫలం యతః మధ్యమోఽపిహి సద్యోగో గాంధర్వస్తేన పూజితః. ౩.౫.౨౯.

పైన తరువాతి తరువాతి వివాహాలకన్న పూర్వపూర్వవివాహాలే ఉత్తమాలని చెప్పారు. కాని ఉత్తమాలైన వివాహాలకు గూడా అనురాగమేకదా ఫలం? అలాటి అనురాగం అనేది లేనివివాహం నిష్ఫలం అవుతుంది. కాబట్టి లెక్కనుపట్టిచెప్పిన ఎనిమిది రకాలైన వివాహాలలోనూ మధ్యనున్నప్పటికీ (సాధారణంగా పరిగణింపబడినప్పటికీ) గాంధర్వవివాహమే లోకోత్తరమైన అనురాగయోగం ఉన్నదికాబట్టి గాంధర్వాన్నే అన్నియోగాలకన్న మిన్నగా ఎన్నుతున్నారు పెద్దలు.

౮౬౩. సుఖత్వాదబహుక్లేశాదపి చావరణాదికం, అనురాగాత్మకత్వాచ్చ గాంధర్వః ప్రవరోమతః.

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే కన్యాసంప్రయుక్తకే తృతీయేఽధికరణే వివాహయోగాః,

పంచమోఽధ్యాయః.

ఇంకా, ఆనందకరమైన సుఖానికి కారణం కాబట్టినీ్న అవిప్రయత్నంగానూ, ప్రయాసలేకుండగానూ సాధింపబడుతుంది కాబట్టినీ్న, వరణసంవిధానమూ మొదలైనవి ఉండవుకాబట్టినీ్న గాంధర్వమే ఉత్తమమని కామశాస్త్రాచార్యు లందరూ ఒప్పుకుంటున్నారు.

ఇలా భారద్వాజ గోత్రుడున్నూ, యజుశ్శాఖీయు
డున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల
ఆంజనేయమూర్తి చేత వాత్స్యాయన కామసూత్ర
ములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయ
బడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలోని కన్యా
సంప్రయుక్తకం అనే మూడో అధికరణంలో
అయిదో అధ్యాయం
ముగిసింది.



శ్రీ

# వాత్స్యాయనీయం

రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

## ౪. భార్యాధికారికాధికరణం

### ౧ ఏకచారిణీవృత్తం-ప్రవాసచర్య

౮౬౪. భార్యా ఏకచారిణీ గూఢవిస్రంభా దేవవత్పతి
మానుకూల్యేవ వర్తేత. ౪.౧.౧.

అవివాహితగాఉన్నపిల్ల ఒక పురుషునిచేత వివాహితురాలై భార్య అని పిలువబడుతుంది. అలా భార్యాత్వాన్ని భజించిన స్త్రీ తనపురుషునితో ఎలాప్రవర్తించాలో ఆవిధానంఅంతా ఈభార్యాధికరణంలో వివరిస్తున్నారు. భార్యలు ఏకచారిణి, సపత్నిక అని రెండువిధాలుగా ఉంటారు. ఏకచారిణి అంటే ఇంకొకస్త్రీకి భర్తమనస్సులో చోటివ్వకుండా తానొక్కతే అతనితో సుఖానుభవాన్ని పొందేది. కొందరుస్త్రీలు ఒకపురుషునికి భార్యలుగాఉంటే వారిలో ప్రతిఒక్కత సపత్నిక వౌతుంది. భార్యఅనే హోదాను పొందినస్త్రీరత్నము,ఇతరనాయికలవలె కపటచారిణికాక, ఎప్పుడూ తనభర్తపైన రహస్యమైననమ్మకము కలిగిఉంటుంది. ఇంకా తాను పరిగ్రహించినభర్తను

దేవునిలాగా గౌరవిస్తూ అతనికి మనసువచ్చినరీతిగా అతన్ని అనుసరిస్తూఉండాలి.

౧౬౫. తస్యతేన కుటుంబచింతామాత్మని సంనివేశయేత్.

"భర్తయే స్త్రీలకు దైవము" అనే న్యాయాన్ననుసరించి భర్తయొక్క చిత్తమునకు అనుకూలమైన ప్రవర్తనకలదై ఉండాలన్నమాట. ఇది అర్థాంగివిషయం. పైరీతిని ఏకచారిణిగాఉన్నభార్య గృహోపకరణాలవిషయంలో భర్తయిష్టాన్ని మనస్సులో ఉంచుకుని ప్రవర్తించాలి.

౧౬౬. వేశ్మచ శుచి సుసమ్మృష్టస్థానం, విరచిత వివిధ కుసుమం సంశ్లక్ష్ణభూమితలం, హృద్యదర్శనం, త్రిష వణాచరిత, బలికర్మ, పూజిత దేవాయతనంకుర్యాత్.

ఏకచారిణి తననివాసగృహాన్ని ఎప్పుడూ పరిశుభ్రంగాఊడ్చి, అలికి, దేశకాలానుసారంగా పుష్పాదులుచల్లి అలంకరించి, సమతలంగా, నున్నగా, చూడటానికి చాలామనోహరంగా ఉండేట్టుగా చేసుకుని, ప్రతిసంధ్యాసమయంలోనూ దేవతాపూజచేసి దేవతాగృహాన్ని బాగా అలంకరించి ప్రకాశవంతంగా ఉండేలాగు చూచుకోవాలి.

౧౬౭. నహ్యతోఽన్యద్గృహస్థానాం చిత్తగ్రాహక మస్తీతి గోనర్దీయః. ౪.౧.౪.

పైవిధంగా నివాసగృహాలుతయారైతే గృహస్థునికి యింతకంటె హృదయాకర్షణమైన వస్తువు మరొకటి ఉండదు. అని గోనర్దీయులన్నారు.

౮౬౮. గురుమంత్రివర్గేషు భృత్యవర్గేషు నాయక
భగినీషు తత్పతిషు చయథార్హం ప్రతిపత్తిః.

పైనచెప్పినతీరుగా నివాసగృహాన్ని హృదయాకర్షకంగా చేసుకుని తరువాత తనగృహకృత్యాలలోని లోటుపాట్లనుగురించి సలహాలిచ్చే పెద్దలైన అత్తమామల విషయంలోనూ, తనచేతి క్రిందపనిపాటులుచేసి పెరుగుతూఉండే భృత్యవర్గంవిషయంలోనూ, తన వదినామరదళ్ళవిషయంలోనూ, వారిభర్తలవిషయంలోనూ వారికివ్వవలసినగౌరవ ప్రపత్తులను గుర్తించి మెలగాలి.

౮౬౯. పరిపూతేషు చ హరితశాకవప్రాన్ ఇక్షుస్తంభాన్
జీరకసర్షపాజామోదశతపుష్పా తమాలగుల్మాంశ్చ
కారయేత్. ౪.౧.౬.

పవిత్రతములైన గృహావరణాలలో కొత్తిమెర, అల్లము, మొదలైన హరితద్రవ్యాలతోనూ, పాలంకి మొదలైన కూర పాదులతోనూ, మడులు తయారుచేసుకోవాలి. చెఱకుగడలు నాటించాలి. జీలకఱ్ఱ, ఆవాలు, అజామోదం, శతపుష్పం, తమాలం మొదలైనవికూడ నారుపోయించి పెంచాలి.

౮౭౦. కుబ్జకామలక మల్లికా జాతీ కురంటక నవమాలికా
తగరనంద్యావర్తజపా గుల్మాన్, అన్యాంశ్చ
బహుపుష్పాన్ బాలకోశీరకపాతాళికాంశ్చ వృక్ష
వాటికాయాం చ స్థండిలాని మనోజ్ఞాని కార
యేత్. ౪.౧.౭.

ఇంకా కుబ్జకాలూ, ఉసిరికలూ, మల్లెలూ, జాజులూ, గోరంటులూ, విరజాజులూ, గ్రంధిగజమూ, సంవర్తమూ, జపాకుసు

మమూ, మొదలైన పుష్పజాతులనూ, వట్టివేళ్ళూ, పాతాళిక వృక్షాలూ మొదలైనవాటిని ఉద్యానవనాలలో నాటించి మనోహరంగా పెంచాలి. ఆచెట్లక్రింద విశ్రమించడానికి చిన్న చిన్న అరుగులుకూడా ఇంపుగా కల్పించాలి.

౮౭౧. మధ్యేకూపం వాపీం దీర్ఘికాం వా కారయేత్.

ఇలా ఉద్యానవనాదులను ఏర్పరచి ఆతోటకు నట్టనడుమన భావినిగానీ, దిగుడుభావినిగాని, కోనేరునుగానీ త్రవ్వించాలి.

౮౭౨. భిక్షుకీశ్రమణాక్షపణా కులటా కుహా కేక్షణికామూలకారికాభిర్నసంసృజ్యేత. ౪,౧,౯.

బిచ్చమెత్తుకుని జీవించేదానితోనూ, బౌద్ధసన్యాసినితోనూ, గుడ్డలు కుట్టుకుని జీవించేదానితోనూ, రహస్యంగా వ్యభిచారంచేసేదానితోనూ, హాస్యంగా మాట్లాడుతూ తిరిగేదానితోనూ, సోదిదానితోనూ, వశీకరణమూలికలు అమ్మేదానితోనూ ఏకచారిణి యెన్నడూ స్నేహం చెయ్యరాదు. వాళ్ళతో కలిసి మాట్లాడరాదు.

౮౭౩. భోజనేచరుచితమిదమస్మై ద్వేష్యమిదం పథ్య మపథ్యమిదమితి చ విద్యాత్ త్యాగోపాదానార్థం.

ఆహారం తీసుకునేసమయాలలో . తనభర్త యేరుచికరాలైన పదార్థాలమీద యెక్కువ మక్కువచూపిస్తున్నాడో వాటిని గుర్తించి అతని యిష్టానిష్టవస్తువులను నిర్ణయించుకోవాలి. ఇలా నిర్ణయించుకుని అతని యిష్టాలైన రుచులనే తయారుచేసి పెట్టాలి.

౮౭౪. సర్వంబహిరుపశ్శృత్యభవనమాగచ్ఛతః కిం కృత్య మితి బ్రువతీ సజ్జా భవనమధ్యే తిష్ఠేత్.

తనభర్త యింటికివచ్చేసమయంలో అతని రాకడను గ్రహించి అతనికి తాత్కాలికంగా అవసరంగా కావలసినవేవో అడిగి ఆపనులు చెయ్యడానికి సంసిద్ధురాలై ఇంట్లో కనిపించాలి. ఇంకా ఏమికావాలని అడగాలి. అలా అడిగినప్పుడు నాయకుని మనస్సు చాలాప్రీతిని చెందుతుంది.

౮౭౫. పరిచారికామపనుద్య స్వయంపాదౌ ప్రక్షాళయేత్.

అలావచ్చినభర్తకు దాసీవాళ్ళున్నాకూడా వాళ్ళచేత పాద ప్రక్షాళనం చేయించరాదు. తనంతటతానే చెయ్యాలి.

౮౭౬. నాయకస్య చ నవిముక్తభూషణం విజనే సందర్శనే తిష్ఠేత్. ౪.౧.౧౩.

భర్త యేకాంతంగా ఉన్నప్పుడు ఏకచారిణి ఆభరణాలు లేకుండాగానీ అలంకరించుకోకుండాగాని అతన్ని సమీపించరాదు. అతనికి కనిపించరాదు.

౮౭౭. అతివ్యయం, అసద్వ్యయంవా కుర్వాణం రహసి బోధయేత్. ౪.౧.౧౪.

తనభర్త ఆదాయాన్నిమించి అతిగా వ్యయంచేస్తుంటేగానీ, డబ్బు వ్యర్థంగా దుష్కార్యాలకు ఖర్చుపెడుతుంటేగానీ తాను గ్రహించి సమయంచూచి యేకాంతంగా అతనిదగ్గరచేరి మంచిచెడుగులను చర్చించిచూపి శాంతవచనాలతో చక్కగా సలహానివ్వాలి.

౩౨౮. ఆవాహే, వివాహే, యజ్ఞే గమనం సఖీభిస్సహ
గోష్ఠీం దేవతాభిగమనమిత్యనుజ్ఞాతాకుర్యాత్.

పెళ్ళిళ్ళూ, యజ్ఞాలూ, విందులూ, ఉత్సవాలూ మొదలైనవి యెక్కడైనా జరుగుతుంటే వాటిని చూడడానికి ముందుగా తన భర్త అనుమతినిపొంది తరువాత తనకు నమ్మకస్థురాళ్ళైన చెలికత్తెలతో వెళ్ళాలి. లేకపోతే స్వేచ్ఛాచారిణికింద భర్త అనుమానిస్తాడు.

౩౨౯. సర్వక్రీడాసుచ తథానులోమ్యేన ప్రవృత్తిః.

యక్షరాత్రి మొదలైన ఉత్సవాలు జరుగుతున్నప్పుడుకూడా భర్తచిత్తవృత్తిని తెలుసుకుని ప్రవర్తించాలి.

౩౩౦. పశ్చాత్సంవేశనం పూర్వముత్థాన మనవబోధనంచ
సుప్తస్య. ౪.౧.౧౨.

భర్త పరున్నతరువాతనే తాను పరుండాలి. అతనికంటె ముందుగానే తాను నిద్రలేవాలి. భర్త కార్యభారాలచేత అలసి నిద్రిస్తూఉంటే లేపరాదు.

౩౩౧. మహానసంచ సుగుప్తం స్యాద్దర్శనీయంచ.

మహానసం అంటే వంటయిల్లు. దాన్ని చాలారహస్యంగా ఉండేలాగున్నూ, చాలాహృదయాకర్షంగా ఉండేలాగున్నూ చేసుకోవాలి.

౩౩౨. నాయకాపచారేషు కించిత్కలుషితా నాత్యర్థం
నిర్వదేత. ౧.౪.౧౯.

భర్తయేదైనా అపరాధంచేస్తే కొంచెం ఓర్పుతో గాంభీర్యాన్ని వహించి అవసరాన్నిపట్టి కొంచెం కోపించనూవచ్చు.

నెమ్మదిగా మందలించనూవచ్చు కాని కలహాకంఠిలాగా ఏవ పుట్టేట్టు తిట్టడం కూడదు.

౪-౧-3. సాధిక్షేపవచనం త్వేనం మిత్రజనమధ్యస్థం ఏకాకినం వాప్యుపాలభేత. సచ మూలకారికాస్యాత్.

ఏకాంతంగా మందలించడానికి అవకాశం లేకపోతే అతడు మిత్రులూ మొదలైనవాళ్ళతో ఉన్నప్పుడూ మృదువులైన అధిక్షేపవచనాలతో నెమ్మదిగా మందలించాలి. కాని విరక్తి కలిగేట్టు మాటలాడరాదు. అలాచేస్తే అసలుకే మోసం యేర్పడుతుంది.

౪-౧-౪. నహ్యతోన్యదప్రత్యయకారణమస్తీతి గోనర్దీయః.

గోనర్దీయుడు ఎక్కువ దుడుసుతనంగా నలుగురిలో భర్తను దూషించడంకంటె మించిన మరిఒక అవిశ్వాసకారణం లేదన్నాడు. అంటే అలామాట్లాడితే భర్త ఆమె విషయమై బాగా అవిశ్వాసాన్ని చెందుతాడన్నమాట.

౪-౧-౫. దుర్వ్యాహృతం దుర్నిరీక్షిత మన్యతో మంత్రణం ద్వారదేశావస్థానం నిరీక్షణం వా నిష్కుటేషు మంత్రణం వివిక్తేషు చిరమవస్థానమితి వర్జయేత్.

ఏకచారిణి యెప్పుడూ భర్తతో దురాలోచన చెయ్యరాదు. దుర్భాషణలు చెయ్యరాదు. దోషంతో చూడరాదు. భర్త పలకరించినప్పుడు పెడమొహం పెట్టరాదు. వాకిట్లో యెప్పుడూ ఔచిత్యాన్ని పాటించకుండా నిలువబడరాదు. వీధిలోకి తొంగిచూడరాదు. పూలతోటలో ఏకాంతంగా చాలాసేపు నిలిచి ఉండరాదు.

౮౮౬. స్వేదదంతపంకదుర్గంధాంశ్చ బుధ్యేతేతి విరాగ కారణం. ౪.౧.౨౩.

చెమటబంటితోనూ, పాచిపళ్ళతోనూ, కళ్ళపుసులతోనూ, దుర్గంధంతోనూ తనభర్తకు కనిపించరాదు. అలా కనిపించడం భర్తయొక్క విరక్తికి కారణం ఔతుంది.

౮౮౭. బహుభూషణం, వివిధకుసుమానులేపనం వివిధాంగరాగసముజ్జ్వలనం, నానావర్ణం వాస ఇత్యాభిగామికో వేషః. ప్రతనుశ్లక్ష్ణాల్పదుకూలతా పరిమితమాభరణం, సుగంధితా, నాత్యుల్బణమనులేపనం తథా శుక్లాన్యన్యానిపుష్పానీతి వైహారికో వేషః.

స్త్రీధరించే వేషం ఆభిగామికమనీ, వైహారికమనీ రెండువిధాలు. ఆభిగామిక వేషం అంటే భర్తతోకూడటానికి చేసుకునే అలంకారం అన్నమాట. పలురకాలైన ఆభరణాలను ధరించుకుని, రకరకాల పూలు పెట్టుకుని, సుగంధద్రవ్యాలనూ, అంగరాగాలనూ ధరించుకుని, దేశకాలాలనుపట్టి నానావర్ణములతో ఒప్పే వస్త్రాలను ధరించడం అభిగమించే వేషవిధానం. వైహారికమంటే ప్రయాణాదులలో ధరించే వేషమన్నమాట. బరువులేకుండా మిక్కిలి పెద్దదికాకుండా ఉండేచీర కట్టుకుని, కొద్దికొద్దిగా ఆభరణాలు ధరించి, కొద్దికా సుగంధద్రవ్యాలను కూడా సేవించి, కొద్దిగా అంగరాగాదులను ధరించి, తెల్లనివి కానీ, యితరవర్ణములుకలవికానీ అయిన పుష్పాలనే తలలో ధరించడం వైహారిక వేషవిధానం.

౨౨౨. నాయకస్య వ్రతముపవాసంచ స్వల్పమపికరణే నాను
వర్తేత. వారితాయాంచ నాహమత్ర వానిర్బంధనీ
యేతి తద్వచసో నివర్తనం. ౪.౧.౨౯.

భర్తయేమైదన వ్రతోపవాసనాదులను ఆచరిస్తూఉంటే తాను గూడా అతన్ని అనుసరించి ఆయావ్రతాలలో పాల్గొనాలి. ఒకవేళ పెనిమిటివద్దని నివారించినా "ఈవిషయంలోమాత్రం నన్ను నిర్బంధించకండి" అని నెమ్మదిగాచెప్పి మాట తప్పించుకోవాలి.

౨౨౯. మృద్వివదళ కాష్ఠ చర్మలోహ భాండానాంచకాలే
సమార్ఘ్యగ్రహణం. ౪.౧.౩౦.

మట్టిపాత్రలున్నూ, వెదురుబుట్టలున్నూ, పీటలూ, మంచాలూ, మానుముంతలూ, తోలుతిత్తులూ, ఇత్తడిపాత్రలూ, రాగిపాత్రలూ, మొదలైనవి సకాలంలో మూల్యంఇచ్చికొని ఉంచుకొని గృహంలో పరికరాలుగా వాడుకోవాలి.

౨౯౦. తథాలవణస్నేహయోశ్చ గంధద్రవ్యకటుకభాండౌష
ధానాం చ దుర్లభానాం భవనేషు ప్రచ్ఛన్న
నిధానం. ౪.౧.౩౨.

ఈవిధంగానే సైంధవాదిలవణాలూ, నెయ్యి, నూనె మొదలైన ద్రవపదార్థాలూ, సుంగధద్రవ్యాలూ, ఔషధాలూ, మొదలైనవి అవసరమైనప్పుడు దొరకవుకాబట్టి ముందుగానే సంపాదించుకుని రహస్యంగా భద్రించేసుకొని ఉంచుకోవాలి.

౮౯౧. మూలకాలుకపాలంకీ దమనకామ్రాతకైర్వారుక త్రపుసవార్తాక కూష్మాండాలాబుశూరణ శుకనాసా స్వయంగుప్తాతిలపర్ణికాగ్నిమంథలశునపలాండు ప్రభృతీనాం సర్వౌషధీనాంచ బీజగ్రహణం కాలేవాపశ్చ. ౪.౧.౨౯.

ముల్లంగి, పాలంకి, అందుగు, దమనకము, ఆమ్రాతకము, అంబాలకము, ఏర్వారుకము, హారుకము, దోస, వంగ, గుమ్మడి, ఆనప, కంద, అవిసె, సీరుల్లి, వెల్లుల్లి, మొదలైన కాయలవిత్తనాలను జాగ్రతపరచి సమయాన్ననుసరించి పాదులు పెట్టించి పండించుకోవాలి.

౮౯౨. స్వయంచ సారస్యపరేభ్యోనాఖ్యానం భర్తృమంత్రితస్యచ. ౪.౧.౩౦.

తమకున్న ధనధాన్యసమృద్ధిని ఇతరులకు వెల్లడిచెయ్యరాదు. భర్త తనకు రహస్యంగాచెప్పిన ఆలోచనలుగూడా వ్యక్తం చెయ్యరాదు. ఇలాగే కులస్త్రీలు బయటపెట్టకూడనివి చాలా ఉన్నాయి. ఆయుస్సు, ధనమూ, గృహచ్ఛిద్రమూ, రహస్యాలోచనలూ, ఓషధులు, దానమూ, మానమూ, అవమానమూ, ఈ మొదలైనవన్నీ బయటపెట్టకూడదు.

౮౯౩. సమానాశ్చ స్త్రియఃకౌశలేన ఉజ్జ్వలతయాపాకేన మానేన తథోపచారైః రతిశయీత. ౪.౧.౩౧.

ఏకచారిణి తనకు ఈడూజోడూ అయినవాళ్ళలో మంచి నేర్పుగలదనీ, యోగ్యురాలనీ, శుచిమతిఅనీ, బుద్ధిమతి అనీ, పాకాదికార్యాలు చాలా నేర్పుగా చేస్తుందనీ పేరు తెచ్చుకోవాలి.

౮౯౪. సాంవత్సరికమాయం సంఖ్యాయ తదనురూపం వ్యయం కుర్యాత్. ౪.౧.౩౧.

తమకు సంవత్సరానికివచ్చే అదాయాన్ని లెక్కవేసి దానికి మించకుండేవ్యయం చెయ్యాలి. కాని ఆదాయాన్ని మించిన వ్యయం చెయ్యరాదు.

౮౯౫. భోజనావశిష్టాద్గోరసాత్ సారగ్రహణం తథా తైలగుడయోగి కార్పాసస్య చసూత్రకర్తనం, సూత్రస్యవానం, శిక్యరజ్జుపాశవల్కలసంగ్రహణం, కుట్టనకండనావేక్షణం, ఆచామమండ తుషకణ కుట్యంగారాణాముపయోజనం, భృత్యవేతనభరణ జ్ఞానం, కృషి, పశుపాలనచింతా, వాహనవిధాన యోగాః, మేషకుక్కుట లావక శారికా పరభృత మయూర వానరమృగాణా మవేక్షణం, దైవసికాయ వ్యయపిండీకరణమితిచ విద్యాత్. ౪.౧.33-

యజ్ఞయాగాదిక్రతువులు సంభవించినప్పుడు బ్రాహ్మణసమారాధనాదులుచేసి వారు భుజింపగా మిగిలిన పాలు తోడుపెట్టుకుని పెరుగుగా చెయ్యాలి. నువ్వులు మొదలైన వాటిలోమంచినూనె తీసి అట్టిపెట్టుకోవాలి. చెరకురసం తీయించి బెల్లం తయారుచేయించుకోవాలి. పత్తివడికి నూలు తయారుచేసుకోవాలి. ఆనూలుతో బట్టలు నేయించుకోవాలి. ఉట్లు, చేంతాళ్ళు, నారచీరలు మొదలైనవి నారతో తయారుచేసుకోవాలి. దాసీలు మొదలైనవాళ్ళు ధాన్యాదులు దంచుతూ

ఉంటే పరీక్షించడం, ఊక, రంపపుపొట్టు, బొగ్గులు మొదలైనవాటిని జాగ్రత్తచేసుకోడం, దాసీవాళ్ళకు జీతభత్యాలివ్వడానికి కావలసిన కొలతలు, లెక్కలు జాగ్రత్తగా తెలుసుకోడం, వ్యవసాయపుపనులు, పశుపాలనము,ఇళ్ళలో పెంచబడే మేకలూ, గొర్రెలు, కోళ్ళూ, పావురాలూ, గోరువంకలూ, కోయిలలూ, నెమళ్ళూ, కోతులూ, లేళ్ళూ మొదలైన అలుజంతువులను ఆహారాదులతో పెంచడం, రోజువారీ ఆదాయవ్యయాలను లెక్కతేల్చడంఇవన్నీ ఏకచారిణి చేసుకోవలసినపనులు.

౮౯౬. తజ్జఘన్యాంచజీర్ణవాససాం సంచయఃతైర్వివిధ రాగైః శుద్ధైర్వాకృతకర్మణాం పరిచారకాణాం అనుగ్రహో మానార్థేషుచ దానమన్యత్రవా ఉపయోగః.

తనపతి కట్టివిడిచినగుడ్డలను తనయింట్లోపనీ పాటూ చేస్తూ ఉండే దాసీలకుగాను పోగుచేసి ఉంచాలి. శుభ్రంగా ఉతికించిగానీ, రంగువేయించిగానీ, వివిధవస్త్రాలను పరిచారికలకుఇచ్చి వాళ్ళనుసంతోషపెడుతూ ఉండాలి. లేకపోతే ఇతరపనులకుగూడాఉపయోగించుకోవచ్చు.

౮౯౭- సురాకుంభీనా మాసవకుంభీనాం చ స్థాపనం, తదుపయోగః. క్రయవిక్రియాయ వ్యయావేక్షణం.

సురాభాండాలూ, ఆసవభాండాలూ, మొదలైనవి జాగ్రతగా గృహంలో దాచుకుని అవసరం వచ్చినప్పుడు ఉపయోగించుకునేనేర్పూ, దాన్ని విక్రయించడమూ అందువలని ఆదాయవ్యయాలు లెక్కచూచుకోడం ఇవన్నీ ఏకచారిణిపనులే.

౮౯౮-౬౦౦. నాయకమిత్రాణాంచ స్రగనులేపనతాంబూలదానైః పూజనం న్యాయతః, శ్వశ్రూశ్వశురపరిచర్యా తత్పారతంత్ర్యమనుత్తరవాదితా, పరిమితాప్రచండాలాపకరణమనుచ్చైర్హాసః తత్ప్రియాప్రియేషు స్వప్రియాప్రియేష్వివవృత్తిః. భోగేష్వనుత్సేకః, పరిజనేదాక్షిణ్యం, నాయకస్య నివేద్యకస్మైచిద్దానం, స్వకర్మసు భృత్యజననియమనముత్సవేషుచ అస్యపూజనమిత్యేకచారిణీవృత్తం.

ఏకచారిణి తనభర్తయొక్క స్నేహితులు మొదలైనవాళ్ళను న్యాయాన్ననుసరించి పుష్ప, గంధ, తాంబూలాదులతో గౌరవిస్తూఉండాలి. అత్తమామలకు పరిచర్య చేస్తూఉండాలి. తానే పనిచెయ్యబోతున్నా వారిఅనుమతిగూడా తీసుకోవాలి. వారికెదురాడరాదు. వారియెదుటచాలాక్లుప్తంగానూమృదువుగానూమాట్లాడడం, సంతోషమైన ముఖంతో వారికికనిపించడంభర్తయిష్టానిష్టాలననుసరించితానుగూడాఇష్టానిష్టాలనుపూనాలి. భోగాలలో మునిగిపోయి ఒళ్లు మరవరాదు. సేవకులవిషయంలో చాలా దయకలిగి ఉండాలి. భర్తకు తెలియకుండా యెవ్వరికీ యేమీ యెప్పుడూ యివ్వరాదు. సేవకుల పనులువిచారించి అర్హతను పట్టి వాళ్ళను పనులలో నియమించుతూ, పండుగలు మొదలైన వేవైనావస్తే వాళ్లకు పప్పూభోజనాదులుపెట్టి సంతోషపెడుతూ ఉండాలి.

౬౦౧. ప్రవాసేచ మంగళసూత్రాభరణా దేవతోపవాసపరావార్తాయాం స్థితాగృహానవేక్షేత. ౪.౧.౪౩.

ఇంతవరకూ భర్తసమీపంలో ఉండేటప్పుడు ఏకచారిణి నడుచుకోవలసినతీర్లు చెప్పారు. ఇక భర్త దూరదేశంలోఉంటే ఏకచారిణి యెలానడుచుకోవాలి? అనేది చెవుతున్నారు. భర్త దూరదేశంగానీ, గ్రామాంతరంగానీ వెళ్ళినప్పుడు తనమంగళకర్మాలైన మంగళసూత్రమూ మొదలైన ఆభరణాదులను మాత్రమే ధరించాలి. అతని ఆరోగ్యాదులను కోరుతూ దేవతాపూజలూ వ్రతాలూ ఉపవాసాలూ చెయ్యాలి. భర్త యొక్క ఆరోగ్యవార్తకోసం యెదురుచూస్తూ గృహకృత్యాలలో పాల్గొనాలి.

౯౦౭-౯౦౮. శయ్యా చ గురుజనమూలే, తదభిమతాకార్యనిష్పత్తిః, నాయకాభిమతానాంచఅర్థానామార్జనే ప్రతిసంస్కారేచయత్నః. ౪.౧.౪౬.

అత్తగారు మొదలైన గురుజనులయొద్దనే పడుకోవాలి, వారిఅనుమతినిపొంది గృహకృత్యాలలో ప్రవర్తించాలి. తనభర్తకు యిష్టములైనపనులను పూర్తిచేస్తూ వాటిలోతనకిష్టంలేనివాటిని వదిలి వెయ్యాలి.

౯౦౯-౯౦౬. నిత్యనైమిత్తికేషు కర్మసు ఉచితోవ్యయః తదారబ్ధానాంచ కర్మణాం సమాపనేమతిః.

నిత్యమూ చేసే అన్నపానాదికర్మలలోనూ అప్పుడప్పుడూ చేసే ఉత్సవాలలోనూ ఉచితమైన వ్యయం చెయ్యాలి. భర్త మొదలుపెట్టి పూర్తిచేయకుండా ఉంచిన పనులు చక్కగా జాగ్రత్తగా పూర్తిచెయ్యాలి.

౯౦౭-౯౦౮- జ్ఞాతికులస్యావభిగమన మన్యత్ర వ్యసనోత్సవా
భ్యాం, తత్రాపి నాయకపరిజనాధిష్ఠితాయా
నాతికాలమవస్థాన మపరివర్తితప్రవాసవేష
తా చ. ౪.౧.౪౯.౫౦.

తనపుట్టింట్లో యేమైనా అక్కరసంభవిస్తేతప్ప ప్రవాస దీక్షలోఉన్నప్పుడు ఏకచారిణి పనిలేకుండా అక్కడకు వెళ్ళరాదు. ఒకవేళ వెళ్లడం తప్పనిసరిఅయితే తనభర్తయొక్క పరిజనాన్ని వెంటపెట్టుకుని వెళ్ళాలి. వెళ్ళినా యెక్కువకాలం అక్కడఉండకూడదు. ఉన్నప్పుడుకూడా తన ప్రవాసవేషాన్ని మార్చుకోరాదు.

౯౦౯-౯౧౦. గురుజనానుజ్ఞాతానాం వరణముపవాసానాం, పరిచారకై శ్శుచిభి రాజ్ఞాధిష్ఠితై రనుమతేన క్రయవిక్రయకర్మణా సారస్యాపూరణం, తనూకరణంశక్త్యావ్యయానాం. ౪.౧.౫౧.౫౨

నాయకుడు ప్రవాసితుడైతే ఏకచారిణి అత్తమామల అనుజ్ఞ తీసుకుని వ్రతాదులు చేసుకోవాలి. నమ్మకస్థులైన పరిచారకుల ద్వారా ఆదాయానికి లోటురాకుండా క్రయవిక్రియవ్యాపారాన్ని గురుజనానుజ్ఞతో చేయించాలి. ఒక్కొక్కప్పుడు ఖర్చు ఎక్కువగా అయితే ఉపాయంతో తగ్గించడానికి ప్రయత్నించాలి.

౯౧౧. ఆగతేచ ప్రకృతిస్థాయాఏవప్రథమతోదర్శనం. దైవపూజనముపహారాణాంచాహరణమితి ప్రవాసచర్యా.

ప్రవాసంనుంచి తనభర్త రాగానే అదివరకున్న తనవేషంతోనే ఆయనకు కనిపించాలి. చూడాలి. తరువాత దేవపూజ

చేసి మొక్కులు చెల్లించుకోవాలి. ఇది భర్త దేశాంతరగతు డైనప్పటి ఏకచారిణి ప్రవర్తన.

౯౧౨. భవతశ్చాత్రశ్లోకౌ—సద్వృత్తమనువర్తేత నాయ
కస్య హితైషిణీ, కులయోషా పునర్భూర్వావేశ్యా
వాప్యేకచారిణీ. ౪.౧.౫౪.

పై ఏకచారిణి నడుచుకోవలసిన విధానాన్ని గురించి పెద్దలు చెప్పే శ్లోకాలు రెండున్నాయి. తననాయకుని హితాన్ని కోరే ఏకచారిణి కులస్త్రీ అయినా, మారుమనువు చేసుకున్నదైనా, వేశ్య అయినా మంచినడవడితో ఉండాలి.

౯౧౩. ధర్మమర్థంచ కామంచ లభంతే స్థానమేవచ
నిస్సపత్నంచ భర్తారం నార్యస్సద్వృత్తమాశ్రితాః.

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే భార్యాధికారికే
చతుర్థేఽధికరణే ఏకచారిణీవృత్తం ప్రవాసచర్యా
ప్రథమోఽధ్యాయః.

ఇలా ప్రవర్తించిన స్త్రీలు ధర్మార్థకామాలనేకాక గొప్ప పతి వ్రతాప్రతిష్ఠను పొందుతారు.

ఇలా భారద్వాజ గోత్రుడున్నూ, యజుశ్శాఖీయు
డున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల
ఆంజనేయమూర్తి చేత వాత్స్యాయన కామసూత్ర
ములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయ
బడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలోని
భార్యాధికారికం అనే నాలుగో
అధికరణంలో మొదటి
అధ్యాయం ముగిసింది.

శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

౪. భార్యాధికారికాధికరణం

### ౨ జ్యేష్ఠావృత్తాధ్యాయం

౯౧౪ జాడ్యదౌశ్శీల్యదౌర్భాగ్యేభ్యః ప్రజానుత్పత్తేరాభీక్ష్ణ్యేన దారికోత్పత్తేర్నాయకచాపలాద్వా సపత్న్యధివేదనం. ౪.౨.౧.

సవతులతో కాపురం ప్రాప్తించినప్పుడు నాయిక యెలా ప్రవర్తించాలో చెపుతున్నారు. పలువురుభార్యలుఉంటే వారిలో జ్యేష్ఠభార్య నడతను ఇక్కడ నిరూపిస్తున్నారు. ముందుగా అసలు సవతి యేర్పడడానికి కారణాలు చెపుతున్నారు. నాయిక మూర్ఖురాలుఉన్నా, శీలం చక్కగా ఉంచుకోకపోయినా, గొడ్డుమోతుడైనా, ఎక్కువగా ఆడపిల్లలను కంటూఉన్నా సవతి యేర్పడడం కలుగుతుంది. ఇవన్నీ స్త్రీయందుండే దోషాలు. నాయకుడు చపలబుద్ధిగలవాడైనా సవతి యేర్పడవచ్చు.

౧౧౫-౧౧౬. తదాదితఏవ భక్తిశీలవైదగ్ధ్యఖ్యాపనేనపరిజిహీర్షేత్, ప్రజానుత్పత్తౌచ స్వయమేవ సాపత్న్యే బోధయేత్. ౪.౨.౩

కాబట్టి మొదట్లో నాయిక, పెనిటిమీద భక్తి చూపిస్తూ, శీలాన్ని చక్కపరుచుకుంటూ, పనులలో చక్కని నేర్పుసంపాదించి మొదటిమూడు దోషాలనూ నివారించుకోవాలి. నాయకుని చపలబుద్ధిని తననేర్పుచేత పోగొట్టాలి. ఇక తక్కినరెండు కారణాలూ దురదృష్టంచేత ప్రాప్తిస్తేతానే ముందుగా నాయకుణ్ణి ద్వితీయవివాహానికి ప్రేరేపించాలి.

౧౧౭. అధివిద్యమానాచ యావచ్ఛక్తియోగాదాత్మనోఽధికత్వేన స్థితిం కారయేత్. ౪.౨.౪.

అలా భర్త రెండోవివాహం చేసుకున్నమీదట ఆరెండో నాయికకూడా తనశక్తివంచనలేకుండా తనపెద్దసవతికి తనకంటెఉన్నతస్థితి కలిగేలాగా చూడాలి.

౧౧౮-౧౨౦. ఆగతాంచైనాం భగినీవదీక్షేత, నాయకవిదితంచ ప్రాదోషికం విధిమతీవ యత్నాదస్యాః కారయేత్. సౌభాగ్యజం వైకృత ముత్సేకం వా అస్యానాద్రియేత్. ౪.౨.౭.

పెద్దనాయికకూడా తనచిన్నసవతిని తనచెల్లెలినచూచినట్లు చూడాలి. భర్తకు ఆనందం కలిగేట్టు మిక్కిలి ప్రయత్నించి తనసవతిని సాయంకాలంవేళలో బాగా అలంకరించాలి. ఒకవేళ ఆసవతి తాను సహజంగా అందకత్తెనుగదా అని గర్వపడుతున్నా తానంతగా పట్టించుకోరాదు.

౯_౨౧-౯_౨౨. భర్తరి ప్రమాద్యంతీము పేక్షేత, యత్రిమన్యే
తార్థమియం స్వయమపి ప్రతిపత్స్యత ఇతి తస్యై
నామాదరత ఏవానుశిష్యాత్. ౪.౨.౯.

పైవిధంగా చిన్నసవతి గర్వపడుతూ భర్తవిషయంలో ప్రమా
దాన్ని పొందుతూఉంటే పెద్దభార్య యేమీ అనకుండా ఊరు
కోవాలి- దానిదోషం దాన్నే చెరుపుతుందని తలంచాలన్న
మాట. నాయకుని సంభోగసుఖంకోసం తానే యీసవతిని
సమకూర్చిఉంటే తనప్రేమను సూచించడానికి మిక్కిలి ఆద
రంతో ప్రమాదపడవద్దని మందలించాలి.

౯_౨౩. బహ్వీభిస్త్వధివిన్నా అవ్యవహితయాసంసృజ్యేత.
పలువురు సవతులతో కాపురంలభిస్తే తనతరువాతసవతితో
మాత్రంఆదరస్నేహాలు ప్రకటిస్తూ ఉండాలి.

౯_౨౪. యాం తునాయకోఽధికాంచికీర్షేత్తాం భూతపూర్వ
సుభగయాప్రోత్సాహ్యకలహయేత్. ౪.౨.౧౧.
ఏసవతిని నాయకుడు ఎక్కువగా ప్రేమిస్తున్నాడో దానితో
అంతకుపూర్వం నాయకుని అభిమానానికి పాత్రురాలైన
దానికి పొగడ్తతో పోట్లాట యేర్పాటు చెయ్యాలి. అందు
వల్ల ఆమెగొప్పతనం కొంత ఉపశమిస్తుంది.

౯_౨౫. ఏతశ్చానుకంపేత. ౪.౨.౧౨
ఇలా తగువు పెట్టి పోరాడేసమయంలో ఒక్కొక్కదాన్ని రహ
స్యంగా ఓదార్చి పోట్లాట మాన్పించాలి.

౯_౨౬. తాభిరేకత్వేనాధికాం చికీర్షితాం స్వానువివదమానా
దుర్జనీకుర్యాత్. ౪.౨.౧౩.

సవతులంతా ఐక్యభావంతో ఉంటున్నప్పుడుకూడా నాయకుడు దేన్ని అధికురాలుగా చూస్తూఉంటాడో దానితో తానుమాత్రం పోరాడకుండా ఇతరులతో కుట్రచేసి దాని దోషాన్ని బయటపెట్టాలి.

౯౨౭. నాయకేనతు కలహితామేనాం పక్షపాతావలంబి నోపబృంహితామాశ్వాసయేత్. ౪.౨.౧౪.

ఆమెకు నాయకునితో కలహం ప్రాప్తిస్తే ఆమెపక్షాన తాను చేరి తానే ప్రత్యుత్తరంచెప్పి ఆమెకు ఊరటకలిగేలాగా చెయ్యాలి.

౯౨౮. కలహంచవర్ధయేత్. ౪.౨.౧౫.

ఇలా సవతిపక్షానపూని నాయకునిమీద తప్పుమోపిఅతనితో ఆమెకు కలహాన్ని బాగాపెంచాలి.

౯౨౯. మందంవా కలహ ముపలభ్య స్వయమేవ సంధుక్షయేత్. ౪.౨.౧౬.

ఇలా రగుల్కొన్న గొప్పకలహాగ్ని కొద్దికొద్దిగా చల్లారుతున్నట్లుంటే తానే స్వయంగా పూనుకుని దాన్ని మళ్ళీ రగుల్కొల్పాలి.

౯౩౦. యదినాయకోఽస్యామద్యాపి సానునయఇతిమన్యేత తదాస్వయమేవ సంధౌ ప్రయతేత, ఇతి జ్యేష్ఠావృత్తం.

ఇలా పోట్లాటపెంచినా నాయకుడు ఆమెమీద అనురాగం కలిగిఉంటే అప్పుడు తానే స్వయంగా నాయకుణ్ణి అనునయించి

సంధిని పోసగించాలి. పెద్దభార్యకాపురాన్ని ప్రమాదంలేకుండా సర్దుబాటు చెయ్యాలన్నమాట. ఇంతవరకూ పెద్దభార్య విషయం చెప్పబడ్డది.

౯౩౧- కనిష్ఠాతు మాతృసత్నపత్నీం పశ్యేత్-

ఇక సవతులలో చిట్టచివరదానినడవడిక చెవుతున్నారు- కనిష్ఠ అంటే చిట్టచివరది- ఆమె తన పెద్దసవతినితల్లినివలెగౌరవించాలి.

౯౩౨. జ్ఞాతిదాయమపితస్యా అవిదితం నోపయుంజీత.

తనపుట్టినింటివాళ్ళవల్ల ప్రాప్తించినప్పటికీ యేవస్తువైనా తన పెద్దసవతికి తెలియకుండా ఉపయోగించుకోరాదు. ఇక భర్త వల్ల సంక్రమించినదాన్నిగూర్చి యేమిచెప్పాలి?

౯౩౩. ఆత్మవృత్తాంతాన్ తదధిష్ఠితాన్ కుర్యాత్.

తనకు సంబంధించిన వ్యవహారాల నన్నిటినీ ఆమెవశంలో ఉండేట్లు చెయ్యాలి.

౯౩౪. అనుజ్ఞాతాపతి మధిశయీత. ౪.౨.౨౧.

ఆమెయిష్టంమీదే దినక్రమాన్ననుసరించి తనపతితో శయనించాలి.

౯౩౫- నవాతస్యా వచనమన్యస్యైః కథయేత్. ౪.౨.౨౨.

ఆమెచెప్పినమాటలు మంచివైనా చెడ్డవైనా ఇతరులతో చెప్పరాదు. అలా చెప్పినట్లైతే కలహాలు ప్రాప్తిస్తాయి.

౯౩౬. తదపత్యాని స్వేభ్యోఽధికాని పశ్యేత్.

ఆమెయొక్క పుత్రపుత్రికలను తనసంతానంకంటె ఎక్కువగా చూస్తూఉండాలి.

౯-౩౭. రహసి పతిమధికముపచరేత్. ౪.౨.౨౪

భర్తతో ఏకాంతంగా శయనించినప్పుడు ఇతరసవతులకంటె ఎక్కువగా తాను అతన్ని రంజింపచెయ్యాలి.

౯-౩౮. ఆత్మనశ్చ సపత్నీకృత ప్రకారజం దుఃఖనాం నాచక్షీత.

సవతులవల్ల కలిగే పరాభవాన్ని తనంతటతాను చెప్పినట్లైతే దాన్ని నాయకుడు నమ్మడం చాలా అరుదు. కాబట్టి ఇతరుల వల్ల చెప్పించాలి.

౯-౩౯. పత్యుశ్చ సవిశేషకం గూఢం మానం లిప్సేత.

భర్త తనసవతులకంటె తన్నెక్కువగా రహస్యంగా గౌరవించే అనుకూల్యంకోసం కోరవచ్చు.

౯-౪౦. అనేనఖలు పథ్యదానేన జీవామీతి బ్రూయాత్.

ఈవిధంగా నన్ననుగ్రహిస్తే సవతిపోరులోనుంచి తప్పించుకుని బ్రతుకుతాను అని జాలికలిగేలాగా చెప్పాలి.

౯-౪౧. తత్తుశ్లాఘయా రాగేణవా బహిర్నాచక్షీత.

తనభర్తకు తనమీద కలిగినదయను అతనిపొగడ్తసమయాలలోగానీ, సవతిమీద కోపం సంభవించినప్పుడుగానీ, సామాన్యజనసమీపంలోగానీ వెల్లడించరాదు. ఇక్కడ రహస్యాన్ని దాచిఉంచడమే ముఖ్యాభిప్రాయం.

౯-౪౨. భిన్నరహస్యాహి భర్తురవజ్ఞాం లభతే.

రహస్యవృత్తాంతాలను బయలుపరచిన నాయిక భర్తవల్ల మితిలేని అవమానాన్ని పొందుతుంది. అంటే భర్తయిచ్చే గౌరవాన్ని రహస్యంగా హృదయంలో దాచుకుని ఉండాలన్నమాట.

౯౪౩. జ్యేష్ఠాభయాచ్చ నిగూఢ సమ్మానార్థినీస్యాదితి గోనర్దీయః.

అలా ఉండకపోతే "తనకంటె ఎక్కువగా భర్త అభిమానాన్ని చూరగొంటున్నది" అనే కోపంచేత జ్యేష్ఠురాలు కోపాన్ని పొంది అనర్థాన్నిగూడా కల్పించగోరుతుంది. అని గోనర్దీయు లన్నారు.

౯౪౪. దుర్భగామనపత్యాంచ జ్యేష్ఠామనుకంపేత, నాయకేనచాప్యనుకంపయేత్. ౪.౨.౩౧.

జ్యేష్ఠురాలు రోగగ్రస్తురాలైఉన్నా, గొడ్డుమోతుగాఉన్నా, ఆమెయందు దయచూపించాలి. తనభర్తకుగూడా ఆమెయందు దయకలిగేలాగా చెయ్యాలికాని ఎన్నడూ రహస్యంగా అవమానపరచాలని కోరరాదు. ఇలాఉంటేతనకుకొంచెం పేరూ ప్రతిష్ఠలూ ఉంటాయి.

౯౪౫. ప్రసహ్యాత్వేనాప్యేనామేకచారిణీ వృత్తమనుతిష్ఠేదితి కనిష్ఠావృత్తం. ౪.౨.౩౨

ఇలా దుర్భగురాలుగాగానీ, గొడ్రాలుగాగానీ ఉన్న పెద్దసవతితో సంప్రతించి జ్యేష్ఠకనిష్ఠలమధ్యనుండే నాయికలలో పొర్పాపర్యాలు నిర్ణయించి వారిచేత జ్యేష్ఠాకనిష్ఠావృత్తాలను అనుసరించేలాగా చెయ్యాలి. ఇది కనిష్ఠికావృత్తాంతం.

౯౪౬. విధవాత్వింద్రియదౌర్బల్యా దాతురాభోగినం గుణసంపన్నంచ యాపునర్విందేత్ సాపునర్భూః

కన్యక యెలా పురుషుణ్ణివరించి భార్యఅనిపించుకుంటున్నదో అలాగే పునర్భూ అనే మరోరకమైన భార్యఉన్నది- ఆపున

ర్భావృత్తాంతాన్ని ఇక్కడ చెవుతున్నారు. పునర్భూ అని పిలువబడే భార్యలు క్షతయోనులు, అక్షతయోనులు అని రెండురకాలు. ఇందులో రెండోరకంవాళ్ళు సంస్కారానికి అర్హత కలవాళ్ళుగనుక కన్యకలుగానే పరిగణింపబడతారు. అక్షతయోనులుకాబట్టి వివాహయోగ్యాలన్నమాట. క్షత యోనిమాత్రం సంస్కారానికి యోగ్యురాలుకాదు. కేవలం స్వీకరింపతగినది మాత్రమే. విధవలనుగురించి వసిష్ఠు డిలా చెప్పాడు. "మనోదత్తా వచోదత్తా యాచమంగళవాచికా ఉదకస్పర్శికా చైవ యాచపాణిగృహీతికా। అగ్నింపరిగతా చైవ పునర్భూఃప్రసవాచయా" అని. అంటే మనస్సులో ఒక నికి ఇవ్వడానికి సంకల్పింపబడినది, ఇస్తామని చెప్పబడినది, పాణి గ్రహణము చేసుకోబడినది, పునర్భువు, ప్రసవ,వీళ్ళంతా భా ర్యాపదంతో పిలవబడతారు- మొదటిఆరుగురూ అక్షత యోనులు.(పురుషస్పర్శలేకుండా వైధవ్యాన్ని పొందినవాళ్ళు). పునర్భువుమాత్రం క్షతయోని. ఆమెవిషయమే యిక్కడ చర్చింపబడుతుంది. అంటే విధవవిషయం అన్నమాట.

భర్త చనిపోయినతరువాత కామోద్రేకాన్ని అణుచు కోలేక ఆతురపడి భోగవంతుడున్నూ, గుణవంతుడున్నూ అయిన మరిఒకణ్ణి మళ్ళీపొందవచ్చు- ఆమే పునర్భూ అని పిలువబడుతుంది. ఒకనికి ముందు భార్యగాఉండి అతడు చని పోగా మరల ఇంకొకనికి భార్యగా అయినదికాబట్టి పునర్భ వుగా చెప్పబడుతుంది. ఇది గోనర్దీయుని మతం.

౫౪౭. యతస్తు స్వేచ్ఛయా పునరపి నిష్క్రమణం నిర్గుణో యమితి, తదాన్యంకాంక్షేతేతి బాభ్రవీయాః.

చేసుకున్న భర్త జీవించిఉండగానే అతడు దుర్మార్గుడని స్వేచ్ఛగా అతనిని వదలి లేచిపోయి మఱొకనిని చేరి, అతడూ గుణవంతుడు కాడని తోసివేసి మఱొక భోగవంతుణ్ణి ఏ స్త్రీ వ్యక్తి కోరుతుందో ఆమె పునర్భువు అని బాభ్రవీయుని మతం.

౯౪౮. సౌఖ్యార్థినీ సాన్యం విందేత. ౪.౨.౩౫.

ఒకభర్తనువిడచి మరిఒకభర్తనుచేరడం సుఖాన్ని కోరేకదా? అందువల్ల అదేపునర్భువు అనబడుతుంది.

౯౪౯. గుణేషు సోపభోగేషు సుఖసాకల్యాత్ తస్మాత్తతో విశేషఇతి గోనర్దీయః. ౪.౨.౩౬.

గుణాలూఉండి, ఉపభోగయుక్తుడుగానూ నాయకుడుఉంటే సుఖప్రాప్తి సంపూర్ణంగా కలుగుతూనేఉందిగదా? అందువల్ల గుణవంతుడుకాని భోగికంటె గుణవంతుడైనభోగి గొప్పవాడు. అందువల్లే సుఖాపేక్షచేత స్త్రీ ఇతరుణ్ణి కోరుతోంది. ఇది గోనర్దీయునిమతం. మాటిమాటికీ లేచిపోయే స్త్రీ వేశ్యలలోనే చేరుతుంది.

౯౫౦. ఆత్మనశ్చిత్తానుకూల్యాదితి వాత్స్యాయనః.

గుణవంతుడూ భోగవంతుడూ అయిన నాయకుడు దొరికినా మనస్సుకు అనుకూలంగా లేకపోతే సౌఖ్యంబాగా లభించదు. అందువల్ల ఎవనిదగ్గర చిత్తం బాగా అనుకూలపడుతుందో వాణ్ణి పొందుతూ ఉంటుంది. ఆస్త్రీనే పునర్భువు అంటారు. ఇది వాత్స్యాయనులమతం.

౯౫౧. సాబాంధవైర్నాయకాదాపానకోద్యాన శ్రద్ధాదానమిత్రసంపూజనాదివ్యయసహిష్ణుకర్తలిప్సేత.

మొత్తంమీద పునర్భువులంటే విధవ, చిత్తచాంచల్యంగలస్త్రీ వ్యక్తి అని తేలింది. ఆమె తనబంధువులతో కూడిఉండి మద్య గోష్ఠులూ, ఉద్యానవిహారాలూ, శ్రద్ధాదానాలూ, మిత్రపూజలూ, మొదలైన ధనవ్యయంతో కూడినవాటిని నాయకుని చేత కల్పింపచేసుకుని అతనిని కలుసుకోవాలి. ఇది ఉత్తమ నాయకులవల్ల ఉత్తమనాయికలుమాత్రమే కోరాలి.

౧౫౨. ఆత్మనస్సారేణవా అలంకార్యం తదీయమాత్మీయం వా బిభృయాత. ౪.౨.౩౯.

తనకున్నసొమ్ములు వెనుకటినాయకుడిచ్చినవైనా తనవైనా ఆయాసమయాలలో ధరించవచ్చు. ఇవి మధ్యమాధమస్త్రీవ్యక్తులు కోరదగిన కోరికలు.

౧౫౩. ప్రీతిదాయేష్వనియమః. ౪.౨.౪౦.

ప్రేమసందర్భంలో లభించిన సొమ్ములను ధరించడంలో నియమంలేనేలేదు.

౧౫౪. స్వేచ్ఛయాచగృహాన్నిర్గచ్ఛంతీ ప్రీతిదాయాదన్యన్నాయకదత్తం దీయేత. నిష్కాస్యమానాతు న కించిద్దద్యాత్. ౪.౨.౪౧.

స్త్రీవ్యక్తి స్వేచ్ఛగా భర్తను ఒదిలిపోయేసమయాలలో ప్రేమసంగతిలో అంతకుపూర్వం లభించిన ఆభరణాదులుతప్ప, నాయకునివల్ల లభించిన యితరద్రవ్యాన్ని అతనికే యిచ్చివెయ్యాలి. అలాకాకుండా నాయకునివల్ల గెంటబడేట్లయితే తనవశంలోఉన్న యేధనమూ తిరిగీ యిచ్చేపనిలేదు.

౯౫౫. సాప్రభవిష్ణురివతస్య భవనమాప్నుయాత్.

ఒకనాయకుణ్ణివదలి రెండవనాయకుణ్ణి వరించేస్త్రీ రెండవ వానియింట్లో తాను సర్వస్వతంత్రంగా ప్రవర్తించాలి. ఏమే మాత్రమూ సంకోచపడరాదు.

౯౫౬. కులజాసుచ ప్రీత్యావర్తేత. ౪.౨.౪౩.

పైవిధంగా సంచరింపగల్గిన వనిత తానలా సంచరింపగలిగే వరకూ నాయకుని ధర్మపత్నుల విషయంలో ప్రేమ కలిగి ఉండాలి.

౯౫౭-౯౫౮. దాక్షిణ్యేన పరిజనే సర్వత్ర, సపరిహాసా మిత్రేషు ప్రతిపత్తిః. ౪.౨.౪౩.౪౪

తనకొత్తనాయకుని పరిజనంవిషయంలో మిక్కిలి సామ్యభావాన్ని ఉంచాలి. అతనిమిత్రులవిషయంలో తనకళాకౌశలం చూపుతూ నవ్వుతూ నాయకుణ్ణి మించేలాగా కళాప్రతిభ చూపుతూ ఉండాలి.

౯౫౯. కలహస్థానేషు చ నాయకం స్వయముపాలభేత.

కలహస్థానాలు ప్రాప్తించినప్పుడు తాను స్వయంగా నాయకుణ్ణి నిందించాలి. పునర్భూస్త్రీలకు భర్తతో కలహం ప్రాప్తింపచేస్థానాలు. ఉచితవిచ్ఛేదం, అనగా ఔచిత్యాన్ని పాటించక పోవడం, స్వైరిణిసంసర్గం, అంటే స్వేచ్ఛగా తిరిగే రంకుటాళ్లతో తిరగడం, అచిరాత్రగమనం, అంటే చాలాసేపు అక్కడిక్కడ సంచరించడం, ఇంటినుంచి మాటిమాటికీ లేచి పోతూఉండడం ఈమొదలైనవి.

౯౬౦-౯౬౭. రహసిచ కళ యాచతుష్షష్ట్యాఅనువర్తేత, సపత్నీనాంచ స్వయముపకుర్యాత్, తాసామపత్యే ష్వాభరణదానం, తేషుస్వామివదుపచారః, మండనకానివేషానాదరేణ కుర్వీత, పరిజనే మిత్రవర్గేచ అధికం విశ్రాణనం, సమాజే పానకోద్యాన యాత్రావిహారశీలతాచేతి పునర్భూవృత్తం.

నాయకుడు శయనాన్ని చేరినతరువాత అతన్ని చతుష్షష్టి కళలతో రంజింపచెయ్యాలి. కులసతులైన సవతులకు అవసరాన్ని పట్టి ఉపకారం చేస్తూఉండాలి. సవతిబిడ్డలకు ఆభరణాలు సమర్పిస్తూఉండాలి. వాళ్ల విషయమై తనభర్తవలెసేవనడపాలి. అలంకారాదివేషాన్ని ఆదరంతో ధరించాలి. పరిజనవిషయంలోనూ, మిత్రవర్గవిషయంలోనూ మిక్కిలి యీవిగలిగి ఉండాలి. సంఘంతో కలిసి పానగోష్ఠి, ఉద్యానయాత్ర యీ మొదలైనవాటిల్లో ఆసక్తికలిగి ఉండాలి. ఇది పునర్భూవృత్తం.

౯౬౮-౯౭౦- దుర్భగాతుసాపత్న్యపీడితా, యాతాసామధికమివపత్యావుపచరేత్తామాశ్రయేత్, ప్రకాశ్యానిచ కళావిజ్ఞానాని దర్శయేత్, దౌర్భాగ్యాద్రహస్యానామభావః-

పైనచెప్పిన ఏకచారిణులుగాఉండే భార్యలలో దుర్భగకూడా ఉండడం సంభవిస్తుంది. ఆమెతో యెలాప్రవర్తించాలో చెప్తున్నారు- దుర్భగసవతులవల్ల బాధకలిగితే ఆమె నాయకునికి

ప్రీతిపాత్రురాలైనా సవతి నాశ్రయించాలి. ప్రకాశింప తగిన కళావిజ్ఞానాన్ని చూపించాలి. దుర్భగకాబట్టి దాచ తగిన రహస్యాలుండవు. పై కళాజ్ఞానాన్ని సంపాదించినట్లైతే దుర్భగాత్వం (మౌఢ్యం) కొంత తొలుగుతుంది.

౯౨౧. నాయకాపత్యానాం ధాత్రీకర్మాణికుర్యాత్.
నాయకుని సంతానవిషయంలో తాను పెంపుడుతల్లిలాగా ప్రవర్తించాలి.

౯౨౨.తన్మిత్రాణిచోపగృహ్యతైర్భక్తిమాత్మనశ్శ్రావయేత్.
అతనిమిత్రులను హితసంభాషణలతో పరిచయం చేసుకుని తనకు వారియందుగల భక్తిని సూచించాలి.

౯౨౩. ధర్మకృత్యేషుచ పురశ్చారిణీస్యాద్వ్రతోపవాసయోశ్చ. ౪.౨.౬౬.

ధర్మకార్యాలలోనూ, వ్రతోపవాసాలలోనూ తానే ముందు ప్రవర్తించాలి.

౯౨౪. పరిజనేదాక్షిణ్యం నచాధికమాత్మానం పశ్యేత్.
నాయకుని పరిజనవిషయంలో చాలా సౌమ్యభావాన్ని పూనాలి. సవతులకంటెనూ, పరిజనంకంటె కూడా తననుఅధికంగా తలంచరాదు.

౯౨౫. శయనేతత్సాత్మ్యేన ఆత్మనోఅనురాగప్రత్యానయనం.
శయనవిషయంలో నాయకు డెలాచేస్తే అలాగే తనకిష్టం లేకపోయినా తన అను రాగాన్ని అతనికి తృప్తి కలిగేవరకూ ప్రకటించాలి.

౯౭౬. వచోపాలభేతవామతాంచనదర్శయేత్ . ౪.౨.౬౯.
నాయకుణ్ణి "నామీద నీకు ప్రేమలేదు" అని నిందించరాదు. అతడు అనుకూలుడై తనను చేరినప్పుడు ప్రతికూలభావాన్ని చూపించరాదు.

౯౭౭. యయాచకలహితస్స్యాత్ కామంతామావర్తయేత్.
తనసవతులలో ఎవతెకైనా నాయకునితో కలహం ప్రాప్తిస్తే ఆమెను తాను ఓదార్చి తిరిగీ నాయకునికి అనురాగపాత్రు రాలినిగా చెయ్యాలి.

౯౭౮. యాంచప్రచ్ఛన్నాం కామయేత్తామనేనసహసంగ
మయేద్గోపయేత్ . ౪.౨.౭౦

తనభర్త రహస్యంగా పరస్త్రీని కామిస్తే తాను దూతీవ్యవహారం నడిపి ఆమెను అతనికి లభ్యురాలినిగా చెయ్యాలి. అలా చేసి ఆవృత్తాంతాన్ని రహస్యంగా ఉంచాలికాని బహిర్గతం చెయ్యరాదు. అంటే ఇతరుల కెవ్వరికీ చెప్పరాదన్నమాట.

౯౭౯. యథాచ పతివ్రతాత్వం నాయకోమన్యేత తథా
ప్రతివిదధ్యాత్, ఇతి దుర్భగావృత్తం.

సాధారణంగా దుర్భగాత్వం, మంకుతనంవల్లగానీ, దుస్స్వభావంవల్లగానీ, కలుగుతూ ఉంటుంది. అలాసంభవించినప్పుడు నాయిక తననాయకునికి కలిగిన సంకోచాన్ని పోగొట్టడానికి ప్రయత్నించాలి. ఇది దుర్భగావృత్తం.

౯౮౦- అంతఃపురాణాంచ వృత్తమేతేష్వేవ ప్రకరణేషు
లక్షయేత్ . ౪-౨-౭౩-

భార్యయొక్క అధికారం భార్యాధికారమని యెలా అన్నా మో అలాగే భార్యయందు నాయకునియొక్క అధికారం అని సప్తమీ సమాసంచెప్పాలి- అంటే భర్తయందు భార్య యెలాపవర్తించవలసినదీ చెప్పేఅధికారం భార్యాధికారం. అలాగే భార్యవిషయంలో భర్త యెలా ప్రవర్తించవలసినదీ చెప్పేఅధికారం నాయకాధికారం అన్నారు. ఇలాచెప్పకపోతే నాయకునితో సంగమించి నాయిక అనువర్తనకలిగి ఉన్నదని చెప్పడానికి వీలుండదు. నాయకులు, రాజు, జానపదుడు అని రెండురకాలు. ఇక్కడ రాజపురుషుణ్ణిగూర్చి అంతఃపురిక వృత్తాంతం వర్ణింపబడుచున్నది. రాజుయొక్క వృత్తాంతాన్ని వర్ణించినట్లుగానే అంతఃపురవృత్తాంతంగూడా వర్ణింపబడాలి గనుక ఆఅంతఃపురస్త్రీజనుల ప్రవర్తననుగూడా ఈపరికరణంలో చెప్పాలి. ఏకచారిణి అని జ్యేష్ఠఅనీ, అంతఃపురజనంలో గూడా పరిభేదాలు ఉన్నాయి కాబట్టి వేరే చెప్పబడవు.

౯౮౧-౯౮౩. మాల్యానులేపనవాసాంసి చాసాం కాంచుకీయామహత్తరికావారాజ్ఞో న వేదయేయుర్దేవీభిః ప్రహితమితి. తదాదాయ రాజా నిర్మాల్యమాసాం ప్రతి ప్రాభృతికం దద్యాత్.అలంకృతశ్చ స్వలంకృతానిచాపరాహ్ణే సర్వాణ్యాంతఃపురాణ్యేకత్యేనపశ్యేత్. ౪.౨.౭౫.

అంతఃపురస్త్రీలయొక్క మాల్యానులేపనవస్త్రాదులను కంచుకిగానీ, మహత్తరికగానీ, తీసుకుని రాణులు పంపించారని చెప్పి రాజుకు సమర్పించాలి. రాజువాటినిపరిగ్రహించిఅంతకుముందుగా తాను

ధరించిఉన్న నిర్మాల్యాన్ని తనశరీరంనుంచి తీసియిచ్చి అనురాగాన్ని తెలియపరచడానికి పంపాలి. తరువాత తానుగూడా బాగుగా అలంకరించుకుని సాయంకాలసమయంలో అంతఃపురజనుల నందరినీ ఒక్కమాటుగా చూడాలి.

౯౮౪. తాసాం యథాకాలం యథార్హంచ స్థానమానా నువృత్తి స్సపరిహాసాశ్చ కథాః కుర్యాత్.

అటుతరువాత రాజు వారివారి కులాలను, వయస్సునుపట్టి యథావిధిగా గౌరవించాలి. ఇంకా వినోదాదులు గూడా వారితో జరపాలి.

౯౮౫. తదనంతరం పునర్భువ స్తథైవపశ్యేత్. ౪.౨.౭౭.

ఇలా కులస్త్రీ దర్శనం అయినతరువాత పునర్భువులను ఒక్కమాటుగా చూడాలి. వారివారికిగూడా అర్హతనుబట్టి గౌరవమివ్వాలి.

౯౮౬. తతో వేశ్యా ఆభ్యంతరికా నాటకీయాశ్చ.

ఆపైన అంతఃపురంలో ఉండేవేశ్యలను, నాట్యకత్తెలను యథార్హంగా చూచి గౌరవించాలి.

౯౮౭. తాసాం యథోక్తకక్షాణి స్థానాని. ౪.౨.౭౯.

పై అంతఃపురజనానికి నియమింపబడ్డ స్థానాలు చెవుతున్నారు. కులస్త్రీలకు అంతఃపురమధ్యప్రదేశమున్నూ, దానికి బయటగా పునర్భువుల వాసస్థానమున్నూ దానికిబయట వేశ్యలనివాసస్థానమున్నూ, దానికి బహిరంగాన నాటకీయల నివాసస్థానమున్నూ నిర్ణయించాలి.

౯౮౮. వాసకపాల్యస్తు యస్యావాసకో యస్యాశ్చాతీతో యస్యాశ్చ ఋతుస్తత్పరిచారికానంగతాదివాశయోర్థిత స్య రాజ్ఞస్తాభిః ప్రహితమంగుళీయక మనులేపన మృతువాసకంచ నివేదయేయుః. ౪.౨.౮౦.

వాసకం అంటే రాజులు అంతఃపురజనంతో రోజులవంతుప్రకారం నివసించడం. క్రమం తప్పకుండా తెలియపరిచేందుకు కొందరు పరిచారికలుంటారు. వాళ్లను వాసకపాలికలంటారు. మహత్తరికలన్నా వీరే. వాళ్లు పైరీతిగా రాజు అంతఃపురజనాన్ని దర్శించినతరువాత ఆయనను సమీపించి ఎవతెదగ్గరకు అదినాన నివసించడానికి వంతుదినమో, వ్యసనోత్సవాలచేత యెవ్వతె దగ్గర గడువునుమించి ఉండటం సంభవించదో, ఎవతెకు ఋతుసమయం సమీపించిందో, మొదలైనవివరాలన్నీ వాళ్లవాళ్ళ పరిజనంద్వారా గ్రహించి రాజు భుజించి మధ్యాహ్న నిద్రనుండి లేచినతరువాత రాజుగారికి నివేదించి అంతఃపుర జనంపంపిన అంగుళీయకమూ, అనులేపనమూ, అర్పించి ఆదినాన ఋతుసమయాన్నీ గడువుదినాన్నీ తెలియజెయ్యాలి.

౯౮౯. తత్ర రాజాయద్గృహ్ణీయాత్తస్యా వాసకమాజ్ఞాపయేత్. ౪.౨.౮౧.

ఇలా వాసకపాలికలు చెప్పినమీదట రాజు ఏ రాణిపంపిన ముద్దుటుంగరాన్ని, సుగంధద్రవ్యాన్ని గ్రహిస్తాడో ఆమెకు వాసకదినం. ఆమె పరిచారికద్వారా తెలియపరచాలి.

౯౯౦. ఉత్సవేషుచ సర్వాసామనురూపేణ పూజా, ఆపానకంచ సంగీత దర్శనేషుచ. ౪.౨.౮౨

ఉత్సవాలేమైనా సంభవించినప్పుడు పైవాసక పాలిత నియమా న్ని పాటించకుండా అంతఃపురజనాన్నంతటినీ యథార్థంగా గౌరవించవచ్చు. వాళ్ళందరితో పానగోష్ఠి జరపవచ్చు. సంగీతాదివినోదాలతో వినోదించవచ్చు.

౬౬౧-౬౬౨- అంతఃపురపరిచారిణీనాం బహిరనిష్క్రమో బాహ్యానాంచాప్రవేశః, అన్యత్రవిదితశౌచాభ్యః అపరిక్లిష్టశ్చ కర్మయోగ ఇత్యాంతఃపురికం. ౪.౨.౮౪.

ఇలాటి వినోదసభలు ప్రాప్తించినప్పుడు శౌచవిషయం తెలిసిన పెద్దమనుష్యులనుతప్ప నగరంలోనుంచి మరెవ్వరినీ ఆప్రదేశంలో చేరనియ్యరాదు. బయటజనాన్ని లోపలికి రానీయరాదు. నాయికలతో రతిక్రీడలు జరిపేసమయాల్లో ఏఅత్యాచారాన్నైనా పరిష్కరించడంలో క్లేశాన్ని చూపరాదు- అలాచూపితే మళ్ళీ ఆకార్యానికే ప్రయత్నిస్తారు.

౬౬3. భవంతి చాత్రశ్లోకాః—పురుషస్తు బహూన్దారాన్ సమాహృత్య సమోభవేత్, నచావజ్ఞాంచరేదాసు వ్యలీకాన్నసహేతచ. ౪.౨.౮౫.

ఇలాగే సామాన్యజనుడుకూడా పలువురుభార్యలు కలిగిఉండడం కద్దు.అలా బహుపత్నీకుడైనపురుషుడుతనఅందరుభార్యలందూ సమానప్రేమనే చూపించాలికాని ఒకతెను ఎక్కువగానూ, ఒకతెను తక్కువగానూ, చూడరాదు. వాళ్ళను గుణంలేదనీ, అందంలేదనీ, అవమానపరచరాదు. అపరాధాలు జరిగినప్పుడుమాత్రం సహించరాదు.

౯౯౮. ఏకస్యాంవా రతిక్రీడా, వైకృతం వాశరీరజం,విస్రం
భాద్వాప్యుపాలంభః తమన్యాసుపకీర్తయేత్.

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే భార్యాధికారికే
చతుర్థేఽధికరణే జ్యేష్ఠావృత్తం కనిష్ఠావృత్తం
ద్వితీయోఽధ్యాయః.

ఒక తెతో జరిపినరతాదులను ఎంతనమ్మకంగల నాయికైనా మఱిఒక్క తెతో చెప్పఁగూడదు. శరీరవికారాన్నిపట్టి ఒకరికి కలిగిన గుహ్యావికారాన్ని మఱిఒక తెకు చెప్పకూడదు. అలా చెవితే స్త్రీలు నాయకునివిషయంలో విరక్తిని చెందుతారు.

ఇలా భారద్వాజ గోత్రుడున్నూ, యజుశ్శాఖీయు
డున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల
ఆంజనేయమూర్తిచేత వాత్స్యాయన కామసూత్ర
ములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయ
బడిన'రతిరేఖ'అను తెలుగువ్యాఖ్యలోని
భార్యాధికారికం అనే నాలుగో
అధికరణంలో రెండవ
అధ్యాయం ముగిసింది.



శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

౫. పారదారికాధికరణం

### ౧ స్త్రీపురుషశీలావస్థాపనాధ్యాయం

౯౯౫. వ్యాఖ్యాతకారణాఃపరపరిగ్రహోపాయాః. ౫.౧.౧.

కన్యక, పునర్భుఅనే యిద్దరునాయికలనూ పొందడాని కుప యోగించే ఉపాయాలు విపులంగా ఇదివరకే చెప్పబడ్డాయి. వేశ్యవల్ల లభ్యమయ్యేది కామంమాత్రమే. పరదారవల్ల అర్థమూ, కామమూకూడా లభిస్తాయి. అందువల్ల వైశికాధికరణంకంటె ముందుగా పారదారికాధికరణాన్ని చెపుతున్నారు. స్త్రీపురుషుల స్వభావాలను నిరూపించకుండా ఆతరువాతవిషయాలను చెప్పడం అయుక్తం గనుక ముందుగా స్త్రీపురుషస్వభావాలను నిరూపిస్తున్నారు. పరస్త్రీలతో సంగమించడానికి కామసుఖంగానీ, పుత్రసుఖంగానీ కారణం గాకుండా వేరేకారణా లుంటాయని పూర్వం నాయికావిమర్శలో చెప్పేఉన్నారు.

౯౯౬. తేషు సాధ్యత్వమనత్యయం గమ్యత్వమాయతిం
వృత్తిం చాదితఏవ పరీక్షేత. ౫.౨.౨.

ఆపరస్త్రీలతో గమనం చెయ్యడానికి ముందుగా ఈమె సాధిం చతగినదేనా? ఒకవేళ సాధిస్తే అపాయంలేకుండా లభ్యపడు తుందా? ఒకవేళ అలా లభ్యపడినా కుష్ఠూ, ఉన్మాదమూ, మొదలైనరోగాలేవీలేకుండా సంగమించడానికి యోగ్యురా లేనా? ఒకవేళ యోగ్యురాలైనా ఈమెతో సంగమిస్తే ఏదన్నా లాభండుంటుందా? అని బాగా విచారించాలి.

౯౯౭. యదాతు స్థానాత్ స్థానాంతరం కామం ప్రతిపద్య మానం పశ్యేత్తదా ఆత్మశరీరోపఘాతత్రాణార్థం పరపరిగ్రహానభ్యుపగచ్ఛేత్. ౫.౧.౩.

ఒకపురుషుడు ఎవతెనైనా ఒకస్త్రీని చూచినప్పుడు ఆమెతో సంభోగించాలనే కోరికరూపమైన కామితం అనే కామం పుడుతుంది. దాన్ని ఒకదశనుంచి మరొకదశకు మారుతున్న ట్లుగా గుర్తించినప్పుడు ఆపురుషుడు తనశరీరాపాయాన్నుంచి తప్పించుకోడంకోసం పరస్త్రీగమనం చెయ్యాలి.

౯౯౮. దశతు కామస్థానాని. ౫.౧.౪.

కామం అనేది హృదయంలో పుట్టకుండానేఉండాలిగాని పుట్టిన దంటే ఆక్షణంనుంచీ సుఖప్రాప్తికోసం అనుకూలం దొరికిన కొలదీ క్షణక్షణమూ వృద్ధిపొంది ప్రాణత్యాగం వరకూ మానవుణ్ణి వదలదు. ఆకామం అనేకవిధాలైన చేష్టలను చేయి స్తుంది. కనుక వ్యవహారంకోసంపదిస్థానాలు ప్రాచీనాచార్యుల చేత చెప్పబడ్డాయి. ఇక్కడ స్థానాలంటే మన్మథావస్థలన్న మాట.

౮౮. చక్షుః ప్రీతి ర్మనస్సంగస్సంకల్పోత్పత్తిర్నిద్రాచ్ఛే
దః తనుతా విషయేభ్యోవ్యావృత్తిః లజ్జాప్రణాశః
ఉన్మాదః మూర్ఛా మరణమితి తేషాం లింగాని.

అవస్థానాలకు చక్షుఃప్రీతి, మనస్సంగమూ, సంకల్పోత్పత్తీ, నిద్రాచ్ఛేదమూ, తనుతా, విషయేభ్యోవ్యావృత్తి, లజ్జాప్రణాశమూ, ఉన్మాదమూ, మూర్ఛా, మరణమూ అనిపేర్లు. ఒక స్త్రీని చూచినప్పుడు సంభోగిద్దామనేకోరిక పుట్టినతరువాత అతనిదృష్టులు ఆమెయందు లగ్నమౌతాయి. దాన్నే చక్షుః ప్రీతిఅంటారు. అటుతరువాత ఆస్త్రీయందు మనస్సు బాగా లగ్నమవుతుంది దాన్ని మనస్సంగంఅంటారు. అటుతరువాత ఆమెను ఎలాపొందుతాను? ఒకవేళ పొందగలిగితే "ఇలా చేస్తాను, అలాచేస్తాను" అని ఊహలు కల్పించుకుంటాడు మానవుడు. దాన్ని సంకల్పోత్పత్తి అంటారు. ఈఆలోచనలవల్ల నిద్రభంగం అవుతుంది. నిద్ర ఎప్పుడులేకపోయిందో అప్పుడు ఆరోగ్యంచెడి చిక్కిపోవడం సాగిస్తాడు. దాన్నే తనుత అంటారు. ఎప్పుడూ ఆఆలోచనలే మనస్సులో ఉండడంచేత ఇతరపనులనుండి విరమించడం జరుగుతుంది. దాన్నే విషయేభ్యోవ్యావృత్తిఅంటారు. అటుతరువాత సిగ్గూ, ఎగ్గూ విడిచి పెడతారు. దాన్నే లజ్జాప్రణాశం అంటారు. సిగ్గు ఒదిలినవెంటనే పిచ్చి యేర్పడుతుంది. దీన్నే ఉన్మాదం, లేక, పిచ్చి అంటారు. ఈపిచ్చివల్ల మూర్ఛ యేర్పడుతుంది. దానివల్ల మరణం ప్రాప్తిస్తుంది. ఆమరణంతో కామంగూడా నిష్ఫలకమైనను మసి చేసి తాను మాయమైనట్లు మాయమౌతుంది.

౧౦౦౦. తత్రాకృత్రిమో లక్షణతశ్చ యువత్యా శ్శీలం, సత్యం, శౌచం, సాధ్యతాం, చండవేగతాంచ లక్ష యేదిత్యాచార్యాః. ౫.౧.౬.

ప్రేమపూర్వకంగాచేసే స్త్రీగమనంలో ఆస్త్రీయొక్క ఆకారాన్నిపట్టీ, లక్షణాలనుపట్టీ మంచిస్వభావం కలది ఔనాకాదా? నిజం మాట్లాడుతుందా? అబద్ధం మాట్లాడుతుందా? చరిత్ర శుభ్రమైనదా? సాధించతగినదౌనా? కాదా? మొదలైన అనుకూలాలన్నిటినీ పరీక్షించి చూచుకోవాలి. అని ప్రాచీనాచార్యు లన్నారు.

౧౦౦౧. వ్యభిచారాదాకృతిలక్షణయోగానింగితాకారాభ్యామేవ ప్రవృత్తిర్బోద్ధవ్యా యోషిత ఇతి వాత్స్యాయనః. ౫.౧.౭

మంచిఆకారమూ, మంచిలక్షణాలూ, ఉన్నంతమాత్రంచేత అక్కడే తప్పనిసరిగా శీలమూ, సత్యమూ, శౌచమూ మొదలైన మంచిలక్షణాలుగూడా ఉంటాయని అనుకోడానికి వీలు లేదు. సాధించతగినదా? కాదా? చండవేగం కలదా? మందవేగం కలదా? అనేవి ఎలాతెలుసుకోడం? అంటే స్త్రీయొక్క అభిప్రాయసూచకాలైన చేష్టలవల్లా ఆకారంవల్లా తెలుసుకోవాలి. అని వాత్స్యాయను లన్నారు.

౧౦౦౨. యంకంచి దుజ్జ్వలం పురుషం దృష్ట్వా స్త్రీకామయతే, తథా పురుషోఽపి యోషితం అపేక్షయాతు నప్రవర్తతే ఇతి గోణికాపుత్రః. ౫.౧.౮.

సాధారణంగా స్త్రీవ్యక్తి అందగాడైన పురుషుణ్ణి ఎవణ్ణి చూచినా అనురాగాన్ని పూనుతుంది. అలాగే పురుషుడుగూడా అందకత్తెయైన స్త్రీనిచూచి అనురాగాన్ని పూనుతాడు. అపేక్షించనియ్యండి. ఇది యేకార్యాన్నో అపేక్షించి సంయోగాన్ని కూర్చడంలేదు. ఆ స్త్రీపురుషు లిద్దరూ కలియబోతున్నారా? లేదు. ఇలా గోణికా పుత్రులన్నారు.

౧౦౦౩. తత్రస్త్రియం ప్రతి విశేషః. ౫.౧.౯.

స్త్రీపురుషులిద్దరూ సమానమైనశీలం కలవారైనా స్త్రీలవిషయంలోమాత్రం ప్రత్యేకించి ఒకవిశేషం ఉన్నది.

౧౦౦౪-౧౦౧౦. నస్త్రీధర్మం అధర్మంచ ప్రవర్తతే, కామయతఏవ, కార్యాపేక్షయాతు నాభియుంక్తే, స్వభావాచ్చ పురుషేణాభియుజ్యమానాచికీర్షంత్యపివ్యావర్తతే, పునఃపునరభియుక్తాసిధ్యతి. పురుషస్తు ధర్మస్థితిమార్యసమయంచ అపేక్ష్య కామయమానోఽపి వ్యావర్తతే. తథాబుద్ధిశ్చాభియుజ్యమానోఽపి నసిధ్యతి. నిష్కారణమభియుంక్తే. అభియుజ్యాపిపునర్నాభియుంక్తే. సిద్ధాయాంచ మాధ్యస్థ్యంగచ్ఛతి. సులభామవమన్యతే. దుర్లభామాకాంక్షతే ఇతి ప్రాయోవాదః. ౫.౧.౧౬.

స్త్రీధర్మాన్నిగానీ, అధర్మాన్నిగానీ అపేక్షించకుండా అజ్ఞానస్వభావంచేత 'ఒంటరిపాటున పొందతగినవాడు సందర్భపడితే సంగమింపగోరుతుంది. కాని ఏపనినో అపేక్షించి తొందర

పాటును సూచిస్తే తనయందు నిందమోపబడుతుందని సంగ మించడానికి సాహసించదు. ఇలాటి మానసికదోషం ఉన్నా శీలం చెప్పబడ్డది కొందరుస్త్రీలకు. ఒకపురుషునితో సంగమిం చాలని కోరుతూకూడా స్వభావసిద్ధంగా పురుషుడు సంగమించ డానికి సమీపించినప్పుడు విముఃఖురాలౌతుంది. అటుతరువాత మాటిమాటికీ నాయకుడు సంగమానికి ప్రేరేపిస్తే సంగ మిస్తుంది. ఇలా పలుమార్లు పురుషుడు కామించడంవల్ల సంగ మించడానికి ఒప్పుతుంది ఒక్కొకప్పుడు. ఇకపురుషుడో? ఏస్త్రీ నైనా సంభోగించడానికిఅపేక్షిస్తున్నా, ధర్మమార్గాన్నీ, పెద్దల ఆచారాన్నీ, గమనించిసాధారణంగా సంయోగానికి సిద్ధపడడం లేదు. ఇది కనిపించీ కనిపించని దోషంగల శీలం. అలా ధర్మాన్నీ, పెద్దలఆచారాన్నీ గమనించి స్త్రీచేత కోరబడీ కూడా సంగమించడు. ఒక్కొక్కప్పుడు ఏ కారణమూ, ఏఅభి లాషా లేకుండానే స్త్రీతో సంగమిస్తాడు. ఒక్కొక్కప్పుడు మళ్ళీ సంగమించనే సంగమించడు. ఒక్కొక్కప్పుడు స్త్రీ తనం తటతాను సిద్ధపడితే ఆట్టే అపేక్షలేకుండా మధ్యస్థంగా ఆమెతో సంగమిస్తాడు. సులభంగా తనంతటతాను సిద్ధురా లయే స్త్రీని అవమానపరుస్తాడు. తనకు లభ్యపడని స్త్రీ కోసం వ్యసనపడతాడు. ఇది సామాన్యంగా లోకంలో ప్రచా రంలో ఉన్నవాదం.

౧౦౧౧-౧౦౩౭. తత్రవ్యావర్తనకారణాని, పత్యావనురాగః

అపత్యాపేక్షా, అతిక్రాంతవయస్త్వం, దుఃఖాభి

భవః, విరహానుపలంభః, అవజ్ఞయావ మంత్ర

యత ఇతి క్రోధః, అప్రతర్క్య ఇతి సంకల్పసజ్జనం, గమిష్యతీ, త్యనాయతి, రన్యత్ర వ్యాసక్తమితిచ, అసంవృతాకార ఇత్యుద్వేగః. మిత్రేషు నిసృష్ట భావ ఇతి తేష్వపేక్షా, శుష్కాభియోగీత్యా శంకా, తేజస్వీతిసాధ్వసం, చండవేగస్సమర్థో వేతి మృగ్యాభయం, నాగరకః కలాసువిచక్షణ ఇతి వ్రీడా. సఖిత్వేనోపచరిత ఇతిచ- అదేశ కాలజ్ఞ ఇత్యసూయా, పరిభవస్థాన మిత్యబహు మానః. ఆకారితోఽపి నావబుధ్యత ఇత్య వజ్ఞా, శశోమంద వేగ ఇతిచ హాస్తిన్యాః, మత్తోఽస్య మా భూదనిష్టమిత్యనుకంపా, ఆత్మ నిదోషదర్శనాన్నిర్వేదః, విదితాసతీస్వజనబహి ష్కృతాభవిష్యామీతిభయం, పలిత ఇత్య నాదరః, పత్యాప్రయుక్తః పరీక్షితు మితి విమ ర్శః. ధర్మాపేక్షా చేతి. 5.1.32

పైసూత్రంలో స్త్రీపురుషుల శీలాలను నిరూపించారు. స్త్రీలు పురుషులమీద అపేక్షఉన్నా ఎందుకు విముఖులౌతారో వాటి కారణాలను ఇక్కడ చెవుతున్నారు. తనభర్తయందు గాఢమైన అనురాగం ఉండడమూ, తనపవిత్రమైన సంతానం క్షేమంగా ఉండాలనే అపేక్షా, ఏనో ఏళ్ళుగడిచినదాన్నిగదా? ఇంకా ఎందుకీతుచ్ఛవ్యవహారాలనే విరక్తీ, తనఆప్తులు చనిపోయా రనే మితిమీరిన దుఃఖమూ, తనభర్తతో యెప్పుడూ ఎడ బాటు కలుగకపోవడమూ, నన్ను అవమానపరచడానికి ఆలో

చిస్తున్నాడనే కోపమూ, ఇతనిహృదయం అర్థంకాదని సంగమిస్తామనే అభిలాషను మరల్చుకోడమూ, ఎక్కువకాలం సమీపంలో ఉండకుండా ఎక్కడికో వెళ్ళిపోతున్నాడు. మరి ఒకస్త్రీమీద మోజుపడ్డాడని ఊహించడమూ, ఇతనితో సంగమిస్తే ఆసంగమించిన లక్షణాలను దాచుకోలేక నన్ను బయటపెడతాడుఅనేభయమూ, స్నేహితు లెలాచెపితే అలా వినేవాడుగనుక తనను వారిమాటలవల్ల అవమానపరుస్తాడేమోనని సందేహమూ, కారణంలేకుండానే గుట్టితనంగా ఏస్త్రీతోనైనాసరే సంగమిస్తాడనే సందేహమూ, ఏదైనా పొరపాటు జరిగితే ఇతడు పౌరుషవంతుడు గనుక క్షమించకుండా అనర్థాన్ని కల్పిస్తాడేమోనని భయమూ, నేను మృగినాయికను ఇతడు చండవేగుడు అనిగానీ, చాలాసమర్థుడనిగానీ భయపడడమూ, ఇతడు నాగరకులలో శ్రేష్ఠుడు, కళలన్నింటిలోనూ నేర్పుకలవాడు. నేనీయనకు సరిపడనని సిగ్గూ, నన్ను చెల్లెలుగా ప్రేమిస్తున్నాడు అనేభావమూ, ఇతడు దేశకాలాలను తెలిసి ప్రవర్తించలేడని అసూయా, ఇతడు నాకు శత్రుపక్షంలోవాడనే తృణీకారభావమూ, భావాన్ని తెలియపరచినా తెలుసుకోలేని మందమతి అని తిరస్కారభావమూ, నేనుహస్తినీనాయికనుగదా? ఇతడు మందవేగుడైన శశజాతి నాయకుడు, నాకెందుకూ పనికిరాడని లెక్కచెయ్యకపోవడమూ, ఇతడు చాలా మత్తెక్కిఉన్నాడు,ఇతనికి అనిష్టం కలుగకుండుగాక యని దయా, తనయందు దోషమున్నదని విరక్తీ, ఒకవేళ బయటపడితే బంధువులు బహిష్కరిస్తారనిభయమూ ముసలివాడని అనాదరమూ, భర్త నాశీలాన్ని పరీక్షించడం,

కోసం పంపాడేమో అని లోచనా; అయ్యో! పవిత్రమూ, ధర్మపూరితమూ అయిన ఇంతచరిత్రనూ ఇతనితో కలిసి భస్మంచేసుకోనా? అనే ధర్మబుద్ధీ, ఇవన్నీ స్త్రీలు పరపురుషుల యందు అపేక్షఉన్నా విముఖులయే కారణాలు.

౧౦_౨౮. తేషు యదాత్మని లక్షయేత్తదాదితఏవ పరిచ్ఛిం
ద్యాత్. ౫.౧.౩౩.

పరస్త్రీని కామించే పురుషుడు ఆమె తనయందు విముఖుడు కావడానికి ఏమైనా కారణాలున్నాయా? అని విచారించుకుని తొలగించుకోవాలి.

౧౦ ౨౯-౧౦౩౫. ఆర్యత్వయుక్తాని రాగవర్ధనాత్. అశక్తి జా
న్యుపాయ ప్రదర్శనాత్, బహుమానకృతాన్య
తి పరిచయాత్, పరిభవకృతాన్యతి శౌండీర్యా
ద్వైచక్షణ్యాచ్చ. తత్పరిభవజాని ప్రణత్యా భ
యయుక్తాని ఆశ్వాసనాదితి. ౫.౧.౩౪.౩౯.

ఇంకా స్త్రీయందున్న ధర్మపూరితాలైన ఊహలనే అడ్డంకు లను అనగా భర్తయందలి లోకోత్తరమైన అనురాగమూ, సం తానంమీది అపేక్షా, వృద్ధురాలినిగదా అనేదుఃఖమూ, అప్పు లుచాలామంది పోయినారనే దుఃఖమూ, ధర్మబుద్ధీ మొదలైన వాటిని తన అనురాగాన్ని ఎక్కువగా ప్రదర్శించి తొలగిం చాలి. ఈపైనచెప్పిన స్త్రీయొక్క వైముఖ్యకారణాలు మంచి స్వభావంగల స్త్రీయందు తప్పకుండా ఉంటాయి.

౧౦౩౬. పురుషాస్త్వమీ ప్రాయేణసిద్ధాః కామసూత్రజ్ఞః,
కథాఖ్యానకుశలః, బాల్యాత్ప్రభృతి సంసృష్టః,

పరివృద్ధయౌవనః, క్రీడనకర్మాదినా ఆగతవిశ్వాసః, ప్రేషణస్యకర్తా, ఉచితసంభాషణః, ప్రియస్యకర్తా, అన్యస్యభూతపూర్వోదూతో మర్మజ్ఞః ఉత్తమయా ప్రార్థితః, సఖ్యాప్రచ్ఛన్నం సంసృష్టః,సుభగాభిఖ్యాతః, సహసంవృద్ధః, ప్రాతివేశ్య కామశీలః, తథాభూతశ్చ పరిచారకః,ధాత్రేయికాపరిగ్రహః,నవవరకః, ప్రేక్షోద్యానత్యాగశీలః, వృషఇతిసిద్ధ ప్రతాపః, సాహసికః, శూరః, విద్యారూపగుణోపభోగైః పత్యు రతిశయితా, మహార్హ వేషోపజారశ్చేతి.

పైనచెప్పినవిధంగా స్త్రీలయొక్క శీలాన్ని గుర్తించి అటుతరువాత తనయొక్క సిద్ధత్వగుణాన్ని చూచుకోవాలి. అలావిచారించుకోకపోతే సంయోగం సంభవించదుకాబట్టి ఇక్కడస్త్రీల విషయంలో సిద్ధులమే పురుషులను చెవుతున్నారు. ఇక్కడ చెప్పబడేవారు సాధారణంగా స్త్రీలవిషయమై సిద్ధులవుతారు. ఈకామసూత్రాలు తెలుసుకున్నవాడూ, ఎక్కువగా కథలు చెప్పేవాడూ, వీరిద్దరూ సాధారణంగా కామస్వభావం కలిగి ఉంటారు గనుక స్త్రీలవిషయమై సిద్ధులవుతారు. ఇంకా ఇరుగూపొరుగూ ఇంట్లోఉండి చిన్నతనంనుంచీ రాకపోకలు జరుపుతూ ఏస్త్రీలతో బాగా పరిచయాన్ని సాధించి కలిసిమెలిసి ఉంటాడో వాడుగూడా స్నేహాన్ని వృద్ధిపొందించుకున్నవాడు గనుక ఆస్త్రీవిషయమై సిద్ధుడౌతాడు. ఇంకా నూతనంగా యవ్వనాన్ని పొందినవాడూకూడా యవ్వనప్రాభవం వల్ల సిద్ధుడౌతాడు. ఏపురుషుడు ఆటలూ మొదలైనకర్మలద్వారా

ఏస్త్రీలవల్ల మెప్పును పొందాడో ఆపురుషుడు ఆస్త్రీలవిషయం లో సిద్ధుడౌతాడు. ఏపురుషుడు ఏస్త్రీలకు అనుకూలంగాఉండి వారుచెప్పినపనులను చేసిపెడుతూఉంటాడో ఆపురుషుడు ఆస్త్రీ లకు సిద్ధుడౌతాడు. ఔచిత్యాన్ని గమనించి మాట్లాడేవాడు ఏ నిర్బంధమూ ఉండదుగనుక స్త్రీలకు సిద్ధుడౌతాడు. ఏస్త్రీయొ క్క యిష్టాన్ని యేపురుషుడు సాధించిపెడతాడో ఆస్త్రీకిఆపురు షుడు సిద్ధుడౌతాడు. ఏపురుషుడు ఏస్త్రీకి పూర్వంమరొకపురుషు నితో కూర్చడానికి దౌత్యాన్నిజరిపి ఆమెకు ప్రియాన్ని చేకూ ర్చాడో ఆదూతకూడా ఆమెకు సిద్ధుడే. ఏపురుషుడు ఏస్త్రీ యొక్క రహస్యాలను తెలుసుకుని ఉంటాడో ఆపురుషుడు ఆ స్త్రీకి సిద్ధుడౌతాడు. ఏపురుషుడు ఉత్తమస్త్రీచేత మిక్కిలిగా ప్రార్థించబడతాడో ఆపురుషుడు ఆఉత్తమస్త్రీకి సిద్ధుడౌతాడు. ఏపురుషుడు ఏస్త్రీయొక్క చెలికత్తెతో సంగమిస్తాడో ఆపురు షుడు ఆస్త్రీకి కూడా సిద్ధుడౌతాడు. అందగాడని ప్రఖ్యాతి పొందిన పురుషుడుకూడా స్త్రీలకు ఒక్క కభురుతో సిద్ధు డౌతాడు. ఏపురుషుడు ఏస్త్రీతో కలిసి ఒకయింట్లో పెరుగు తాడో ఆపురుషుడు ఆస్త్రీకి సిద్ధుడౌతాడు. సహజంగా కామ స్వభావంగల పురుషుడు గూడా స్త్రీ కబురంపితే ఆమెకు సిద్ధు డౌతాడు. కామస్వభావంగల పురుషుడు ఏస్త్రీకి పరిచారకుడు గాఉంటాడో ఆపురుషుడు ఆస్త్రీకి సిద్ధుడౌతాడు. ఏపురుషుడు ఏస్త్రీయొక్క దాదిని పెండ్లాడతాడోఆపురుషుడుఆస్త్రీకి కూడా సిద్ధుడౌతాడు. ఏఇంటికి ఏపురుషుడు క్రొత్త అల్లుడో ఆపురుషుడు ఆయింటిలోని స్త్రీలకందరకూ సిద్ధుడౌతాడు. నాటకాలూ,

నృత్యాలూ, ఎక్కువగా చూడబోయేవాడూ, ఉద్యాన క్రీడ యందు ఆసక్తి కలవాడూ, డబ్బు బాగా దుర్వినియోగం చేసే వాడూ, ఈముగ్గురూ కామప్రవృత్తి కలవాళ్లు గనుక స్త్రీలకు సిద్ధులౌతారు. ఎవడు పౌరుషవంతుడని పేరు మోగాడో ఆ పురుషుడుగూడా స్త్రీలకు సిద్ధుడే. సాహసం కలవాడుగూడా స్త్రీలకు సిద్ధుడే. శూరుడు ఎటూ భయంలేనివాడుగనుక స్త్రీల యందు సిద్ధుడు. అతడు ఎప్పుడూ స్త్రీలను కోరుతూనే ఉం టాడు. ఏపురుషుడు ఏస్త్రీయొక్క భర్తకంటె విద్య మొదలైన వాటిలో గొప్పవాడుగా ఉంటాడో ఆపురుషుడు ఆస్త్రీకి సిద్ధు డౌతాడు. గొప్పవేషమూ, డాంబికమూ, కలవాడుగూడా స్త్రీలవిషయమై సిద్ధుడే. పైన చెప్పబడినవారంతా స్త్రీలకు సిద్ధులయే పురుషులు.

౧౦3౭-౧౦౪౮. యథాత్మనస్సిద్ధతాంపశ్యే దేవంయోషితోప్య యత్నసాధ్యతా మిత్యయత్నసాధ్యాయోషిత ఉచ్యంతే. యోషితస్త్వమా అభియోగ మా త్రసాధ్యాః- ద్వారదేశావస్థాయినీ, ప్రాసాదా ద్రాజమార్గావలోకినీ, తరుణప్రాతివేశ్యగృహే గోష్ఠీయోజినీ, సతతప్రేక్షణప్రేక్షితా, పార్శ్వ విలోకినీ, నిష్కారణం సపత్న్యాభివిన్నా, భ ర్తృద్వేషిణీ, విద్విష్టాచ, పరిహారహీనా, నిర పత్యా, జ్ఞాతికులనిత్యా, విపన్నాపత్యా, గోష్ఠీ యోజినీ, ప్రీతియోజినీ, కుశీలవభార్యా, మృతపతికాబాలా, దరిద్రా, బహూపభోగా,

> జ్యేష్ఠభార్యా, బహుదేవరికా, బహుమానినీ, న్యూవభర్తృకా, కౌశలాభిమానినీ, భర్తుర్మౌర్ఖ్యేణోద్విగ్నా, అవిశేషజ్ఞతయా లోభేవయుక్తా, కన్యాకాలే యత్నేన వారితా, కథంచిదలబ్ధాభియుక్తాచ, సాతదానీం సమాన బుద్ధిశీల మేధాప్రతిపత్తిసాత్మ్యా, తుల్యరూపాభి శ్చాధరీకృతా ప్రోషితపతికా, ఈర్ష్యాళుపూతి చోక్షక్లీబదీర్ఘసూత్రకాపురుష కుబ్జ వామన విరూప మణికార గ్రామ్య దుర్గంధి రోగి వృద్ధ భార్యా శ్చేతి. ౫.౧.౫౨.

ఈక్రిందచెప్పబోయేస్త్రీలు సూచనామాత్రంచేతనే పైపురుషులవలె సిద్ధపడతారు. ఆస్త్రీలను ఇక్కడ చెవుతున్నారు. ఏస్త్రీలు సూచనామాత్రాన్నపేక్షిస్తారో ఆస్త్రీలు ప్రయత్నంగూడా లేకుండానే లభిస్తారు. బజారులో ఒచ్చేపోయే పురుషులను చూద్దామనే కోరికతో తలవాకిట్లోనిలిచే స్వభావం కలదీ, మేడఎక్కి రాజమార్గాన్ని పరిశీలించేదీ, యువకులైన పురుషులు ఎక్కడఉంటారో అనైపు వెట్టిగా చూచేదీ, ఇరుగు, పొరుగూ ఇండ్లలో స్త్రీలగోష్ఠులలో చేరేదీ, పురుషులకు సులభంగా లభ్యపడుతుంది. తాను మార్గానపోతూ తన్నెవరైనా చూస్తున్నారా? అని వెనుకవైపునా ప్రక్కలా చూస్తూ పోతూఉండేదీ, మందమతిగానీ, దుస్స్వభావంగానీ లేకపోయినా సవతిపెత్తనానికి పాల్పడినదీ, గుణవంతుడైనా భర్తను ద్వేషించేదీ, భర్తచేత ద్వేషింపబడేదీ, అంటూ సొంటూ లేనిదీ,

సంతానంలేనిదీ, పుట్టినింట్లో ఎప్పుడూ నివసించేదీ, భర్తవల్ల అల్పాయుష్కసంతానాన్ని పొందినదీ, గోష్ఠులను సమకూర్చేదీ, పరపురుషులతో ప్రేమసంభాషణలు చేసేదీ, నటులూ, నర్తకులూ, మొదలైనవాళ్ల స్త్రీలూ, బాల్యంలో భర్తను ఎడబాసినదీ, దరిద్రురాలూ, ఎక్కువ భోగాన్నికోరేదీ, పెద్దభార్యా, ఎక్కువమంది మరుదులున్నదీ, భర్తను తనకు తగనివాడని తలచేదీ, కళలయందు పరిజ్ఞానమూ, అభిలాషా కలదీ, మూర్ఖుడైన భర్తను పెండ్లాడినదీ, పురుషులకు యత్నంలేకుండా సిద్ధలౌతారు. కన్యగా ఉండగా ఒకనాయకునిచేత వరింపబడి దైవయోగంచేత మరిఒకనికి భార్యఅయిన స్త్రీ గూడా మొదటిపురుషునికి సాధ్యపడుతుంది. బుద్ధిలోనూ, శీలంలోనూ, తెలివితేటలలోనూ, కార్యదీక్షలోనూ, దేశాచారాలలోనూ, హృదయాభిలాషలలోనూ ఏనాయకునితో సమానురాలుగా ఉంటుందో ఆనాయిక అతనికి సాధ్యురాలు అవుతుంది. ఏ స్త్రీ భావసిద్ధంగా ఎవనిమీద పక్షపాతం కలిగి ఉంటుందో ఆస్త్రీ అతనికి సాధ్యురాలే. దోషం లేకుండా భర్తచేత అవమానపడిన స్త్రీ గూడా పరపురుషులకు యత్నం లేకుండా లభ్యపడుతుంది. సవతులలో నీచంగా చూడబడేదీ, భర్త దేశాంతరంలో ఉన్నప్పుడు వ్రతాన్ని అతిక్రమించినదీ, పరునికి లభ్యపడుతుంది. ఎవడు నిష్కారణంగా ఈర్ష్యకలిగి ఉంటాడో అతనిభార్యకూడా పరునికి లభ్యపడుతుంది. తలా, ఒళ్లూ, గుడ్డలూ మాసి దుర్వాసన వేస్తూ శుచిలేకుండా ఉండేవానిభార్య అతన్ని అసహ్యించుకుని పరుణ్ణి కోరుతుంది. చోక్ష

అనే జాతివాని భార్యా, నపుంసకుని భార్యా, బద్ధకస్థుని భార్యా, కపటపరుని భార్యా, పొట్టివాని భార్యా, గూనివాని భార్యా, కురూపి భార్యా, మణులు తయారుచేసేవాని భార్యా, విద్యా విజ్ఞానాదులు లేనివాని భార్యా, దుర్గంధం కలవాని భార్యా, రోగి భార్యా, వృద్ధుని భార్యా, ఈస్త్రీలు పరపురుషులకు ప్రయత్నంలేకుండా లభ్యపడతారు.

౧౦౪౬-౧౦౪౭. శ్లోకావత్ర భవతః—ఇచ్ఛా స్వభావతో
జాతా, క్రియయా పరిబృంహితా। బుద్ధ్యా
సంశోధితోద్వేగా స్థిరా స్యాదనపాయినీ,
సిద్ధతా మాత్మనోఽజ్ఞాత్వా। లింగాన్యన్నీయ
యోషితాం। వ్యావృత్తికారణోచ్ఛేదీ। నరో
యోషిత్సుసిద్ధ్యతి. ౫.౧.౫౩-౫౪.

ఇతి శ్రీవాత్స్యాయనీయే కామసూత్రే పారదారికే
పంచమేఽధికరణే స్త్రీపురుష శీలావస్థాపనం,
వ్యావర్తనకారణాని, స్త్రీషుసిద్ధాః
పురుషాః, అయత్నసాధ్యాయో
షితః ఇతి ప్రథమోఽధ్యాయః.

రూపవంతుడైనవాణ్ణి ఎవణ్ణైనా చూచినప్పుడు స్త్రీలకు కామం సహజంగానే కలుగుతుంది. అది పరిచయాదులవల్ల వృద్ధిపొంది బుద్ధిబలంచేత శోధింపబడి ఉద్వేగాన్ని కల్పించి చిట్టచివరకు అపాయంలేకుండా సిద్ధిని సమకూరుస్తుంది. కాబట్టి పురుషుడు తనసిద్ధత్వగుణాలను చూచుకుని, స్త్రీల

యొక్క అనుకూల లక్షణాలను పరీక్షించుకుని వారు తననుండి విరక్తులయే కారణాలను నివారించుకుని ప్రవర్తిస్తే అతనికి స్త్రీలు లభ్యలవుతారు.

ఇలా భారద్వాజ గోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయమూర్తి చేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలో పారదారికమనే అయిదో అధికరణంలో ప్రథమాధ్యాయం ముగిసింది.



శ్రీ

# వాత్స్యాయనీయం

రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

---

౫. పారదారికాధికరణం

౨ పరిచయకారణాధ్యాయం

౧౦౪౮. యథాకన్యా స్వయమభియోగ సాధ్యా న తథా దూత్యా, పరస్త్రియస్తు సూక్ష్మభావాగి దూతీ సాధ్యాః, నతథా త్మనేత్యాచార్యాః ॥౫.౨.౧.

పై అధ్యాయంలో పరిచయంవల్ల కామేచ్ఛ వృద్ధిపొందుతుం దని చెప్పిఉన్నారు. ఆపరిచయవిషయాన్ని ఇక్కడ ప్రదర్శిస్తు న్నారు. కన్యక, పరభార్య అనే స్త్రీలిద్దరూ పరిచయంవల్ల సాధించతగినవాళ్ళు. ఆపరిచయంగూడా స్వయంగా కల్పించు కునేదీ, దూతికద్వారా కుదుర్చుకునేదీ అని రెండురకాలు. కన్యకలు సంయోగాన్ని అంతకుపూర్వం ఎరుగనివాళ్ళు గనుక వాళ్ళయందు పరిచయం సాధారణంగా యుక్తిచేత సాధించ తగి ఉంటుంది. ఆయుక్తులనుగూడా నాయకుడు స్వయంగానే ప్రయోగించడానికి సమర్థుడౌతాడు. దూతికద్వారా పరిచ యాన్ని నడపరాదు. ఆకన్యకను వివాహం చేసుకోదలచిన వాడు తనంతటతానే ఆమెతో పరిచయం చేసుకోవాలనిభావం.

ఇక పరస్త్రీసంయోగాన్ని అనుభవిస్తూ ఉన్నది గనుక ఆమెకు పరపురుషుని దర్శనమే సంభవించడం కష్టం. భర్త అధీనంలో ఉండడమే దీనికి కారణం. అలాటి స్త్రీవ్యక్తికి పరపురుషుడు తనభావాన్ని యెలా తెలియపరచడం సంభవిస్తుంది? దూతికద్వారా ఈరెండూ సంభవిస్తాయిగనుక పరస్త్రీ దూతికద్వారానే సాధ్యం అవుతుంది. ఇది ప్రాచీనాచార్యుల మతం.

౧౦౪౯. సర్వత్రాశక్తివిషయే స్వయంసాధన ముపపన్నతరం దురుపపాదత్వాత్తస్య దూతీప్రయోగ ఇతి వాత్స్యాయనః. ౫. ౨. ౨.

నాయకుడు స్వయంగా పరిచయాన్ని సంపాదించగలిగితే కన్యకతోనూ, పరస్త్రీతోనూగూడా ఆపద్ధతినే అనుసరించడం చాలామేలు. అలా పరిచయం కుదరడానికి అవకాశం ఉండదనితోచినప్పుడు దూతికద్వారా పరిచయాన్ని సాధించాలి. ఇలా వాత్స్యాయను లన్నారు.

౧౦౫౦. ప్రథమసాహసా అనియంత్రణసంభాషాశ్చ స్వయం ప్రతార్యాః తద్విపరీతాశ్చ దూత్యేతి ప్రాయోవాదః. ౫. ౨. ౩.

మొట్టమొదటగా పరపురుషునితో సంగమించగోరే స్త్రీవ్యక్తి విషయంలో నాయకుడు స్వయంగానే ప్రవర్తించాలి గాని దూతికను పంపరాదు. అలా ఆస్త్రీ సాధ్యపడదు. స్వయంగా ఏఅడ్డంకులూ లేకుండా నాయికతో సంభాషించకలిగినప్పుడు

ఇంకా దూతికతో పనేమున్నది? పలుమార్లు పరపురుషస్పర్శ దోషదూషితలైన స్త్రీలు దూతికద్వారా సాధించతగినవారని పెద్దలు సాధారణంగా చెపుతున్నారు.

౧౦౫౧. స్వయమభియోక్ష్యమాణస్తు ఆదావేవ పరిచయం కుర్యాత్. ౫.౨.౪.

పరస్త్రీతో రమించడం అనేది పరిశుద్ధం లేని విషయం అన్నారు గనుక మొట్టమొదటగా పురుషుణ్ణి కూడగోరే స్త్రీతో సంగమించడం ఖండితంగా నిషేధించబడినది. అయినా ప్రాణాపాయం జరగబోయేటప్పుడు శరీరసంరక్షణకోసం చెప్పబడ్డది. స్వయంగానే నాయికను పొందగోరేవాడు ఆమెతో మొదట బాగా పరిచయాన్ని పొందాలి.

౧౦౫౨-౧౦౫౪. తస్యాస్స్వాభావికం దర్శనం ప్రాయత్నికంచ స్వాభావికమాత్మనో భవన సన్నికర్షే, ప్రాయత్నికం మిత్రజ్ఞాతి మహామాత్రి వైద్యభవనసన్నికర్షే వివాహయజ్ఞోత్సవవ్యసనోద్యానగమనాదిషు. ౫.౨.౬-

ఆపరిచయం కూడా నాయికానాయకులు ఒకళ్ళనొకళ్ళు బాగా చూచుకున్న పయినగాని కలగదు. ఆచూచుకోడాన్నే దర్శనం అంటారు. ఆదర్శనంగూడా రెండువిధాలు. నాయిక తన యింటిదాపున తిరుగుతున్నప్పుడు చూడడం అనేది సామాన్య దర్శనం. ఇది ఒకరకం. ఇక రెండోది ప్రయత్నపూర్వకంగా జరిగేదర్శనం. తనమిత్రుని యింటిదగ్గరగానీ, జ్ఞాతులయింటి

దగ్గరగానీ, వైద్యులయింటిదగ్గరగానీ,వివాహమూ, యజ్ఞమూ, మొదలైనఉత్సవాలలోగానీ, నాటకాలు మొదలైన ప్రదర్శనాలు జరిగేచోట్లగానీ ఉద్యానవిహారానికి పోయేసమయాలలోగానీ, నాయికనునాయకుడు చూడడం ప్రయత్నపూర్వకమైనది.

౧౦౫౫-౧౦౫౬. దర్శనేచాస్యాస్సతతం సాకారం ప్రేక్షణం కేశసంయమనం, నఖాచ్ఛురణ మాభరణ ప్రహ్లాదనమధరోష్ఠవిమర్దనం తాస్తాశ్చలీలా వయస్యైస్సహప్రేక్షమాణాయాగితత్సంబద్ధాగి పరాపదేశిన్యశ్చకథాగి, త్యాగోపభోగ ప్రకాశనం, సఖ్యురుత్సంగనిషణ్ణస్యసాంగ భంగం జృంభణం, ఏకభ్రూప్రేక్షణం,మంద వాక్యతా, తద్వాక్యశ్రవణం, తాముద్దిశ్య బాలేనాన్యజనేనవా సహాన్యోపదిష్టా ద్వ్యర్థాకథా,తస్యాం స్వయం మనోరథావేదన మన్యాపదేశేన,తామేవోద్దిశ్య బాలా చుంబనం, ఆలింగనంచ, జిహ్వయాచాస్య తాంబూలదానం ప్రదేశిన్యాహనుదేశఘట్టనం, తత్తద్యథాయోగం యథావకాశం చ ప్రయోక్తవ్యం,తస్యాశ్చాంకగతస్యబాలస్య లాలనం,బాలక్రీడనకానాం చాస్యదానం,గ్రహణం, తేనసన్నికృష్టత్వా త్కథాయోజనం, తత్సంభాషణక్రమేణ జనేన చప్రీతిమాసాద్య కార్యం తదనుబంధంచ గమనాగమనస్య

యోజనం సంశ్రవేచాస్యాస్తామపశ్యతో
నానా కామసూత్రసంకథా. ౫.౨.౮.

పైనచెప్పిన రెండురకాలైన దర్శనాలలోనూ జరిగే పరిచయానికి కారణాలు బాహ్యమనీ, ఆభ్యంతరమనీ రెండురకాలు. వాటిలో మొదటిదైన బాహ్యపరిచయాన్ని చెవుతున్నారు. నాయకుడు నాయికకు కళ్ళతోనూ, ముఖలక్షణాలతోనూ తన అభిప్రాయాన్ని సూచిస్తూ తదేకదీక్షతో చూడాలి. జుట్టు ముడివిప్పి మళ్లీ ముడివెయ్యడమూ, చిటికెనవేలు గోరు కొరుకుతూ నిలుచోడమూ, ఆభరణాలను మోతపుట్టేలాగా కదల్చడమూ, పెదవిని చేవ్రేళ్ళతో నొక్కుకొనడమూ, ఈమొదలైన చేష్టలున్నూ, నాయిక తనవంకచూస్తూ ఉన్నప్పుడు తనస్నేహితులతో ఆమెకు సంబంధించిన ఆయాకథలను ఎవరిమాటలో చెవుతున్నట్లు చెప్పడమూ, తనత్యాగాన్నిగానీ, తనభోగాన్నిగానీ, ఆమెకు తెలియజెయ్యడమూ, మిత్రుని తొడమీద తలపెట్టి పడుకుని ఒళ్లు విరుస్తూ ఆవలించడమూ, ఒక్క కనుబొమ్మమాత్రం నిక్కించి ఓరకంట చూడడమూ, మిత్రునితో చెవిలో మాట్లాడడమూ, ఆమెమాటలు ఎంతోశ్రద్ధగా వినడమూ, తనదగ్గరఉన్న ఏపిల్లవానితోనో ఆమెనుగురించిన మాటలను ఎవరోచెప్పినట్లు రెండర్థాలు ఒచ్చేలాగా చెప్పడమూ, ఏదో నెపంమీద తన అభిప్రాయాన్ని ఆమెకు తెలియజెయ్యడమూ, ఆమెను ముద్దుపెట్టుకున్నట్లు తనదగ్గర ఉన్న పిల్లవానిని ముద్దుపెట్టుకోడమూ, ఆలింగనం చేసుకోడమూ, నోటితో తాంబూలాన్ని అందించడమూ, చూపుడు

వ్రేలితో బుగ్గమీద పొడవడమూ, ఈమొదలైన చేష్టలన్నీ ఆయాకాలానుసారంగా అవకాశాన్నిపట్టి ప్రయోగించాలి. ఇంకా నాయికఒడిలో ఉన్న పిల్లవాణ్ణి పల్కరిస్తూలాలించాలి. అపిల్లవానికి ఆటవస్తువులు చూపించి పిలిచి అవి అతనికివ్వాలి. ఆపిల్లవానిదగ్గర ఏమన్నా ఉంటే తాను తీసుకోవాలి. వస్తువులను ఇచ్చి పుచ్చుకోడం ద్వారా అపిల్లవానితో పరిచయం కలిగింది గనుక నెమ్మదిగా ఆమాటలూ ఈమాటలూ అతనికి చెప్పడం మొదలుపెట్టాలి. అమాటలద్వారా నాయికకు తన భావంరహస్యంగా తెలియజెయ్యాలి. తరువాత క్రమంగా ఆమె ఎవరిఅధీనంలో ఉన్నదో వారిస్నేహాన్ని సంపాదించి దాన్నను సరించి ఆమెవున్న ప్రదేశానికి రాకపోకలు జరపడానికి అనుకూలాన్ని యేర్పాటు చేసుకోవాలి. ఆమె వినడానికి అనుకూలంగా ఉండే సమయంలో ఈకామసూత్రాలు విని పించాలి.

౧౦౫౭-౧౦౬౧. ప్రసృతేతు పరిచయే తస్యా హస్తేన్యాసం నిక్షేపంచ నిపధ్యాత్, తత్ప్రతిదినం ప్రతిక్షణం చైకదేశతో గృహ్ణీయాత్, సౌగంధికం పూగఫలానిచ, తామాత్మనో దారైస్సహవిస్రంభగోష్ఠ్యాంవివిక్తాసనేచయోజయేత్, విశ్వాసనార్థం విజనార్థంచనిత్యసందర్శనార్థం సువర్ణకార మణికారవైకటికనీలకుసుంభరంజకాదీంశ్చ కర్మార్థిన్యాం సహాత్మనోవశ్యైశ్చైషాం తత్సంపాదనే స్వయంప్రయ

తేత, తదనుష్ఠాననిరతస్య లోకవిదితో దీర్ఘ కాలసందర్శన యోగః, తస్మింశ్చాన్యేషామపి కర్మణామనుసంధానం, యేనకర్మణాదర్వ్యేణ కౌశలేవచార్థినీ స్యాత్తస్య ప్రయోగముత్ప త్తి మాగమముపాయం విజ్ఞానం చాత్మా యత్తం దర్శయేత్. పూర్వప్రవృత్తేషు లోకచరితేషు ద్రవ్యగుణపరీక్షానుచతయా తత్పరిజనేనచ సహవివాదః తత్రనిర్దిష్టాని ఫణితాని తేష్వేనాం ప్రాశ్నికత్వేనయోజ యేత్. తయాతు వివదమానోఽవ్యం తద్భ క్తమితిపరిచయకారణాని. ౫.౨.౧౭.

ఇక అభ్యంతరపరిచయాన్ని గూర్చి చెపుతున్నారు. నాయికతో కొద్దిగాపరిచయం కలిగినతరువాత ఆమెచేతులో "ఈవస్తువు దాచి ఉంచుము" అని ఉంచుతూ మళ్లీ ఆవస్తువును ఒకరోజు అయినతరువాత తీసుకుంటూ అలాగే క్రమక్రమంగా క్షణ క్షణానికీ తీసుకుంటూ ఉండాలి. తరువాతతరువాత సుగంధ ద్రవ్యాలూ, పోకచక్కలూ, మొదలైనవి అందించాలి. ఆమెకు మెల్లమెల్లగా తనస్త్రీలతో పరిచయం కలిగించి పానగోష్ఠులూ మొదలైనవాటిలో తాను కూర్చున్నఆసనంమీద ఆమెకూడా ఉండేట్టు చెయ్యాలి. ఇలాచెయ్యడం ఆమెకు చనువు ఏర్పడ టానికీ, ఉన్నప్రదేశం విజనంగా ఉండటానికిన్నీ బాగా ఉప యోగిస్తుంది. ఆమెను ఎప్పుడూ చూస్తూ ఉండటానికి కంసాలీ, మణులుచెక్కేవాడూ, రత్నాలు పరీక్షించేవాడూ, బట్టలకు

రంగువేసేవాడూ, మొదలైనవాళ్ళను తనఅధీనంలో పెట్టుకుని అమెకు ఏపని అవసరమైనా తానే కల్పించుకుని ఆయాపని ముట్టు చేయించిపెడుతూ రాకపోకలకు బలం చేకూర్చు కోవాలి. ఈ విధంగా ప్రవర్తిస్తూఉంటే ఎక్కువ కాలం నాయికను సందర్శించడానికి అవకాశం ఏర్పడుతుంది. ఈసంగతి లోకానికి బాగా విదితం అయేఉన్నది. ఆదర్శంకోసమే మరి కొన్ని యిలాటిపనులే కల్పించి తాను వాటిని సాధించడానికి పూనుకోవాలి. ఆ పనులు కుశలంగా సాధించవలసినపని నాయి కకు తెలిసేవిగా ఉండాలి. ఆకార్యసాధనవిషయంలో నాయిక కోరేవస్తువు ఎక్కడఉంటుందో, అది ఎలా సంభవిస్తుందో, దాన్ని సంపాదించేఉపాయమూ, విజ్ఞానమూ మొదలైన వాటిలోని తనగొప్పతనాన్ని చూపించాలి. పూర్వం ప్రసిద్ధం గాఉన్న రామాయణాది లోకచరిత్రలలోగానీ, మణులు మొదలైవస్తువుల మంచిచెడుగుల పరీక్షలోగానీ ఆనాయిక పరిజనంతో వాదించాలి. ఆలోకచరిత్రిలోగానీ, వస్తువులలో గానీ ఉన్నయథార్థాన్ని బయటపెట్టి నాయికను ప్రశ్నిస్తూ ఉండాలి, ఆమెతోగూడా వాదిస్తూ నెమ్మదిగా అనుకూలుడై పోవాలి. ఈపైనచెప్పినవన్నీ పరిచయకారణాలు.

౧౦౬_౭-౧౦౬౬. కృతపరిచయాం దర్శితేంగితాకారాం కన్యా మివోపాయతో௨భియుంజీతేతిప్రాయేణ తత్రసూక్ష్మాభియోగాః,కన్యానామ సంప్ర యుక్తత్వాత్, ఇతరాసుతానేవస్ఫుటము పదధ్యాత్, సంప్రయుక్తత్వాత్.సందర్శితా కారాయాం నిర్భిన్నసద్భావాయాం సముప

భోగవ్యతికరే తదీయాన్యుపయుంజీత. తత్ర మహార్హ గంధప్రహణీయం స్వనఖదశనపద చిహ్నితం సాకారం దద్యాత్. అధికైరధి కైశ్చాభియోగై స్సాధ్వసవిచ్ఛేదనం.

పైవిధంగా పరిచయానికి సహించి, తనతో సంగమించడానికి అనుకూలభావాన్ని సూచించిన నాయికను, కన్యకను సంగమిం చినట్లు ఉపాయంగా సంగమించాలి. కన్యకలు అంతకుపూర్వం ఉపాయం ఎరుగరుకాబట్టి వారితో తొందరపడి మొగం మొత్తించకుండా సంగమించాలి. ఇక పరస్త్రీలవిషయమై అం తకుపూర్వం సంభోగాభిరుచి యెఱిగిఉన్నవారేగనుక కొద్ది గాఢంగా సంప్రయోగాలు జరపవచ్చు. నాయిక తనతో సంగమించడానికి అనుకూలభావాన్ని సూచిస్తూ తననుంచి అనుకూలభావాన్ని తొలగించుకోలేనంతటి అనురాగాన్ని పొందినతరువాత నాయకుడు తనపరిమిళవంతాలైన ఉత్తరీ యాలను ఆమెకు ధరించుకోడానికి ఇవ్వాలి. ఆమె వస్తువులను తాను గ్రహించాలి. అమూల్యమయిన సుగంధద్రవ్యంతో ఘుమఘుమలాడే తనఉత్తరీయాన్నిగానీ, తాను ధరించిన పుష్పాన్నిగానీ, తనఅంగరాగాన్నిగాని, ఇచ్చి ఆమెచేత్తో పరిమళద్రవ్యాలతో కూడిఉన్న తాంబూలాన్ని గ్రహిం చాలి. గోష్ఠులు జరపడానికి ప్రయాణమయేసమయాలలో ఆమెజుట్టులో ధరించిన పువ్వుగానీ, చేతిలోధరించినపువ్వుగానీ అడిగి తీసుకోవాలి. స్తనాలూ మొదలైన కళాస్థానాలలో జ్ఞాపకంకోసం పరిమిళవంతమయిన గంధాన్ని చిలికి, నఖ

క్షతాలూ, దంతక్షతాలూ, భావసూచకంగా చెయ్యాలి. సాధారణంగా పరస్త్రీలు పరపురుషునిదగ్గర చాలా భయాన్ని పొందుతూ ఉంటారు. అందువల్ల ఎక్కువగా ఆమెయందు నఖక్షతాలూ, దంతక్షతాలూ మొదలైనవిచేసి ఆమె భయాన్ని ఒదల్చాలి.

౧౦౬౭. క్రమేణచ వివిక్తదేశేగమన మాలింగనం చుంబనం తాంబూలస్య గ్రహణం దానాంతే ద్రవ్యాణాం పరివర్తనం గుహ్యదేశాభిమర్శనం చేత్యభి యోగాః. ౫. ౨. ౨౮.

ఇక ఆభ్యంతరపరిచయాన్ని గూర్చి చెపుతున్నారు. క్రమ క్రమంగా చనువు యేర్పడి భయమూ సిగ్గూ లేకుండా నాయిక తనతో కలియడానికి సంసిద్ధపడినతరువాత జనులులేని యేకాంత ప్రదేశానికి ఆమెను తీసుకుపోయి కౌగిలించుకుని, ముద్దు పెట్టుకుంటూ, తాంబూలాన్ని నోటికందించి, తానూ ఆమె నోటినుంచి గ్రహించాలి. తరువాత ఒకరిఆభరణాలను ఒకళ్ళు మార్చుకోవాలి. ఇక క్రమక్రమంగా నాయకుడు ఆమె భగ స్థానాన్ని చేత్తో తడువుతూ సంభోగకార్యానికి ప్రయ త్నించాలి.

౧౦౬౮. యత్రచైకాభియుక్తాన తత్రాపరా మభియుంజీత, తత్రయావృద్ధా అనుభూతవిషయా ప్రియోప గ్రహైశ్చ తాముపగృహ్ణీయాత్. ౫. ౨. ౨౯.

సంభోగం విషయంలో ఒకనిషేధాన్ని చెపుతున్నారు. ఒక పరస్త్రీతో సంభోగించి ఆమెయింట్లో మరొకస్త్రీతో రమించ

రాదు. అలాచేస్తే వాళ్ళలోవాళ్లు పోరాడుకుని రహస్యాన్ని బయటపెడతారు. ఒకవేళ ఆయింట్లో పరపురుష సంగమానికి అలవాటుపడిన భ్రష్టురాలుగాఉన్న వృద్ధురాలుంటే దానితో సంభోగించిగానీ, దానికి ఇష్టమైన వస్తువులను సమకూర్చిపెట్టి గానీ దానిద్వారా ఆనాయికను పొందాలి.

౧౦౬౯-౧౦౭౦. శ్లో॥ కావత్రిభవతః – అన్యత్రాదృష్టసంచారః తద్భర్తా యత్రనాయకః, న తత్ర యోషితం కాంచిత్సుప్రాపామపిలంఘయేత్. శంకితాం రక్షితాం భీతాం, సశ్వశ్రూకాంచయోషితం, నతర్కయేత మేధావీ జానన్ ప్రత్యయ మాత్మనః. ౫.౨.౨౫.

ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే పారదారికే
పంచమేఽధికరణే పరిచయకారణా న్యభియోగా
ఇతి ద్వితీయోఽధ్యాయః.

ఒకయింట్లో ఒకగృహస్థు పరస్త్రీతో నివసిస్తున్నప్పుడు ఆగృహస్థుభార్యను పరపురుషుడు తనకందుబాటులో ఉన్నట్లు తోచినా పొందటానికి ప్రయత్నించరాదు. అత్తమామలచేతా భర్తచేతా అనుమానింపబడినస్త్రీనీ, కత్తులూ, కటార్లూ గల పురుషులచేత సంరక్షణ పొందుతున్న స్త్రీనినీ, అత్తమామల భయం ఉన్నస్త్రీనీ, బుద్ధిమంతు డెన్నడూ కూడడానికి ఊహించరాదు. ఏఆలోచనాలేకుండా ప్రవర్తిస్తే ఫలితాన్ని చక్కగా అనుభవిస్తాడు.

ఇలా భారద్వాజ గోత్రుడున్నూ, యజుశ్శాఖీయు
డున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల
ఆంజనేయమూర్తి చేత వాత్స్యాయన కామసూత్ర
ములకు జయమంగళ వ్యాఖ్య ననుసరించి వ్రాయ
బడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలో
పారదారికమనే అయిదో అధి
కరణంలో రెండవఅధ్యాయం
పూర్తి అయింది.



శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

౫. పారదారికాధికరణం

### 3 భావపరీక్షాధ్యాయం

౧౦౭౧. అభియుంజానో యోషితః ప్రవృత్తిం పరీక్షేత తయా భావః పరీక్షితో భవతి. ౫.౩.౧.

కొందరుస్త్రీలు అభియోగాలు జరుపుతూఉన్నా తొణకకుండా ధీరురాండ్రుగా ఉండి పురుషుణ్ణి పరీక్షిస్తూఉంటారు. అలా ధీరురాండ్రుగా ఉండేస్త్రీలను పరపురుషులకు విముఖలని యెంచరాదు. వాళ్లు చాలాదొంగలు. అలాటిస్త్రీల విషయంలో తొందరపడరాదు. ఎక్కువగా చేష్టలు చెయ్యరాదు. అందువల్లే పురుషుడు తాను సంగమింపదలచిన స్త్రీయొక్కప్రవృత్తి యెలాటిదో పరీక్షించాలి. అలాచేస్తే ఆమె భావంగూడా పరీక్షించినట్లౌతుంది.

౧౦౭౨. మంత్రమవృణ్వానాం దూత్యైనాం సాధయేత్.

అయితే అంత ధీరురాలుగా ఉండేస్త్రీ ఎలా సాధించతగినది అవుతుంది? ప్రత్యక్షంగా సంభోగానికనుకూలించే సూచనలు ఏమీ ఇయ్యకపోతే దూతికను పంపి దాని ద్వారా సాధించాలి.

౧౦౭౩. అప్రతిగృహ్యాభియోగం పునరపి సంసృజ్యమానాం ద్విధాభూతమనసాం విద్యాత్తాం క్రమేణసాధయేత్.

ఒకమాటు దూతనుపంపి సంభోగించడానికి నాయిక ఒప్పక పోతే కొన్నిరోజులు ఆగి మళ్లీ దూతను పంపాలి. అలాపంపి సందేహదృష్టి కలదిగా తోస్తే క్రమంగా సాధించాలి.

౧౦౭౪. అప్రతిగృహ్యాభియోగం సవిశేష మలంకృతాచ పునర్దృశ్యేత తథైవతామభిగచ్ఛేచ్చ. వివిక్తే బలాద్గ్రహణీయాం విద్యాత్. ౫.౩.౪.

తనచేష్టలకనుకూలంగా సమాధానమియ్యక బాగా అలంకారం చేసుకుని తన కంటపడ్డప్పుడు ఆ నాయికతో నాయకుడు ఆపట్టున సంభోగించవచ్చు. ఆస్త్రీని ఏకాంతసమయంలో బలాత్కారంగా గ్రహించవచ్చునని తెలుసుకోవాలి.

౧౦౭౫. బహూనపి విషహతే అభియోగాన్నచ చిరేణాపి ప్రయచ్ఛత్యాత్మానం సాశుష్క ప్రతిగ్రాహిణీ పరిచయ విఘటనసాధ్యా. ౫.౩.౫

నాయకుడు తననుగూర్చి చేసేచేష్టలన్నీ సహిస్తూకూడా ఎంతకాలానికీ అనుకూలురాలు కాకపోతే ఆమె అర్థంలేని శూన్యచేష్టలను కోరుతుందని గ్రహించాలి. ఆమె చాలాదీర్ఘంగా పరీక్షించిగ్రహించ తగ్గదౌతుంది. పరిచయాన్ని సాంతంగా ఒదులుకుంటేనేగాని ఆమె సాధ్యురాలుకాదు.

౧౦౭౬. మనుష్యజాతేశ్చిత్తానిత్యత్వాత్. ౫.౩.౬

అయితే ఆమెతో పరిచయాన్ని తెంపుకుంటే ఆమె యెలా స్వాధీనపడుతుంది? అంటే సాధారణంగా మానవజాతి బుద్ధి

చలించే స్వభావంకలది. అందువల్ల పరిచయం దూరమయితే విచారాన్నిపొంది మళ్లీ పరిచయంకోసం అపేక్షపడుతుంది.

౧౦౭౭. అభియుక్తాపి పరిహరతి, నచసంసృజ్యతే, నచప్రత్యాచష్టే, తస్మిన్నాత్మనిచ గౌరవాభిమానాత్సాతి పరిచయాత్కృచ్ఛ్రసాధ్యా, మర్మజ్ఞయాదూత్యాతాం సాధయేత్. ౫.౩.౭

ఒకానొకస్త్రీ వ్యక్తి అభియోగాలకు ఒప్పుకున్నా, సంభోగించడానికి ఒడపడదు. అలాగని కేవలమూ విరక్తురాలుగానూ కనిపింపదు. సంభోగించడానికి ఇష్టపడుతూనేఉంటుంది. ఇలా ఉండే స్త్రీవ్యక్తి, తనయందు తనకు అభిమానంకలది అన్నమాట. అయితే ఆ పరపురుషునియందుగూడా అభిమానం లేకపోలేదు. ఏకాంతంలో ఒడవడుతుంది. ఆ ఏకాంతం సంభవించడం ఎలా? ఆమెతో అతిగా పరిచయం కలిగించుకోడానికి గానీ, ఆ పరిచయంవల్ల ఆమెను సాధించడానికిగానీ చాలా కష్టపడాలి. అందువల్ల ఆమె రహస్యాలు గుర్తెఱిగిఉన్న దూతికద్వారా ఆమెను సాధించవచ్చు.

౧౦౭౮. సాచేదభియుజ్యమానా, పారుష్యేణ ప్రత్యాదిశత్యుపేక్ష్యా. ౫.౩.౮

ఆమె విషయంలో ఒక విశేషాన్ని చెవుతున్నారు. ఒకవేళ ఆమెతో అభియోగాన్ని జరిపేసమయంలో ఆమె పరుషంగా మాట్లాడటం జరిగితే, వెంటనే తాను ఆమెనుగూర్చిన అభియోగాలనుంచి విరమించడం మంచిది.

౧౦౭౯. పరుషయిత్వాఽపితు ప్రీతియోజనం సాధయేత్.

ఇలా విముఖురాలుగా కనిపించే స్త్రీ విషయంలోనే మరొక విశేషాన్ని చెపుతున్నారు. పై విధంగా పరుషవాక్యాలు అభియోగ కాలంలో (పరిచయకాలంలో) పలికినా తరువాత తరువాతమళ్ళీ ప్రేమను సూచిస్తూఉంటే ఆమె విషయమై మళ్ళీ అభియోగాలను జరిపి వశం చేసుకోవాలి.

౧౮౫. కారణా త్సంస్పర్శనంసహతే, నావబుధ్యతే నామ, ద్విధాభూత మనసా సాతత్యేన క్షాంత్యా వాసాధ్యా. 5.3.11

ఏదోఒక కారణాన్నిపట్టి నాయకుడు తనను స్పృశించడానికి సహిస్తుంది. అంటే నాయకుని అభిప్రాయాన్ని ఎరుగనిదాని వలె ఏదో పనిమీద అతని శరీరసంస్పర్శ తనకుకలిగితే సహించి ఊరుకుంటుంది. ఆమె మనస్సు అటూ ఇటూ ఊగులాడుతూ ఉంటుందిగనుక తెంపులేకుండా ఆమెను ఏదో నెపం మీద స్పృశిస్తూగానీ, ఎక్కువ ఓర్పుతోగానీ సాధించాలి.

౧౮౬. సమీపేశయానాయాః సుప్తోనామ కరముపరిన్యసేత్సాఽపి సుప్తేవోపేక్షతే జాగ్రతేత్వ నుపదేద్భూయోభియోగకాంక్షిణీ. 5.3.11

నాయకుడు తనకు దగ్గరగాపరుండి ఉన్ననాయిక (పై విధంగా అభియోగాలకూ స్పర్శకూ సహించిన నాయిక నన్నమాట) మీద చెయ్యివెయ్యాలి. అలా చెయ్యివేసినప్పుడు ఆమె మేలుకుని ఉండికూడా నిద్రపోతున్నట్లు ఊరుకుని వెంటనే అతని స్పర్శవల్ల మెళుకువు వచ్చినట్లు మేలుకుని చెయ్యి తోసివేస్తుంది. ఆమె మళ్ళీ అతనిచేత అలా స్పృశింపచేసుకోవాలని అపేక్షపడి అలా చేస్తుందన్నమాట. లేకపోతే నిద్రావశంచేత

ఒళ్లు తెలియక ఇలా చెయ్యి వేశాడా? లేక పరిచయంకోసం వేశాడా? అనే సందేహానికి అవకాశం యేర్పడుతుంది.

౧౦౮-౨. ఏతేనపాదస్యోపరి పాదన్యాసోవ్యాఖ్యాతః.

చెయ్యివేసేవిధానం ఇలా చెప్పడంచేత కాలువేసే విధానం గూడా చెప్పినట్లైనది.

౧౦౮-౩. తస్మిన్ప్రసృతే భూయ స్సుప్తసంశ్లేషణ ముపక్ర మేత, తదసహమానా ముత్థితాం ద్వితీయేఽహని ప్రకృతివర్తినీ మభియోగార్థినీం విద్యాత్, అదృశ్య మానాంతు దూతీసాధ్యాం. ౫.౩.౧౩

పై విధంగా హస్తస్పర్శకూ, పాదస్పర్శకూ గూడా సహించిన తరువాత ఆమెను నిద్రలో ఒళ్లు తెలియక కౌగిలించుకున్నట్లు కౌగిలింతకు ప్రయత్నించాలి. ఆ కౌగిలింతను సహించక లేచి పోయి ఎప్పటివిధంగానే సుముఖురాలుగాఉంటే ఆమెను అభి యోగాలు మళ్ళీ కోరేదాన్నిగా గుర్తించాలి. అసలు కనిపించ కుండాపోతే దూతికద్వారా సాధించాలి.

౧౦౮-౪. చిరమదృష్టాపి ప్రకృతి స్థైవ సంసృజ్యతే కృత లక్షణాంతాం దర్శితాకారా ముపక్రమేత.

అలా నిద్రలోఉన్నట్లు కౌగిలింతకు పూనుకున్నప్పుడు సహించ నట్లు లేచిపోయి చాలా రోజులకు మళ్ళీ కనిపించినప్పుడు ఆస్త్రీ వ్యక్తికోసం పూనకుండా కూడడానికి ఒప్పుకుంటుంది. సంభో గానికి అవసరాన్ని సూచిస్తూ భావప్రకటనం చేస్తున్నప్పుడు ఆమెను సంభోగించడానికి ప్రయత్నించాలి.

౧౦౮౪-౧౦౯౭ అనభియుక్తాప్యాకారయతి, వివిక్తే ాత్మానం దర్శయతి, సవేపథుగద్గదంవదతి, స్విన్నకర చరణాంగుళిగ స్విన్నముఖీచభవతి, శిరగ పీడనే సంవాహనేచ ఊర్వోరాత్మానం నాయకే నియోజయతి, ఆతురాసంవాహికాచ ఏకేన హస్తేన సంవాహయంతీ, ద్వితీయేన బాహు నాస్పర్శమావేదయతి ఆశ్లేషయతిచ. విస్మిత భావా నిద్రాంధా వా పరిప్ర్శోర్యురుభ్యాం బాహుభ్యాం తిష్ఠతి, అణిక్కైక దేశమూర్వోరు పరిపాతయతి, ఊరుమూల సంవాహనే నియుక్తా సప్రతిలోమయతి, తత్రైవహస్తమేక మతిచలం న్యస్యతి. అంగసందంశేనచ పీడితం చిరాదపనయతి, ప్రతిగృహ్యైవం నాయకాభి యోగాన్, పునర్ద్వితీయేఽహని సంవాహనా యోపగచ్ఛతి, నాత్యర్థం సంసృజ్యతే. నచపరి హరతి. వివిక్తేభావం దర్శయతి, నిష్కా రణం గూఢ మన్యత్రి ప్రచ్ఛన్నప్రదేశాత్, సన్నికృష్ట పరిచారకోపభోగ్యా సాచేదాకా రితాఽపితథైవస్యాత్సామర్జ్య యాదూత్యా సాధ్యా, వ్యావర్తమానాతు తర్కణీయేతి భావపరీక్షా. ౫.౩.౩౧

పైవిధంగా నాయిక అభియోగాలకు ఇష్టపడకపోయినా తన అనుకూలభావాన్ని సూచిస్తుంది. జనులు లేనిప్రదేశంలో అతనికి కనుపిస్తుంది. అతనితో మాట్లాడవలసివస్తే ఒణుకుతోవున్న

కంఠంతో మాట్లాడుతుంది. ముఖానా, కాళ్లకూ, చేతులకూ ముచ్చెమటలు కమ్ముతాయి. నాయకునితలను మర్దించడానికీ, తొడలు సంవాహనం చెయ్యడానికీ తనను నియమించుకుంటుంది. అలా మర్దనంచేస్తూ తొందరపాటుచేత కామాతురురాలై ఒక్కచేత్తో సంవాహనం చేస్తూనే రెండవచేత్తో నాయకుని గుహ్యప్రదేశాన్ని ముట్టి తనను నాయకునికి జ్ఞాపకం చేస్తుంది. వెంటనే కౌగిలించుకుంటుంది. ఆ కౌగిలింతతో తనను తాను మరచిపోతుంది. ఒకొ్కక్కసమయంలో నిద్రవచ్చిన దానివలె రెండుచేతులూ ఆ తొడలమీదేఉంచి నెమ్మదిగా అతనిమీదే వాలుతుంది. తన రహస్యేంద్రియాన్ని అతని తొడకు తగిలేలాగా చేస్తుంది. అతడు గజ్జలు మొదలైనచోట్ల సంవాహనం చెయ్యమని ఆజ్ఞాపిస్తే ఆపని తనకిష్టమైనదే గనుక అలా చేస్తుంది. అతని లింగస్థానంలో ఒకచేతిని కదిలించకుండా ఉంచుతుంది. అతనిఅంగం లేపనాన్ని చెందినతరువాత చాలా సేపటికిగాని చేతిని అక్కడినుండి తొలగింపదు. ఈ విధంగా నాయకుని అభియోగాలను అనుకూలంగా గ్రహించి మరుసటిదినాన నాయకునికాళ్లు పిసగటానికి సమీపిస్తుంది. అప్పుడు ఎక్కువగా కలిసేఉండదు. ఎక్కువ విరక్తురాలుగానూ ఉండదు. జనులులేని ప్రదేశంలో తన భావాన్ని సూచిస్తుంది. జనసమ్మర్దం ఉన్నచోట రహస్యంగా తన భావాన్ని సూచిస్తుంది. దగ్గరఉన్న పరిచారకునికి ఉపభోగింపతగినదిగా ఉంటుంది. నాయకుడు ఏ అభిప్రాయాలను సూచిస్తున్నా గంభీరంగా ఉండిపోతుంది. కాని యేమీ సమాధానం ఇవ్వదు. అలాటిఅవస్థలో ఉన్న స్త్రీని ఆమె రహస్యాలు

తెలుసుకునిఉన్న దూతిక ద్వారా సాధింపబడుతుందనే నమ్మకం లేకపోతే ఆమె చరిత్రనుగూర్చి ఆలోచించి ప్రవర్తించాలి. ఇది భావ పరీక్షాధ్యాయం.

భవంతి చాత్రశ్లోకాః

౧౯౮-౧౧౦౨. ఆదౌ పరిచయం కుర్యాత్తతశ్చ పరిభాషణం
పరిభాషణసంమిశ్రం మిథశ్చాకార వేదనం,
ప్రత్యుత్తరేణ పశ్యేచ్చేదాకారస్య పరి
గ్రహం, తతోభియుంజీత వరః స్త్రియం
విగతసాధ్వసః ఆకారేణాత్మనోభావం యా
నారీ ప్రాక్ప్రయోజయేత్, క్షిప్రమేవాభి
యోజ్యాసా ప్రథమేత్వేవదర్శనే, శ్లక్ష్ణ
మాకారితాయాతు దర్శయేత్స్ఫుటము
త్తరం। సాపితత్క్షణసిద్ధేతి విజ్ఞేయారతిలాలసా,
ధీరాయామప్రగల్భాయాం పరీక్ష్యాయాం
చయోషితి, ఏషసూక్ష్మోవిధిః ప్రోక్తః
సిద్ధా ఏవస్ఫుటం స్త్రియః. ౫.౩.౩౧.౩౫

ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే పారదారికే పంచమేఽధికరణే భావపరీక్షానామ తృతీయోఽధ్యాయః.

సాధారణంగా స్త్రీలవిషయంలో ఈ క్రమాన్ననుసరించాలి. మొట్టమొదటగా పరిచయంచేసుకోవాలి. తరువాత కొద్ది కొద్దిగా మాటలు కలపాలి. ఆ మాటలు కలుపుతూనే నాయికా నాయకులు పరస్పరమూ తమతమ భావాలను ఒకళ్ల నొకళ్లు తెలియజేసుకోవాలి. తన భావసూచనకు నాయిక సమాధానం అనుకూలంగాయిస్తే ఆ భావాన్నిగ్రహించి పురు

షుడు కలియడానికి ప్రయత్నించాలి. ఏ నాయిక తన భావాన్ని నాయకునికంటె ముందుగా నాయకునికి తెలియ జేస్తుందో ఆ నాయిక అతనికి వెంటనే ఆ మొదటిదర్శనంలోనే సంగమించతగిఉంటుంది. మొదటిదర్శనంలోనే నాయకుడు కనుసన్న చేయడంతోనే అనుకూలంగా తన సురతసౌఖ్యాపేక్షను సూచిస్తుందో ఆస్త్రీ వ్యక్తి కూడా నాయకునికి పొందతగినదే. ఇక ఏమాత్రమూ తొణకకుండా ధీరురాలుగాఉండి పరీక్షింపతగినదిగా ఉంటే ఆ స్త్రీ విషయమై పైనచెప్పిన క్రమాన్ననుసరించాలి. అలా ధీరురాండ్రుగా ఉండేవాళ్లుగూడా క్రమక్రమంగా సిద్ధపడతారు.

ఇలా భారద్వాజ గోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయమూర్తి చేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలో పారదారికమనే అయిదో అధికరణంలో మూడో అధ్యాయం ముగిసింది.



శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

౫. పారదారికాధికరణం

౪. దూతీకర్మ విమర్శాధ్యాయం

౧౧౦౩. దర్శితేంగితాకారాంతు ప్రవివిక్తదర్శనా మపూర్వాంచ దూత్యోపసర్పయేత్. ౫.౪.౧

పరిచయం చేసుకోబోయేనాయకుడు అనుకూలభావాన్ని సూచిస్తూఉన్న నాయిక తరుచుగా కనిపించేఅవకాశం లేనిదైనా తనకు కొత్తవ్యక్తిగా ఉన్నా దూతికద్వారా సమీపించాలి.

౧౧౦౪-౧౧౨౦. సైనాం శీలతోఽనుప్రవిశ్య ఆఖ్యానకపటైస్సుభగం కరణయోగైః లోకవృత్తాంతైః కవికథాభిః పారదారక కథాభిశ్చ తస్యాశ్చ రూపవిజ్ఞాన దాక్షిణ్యశీలాను ప్రశంసాభిశ్చ తాం రంజయేత్. కథమేవం విధాయాస్తవాయమిత్థం భూతః పతిరితిచానుశయం గ్రాహయేత్. నతవసుభగే! దాస్యమపికర్తుం యుక్త ఇతిబ్రూయాత్. మందవేగతామీర్ష్యాలుతాం శఠతా మకృతజ్ఞతాంచాఽ

సంభోగశీలతాం కదర్యతాం చపలతామన్యా
నిచ యానితస్మిన్నుప్తాన్యస్యాగి అభ్యాసే సతి
సద్భావేఽతిశయేనభాషేత. యేనచదోషేణో
ద్విగ్నాం లక్షయే త్తేనైవానుప్రవిశేత్.
యదాసౌ మృగీతదా నైవశశతోదోషగి, ఏతే
నైవ బడబాహస్తినీ విషయశ్చోక్తః.

ప్రధానంగా దూతికలు నిసృష్టార్థలనీ, పరిమితార్థలనీ, పత్ర హారులనీ మూడువిధాలు. ఈ ముగ్గురూచేసే సామాన్య దౌత్య కర్మను చెవుతున్నారు. మొట్టమొదటగా నాయికదగ్గరకు ఎంతోమంచి స్వభావంకలిగిఉన్నట్లు చేరి జారస్త్రీల చిత్రకథ లను తెల్పే పటాలు అప్పుడప్పుడుచూపుతూ, సుభగం కరణ యోగాలను తెలియజేస్తూ (సుభగం కరణయోగాలు ముస్ముం దుచెవుతారు) లోకంలో జరుగుతున్న జారకథలనూ, పురాణ గాథలనూ హృదయాకర్షకంగా చెవుతూ కవులు పరదారలను గూర్చి కల్పించివ్రాసిన బిందుమతీ మొదలైన కథా సందర్భా లను ఉగ్గడిస్తూ, పరస్త్రీ అయిన అహల్యతో ఇంద్రుడూ, తారతో చంద్రుడూ, కామకేళిజరపడం, వాళ్లను అపహరించ డమూ ఈ మొదలైన కథలను చెవుతూ ఆమెను సంతోష పెట్టాలి. తరువాత ఆమె అందాన్ని, కులాన్ని, గొప్పతనాన్ని, శాస్త్రవిద్యలలో ఆమెకుగల విజ్ఞానాన్ని అనుకూలస్వభావాన్ని మంచిస్వభావాన్ని బాగా స్తోత్రంచెయ్యాలి. ఇలా స్తోత్రం చెయ్యడంచేత లోక జ్ఞానంలేని స్త్రీవ్యక్తి తనను అభిమానించు కుంటుంది. ఆ వెంటనే దూతిక ఇలాటిగుణాలుకల నీకు ఇలాటి కురూపీ దుర్గుణుడూ, అయినభర్త ఎక్కడ దాపురించాడమ్మా!

సుందరీ! నీ కితడు దాస్యంచెయ్యడానికికూడా పనికిరాడమ్మా! అని పలకాలి. ఇంక క్రమక్రమంగా అతని మందవేగత్వాన్నీ, ఈర్ష్యాస్వభావాన్నీ, ధూర్తగుణాన్నీ, కృతజ్ఞత లేకపోవడాన్నీ, సంభోగంమీద ఇచ్ఛలేకపోవడాన్నీ, కపటగుణాన్నీ, ఈ మొదలైనవీ, భర్తనుగురించి ఆమె హృదయంలోఉన్న చింతలనూ, అతని వార్ధక్యాన్నీ, పరిచయాన్నిపట్టి నాయికకు దూతిక తెలియజెయ్యాలి. ఆమె తనభర్తయందు ఏదోషాన్నిచూచి విరక్తురాలౌతుందో ఆ దోషాన్నేచూసి ఆమెకు అంతరంగికురాలు కావాలి. ఈ నాయిక మృగి అయిఉంటే శశజాతిపురుషుడనే దోషం ఉండదు. ఇలాగే బడబకు వృషజాతివాడనీ, హస్తినికి అశ్వజాతివాడనీ దోషం ఉండదు.

౧౧-౨౧. నాయికాయా ఏవతు విశ్వాస్యతా ముపలభ్య
దూతీత్వేన ఉపసర్పయే ద్ప్రథమసాహసాయాం
సూక్ష్మభావాయాంచేతి గోణికాపుత్రః. ౫.౪.౯

పై సూత్రంలో దూతికద్వారా నాయికను సమీపించాలని సామాన్యంగా చెప్పారు. ఇక్కడ గోణికాపుత్రుని మతాన్ని చెవుతున్నారు. దూతిక నాయికకు బాగా నమ్మకస్థురాలై తాను దూతికగా ఆమెను సమీపించాలి. అలా సమీపించి మొట్టమొదటగా పరపురుషసంగమంకోసం ప్రయత్నించే నాయికనూ, భావాన్ని బాగా స్పష్టంచెయ్యకుండా నిబ్బరంగా ఉండేదాన్నీ, స్వాధీనం చేసుకోడానికే మాత్రమే దూతిక ప్రయత్నించాలని గోణికాపుత్రుల ఆశయం. ఈ మతం వాత్స్యాయనులకుకూడా ఇష్టమే.

౧౧-౨-౨-౧౧-౨౭. సానాయకస్య చరితమనులోమతాం కామితానిదకథయేత్. ప్రసృతసద్భావాయాంచ యుక్త్యా కార్యశరీరమిత్థం వదేత్. శృణు! విచిత్రమిదం సుభగే! త్వాంకిలదృష్ట్వా అముత్ర అసావిత్థం గోత్రపుత్రో నాయకశ్చిత్తోన్మాదమనుభవతి. ప్రకృత్యాసుకుమారః కదాచిదన్యత్రాపరిక్లిష్టపూర్వస్తపస్వీ తతోఽధునాశక్యమనేన మరణమప్యనుభవితు మితివర్ణయేత్. తత్రసిద్ధాద్వితీయేఽహని వాచివక్త్రే దృష్ట్వాచ ప్రసాదముపలక్ష్య పునరపి కథాం ప్రవర్తయేత్. శృణ్వత్యాం చాహల్యాఽవిమారక శాకుంతలాదీన్యన్యాన్యపి లౌకికానిచ కథయేత్తద్యుక్తాని. వృషతాం, చతుష్షష్టి విజ్ఞతాం, సౌభాగ్యంచ నాయకస్య, శ్లాఘనీయతాంచాస్య ప్రచ్ఛన్నం సంప్రయోగం భూతమభూతపూర్వం వావర్ణయేదాకారం చాస్య లక్షయేత్. ౫.౪.౧౦.౧౫

ఆ దూతిక నాయికను సమీపించి నాయకుని మంచినడవడిని, అనుకూలభావాన్ని, సంభోగ ప్రారంభకాలంలోనూ, మధ్యకాలంలోనూ, అంత్యకాలంలోనూ అతనికిఉండే కామోద్రేకాన్ని, నెమ్మదిగా ఆమెకుచెప్పాలి. పై విషయాలు విని అనుకూలభావాన్ని నాయికసూచిస్తే, ఇక ఉపాయంగా చేయవలసినపనిని ఇలా చెప్పాలి. ఓ సుందరీ! ఈ చిత్రాన్నివిను.

భలానాగోత్రంలో పుట్టి, భలానాగుణాలు కలిగిఉన్న భలానా నాయకుడు నిన్నుచూచి ఇప్పుడిలా పిచ్చెత్తినవాడిలాగా అయిపోయినాడు. పాపం చాలా మంచివాడుసుమా! ఎప్పుడూ ఇలాటి సందర్భాలలో అట్లి క్లేశపడ్డవాడుకాదు. అతని మాట మాత్రంచేతనే యేస్త్రీ అయినా వశం అయిపోయేది. ఇప్పుడు నీవు లభించకపోతే ప్రాణాలుగూడా ఒదిలేస్తాడేమో? ఇలా వర్ణించిచెప్పాలి. ఇప్పటికి ఆ మాటలు విని నాయిక అనుకూలురాలుగా గోచరిస్తే మరునాటిదినానగూడా ఆమె మాటల్లోనూ, ముఖలక్షణాలలోనూ, చూపులలోనూ సంతోషాన్ని గమనించి మళ్లీ యేవో కథలు మొదలుపెట్టాలి. వెనుక గౌతమునిభార్యఅయిన అహల్యను ఇంద్రుడు మోహించలేదా? అగ్నిహోత్రుడనే ఆయన అగ్నిహోత్రగృహంలో పనీపాటూచేస్తూ ఉండమని తన కోడలిని నియమించగా, ఆమెను చూచి అగ్నిహోత్రుడు మోహించి ఆమెను కలిశాడు. వెంటనే ఆమె గర్భాన్నిధరించింది. ఆమె మామగారు కులంలోనుంచి వెలిఅయిపోతామనేభయంతో ఆమెను నట్టడవిలో ఒదిలివేశాడు. ఆమెను ఒక శబరసేనా నాయకుడు తనయింటికి తీసుకుపోయి కూతురిలాగా పోషించాడు. అక్కడ ఆమె ప్రసవించింది. మగపిల్లవాడు పుట్టాడు. ఆ పిల్లవాడు చిన్నతనంచేత మేకలమందలతోనూ, గొఱ్ఱెలమందలతోనూ, తిరుగుతూ, వాటిపాలుతాగి బాగా బలవంతుడయినాడు. ఆ చిన్నతనంలోనే భయంకరమృగాలనుగూడా చంపగలిగాడు. అతని బలాన్నిచూచి ఆ శబరసేనాపతి అతనికి అవిమారకుడని పేరు పెట్టాడు. ఆ అవిమారకుడు క్రమంగాపెరిగి యువకుడైనాడు.

ఇలా ఉండగా ఆ అడవిలోనికి ఆ దేశాన్నేలే రాజుగారు భార్యాబిడ్డలతో వేటకు వచ్చాడు. ఆయనకూతురిని ఒక యేనుగు చంపబోతుంటే ఈ అవిమారకుడు ఆ యేనుగును చంపి ఆ పిల్లను రక్షించాడు. ఆ పిల్ల అతనినిచూచి మోహించి స్వయంగానే అతనిని పెండ్లాడింది. ఇలాటికథలూ, ఇంకా శకుంతలాదుష్యంతులకథలూ, మొదలైనవాటిని వినిపించాలి. ఇంకా నాయకునికి సురతక్రియలోగల చాకచక్యాన్ని, సామర్థ్యాన్ని, పాంచాలిక చతుష్షష్టికళలలోగల పాండిత్యాన్ని, ఐశ్వర్యాన్ని చెప్పి రహస్యంగా అతనితో సంభోగంజరిపిచూస్తే అతనిసంగతి తెలుస్తుందని ఉబలాటపెట్టాలి.

౧౧౨౮-౧౧౩౦. స విహసితం దృష్ట్వాసంభాషతే, ఆసనేచోపనిమంత్రయతే, క్వాసితం, క్వశయితం, క్వభుక్తం, క్వచేష్టితం, కింవాకృతమితిపృచ్ఛతి, వివిక్తేదర్శయత్యాత్మానం, ఆఖ్యానకాన్యనుయుంక్తే, చింతయంతీనిశ్వసితి, విజృంభతేచ, ప్రీతిదాయంచదదాతి, ఇష్టేషూత్సవేషుచ స్మరతి, పునర్దర్శనానుబంధం విసృజతి, సాధువాదినీ సతీ కిమిదమశోభన మభిధత్సే ఇతి కథా మనుబధ్నాతి, నాయకస్య శాఠ్య చాపల్య సంబద్ధాన్దోషాద్ధాతి, పూర్వ ప్రవృత్తం చ తత్సందర్శనం, కథాభియోగంచ స్వయమకథయంతీ తయోచ్యమానమాకాంక్షతే. నాయక మనోరథేషుచ కథ్యమానేషు సపరిభవం నామహాసతి నచనిర్వదతీతి.

నాయిక తన భావాలను యెలాసూచిస్తుందో చెపుతున్నారు. నవ్వుతోలుకాడే చూపులతో ఆనందంగా మాటాడుతుంది. ఈ ఆసనంమీద కూర్చోమని గౌరవిస్తుంది. 'ఎక్కడున్నావు? ఎక్కడనిద్రపోయినావు? ఎక్కడ భుజించావు? ఎక్కడెక్కడ తిరిగావు? ఏమేమిచేశావు?' అని అడుగుతుంది. ఈ మాటల సందర్భంలో నాయకునితో యీ దూతిక కలిసి మాట్లాడటం, అతను చెప్పినమాటలూ మొదలైనవి వినటానికి అవకాశం ఉంటుందిగనుక అలా అడుగుతుంది. ఏకాంతంగా దూతికతో మాట్లాడేసదుపాయం చేస్తుంది. ఏవైనా కథలుచెప్పమని అడుగుతుంది. ఏమో ఆలోచిస్తున్నట్లుంటుంది. నిట్టూర్పులు విడుస్తుంది. ఆవులిస్తుంది. తనప్రేమను సూచించడానికి ఏదో ఒకవస్తువును నాయకునికిమ్మని ఆదూతిక చేతికిస్తుంది. తనకిష్టాలైనపనులు చేసేసమయాలలోనూ, ఉత్సవాలలోనూ, "ఇంకా దూతిక రాలేదే" అని ఆమెనుగురించి స్మరిస్తుంది. మళ్ళీమళ్ళీ ఆమెనురమ్మని చెపుతూ గౌరవంగా సాగనంపుతుంది. దూతిక నాయకుణ్ణిగూర్చి యేసందర్భాలైనా మాట్లాడే సమయాలలో తానే ఆ మాటలలో జోక్యం కల్పించుకుని మాట్లాడుతుంది. నాయకునియందు శఠుడనీ, చపలుడనీ, ఏవేవోదోషాలను ఆరోపిస్తుంది. పూర్వం నాయకుడు తనకు కనుపించడమూ, కొంత కామప్రసంగం నడవడమూ, మొదలైనదేమీ సిగ్గుచేత స్వయంగా చెప్పక దూతిక చెప్పతూఉంటే వినగోరుతుంది. నాయకునికోరికలు చెప్పతూఉంటే వేళాకోళంగా వెక్కిరించి నవ్వుతుంది.

౧౧౩౧-౧౧౩౨. దూత్యైనాం దర్శితాకారాం నాయకాభిజ్ఞా
నైరుపబృంహయేత్, అసంస్తుతాంతు గుణకథ
నైరనురాగ కథాభిశ్చావర్జయేత్.

దూతిక ఆమె ముఖలక్షణాలనూ, భావాలనూ గమనించిన తరువాత అనుకూలురాలని నిశ్చయించి నాయకునికీ తనకూ జరిగిన సంభాషణ క్రమాన్నంతా ఆమెకు వినిపించి ఆమెను బాగా అనురాగం కలదాన్నిగా ప్రోత్సహించాలి. క్రొత్త స్త్రీ అయితే నాయకుని గుణాలు చెప్పి, అతని ప్రేమగాథలు తెలిపి సుముఖురాలినిగా చేసుకోవాలి.

౧౧౩౩-౧౧౩౬. నాసంస్తుతా దృష్టాకారయోర్దూత్య మస్తీ
త్యౌద్దాలకిః, సంసృష్టాకారయోరప్యస్తీతి
బాభ్రవీయాః, సంస్తుతయో రప్యసంసృష్టా
కారయోరస్తీతి గోణికాపుత్రః, అసంస్తుత
యో రదృష్టాకారయోరపి దూతీ ప్రత్యయా
దితి వాత్స్యాయనః. సూ.౪.౩౧-౩౪.

ఈ విషయంలో కామశాస్త్రాచార్యుల మత భేదాలను చెవుతున్నారు. నాయికా నాయకులను ఒకరినిఒకరు అంతకుముందు ఒక్కమారైనా చూచుకొనకుండా ఉన్నా, ఒకరిభావాలు ఒకరికి సూచించుకోకుండా ఉన్నా, దౌత్యం పనిచెయ్యదని ఔద్దాలకిఅంటారు. నాయికానాయకులు ఒకరికొకరు చూచుకోకపోయినా ఒకరిగుణాలను ఒకరు వినిఉన్నప్పుడుగూడా దౌత్యం పనిచేస్తుందని బాభ్రవీయుల మతం. ఒకరినిఒకరు చూచుకున్నా, ఒకరిభావాలు ఒకరికి తెలియనప్పుడు దౌత్యం

అవసరమని గోణికాపుత్రులమతం. ఒకరినిఒకరు చూచుకోక పోయినా, ఒకరిభావాలు ఒకరికి తెలియకపోయినా దూతిక చాకచక్యాన్నిపట్టి అన్నీ సమకూడతాయని వాత్స్యాయను లన్నారు.

౧౧౩౭-౧౧౪_౨. తాసాం మనోహరాణ్యుపాయనాని, తాంబూలమనులేపనం స్రజమంగుళీయకం దాస్యా వా తేన ప్రహితం దర్శయేత్. తేషు నాయకస్య యథార్థం నఖదశనపదాని తాని తాని చిహ్నాని స్యుః. వాససి చ కుంకుమాంకమంజలిం నిదధ్యాత్. పత్రచ్ఛేద్యాని నానాభిప్రాయాకృతీని దర్శయేత్. లేఖపత్ర గర్భాణి కర్ణపత్రాణ్యాపీడాంశ్చ. స్వమనోరథాఖ్యాపనం, ప్రతిప్రాభృతదానే చైనాం నియోజయేత్. ఏవం కృత పరస్పర పరిగ్రహయోశ్చ దూతీ ప్రత్యయస్సమాగమః.

నాయకునితో పరిచయంలేని నాయికలకు మనోహరాలైన కానుకలను, తాంబూలమూ, గంధమూ, పూలమాలలూ, ఉంగరాలూ, నాయకుడు తనద్వారా పంపినట్లు దూతికచూపాలి. తాంబూలాలలో నాయకుని నిజమైన దంతక్షతాలూ, నఖక్షతాలూ ఉండాలి. నాయిక చీరమీద కుంకుమతో అద్దబడిన చేతులతో ముద్రవెయ్యాలి. అనేక అభిప్రాయాలు సూచించే పత్రభంగాలతో చెవులకు అలంకరించుకునే పత్రాలు గూడా ఇవ్వాలి. ఆమెకు పంపేపత్రాలలో నాయకుడు తన

అభిప్రాయాన్ని సూచించాలి. ఆమె పంపే ప్రణయలేఖలు తెమ్మని ఆ దూతికను నియోగించాలి. ఇలా దూతిక ద్వారా పరిచయాన్ని పొందిన నాయికా నాయకులు ఆమెద్వారా సమాగమాన్ని పొందగలుగుతారు.

౧౧౪౩-౧౧౪౫. సతు దేవతాభిగమనే, యాత్రాయాం, ఉద్యానక్రీడాయాం, జలావతరణే, వివాహే, యజ్ఞవ్యసనోత్సవే ష్వ గ్న్యు త్పా తే, చౌరవిభ్రమే, జనపదస్య చక్రారోహణే, ప్రేక్షావ్యాపారేషు తేషుచ కార్యేష్వితిబాభ్రవీయాః. సఖీభిక్షుకీక్షపణికాతాపసీ ఏతా సాంభవనేషు సుఖోపాయ ఇతి గోణికా పుత్రః. తస్యా ఏవతు గేహే విదితనిష్క్రమ ప్రవేశే చింతితాత్యయప్రతీకారే ప్రవేశన ముపపన్నం నిష్క్రమణ మవిజ్ఞాతకాలంచ తన్నిత్యం సుఖోపాయంచేతి వాత్స్యాయనః.

దేవతాపూజలకు వెళ్లేచోట్లా, క్షేత్రాలకు ప్రయాణంచేసే సందర్భంలోనూ, జనసమూహంలో స్నానంచేసే సమయం లోనూ, అగ్నిప్రమాదాలు జరిగేసమయంలోనూ, దొంగల అలజడిజరిగినప్పుడూ, ప్రయాణసమయంలో బళ్లు మొదలైన వాటిని యెక్కినప్పుడూ, ఇలాటి సమయాలలో జనసమర్దంలో గానీ, ఏకాంతప్రదేశ లోగానీ, దూతిక ద్వారా నాయికను పొందటం సుకరం అవుతుందని బాభ్రవీయులమతం. చెలులు, బిచ్చుకత్తెలు, తాపసి మొదలైనవాళ్ల గృహాలలోగూడా

దూతికద్వారా నాయికను సాధించవచ్చునని గోణికాపుత్రు లన్నారు. ఆ నాయికయింట్లోనే ఎప్పుడూ ఏమార్గం రహస్యంగా ప్రవేశించడానికీ బయటకువెళ్ళటానికీ అనుకూలంగా ఉంటుందో ఆ మార్గాన రాకపోకలుజరిపితే అది చాలా సుకరంఅని వాత్స్యాయనులన్నారు.

౧౧౪౬-౧౧౪౭. నిసృష్టార్థా, పరిమితార్థా,పత్రహారీ, స్వయం దూతీ, మూఢదూతీ, భార్యాదూతీ, మూక దూతీ,వాతదూతీ చేతిదూతీ విశేషాః॰నాయక స్యనాయికాయాశ్చ యథామనీషితమర్థముప లభ్య స్వబుద్ధ్యాకార్య సంపాదినీ నిసృష్టార్థా.

ఈ పైన చెప్పిన దూతికలు నిసృష్టార్థ, పరిమితార్థ, పత్రహారి, స్వయందూతి, మూఢదూతి, భార్యాదూతి, మూకదూతి, వాతదూతి అని ఎనిమిదివిధాలు. నాయికానాయకులకోరిక లను తనబుద్ధితో ఊహించి కార్యాన్నిసాధించే దూతికను నిసృష్టార్థ అంటారు.

౧౧౪౮-౧౧౫౦. సా ప్రాయేణ సంస్తుతసంభాషణయోః, నాయికయాప్రయుక్తా సంస్తుతాసంభాషణ యోరపీతి. కౌతుకాచ్చానురూపే యుక్తా విమా పరస్పరస్యేత్యసంస్తుతయోరపి.

పైనచెప్పిన నిసృష్టార్థఅనే దూతికచేసేపని చెవుతున్నారు. ఆమె తరుచుగా నాయికానాయకులు ఒకరినిఒకరు ఎరిగిఉండి మాటలుగూడా కలిసినమీదట దౌత్యంచేస్తుంది. ఈమె పరి చయంమాత్రం కలిగిఉండి మాటలుకలవని నాయికానాయ

కులలో నాయికచేత పంపబడి కార్యసాధనచేస్తుంది. ఒక్కొక ప్పుడు కుతూహలంచేత వీరిద్దరూ తగినవారని ఒకరినొకరు ఎరిగిఉండని నాయికానాయకులనుగూడా సంధానం చేస్తుంది.

౧౧౫౧. కార్యైకదేశ మభియోగైకదేశంచ ఉపలభ్య శేషం సంపాదయతీతి పరిమితార్థా. ౫.౪.౪౯

నాయకుడు కొంతవరకు సాధించి కొంతవరకు అభియోగాలను గూడా జరిపిఉన్నప్పుడు అతనిచేత నియోగింపబడి ఆ పనికి తాను ఒడిగట్టి పూర్తిచేసేదూతికను పరిమితార్థ అంటారు.

౧౧౫౨. సాదృష్ట పరస్పరాకారయోః ప్రవిరళదర్శనయోః.

నాయికానాయకులు ఒకరిభావాలనుఒకరికి తెలియజేసుకుని గూడా దర్శనం చాలాతరుచుగా ఉన్నప్పుడు పూని కార్యాన్ని సాధిస్తుంది.

౧౧౫౩. సందేశమాత్రం ప్రాపయతీతి పత్రహారీ. ౫.౪.౫౧

నాయికానాయకులకు వార్తలనుమాత్రం చేరవేసే దూతికను పత్రిహారి అంటారు.

౧౧౫౪. సాప్రగాఢసద్భావయోస్సంసృష్టయోశ్చ దేశకాల సంబోధనార్థం. ౫.౪.౫౨

పై పత్రహారి బాగా అనుకూలభావం కలిగిఉండి పూర్వం సంయోగం జరిపిఉన్న నాయికానాయకులకు ఈ ప్రదేశంలో, ఈ సమయంలో కలుద్దామనేవార్త చేరవెయ్యడానికుపయోగిస్తుంది.

౧౧౫౫. దౌత్యేన ప్రహితాన్యయా స్వయమేవ నాయక
మభిగచ్ఛేదజానతీ నామ తేన సహోపభోగం స్వప్నే
వాకథయేత్. గోత్రస్ఖలితేచ భార్యాంచాస్యనిం
దేత్. తద్వ్యపదేశేన స్వయమీర్ష్యాం దర్శయేత్.
నఖదశన చిహ్నితం వా కించిద్దద్యాత్. భవతేఽ
హమాదౌ దాతుం సంకల్పితేతిచ అభిదధీత. మమ
త్వద్భార్యాయా వా ఆకార రమణీయతేతి వివిక్తే
పర్యనుయుంజీత, సాస్వయందూతీ. తస్యాః వివిక్తే
దర్శనం ప్రతిగ్రహశ్చ. దూతీచ్ఛలే నాన్యామభి
సంధాయాస్యా స్సందేశ శ్రవణద్వారేణ నాయకం
సాధయేతౌ. తాంచోపహన్యాదాఽపి స్వయం
దూతీ. ఏతస్యాః నాయకోఽప్యన్య దూత్యశ్చ
వ్యాఖ్యాతాః. ౫.౪.౫౩-౫౬

మొట్టమొదట చెప్పిన నిసృష్టార్థఅనే దూతిక రెండువిధాలు. ఇతరులకోసం ఇతరులదగ్గర దౌత్యకృత్యాన్ని నెరవేర్చేది ఒక రకం. ఇక రెండోరకపు దూతిక తనకోరకుతానే నాయకుని దగ్గరకు దౌత్యానికిపోయేది. దీన్నే స్వయందూతిక అనికూడా అంటారు. ఈ స్వయందూతిక చేయవలసినపనులు చెపుతున్నారు. తనపేరు అతనితో చెప్పక "నేను స్వప్నంలో ఈ రోజున నీచేత సంభోగించబడ్డాను." అని చెప్పాలి. లేక గోత్రస్ఖలితంతో అతనిభార్యను నిందించాలి. అదేవిధంగా ఆమెమీద ఈర్ష్యను సూచించాలి. నఖక్షతాలూ, దంతక్షతాలూ గల ఏ వస్తువైనా అతనికివ్వాలి. మొట్టమొదట నన్ను నీకివ్వాలని ప్రయత్నాలు జరిగాయని చెప్పాలి. నీ భార్య అందకత్తెయో.

నే సందర్భమైనో చూడమని జనులులేనిచోట రహస్యంగా చెప్పాలి. ఈమెను స్వయందూతి అంటారు. ఈమెను విజన ప్రదేశంలో దర్శించడమూ, సంభోగించడమూ యుక్తం. తానే దూతికఅయినట్లు నాయకుణ్ణి సమీపించి దేన్నిగురించో చెపుతూ సందేశ శ్రవణంద్వారా అతన్ని సాధించేస్త్రీగూడా స్వయందూతిక అవుతుంది. ఇంకా ఆమె యే నాయికను ఇంత వరకూ నాయకునితో వర్ణించిచెప్పిందో, ఆమెయందున్న దోషాలు అతనికి బాగాచెప్పాలి. ఈ పైనచెప్పిన స్వయం దూతిక వృత్తాంతంవల్ల స్వయంగా దౌత్యాన్ని నిర్వహించు కునే నాయకుడూ, అతనిదూతలూ వ్యాఖ్యానం చేయబడ్డారు.

౧౧౫౬. నాయకభార్యాం ముగ్ధాం విశ్వాస్య అయంత్రణ యానుప్రవిశ్య నాయకస్య చేష్టితాని పృచ్ఛేత్. యోగాన్ శిక్షయేత్. కోపమేనాం గ్రాహయేత్. ఏవంచ ప్రతిపద్యస్వేతి శ్రావయేత్. స్వయం చాస్యాం నఖదశనపదాని నిర్వర్తయేత్. తేన ద్వారేణ నాయక మాకారయేత్సా మూఢదూతీ.

నాయిక రహస్యంగా ప్రవర్తించవలసింది కాబట్టి స్వయంగా దౌత్యాన్ని జరుపుకోడానికి అవకాశంఉండదు. అప్పుడు నాయిక ముగ్ధురాలుగాఉన్న నాయకునిభార్యను నమ్మించి వశ పరుచుకుని నాయకుడు ఎలాఎలా సురతాదిక్రియలు జరుపు తాడో ఆ చేష్టలన్నిటినీ ఆమె నడగాలి. అప్పుడామె బేల తనంచేత ఆమెకు వశ్యురాలై సంకోచంలేకుండా తన నాథుని చేష్టలనన్నిటినీ ఆమెకుచెవుతుంది. ఆ నాయిక ఆ నాయకుని

భార్యేవల్ల అతని చేష్టలు తెలుసుకుని అతనిని వశపరచుకునే యోగాలను ఆమెకు నేర్పాలి. తన అభిప్రాయాన్ని నాయకునికి తెలిపేందుకుగా ఆమెను అలంకరించాలి. కోపాన్ని పూనేట్లు ఆమెకు బోధించాలి. ఇలాచెయ్యి, అలాచెయ్యిఅని చెప్పాలి. తనంతటతానుగూడా నఖక్షతాలూ, దంతక్షతాలూ ఆమెమీద చెయ్యాలి. ఈ విధంగా నాయకునిహృదయంలో నాయికనుగురించి భావం జనించేట్లు నాయకునిభార్య ప్రవర్తించాలి. ఈ నాయకునిభార్యను మూఢదూతి అంటారు.

౧౧౫౭. తస్యాస్తయైవ ప్రత్యుత్తరాణి యోజయేత్.

ఆ మూఢదూతికచేతనే నాయకునికి రతివిషయంలో ప్రతిసమాధానం కలిగేలాగా చేయించాలి.

౧౧౫౮. స్వభార్యాంవా మూఢాం ప్రయోజ్యయా సహ
విశ్వాసేన యోజయిత్వా, తయైవాకారయేదాత్మ
నశ్చ వైచక్షణ్యం ప్రకాశయేత్. సాభార్యాదూతీ.
తస్యాస్తయైవాకారగ్రహణం. ౫.౪.౫౯

ఒక్కొకప్పుడు నాయకుడుగూడా సిగ్గుచేత స్వయంగా దౌత్యాన్ని నిర్వహించుకోలేకపోతే, అతడు మూఢురాలుగా ఉన్న తనభార్యకు ఆమెతో నమ్మకంగా స్నేహంకల్పించి ఆమెద్వారా తనభావాన్ని నాయికకు తెలియజెయ్యాలి. ఆమెకు తనపైన భావంకలిగేలాగా ఆమెచేత చేష్టలుచేయించాలి. ఇంకా ఆమెద్వారా తనకు కళలోఉన్న చాతుర్యమూ, మొదలైనవి నాయికకు తెలియజెయ్యాలి. ఆమెను భార్యా

దూతి అంటారు. తెలివితేటలూ, ప్రపంచజ్ఞానమూ గల భార్యను ఈ దౌత్యానికి నియోగిస్తే ఆమె అతనికి విరుద్ధంగా ప్రవర్తిస్తుంది.

౧౧౫౯. బాలాం వా పరిచారికా మదోషజ్ఞా మదుష్టోపాయేన ప్రహిణుయాత్తత్ర స్రజకర్ణపత్రే వా గూఢలేఖ విధానం, నఖదశనపదం వా సామూకదూతీ, తస్యాస్తస్మైవ ప్రత్యుత్తరప్రార్థనం. ౫.౪.౬౦

లేక దోషాలేవీ ఎఱుగకుండా, వంచనలేమీ యెఱుగని బాలిక అయిన పరిచారికను పిల్లలతో ఆటలాడడమనే ఉపాయంచేత ప్రతిరోజూ నాయిక ఇంటికి పంపుతూ ఉండాలి. ఆపిల్ల నాయికతో పరిచయాన్ని యేర్పరుచుకున్న తరువాత దానిద్వారా పూలమాలికలలో రహస్యంగా లేఖలు పెట్టి పంపాలి. ఈమె యే వార్తలూ నాయికకు చెప్పదుగనుక ఉత్తరాలు జేరవేసే పత్రహారి అనే దూతికవంటిది. ఈమెను మూకదూతి అంటారు. నాయికయొక్క ప్రత్యుత్తరాన్ని ఆ బాలికద్వారానే రప్పించుకోవాలి నాయకుడు.

౧౧౬౦. పూర్వప్రస్తుతార్థ లింగసంబద్ధ మన్యజనాగ్రహణీయం లౌకికార్థం ద్వ్యర్థంవా వచన ముదాసీనం యాశ్రావయేత్సావాతదూతీ, తస్యాఅపి తమైవ ప్రత్యుత్తర ప్రార్థనమితి తాసాం విశేషాః.

ఆ బాలికకుగూడా నాయిక వశంకాకపోతే నాయికానాయకులకు పూర్వం జరిగిఉన్న చేష్టలను జ్ఞాపకంచేసే వాక్యాలను ఇతరులకు తెలియకుండా ఉండేలాగా అర్థంకాకుండా వ్రాసి నాయకుడు నాయికదగ్గరకు పంపాలి. లేదా రెండర్థాలు

ఒచ్చేలాగా కవిత్వం సృష్టించైనా ఉత్తరంపంపాలి. ఈ ఉత్తరాలు చేరవేసేదూతిక చాలా ధైర్యవంతురాలూ, ఎవ్వరికి లొంగనిదీ, అయిఉండాలి. ఈమెను వాతదూతి అంటారు. అప్పుడుగూడా నాయికభావాన్ని ఆమెద్వారా గుర్తించాలి. ఇవి దూతికలోని విశేషాలు.

భవంతి చాత్రశ్లోకాః—

౧౧౬౧-౧౧౬౨. విధవేక్షణికా దాసీ భిక్షుకీ శిల్పకారికా,
ప్రవిశత్యాశు విశ్వాసం, దూతీకార్యంచ
విందతి। విద్వేషం కారయేత్పత్యౌ, రమ
ణీయానివర్ణయేత్। చిత్రాన్సురతసంభోగా
నన్యాసామపి దర్శయేత్. నాయకస్యాను
రాగంచ పునశ్చరతికౌశలం। ప్రార్థనాం
చాధికస్త్రీభి రవష్టంభంచ వర్ణయేత్.

విధవ, సోదిచెప్పేదీ, దాసి, యోగిని, బొమ్మలు మొదలైన వాటిని తయారుచేసేదీ, వీళ్లు దూతీకర్మకు చాలా అనుకూలు రాండ్రుగా ఉంటారు. పరగృహాలలోనైనా జంకులేకుండా ప్రవేశిస్తారు. స్త్రీలను బాగా నమ్మిస్తారు. దూతికలు చెయ్యవలసిన పనులు:- భర్తయందు ద్వేషాన్నికల్పించడమూ, చిత్రవిచిత్రాలైనవీ, రమణీయమయినవీ, ఇతరస్త్రీలకు సంబంధించినవీ అయిన సురతకథలను నాయిక వినిపించడమూ, నాయకునికి ఉన్న ప్రేమ విశేషాన్నీ, అతని రతికౌశలాన్నీ, అందకత్తెలైన పలువురుస్త్రీలు అతనిని ప్రేమించడాన్నీ బాగా నాయికదగ్గర వర్ణించాలి.

౧౧౬౩. అనుకల్పిత మప్యర్థం, తత్స్పృష్టం దోష కారణాత్।
పునరావర్తయత్యేవ దూతీవచన కౌశలాత్.

ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే పారదారికే పంచమేఽధికరణే దూతీకర్మాణి చతుర్థోఽధ్యాయః.

దోషాలున్నాయనే కారణాన్నిపట్టి నాయకుడు నాయికవిషయంలో ఆలోచనగూడా లేకుండా ఒదిలివేసినా దూతిక తన మాటలలోని తియ్యదనంవలన తిరిగి నాయికయందు ప్రేమను కల్పించగలదు.

ఇలా భారద్వాజ గోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయమూర్తి చేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలోని పారదారికమనే పంచమాధికరణంలో నాలుగో అధ్యాయం ముగిసింది.



శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

### ౫. పారదారికాధికరణం

### ౫. ఈశ్వర కామితాధ్యాయం

౧౧౬౪. నరాజ్ఞాం మహామాత్రాణాంవా పరభవన ప్రవేశో విద్యతే. మహాజనేనహి చరితమేషాం దృశ్యతే అను విధీయతేచ. ౫.౫.౧

రాజులకుగానీ, మంత్రిలూ, సామంతులూ మొదలైనవారికి గానీ పరులగృహంలో ప్రవేశించడానికి అవకాశంఉండదు. వీరి చరిత్రను జనులంతా చూస్తూఉంటారు. ఎల్లప్పుడూ వారి చుట్టూ జనులు మూగిఉంటారు. వాళ్లు అలాటితప్పులు ఆచరిస్తే ప్రజలుగూడా ఆ పద్ధతినే అనుసరిస్తారు.

౧౧౬౫. సవితారముద్యంతం త్రయోలోకాః పశ్యంతి అనూద్యంతేచ. గచ్ఛంతమపిపశ్యంతి, అను ప్రతిష్ఠంతేచ.

సూర్యుడు ముల్లోకాలలోనూ శ్రేష్ఠుడుగా వినబడుతున్నాడు. అతడు ఉదయిస్తుంటే ముల్లోకాలూ చూస్తూన్నాయి. అతని ఉదయాన్ననుసరించి నిద్రలేస్తున్నాయి. అతడు అస్తమించడాన్నికూడా చూస్తున్నాయి. నిద్రిస్తున్నాయి. ఈ ఉదయాస్తమయాలనుపట్టి తమతమపనులలో ప్రాకొంటున్నాయి.

౧౧౬౬. తస్మాదశక్యత్వా గ్గర్హణీయత్వాచ్చ న తే వృథా కించిదాచ రేయుః. ౫.౫.3

అందువల్ల రాజులు మొదలైనవాళ్ళు పరులగృహాలలో ప్రవేశించి పరస్త్రీలతో రమించడం అసంభవం. వారికది అశక్యం. అలా ఆచరిస్తే మహాజనం అసహ్యించుకుంటుంది. ఇతరులు గూడా అలా ఆచరించడానికి మార్గం అవుతుంది. అందువల్ల రాజపురుషులూ, పెద్దలూ, మంచి చరిత్రగలవారూ, పరస్త్రీ గమనాన్ని యెన్నడూ చేయరాదు.

౧౧౬౭. అవశ్యం త్వాచరితవ్యే యోగాన్ప్రయుంజీరన్.

పైనచెప్పిన పెద్దమనుష్యులు తప్పనిసరిగా పరదారాగమనం చెయ్యవలసివస్తే దూతికలద్వారా ప్రయోగాలను నెరపాలే గాని తమంతటతాము పరగృహంలో ప్రవేశించరాదు.

౧౧౬౮. గ్రామాధిపతే రాయుక్తస్యహాలోత్థవృత్తి పుత్రస్య యూనో గ్రామీణ యోషితో వచనమాత్రసాధ్యాః యాస్తాశ్చర్షణ్య ఇత్యాచక్షతే విటాః. ౫.౫.౫

ప్రభువులు మున్నగువారు దూతికలద్వారా ప్రయోగాలను రహస్యంగా కొన్నిటినీ, వ్యక్తంగా కొన్నిటినీజరపాలి. ప్రభువులుగూడా, అల్పులనీ, ముఖ్యులనీ రెండువిధాలు. ఇక్కడ అల్పులైనరాజులు రహస్యంగా ప్రయోగించతగిన అభియోగాలను చెపుతున్నారు. అగ్రహారీకులూ, గ్రామాధికారులూ, మొదలైనవాళ్లూ, వ్యవసాయదారులవల్ల పన్నులు వసూలు చేసే అధికారుల్లూ, కరణాలూ, మునసబులూ, యువకులుగా

ఉండే వ్యవసాయదారుల కుమారులూ, మొదలైనవాళ్లకు కొంత పలుకుబడి ఉంటుంది కాబట్టి వాళ్లు అల్పాధికారంగల ఈశ్వరులని పిలువబడతారు. వాళ్ల మాటమాత్రించేతనే స్త్రీలు వశం అయిపోతారు. కాని పల్లెటూళ్ల స్త్రీలందరూ ఇలాటివాళ్లని తలంచరాదు. ఎవరో కొందరు నీచులుమాత్రం ఇలా ఉంటారు. ఇలాటి జారపురుషులను విటులంటారు. ఇలాటి జారస్త్రీలను చర్షణులంటారు.

౧౧౬౯. తాభిస్సహ విష్టికర్మసు కోష్ఠాగారప్రవేశే ద్రవ్యాణాం నిష్క్రమణ ప్రవేశనయోః, భవన ప్రతిసంస్కారే, క్షేత్రకర్మణి కార్పాసోర్ణాతసీశణవల్కలాదానే, సూత్రప్రతిగ్రహే, ద్రవ్యాణాం క్రయవిక్రయ వినిమయేషు, తేషు తేషుచ కర్మసు సంప్రయోగః.

పైనచెప్పిన జారిణులైన పల్లెస్త్రీలతో సంప్రయోగంజరిపే ఉపాయం చెపుతున్నారు. ఆ స్త్రీలు సాధారణంగా గృహకృత్యాలలో నియమింపబడుతూ ఉంటారు. బియ్యందంచడం, పిండివిసరడం, చెరగడం, ఇళ్లు ఊడవడం, అలకడం, మొదలైనవే విష్టికర్మలు. ఈ పనులన్నీ ధనానికిబదులు బియ్యమూ, అన్నమూ, పెట్టి చేయించుకోడం సర్వసాధారణంగా అందరికీ అనుభవసిద్ధమే. అలాటి సమయాలలో ధాన్యపుగాదెలూ, వడ్లకొట్లూ, పురులూ, మొదలైనవాటిలో ధాన్యం పోయించే సమయాలలోనూ, వాటిలోనుంచి ధాన్యాదులను బయటకు చేర్చే సమయాలలోనూ, ఇండ్లకు బూజుదులపడం, గిలాబా చేయించడం మొదలైనపనులు చేయించే సమయాలలోనూ,

పొలాలలో పనులుజరిపే సమయాలలోనూ, పత్తి, ఉన్ని, నారలు, వాటిని శుభ్రిపరిపించే సమయాలలోనూ, వాటి దారాలు ఒడికించే సమయాలలోనూ, అలా తీసినదారాన్ని ఒప్పచెప్పుకునే సందర్భంలోనూ, ధాన్యాదులను కొనేసందర్భం లోనూ, అమ్మేసందర్భంలోనూ, ఆయాపనులలో నియమింప బడిన స్త్రీలతో పైనచెప్పినవారు సంగమిస్తూఉంటారు.

౧౧౭౦-౧౧౭౧. తథా వ్రజయోషిద్భిస్సహ గవాధ్యక్షస్య, విధవాఽనాథా ప్రవ్రజితాభి స్సహ సూత్రాధ్యక్షస్య. ౫.౫.౭.౮

అలాగే గొల్లపడుచులతో గోవులుకలవాడికీ, విధవలూ, భర్తలచే విడువబడినవారూ, సన్యాసినులూ, మొదలైనవారితో వారికి సమీపస్థులైనవారితోనూ, సంయోగం జరుగుతూ ఉంటుంది.

౧౧౭౨. మర్మజ్ఞత్వా ద్రాత్రావటనే చాఽటంతీభిర్నాగర కస్య. ౫.౫.౯

రాత్రిలందు గస్తీ తిరగడానికి నియోగింపబడిన నాగరకునికి స్త్రీల రహస్యాలు బాగా తెలుస్తాయిగనుక అలాటివానికి రాత్రులయందు సంచరించే సమయాలలో రాత్రిలందు సంచ రించే స్త్రీలతో సంయోగం జరుగుతుంది.

౧౧౭౩. క్రయవిక్రయే పణ్యాధ్యక్షస్య. ౫.౫.౧౦

రాజకీయాలైన వస్తువులను అమ్మేసమయాలలోనూ, కొనేసమ యాలలోనూ, ఆయాపనులలో నియమింపబడిన అధికారికి ఆ వ్యాపారాలు జరిపేస్త్రీలతో సంభోగం జరుగుతుంది.

౧౧౭౪. అష్టమీ చంద్రకౌముదీసు వసంతకాదిషు పత్తన
నగర ఖర్వాటయోషితా మీశ్వరభవనే సహాంతః
పురికాభిః ప్రాయేణక్రీడా. ౫.౫.౧౧

ఇక ముఖ్యులైన రాజపురుషులనుగూర్చిన రహస్యాభియోగా
లను చెవుతున్నారు. అష్టమీచంద్రికౌముది, వసంతకము,
మొదలైన ఉత్సవసమయాలలోనూ, పట్టణాలలోనూ, నగరా
లలోనూ, ఖర్వాటాలలోనూ, ఉండే స్త్రీలతోనూ, రాజుల
గృహాలలో అంతఃపురస్త్రీలతోనూ, రాజులకూ, పెద్దమనుష్యు
లకూ సాధారణంగా క్రీడలు జరుగుతాయి.

౧౧౭౫. తత్రచాపానకాంతే నగరస్త్రియో యథాపరిచయ
మంతఃపురికాణాం పృథక్పృథగ్భోగా వాసకాన్ప్ర
విశ్య కథాభి రాసిత్వా పూజితాశ్చోపప్రదోషం
నిష్క్రామయేయుః. ౫.౫.౧౨

ఆ క్రీడలలో అంతఃపురస్త్రీలతో పానీయాలు సేవించడం జరుగు
తుంది. అటుతరువాత రతిగృహాలలో ప్రవేశించి రతికథలతో
సాయంకాలంవరకూ జరిపి వాళ్ల పూజలుపొంది, వాళ్ళద్వారా
పానీయాలు సేవించి తరువాత ఆ రాజగృహంనుంచి తమతమ
స్థానాలకు చేరుకోవాలి. ఆ స్త్రీలనుగూడా వారివారిస్థానాలకు
చేర్చాలి.

౧౧౭౬-౧౧౮౩. తత్ర ప్రణిహితా రాజదాసీ ప్రయో
జ్యాయాగి పూర్వసంసృష్టా తాం తత్ర సంభా
షేత. రామణీయకదర్శనేచ యోజయేత్.
ప్రాగేవస్వభవనస్థాం బ్రూయాత్. అమ

ష్యాం క్రీడాయాం తవ రాజభవనస్థానాని రామణీయకాని దర్శయిష్యామీతి కాలేచ యోజయేత్. బహిః ప్రవాళకుట్టిమంతే దర్శయిష్యామీతి, మణిభూమికాం వృక్షవాటికాం, మృద్వీకామండపం, సముద్రగృహప్రాసాదాన్ గూఢభిత్తి సంచారాం శ్చిత్రకర్మాణి క్రీడామృగాన్ యంత్రాణి, శకునాన్వ్యాఘ్ర సింహపంజరాదీనిచ యాని పురస్తాద్వర్ణితానిస్యుః. ఏకాంతేచ తద్గతమీశ్వరానురాగం శ్రావయేత్. సంప్రయోగే చాతుర్యం చాభివర్ణయేత్. అమంత్రసావ్రంచ ప్రతిపన్నాం యోజయేత్.

పైన చెప్పిన ఉత్సవాలలో అంతఃపూర్వం రాజుచేత నియమింపబడిన రాజదాసి అతను కోరిఉన్న నాయికతో కలిసి అక్కడ మాట్లాడాలి. క్రమంగా నీకు అందచందాలైన చిత్రాలు చూపిస్తానని ఆమె యింటిలో ఉండగానే చెప్పి ఈ క్రీడాసందర్భంలో నీకు రాజభవనమూ, అక్కడి విశేషాలూ, అందచందాలైనచోట్లూ చూపిస్తానురమ్మని ఆమెనుఒప్పించి ఆచోటికి తీసుకురావాలి. ఇక నెమ్మదిగా బయటఉన్న ప్రవాళకుట్టిమాన్ని చూపిస్తాననీ, మణిమందిరాన్ని, పూలతోటను, ద్రాక్షామంటపాన్ని, జలయంత్రాలనూ, సముద్రగృహాలనూ, రహస్యంగా గోడలలోనుంచి నడిచేమార్గాలనూ,చిత్రకర్మలూ, ఆటలకొరకైన జంతువులబొమ్మలూ, శకునపక్షులూ, పెద్దపులులూ, సింహాలూ, మొదలైనవాటిబోనులూ, పూర్వం

ఆమెతో చూపిస్తానని చెప్పినవన్నీ చూపించాలి. తరువాత ఒక యేకాంతప్రదేశంలో ఆమెను చేర్చి ప్రభువు నిన్ను సంభోగించడానికి కోరుతున్నాడనీ, నిన్ను ప్రేమిస్తున్నాడనీ, ఆమెకు తెలియపరచాలి. అతనికి సంభోగంలోగల నేర్పును ఆమెకు వర్ణించిచెప్పాలి. మనము ఇలావచ్చినట్లు యెవ్వరికీ తెలియదనిచెప్పి నెమ్మదిగా రాజుతో సంప్రయోగానికి ఆమెను ఆ దూతిక సమకూర్చాలి.

౧౧౮౪- అప్రతిపద్యమానాంతు స్వయమేవేశ్వర ఆగత్య
౧౧౮౫. ఉపచారై స్సాంత్వయిత్వా తాం రంజయిత్వా
సంభూయచ సానురాగం విసృజేత్. ప్రయోజ్యా
యాశ్చ పత్యురనుగ్రహోచితస్య దారా న్నిత్య
మంతఃపుర మాచిత్యాత్ప్రవేశయే త్తత్రప్రణి
హితా రాజదాసీతి సమానం పూర్వేణ. అంతఃపురి
కావా ప్రయోజ్యయాసహ స్వచేటికా సంప్రేష
ణేన ప్రీతిం కుర్యాత్. పరిసృత ప్రీతించ సావ
దేశం దర్శనే నియోజయేత్. ప్రవిష్టాం,
పూజితాం పీతవతీం ప్రణిహితా రాజదాసీతి
సమానం పూర్వేణ. యస్మిన్వా· విజ్ఞానే
ప్రయోజ్యా విఖ్యాతా స్యాత్తద్దర్శనార్థ మాంతః
పురికా సోపచారం తమాహ్వయేత్. ప్రవిష్టాం
ప్రణిహితా రాజదాసీతి సమానం పూర్వేణ.
అద్భుతానర్థస్య భీతస్యవా భార్యాం భిక్షుకీబ్రూ
యాత్, అసావాంతఃపురికా రాజని సిద్ధా

గృహీతవాక్యా, మమవచనం శృణోతి స్వభావ
తశ్చ కృపాశీలా, తామనేనోపాయేన నాధిగ
మిష్యామి. అహమేవ తే ప్రవేశం కరిష్యామి,
సాచ తే భర్తుర్మహాంత మనర్థం నివర్తయిష్యతీతి
ప్రతిపన్నాం ద్వ్యస్త్రీరితి ప్రవేశయేత్. అంతఃపురి
కాస్యా అభయం దద్యా దభయప్రవణాచ్చ
సంప్రహృష్టాం ప్రతిహితా రాజదాసీతి సమావం
పూర్వేణ. ఏతయా వృత్త్యర్థినాం, మహామా
త్రాభితప్తానాం బలా ద్విగృహీతానాం, వ్యవ
హారే దుర్బలానాం, స్వభోగేనాసంతుష్టానాం,
రాజని ప్రీతికామానాం, రాజభవనేషు
స్వాతంత్ర్య మిచ్ఛతాం, సజాతైర్బాధ్య
మానానాం, సజాతాన్బాధితుకామానాం,
సూచకానామన్యేషాం, కార్యవశీనాం జాయాగి
వ్యాఖ్యాతాగి. ౫.౫.౧౪-౨౮

నాయిక యిష్టపడనప్పుడు చెయ్యవలసినవిధులను చెవుతు
న్నారు. పుష్పమాలలు మొదలైన అలంకరణాలవల్లా, మద్య
పానాదులవల్లా, బాగా ఓదార్పుకలిగించి నాయకుడు ఆ
నాయికను సుముఖురాలినిగా చేసుకోవాలి. సాధారణంగా
స్త్రీలు ప్రేమసూచకాలైన ఉపచారాలవల్ల సిగ్గుపడి వశమౌ
తారు. కాబట్టి అలా వశంచేసుకున్న స్త్రీని ఆమెకు ఇష్టమైన
తీరుగా ఆమెతో సంభోగించి తృప్తిపరచి దాసీద్వారా నాగ
రక స్త్రీలతోచేర్చి ఆదర ప్రేమలతో సాగనంపాలి. ప్రభువు

నన్ను ప్రేమించాడనే సంతృప్తి కలిగేలాగా ఆమెను ఆదరించాలన్నమాట. రాజుగారి అనుగ్రహానికి పాత్రుడు కాగోరే పురుషుని భార్యనుగూడా ఎప్పుడూ అంతఃపురంలోనికి అనుగ్రహింపవలసిన అవసరంఉంది గనుక ప్రవేశింపచెయ్యాలి. ఆమె అలా అంతఃపురంలో ప్రవేశించినతరువాత పూర్వంచెప్పిన రాజదాసి పూర్వపుపద్ధతిగా రాజుగారికి తార్చాలి. ఒక అంతఃపురస్త్రీ ఆ నాయికతోకలిసి తన చేటికను ఆమెతోగూడా పంపి ఆమెకు ప్రీతినికల్పించాలి. ఆ నాయిక సంతోషపూరితురాలై ఉన్నప్పుడు మాటలసందర్భంలో అటూ ఇటూ తీసుకుపోయి రాజుగారున్నచోటికి చేర్చాలి. ఆ తరువాత ఆమాటా ఈమాటా చెప్పి ఆమెను ఆ చేటిక రాజగారిసన్నిధికి చేర్చాలి. ఆటుతరువాత ఆమెనుగౌరవించి, మద్యం త్రాగేట్టుచేసి రాజదాసి చక్కగా మాటాడాలి. తరువాత పైన చెప్పినప్రకారం చెయ్యాలి. నాయిక మంచి విజ్ఞానవంతురాలుగా ప్రఖ్యాతిని పొందిఉంటే ఆమెను చూడడానికి అంతఃపురవనిత సగౌరవంగా ఆమెను తనదగ్గరకు పిలిపించుకోవాలి. అలా అంతఃపురంలో ప్రవేశించినతరువాత రాజదాసి మధురంగా ఆమెతోసంభాషించి పూర్వంవలెచెయ్యాలి. ఏదైనా ఉరిశిక్ష మొదలైన ఆపదలో ఉన్నవానిభార్యనూ, పరులవల్ల భయపడి ఉన్నవానిభార్యనూ, బిచ్చుకత్తెసమీపించి "భలానా అంతఃపురయువతి రాజునకు చాలా ఇష్టురాలు. రాజు ఆమెమాట అంటే కాదనలేడు. ఆమె నామాటతప్పకుండా వింటుంది. సహజంగానే ఆమె చాలా దయాస్వభావంకలది. నిన్ను ఆమె దగ్గరకు ఉపాయంతో తీసుకునివెడతాను. నేనే నిన్నక్కడకు

చేస్తాను. ఆమె నీ భర్తకు సమకూడిన ఆపదను తనభర్తతో చెప్పి తప్పింపగలదు." అనిచెప్పి బోధించి అంతఃపురంలోనికి రెండుమూడుమార్లు స్వతంత్రంగా ప్రవేశింపచెయ్యాలి. ఆ అంతఃపురయువతికూడా ఆమెను తప్పకరక్షిస్తానని అభయ హస్తమివ్వాలి. ఆ అభయప్రదానాన్ని విని ఆమె సంతసించిన తరువాత రాజదాసి ఆమెను వశపరచుకొని పూర్వంవలె కార్య క్రమాన్ని నడపాలి. ఈ పైనచెప్పిన విధానాలచేత ఏవైనా నౌకరీలు కోరేవారిభార్యలూ, మంత్రులూ, సామంతులూ, మొదలైనవారిచేత పీడింపబడినవారిభార్యలూ, బందీకృతుల భార్యలూ, వ్యవహారవిషయంలో దెబ్బతింటూ ఉన్నవారి భార్యలూ, ఏ పురుషునిసంభోగంవల్ల స్త్రీలు తృప్తిపడరో ఆ పురుషునిభార్యలూ, రాజును సంతోషపెట్టాలని కోరేవారి భార్యలూ, రాజగృహాలలో స్వాతంత్ర్యం సంపాదించాలని కోరేవారిభార్యలూ, తన జాతివాళ్ళచేత బాధింపబడేవాని భార్యలూ, తనజాతివాళ్ళను బాధపెట్టగోరేవానిభార్యలు ఇంకా ఇలాటి కార్యకలాపాలలో వశవర్తులై ఉండేవాళ్ళభార్యలూ వ్యాఖ్యానం చెయ్యబడ్డారు.

౧౯౦- అన్యేనవా సహ సంసృష్టాం సంగ్రాహ్య
౧౯౧. ప్రయోజ్యాం దాస్యముపనీతాం క్రమేణాంతఃపురం ప్రవేశయేత్. ప్రణిధినా చాయతిమస్యాః సందూష్య రాజని విద్విష్ట ఇతి కళత్రావగ్రహోపాయేన ఏనామంతఃపురం ప్రవేశయేత్. ఇతి ప్రచ్ఛన్న యోగాః, ఏతే రాజపుత్రేషు ప్రాయేణ.

గ. గ. ౨౮. ౨౯

పైనచెప్పినవిధంగా స్వాధీనంగానిస్త్రీని సహజంగా దస్యులారాలు కాకపోయినా, ఎవరితోనో సంసర్గంచేసినట్లు నెపం ఆరోపించి కులంలోనుంచి వెలివేయించి ఆమెను దాసినిగా పరిగ్రహించి క్రమంగా అంతఃపురంలో ప్రవేశింపచెయ్యాలి. లేక నాయిక భర్తను పరభార్యాపహర్తనుగా చారునివలన గ్రహింపచేసి దానికిబదులుగా అతనిభార్యను అంతఃపురంలో ప్రవేశపెట్టు కోవాలి. ఇవి రహస్యయోగాలు. ఇవి సాధారణంగా రాజ పుత్రులకు సంబంధించిన విషయాలు.

౧౯౯-౨. నత్వేవ పరభవన మీశ్వరః ప్రవిశేత్. ఆభీరంహి కోట్టరాజం పరభవనగతం భ్రాతృప్రయుక్తో రజకో జఘాన. కాశిరాజం జయత్సేన మశ్వాధ్యక్షః ఇతి.

ఎలాంటి సమయాలలోనైనాసరే రాజు పరగృహంలో ప్రవేశం చరాదు. అలా రాజులు పరగృహంలో ప్రవేశిస్తే ప్రమాదాలు సంభవిస్తాయి. వెనుక ఘూర్జరదేశరాజైన ఆభీరుడు పరస్త్రీకోసం పరగృహంలో ప్రవేశించాడు. అతని రాజ్యాన్ని అపహరించగోరుతున్న అతనిసోదరుడు ఆ సమయంకని పెట్టి ఒక చాకలిని అతన్ని చంపిరమ్మని పంపాడు. ఆ చాకలిచేత ఆ రాజు చంపబడ్డాడు. కాశీరాజైన జయత్సేనుణ్ణి ఒక అశ్వాధ్యక్షుడు చంపాడు.

౧౯౯-౩. ప్రకాశకామితాని తు దేశ ప్రవృత్తి యోగాత్.

దేశాచారాన్ని చక్కగాకనిపెట్టి రాజులైనవాళ్లు కామవ్యవహారంలో ప్రవర్తించాలని భావం.

౧౯౯-౪- ప్రత్తాః జనపదకన్యాః దశమేఽహని కించిదౌ

౧౯౯-౫. పాయనిక ముపగృహ్య ప్రవిశం త్యంతఃపురముప

భుక్తా ఏవ విసృజంత ఇత్యాంధ్రాణాం. మహా
మాత్రేశ్వరాణా మంతఃపురాణి నిశి సేవార్థం
రాజానముపగచ్ఛంతి వాత్స గుల్మకానాం. రూప
వతీ ర్జనపదయోషితగ్ని ప్రీత్యపదేశేవ మాసం
మాసార్థం వాసయం త్యంతఃపుర ఏ వాంతఃపురి
కాన్వైదర్భాణాం దర్శనీయాగ్ని స్వభార్యాః ప్రీతి
దాయ మేవ మహామాత్ర రాజభ్యో దదత్యప
రాంతకాణాం. రాజక్రీడార్థం నగరస్త్రియో జనపద
స్త్రియశ్చ సంఘశః ఏకశశ్చరాజకులం ప్రవిశంతి
సౌరాష్ట్రకాణామితి. ౫.౫.౩౮

కొత్తగా వివాహితలైన పల్లెపడుచులు వివాహమయి ఏదో రోజున కానుకలు చేతగ్రహించి రాజుల అంతఃపురంలో ప్రవేశించి రాజుచేత భోగింపబడి విడువబడుతూఉంటారు. ఇది ఆంధ్రులఆచారం. మంత్రులూ,సామంతులూ, భాగ్యవంతులూ మొదలైనవారి అంతఃపురాలలోనికి రాత్రివేళలలో పల్లెపడుచులు రాజసేవకై ప్రవేశించి రాజుచేత ఉపభోగింపబడతారు. ఇది వాత్సగుల్మదేశంలోని ఆచారం. దక్షిణాపథంలో వాత్స, గుల్మ అనే పేరుగల ఇద్దరురాజులు పాలించిన దేశం పేరు వాత్స గుల్మదేశంఅంటారు. మంచి అందకత్తెలైన పల్లెపడుచులను పిలుపించుకుని ప్రేమకారణంగా నెలరోజులుగానీ, నెలా పది హేనురోజులుగానీ రాజులు తమ అంతఃపురంలోనే అంతఃపుర స్త్రీలుగా ఉంచుకుంటున్నారు. ఇది వైదర్భదేశంలోని ఆచారం. అపరాంతదేశీయులు తమ అందకత్తెలైన భార్య లను అనుగ్రహంకోసం రాజులకూ, మహామంత్రులకూ భాగ్య

వంతులకూ తారుస్తారు. రాజక్రీడలకోసం పట్టణస్త్రీలూ, పల్లెపడుచులూగూడా గుంపులుగుంపులుగానూ, ప్రత్యేకంగానూ రాజాంతఃపురంలో ప్రవేశిస్తారు. ఇది సౌరాష్ట్రదేశంలోని ఆచారం.

౧౧౯౯- ఏతేచాన్యేచ బహవః ప్రయోగాః పారదారికాః,
౧ ౨౦౦. దేశేదేశే ప్రవర్తంతే రాజభిః సంప్రవర్థితాః,
న త్వేవైతాన్ప్రయుంజీత రాజా లోకహితే రతః.
నిగృహీతారిషడ్వర్గః తదా విజయతే మహీం.

ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే పారదారికే పంచమేఽధికరణే ఈశ్వర కామితం నామ పంచమోధ్యాయః.

ఈ పైనచెప్పినవీ, ఇంకా ఇతరమైనవీ చాలా ప్రయోగాలు పరదారలవిషయమై ఉన్నాయి. ఆయా దేశాలలో ఆచరణలోగూడా ఉన్నాయి. రాజులచేత ఆచరింపబడుతున్నాయికూడాను. కాని లోకహితాన్ని కోరేరాజు ఎన్నడూ ఇలాంటి బుద్ధితక్కువపనులు చెయ్యరాదు. రాజైనవాడు అరిషడ్వర్గాలనుజయించి ప్రవర్తిస్తే జయశీలుడై దిగ్విజయంగా భూమిని ఏలుతాడు.

ఈ విధంగా భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయమూర్తిచేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలోని పారదారికమనే పంచమాధికరణంలో అయిదో అధ్యాయం ముగిసింది.



శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖా అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

### ౫. పారదారికాధికరణం

### ౬. ఆంతఃపురికదారరక్షితాధ్యాయం

౧-౨౦౧. నాంతఃపురాణాం రక్షణయోగాత్పురుషసందర్శనం
విద్యతే. పత్యుశ్చైకత్వాదనేక సాధారణత్వాచ్చ
అతృప్తిః తస్మాత్తాని యోగత ఏవ పరస్పరం రంజ
యేయుః. ౫.౬.౧

అంతఃపురాలలో ఉండేస్త్రీలకు రక్షణాలూ, కాపలాలూ, ఎక్కువగా ఉండడంచేత పురుషులను చూడడంఅనేది పొసగనే పొసగదు. చాలామంది అంతఃపురస్త్రీలకు ఒక్కడేభర్తకావడంచేత ఆ అంతఃపురస్త్రీలు కామవిషయంలో తృప్తిచెందలేక ఆ కామవాంఛను ఒకరివలన ఒకరు ప్రయోగాలద్వారా తీర్చుకుంటారు. ఆ విధానం ఈ క్రింద చెప్తున్నారు.

౧-౨౦౨. ధాత్రేయికాం సఖీం దాసీం వా పురుషవదలం
కృత్య ఆకృతిసంయుక్తైః కందమూల ఫలావయ
వైర్వా ఆత్మాభిప్రాయం నిర్వర్తయేయుః. ౫.౬.౨

దాదినిగానీ, చెలినిగానీ, దాసినిగానీ, పురుషుని వేషంతో అలంకరించి కందమూలాదులతో పురుషులకుండే అవయవాలు.

ఆమెకు కల్పించి ఆమెను పురుషుడని భావనచేస్తూ తమ కామ వాంఛను తీర్చుకుంటారు.

౧_౨౦౩. పురుషవద్వా మా అవ్యక్తలింగాశ్చాధిశయీరన్.

ఇంకా పురుషుని ఆకారంకలిగిఉండి గడ్డమూ మీసములేకుండా ఉండే కొజ్జాలను పక్కలో పరుండబెట్టుకుంటారు.

౧_౨౦౪. రాజానశ్చ కృపాశీలాః వినాఽపి భావయోగాదాయోజితాపద్రవ్యా యావదర్థమేకయా రాత్ర్యా బహ్వీరపి గచ్ఛంతి. యస్యాంతు ప్రీతిర్వాసకఋతుర్వా తత్రాభిప్రాయతః ప్రవర్తంత ఇతి ప్రాచ్యోపచారః. ౫.౬.౪

ప్రాచ్యదేశీయులలో ఒక ఆచారంఉన్నది. రాజులు కామార్తలైన తమ అంతఃపురస్త్రీలయందు దయాస్వభావంచేత వారికి తృప్తిని కల్పిస్తున్నారు. అలాగే దయాస్వభావంగల రాజులు తమకు కామేచ్ఛ అప్పుడు వారివిషయమై లేక పోయినా కపటలింగాలనుధరించి వారికి తృప్తిని కల్పిస్తున్నారు. ఆ విధంగా ఒక్కరాత్రిలోనే అనేకస్త్రీలను తృప్తిపరుస్తున్నారు. ఏ స్త్రీయందు మనసువిస్తే ఏ స్త్రీకి ఋతుదినమో ఆ స్త్రీయందు హృదయపూర్వకంగా ప్రవర్తిస్తున్నారు.

౧_౨౦౫. స్త్రీ యోగేనైవ పురుషాణామస్య లభ్యవృత్తీనాం వియోనిషు విజాతిషు స్త్రీ ప్రతిమాసు కేవలోపమర్దనాచ్చ అభిప్రాయ నివృత్తిర్వ్యాఖ్యాతా.

పురుషదర్శనంలేని స్త్రీలు తమ చెలికత్తెలనే పురుషబుద్ధితో కూడి కామవాంఛ నెలా తీర్చుకుంటున్నారో అలాగే పురుషులుగూడా తమతోడిపురుషులకు స్త్రీవేషాన్ని చిత్రించి వారితోకూడి కామవాంఛను తీర్చుకుంటారు. ఎంత ప్రయత్నించినా స్త్రీ లాభంచేకూరని పురుషులుకృత్రిమ యోనులద్వారాగానీ, ఇతరజాతిమృగాల యోనులద్వారాగానీ, ఆడబొమ్మలూ, విగ్రహాలూ మొదలైనవాటిద్వారాకానీ కామవాంఛను తీర్చుకుంటారు.

౧_౨౦౯- యోషావేషాంశ్చ నాగరకాన్ప్రాయేణ అంతఃపురి
౧_౨౦౭. కాపరిచారికాభిః సహ ప్రవేశయంతి. తేషాముపావర్తనే ధాత్రేయికాశ్చాభ్యంతర సంసృష్టా ఆయతిం దర్శయంత్యః ప్రయతేరన్. సుఖప్రవేశితా మపసారభూమిం విశాలతాం వేశ్మనః ప్రమాదం రక్షిణా మనిత్యతాం పరిజనస్య వర్ణయేయుః. నచాసద్భూతేనార్థేన ప్రవేశయితుం జన మావర్జయేయు ర్దోషాత్. ౫.౬.౬_౯

సాధారణంగా అంతఃపుర స్త్రీలు ఆడవేషాన్ని ధరించిఉన్న నాగరకపురుషులను పరిచారికలసహాయంతో తమదగ్గరకు రప్పించుకుంటారు. ఆ నాగరకపురుషులను అనుకూలులనుగా చేసికోడానికి దాదులు అంతఃపురస్త్రీల అనుమతిమీద పెద్ద పెద్ద ఆశలు వారికి కల్పించి ప్రయత్నించాలి. ఇలా ప్రయత్నిస్తూ ఆ పురుషులకు భయాదులు సంభవిస్తే ఈ మార్గంనుంచి సుళువుగా పారిపోవచ్చునని వర్ణించిచెప్పాలి. సులభంగా ఎల్లప్పుడూ ప్రవేశించడానికి వీలైనమార్గాన్ని చూపాలి. ప్రమా

దాలు సంభవించినప్పుడు తాము తప్పించుకునేమార్గాల నైశా ల్యాన్ని చూపించి వర్ణించిచెప్పాలి. పరిజనం అజాగ్రతగా మెల గడం మొదలైనవి నిరూపించాలి. కాని అసత్యాలుచెప్పి అతని హృదయాన్ని వంచించి ప్రవర్తించరాదు. అది అతని ప్రాణా న్నితీస్తుంది గనుక చాలాదోషం.

౧_౨౦౮- నాగరకస్తు సుహ్రృహా మప్యంతఃపుర మపాయ
౧_౨౧౦. భూయిష్ఠత్వా న్న ప్రవిశేదితి వాత్స్యాయనః సాపసారంతు, ప్రమదవనావగాఢం విభక్తదీర్ఘ కక్షం, అల్ప ప్రమత్తరక్షకం, ప్రోషితరాజకం, కార ణానిసమీక్ష్య, బహుశః ఆహూయమానోఽర్థ బుద్ధ్యా కక్షాప్రవేశంచ దృష్ట్వా తాభిరేవ హితో పాయః ప్రవిశేత్. శక్తే విషయేచ ప్రతిదినం నిష్క్రామయేత్. ౫.౬.౧౦-౧౨

నాగరకుడైనవాడు ఎంతసులువుగా ప్రవేశింపతగినదైనా రాజాంతఃపురంలో మాత్రం ప్రవేశించరాదని వాత్స్యాయను లన్నారు. ఒకవేళ ప్రవేశింపవలసివస్తే సులువుగా ప్రవేశించ డానికీ, బయటకురావడానికి అనుకూలమైన మార్గాలుగల ఉద్యానవనంలోని రహస్యాలను బాగా గమనించాలి. రాజు నగరంలో ఉన్నాడా? లేడా? అని గమనించాలి. తప్పతాగి తక్కువగా పాలకజనంకలిగిఉన్నప్పుడు సమయంచూచి అనేక కారణాలు చూచుకుని అనేకపర్యాయములు ఆ స్త్రీలచేత ఆహ్వానింపబడి కార్యసాధన దృష్టితో ద్వారప్రదేశాన్ని కని పెట్టి తనను వారు చేర్చుకునేయేర్పాటుమీద ప్రవేశించాలి. సామర్థ్యంఉంటే రోజూ అలాప్రవేశించవచ్చు. మరలిరావచ్చు.

౧-౨౧౧- బహిశ్చ రక్షిభి రన్యదేవతాకారణ మపదిశ్య సంసృ
౧-౨౧౯• జ్యేత. అంతశ్చారిణ్యాంచ పరిచారికాయాం విదితార్థాయాం సక్తమాత్మానం రూపయేత్తదలాభాచ్చ శోకం. అంతఃప్రవేశినీభిశ్చ దూతీకల్పం సకలమాచరేత్. రాజప్రణిధీంశ్చ బుధ్యేత. దూత్యాస్త్వసంచారే యత్రగృహీతాకారాయాః ప్రయోజ్యాయాః దర్శనయోగ స్తత్రావస్థాపనం. తస్మిన్నపితు రక్షిషు పరిచారికావ్యపదేశః. చక్షురనుబధ్నంత్యా మింగితాకార నివేదనం యత్ర సంపాతోఽస్యా స్తత్ర చిత్రకర్మణ స్తద్యుక్తస్య ద్వ్యర్థానాం గీతవస్తుకానాం క్రీడనకానాం, కృతచిహ్నానా మాపీడనక స్యాంగుళీయకస్య చ విధానం. ప్రత్యుత్తరంచ తయాదత్తం ప్రయత్నతః ప్రవేశనే యతేత.

స్వయంగా ప్రయత్నించేవిధానాన్ని చెపుతున్నారు. ముందుగా ద్వారపాలకులతో యేదో కారణాన్ని కల్పించుకుని సహవాసం చెయ్యాలి. వాళ్ళతో స్నేహం కలిసినతరువాత వారితో అంతఃపురంలో తిరుగుతున్న పరిచారిక తనతో కూటమికి ఒప్పుకున్నదనీ, ఆమెయందు తనమనస్సు లగ్నమైనదనీ, ఆమె తనకు లభించకపోతున్నందున చాలా దుఃఖపడుతున్నట్లు శోకాన్ని నటించాలి. బయటనుండి అంతఃపురంలో ప్రవేశించే స్త్రీలద్వారా కొంత దౌత్యాన్ని జరపాలి. రాజుయొక్క గూఢచారులనుగూడా కొంతవరకు కట్టుకోవాలి. దూతిక లభించినప్పుడు నాయిక తన అభిప్రాయాన్ని సూచించడానికీన్నీ, తన అభిప్రాయాన్ని ఆమెకు తెలపడానికిన్నీ తగినచోట

ఆమెనుచూస్తూ నిలుచోవాలి. అక్కడగూడా పరిచారకులూ, రక్షకభటులూ, ఉంటే పరిచారికకోసం చూస్తున్నట్లు నటించాలి. నాయిక తనవైపు చూస్తున్నప్పుడు నాయకుడు తన అభిప్రాయాన్ని సూచించాలి. ఏయేవైపునకు ఆమె వస్తూ ఉంటుందో ఆయావైపున విచిత్రాలైనబొమ్మలూ, వాటితో రెండర్థాలు స్ఫురించేవస్తువులూ, గీతవస్తువులూ, ఆటవస్తువులూ, తలలోధరించేపూలూ, ఉంగరాలూ, మొదలైనవాటిని చిత్రించాలి. ఆమెయిచ్చే సమాధానాన్నిగూడా జాగ్రతగా పరిశీలించాలి. అటుతరువాత అంతఃపురప్రవేశానికి ప్రయత్నించాలి.

౧.౨.౨౦. యత్రచాస్యానియతం గమనమితి విద్యాత్ తత్ర ప్రచ్ఛన్నస్యప్రాగేవ అవస్థానం. రక్షిపురుషో వా తదనుజ్ఞాతో వేళాయాం ప్రవిశేత్. అస్తరణ ప్రావరణ వేష్టితస్య వా ప్రవేశ నిర్గమౌ రే. పుటాపుటయో(?) ర్వాన్తర్ధాన ఛాయా రూపాః. తత్రాయం ప్రయోగో నకులహృదయం, చోరక తుంబీఫలాని సర్పాక్షిణి చాంతర్ధానమేన పచేత్త తోంజనేన సమభాగేన(?) నోదకేన ... దనేనాభ్యక్త నయనో ... చ్ఛాయారూప శ్చరతి, రాత్రౌ కౌముదీమువ దీపికా సంబాధే సురంగయావా. శ్లో.౬.౨.౨౧.౨౨

ఎప్పుడు నాయిక సంకేతస్థానికి వస్తుందనితెలుస్తుందో అప్పుడు నాయకుడు రహస్యంగా ఆ సంకేతస్థానానికి ముందుగా చేసుకోవాలి. రక్షక పురుషసహాయంతో రాత్రివేళయందు ఆమె సూచించినచోటును ప్రవేశించాలి. అలా ప్రవేశించే సమ

యంలో దూది దుప్పట్లుగానీ, కంబళ్లుగానీ, కప్పుకుని ప్రవర్తించాలి. లేక అంతర్ధానయోగాలద్వారానైనా ప్రవేశించాలి. అంతర్ధానయోగాలు ధరిస్తే నీడ కనుపించకుండా పోతుంది. అలా కనుపించకుండాపోవడానికి ఔషధాన్ని ఈక్రింద చెపుతున్నారు. కచ్చూరం, తుంబీఫలం, సర్పాక్షిఅనే మూటనీ, అంతర్ధామంతో వండాలి. ఆ అంజనాన్ని దానికి సమభాగమైన నీటితోనూరాలి. ఆ కాటిక కళ్లకు వేసుకుంటే అతనిస్వరూపం యెవ్వరికీ కనుపించదట. వెన్నెలరాత్రులలోనూ దీపకాంతుల లోనూ వెళ్లవలసివస్తే సారంగాలద్వారా పోవాలి.

భవంతి చాత్రశ్లోకాః—

౧-౨-౨౧. దివ్యానామపి నిర్హారే యానకానాం ప్రవేశనే ।
౧-౨-౨౪. లపానకోత్సవార్థేఽపి చేటికానాంచ సంభ్రమే ।
వ్యత్యాసే వేశ్మనాంచైవ రక్షిణాంచ విపర్యయే ।
ఉద్యానయాత్రాగమనే యాత్రాతశ్చ ప్రవేశనే।
దీర్ఘకాలోదయాం యాత్రాం । ప్రోషితే చాపి
రాజని । ప్రవేశనం భవేత్ప్రాయో యూనాం
నిష్క్రమణంతథా। పరస్పరస్య కార్యాణి జ్ఞాత్వా
చాంతః పురాలయాః. ఏకకార్యాస్తతః కుర్యుః
శేషాణామపిభేదనం । దూషయిత్వాతతో న్యోన్య
మేక కార్యార్పణే స్థిరాః । అభేద్యతాం గతస్సద్యః
యథేష్టం ఫలమశ్నుతే ॥ ౫.౬.౨౮.౩౨

అంతఃపుర ప్రవేశానికీ, బయటకు రావడానికీ, మరికొన్ని ఉపాయాలు చెపుతున్నారు. బరువులైన దూలాలూ మొదలైనవి

కొనిపోయే సమయంలోనూ, బళ్లూ, పాలకీలూ, పోయే సమయంలోనూ, పానోత్సవాది సందర్భంలో చేటికలూ మొదలైన వాళ్లు తొందరపాటున అటూ-ఇటూ తిరిగేసమయంలోనూ, ఇళ్లలో మార్పుజరిగే సమయంలోనూ, ఉద్యానయాత్రకు పోయే సమయంలోనూ, యాత్రనుండివచ్చి కోటలో ప్రవేశించే సమయంలోనూ, చాలాకాలం చెయ్యదగిన యాత్రకుపోయి రాజతో రాణి విడిగాఉన్నప్పుడూ సాధారణంగా యువకులకు అంతఃపురప్రవేశమూ, నిష్క్రమణమూ జరుగుతూఉంటుంది. ఆ అంతఃపురస్త్రీలు కొందరు సంఘంగాఏర్పడి ఒకరికొకరు కావలసిన కార్యాన్ని మనమంతాకలిసి సాధిద్దామని ప్రవర్తిస్తుంటే ఈ నాయికానాయకులు వారిలో పరస్పరమూ భేదంపుట్టించి ఆ సంఘాన్ని భేదింపచెయ్యాలి. అప్పుడు ఆ సంఘంలోనివారు ఒకరినొకరు దూషించుకొని మళ్లీ ఏకకార్యంలో స్థిరబుద్ధికలిగి అభేద్యంగా తమయిష్టాన్ని పొందగలుగుతారు.

౧_౨_౨౬. తత్రరాజ కులచారిణ్య ఏవ లక్షణ్యా పురుషా
౧_౨౭౫. నంతఃపురం ప్రవేశయంతి. నాతి సురక్షత్వాదాప రాంతికానాం క్షత్రియ సంజ్ఞకై రంతఃపుర రక్షిభి రే వార్థం సాధయంత్యాభీరకాణాం। ప్రేష్యాభిస్సహ తద్వేషా న్నాగరకపుత్రా న్ప్రవేశయంతి వాత్స గుల్మకానాం। స్వైరేవపుత్రై రంతఃపురకాణి కామచారై ర్జననీవర్జ ముపయుజ్యంతే వైదర్భకాణాం। తథా ప్రివేశిభిరేవ జ్ఞాతి సంబంధిభి ర్నాన్యై రుపయుజ్యంతే స్త్రైరాజకానాం। బ్రాహ్మణైర్మిత్రై

ష్ఫలస్త్రైర్బ్రాహ్మణసచేష్టశ్చ గౌడానాం। పరిష్కందాశ్చ కర్మకరాశ్చాంతః పురే ష్వనిషిద్ధా అన్యేపి తద్రూపాశ్చ సైంధవానాం। అర్థేన రక్షిణ ముపగృహ్య సాహసికాస్సంహతాః ప్రవిశంతి హైమవతానాం। పుష్పదాన నియోగా న్నగర బ్రాహ్మణా రాజ విదిత మంతఃపురాణి గచ్ఛంతి పటాంతరిత శ్చైషా మాలాపః, తేన ప్రసంగేన వ్యతికరోభవతి వంగాంగ కళింగకానాం। సంహత్య నవదశేత్యే కైకం యువానం ప్రచ్ఛాదయంతి ప్రాచ్యానాం। ఇత్యేవం పరస్త్రియః ప్రకుర్వీత। ఇత్యాంతః పురికావృత్తం. గ.ఇ.30.42

అపరాంత దేశవాసులైన రాజులయిండ్లలో రక్షణవిధానం చాలా తక్కువగా ఉంటుందిగనుక ఆ స్త్రీలు స్త్రీ రూపాలు ధరించిఉన్న పురుషులను ఎక్కువగా తమదగ్గరకు ప్రవేశపెట్టుకుంటారు. ఆభీరదేశీయులు క్షత్రియజాతివారైన అంతఃపుర రక్షకులచేతనే తమ కామతృప్తిని తీర్చుకుంటారు. దూతికలతో వారి వేషాలు ధరించిఉన్న నాగరక కుమారులను వాత్స గుల్మ దేశీయులు తమ అంతఃపురంలో ప్రవేశపెట్టుకుంటారు. వైదర్భ దేశస్త్రీలు దేహసంబంధంగల పుత్రులతో తప్ప ఇతర పుత్రులతో కామక్రియలు రహస్యంగా జరుపుతారు. స్త్రీ రాజ్యాలలోని స్త్రీలు చనువుగా వచ్చిపోయే జ్ఞాతిజనంతో మాత్రమే యథేచ్ఛగా కూడుతున్నారు. కాని ఇతరులతో కూడరు. గౌడ దేశస్త్రీలు బ్రాహ్మణులు, మిత్రులు, భృత్యులు, దాసులు

చేటులు, మొదలైనవాళ్లవల్ల రహస్యంగా కామతృప్తి తీర్చుకుంటారు. సైంధవదేశస్త్రీలు ద్వారపాలకులు, కూలివాళ్లూ, ఇంకా ఇలాటి అంతఃపుర ప్రవేశంగల జనులవల్ల తమవాంఛ తీర్చుకుంటారు. హైమవత దేశస్త్రీలు రక్షకపురుషులను ధనంచేత వశపరచుకుని సాహసంతో వాళ్లవల్ల కామతృప్తిని పొందుతారు. వంగ, అంగ, కళింగదేశంలో పూలు ఇచ్చేపనిమీద నగరబ్రాహ్మణులు అంతఃపురంలో యథేచ్ఛగా స్వతంత్రంగా రాజుల అనుజ్ఞమీద ప్రవేశిస్తారు. తెరచాటునఉన్న అంతఃపురస్త్రీలతో మాట్లాడతారు. ఆ ప్రసంగాలలో తబ్బిబ్బులు జరుగుతూఉంటాయి. ఇలా ఆ దేశస్త్రీలు కామవాంఛను తీర్చుకుంటారు. ప్రాచ్యదేశీయ రాజస్త్రీలు తొమ్మిదిపదిమంది కలిసి ఒక్క మానవుణ్ణే ఉంచుకుంటారట. ఈ విధంగా పరస్త్రీ విషయాలలో ప్రవర్తించాలి. ఇది అంతఃపురికావృత్తం.

౧౨౩౬. ఏభ్య ఏవచ కారణేభ్యః స్వదారాన్రక్షేత్.

పరస్త్రీలను ఈ ఉపాయాలచేత యెలా పొందుతున్నారో పురుషులు, వారి స్త్రీలనుగూడా ఇతరపురుషులు పొందుతూ ఉంటారని తెలుసుకోవాలి. అందువల్ల పరస్త్రీగమనం మున్నూటికీవద్దు. ఇక ఇతరులవల్ల తమభార్యలను రక్షించుకునే ఉపాయాలు చెప్తున్నారు. తనభార్య తననుండి యే కారణంచేత విముఖురాలు పోతోందో తెలుసుకుని ఆ కారణాలను తొలగించుకోవాలి. ఆమె హృదయాన్ని తాను ఆకర్షించాలి. ఇతర పురుషులనుండి ఆమెను స్పర్శని తప్పించాలి. తలవాకిట్లో నిలుచుండడం, పరిచయకారణాలూ, దూతీకర్మలూ. ఈశ్వర

కామితోపాయం, అంతఃపురికావృత్తం, అనేవీటివల్ల తమ భార్యలను పురుషులు తమ చరిత్రను చక్కచేసుకుని సుఖించాలి. వారిని రక్షించుకోవాలి.

౧౨౩౮- కామోపధాశుద్ధాన్ రక్షిణోఽంతఃపురే స్థాపయే
౧౨౩౯. దిత్యాచార్యాః । తేహిభయేన చార్థేన చాన్యం ప్రయోజయేయుః స్తస్మాత్కామభయార్థోపధా శుద్ధానితి గోణికాపుత్రః । అద్రోహో ధర్మస్తదతి భయాజ్జహ్యా దతో ధర్మభయోపధా శుద్ధానితి వాత్స్యాయనః. ౫.౬.౪౬.

కామవిషయంలో పరీక్షింపబడి పరిశుద్ధికలవారని నిర్ణయింపబడినవారిని మాత్రమే అంతఃపురాలలో రక్షణకోసం ఏర్పరచాలి. అని ప్రాచీనార్యులన్నారు. వారు భయంచేతా, ధనాశచేతా, ఇతరులను ప్రయోగాలకు అంతఃపురంలో ప్రవేశపెడతారు కాబట్టి కామ విషయంలో కల్మషంలేక, నిర్భయంగా సంచరించే ప్రవృత్తి కలిగి, ఆశలేనివారినిగా పరీక్షించి అంతఃపుర రక్షణకు అట్టివాళ్లను నియోగించాలని గోణికాపుత్రులన్నారు. ద్రోహం చెయ్యకపోవడం ధర్మం. ఆ ధర్మాన్నికూడా భయంవల్ల విడిచిపెట్టవచ్చు. అందువల్ల ధర్మమూ, భయమూ, అర్థమూ, కామమూ, ఈవిషయాలలో పరీక్షింపబడినవారినే నియమించాలని వాత్స్యాయనులన్నారు.

౧౨౪౦. పరవాక్యాభిధాయినీభి శ్చ గూఢాకారాభి రాత్మ
౧౨౪౧. దారానుపపథ్యా చ్ఛౌచాశౌచ పరిజ్ఞానార్థమితి బాభ్రవీయాః । దుష్టానాం యువతిషు సిద్ధ

త్వాన్నా కస్మా దదుష్టదూషణ మాచ రేదితి
వాత్స్యాయనః ౫.౬.౪౭-౪౮

౫౧ భార్యలవిషయమై పరీక్షకూడా రక్షణోపాయమేనని కొందరంటున్నారు. భలా నావాడు నీ యందు అనురాగం కలిగి ఉన్నాడు. వాడు నా ప్రాణాలను రక్షించమన్నాడు. అని ఈ విధంగా దాసిచేత ప్రసంగింపచేసి ఆమె మనస్సు పరీక్షించాలి. అలా పరీక్షించే సమయంలో అనుకూలసమాధానం ఉంటే శుచిగుణం లేదనీ, ప్రతికూలసమాధానం ఉంటే శుచిగుణం కలదనీ, గమనించాలి. అని బాభ్రవీయులన్నారు. దుష్టులైన పురుషులు స్త్రీలవిషయమై సిద్ధులౌతారుగనుక ఏదో పురుష దోషాన్నిపట్టి స్త్రీని తొందరపడి దూషణచెయ్యరాదు. స్త్రీలకు సహజంగా దోషంలేకపోయినా దోషాలనుకునే అవగుణాలు కొన్ని సహజంగా ఉంటాయి. అని వాత్స్యాయనులన్నారు.

౧౨౪౭. సందృశ్య శాస్త్రతోయోగాన్ పారదారికలక్షితాన్।
౧౨౪౮. నయాతిఛలనాం కశ్చిత్స్వదారాన్ప్రతి శాస్త్రవిత్।
పాక్షికత్వా త్ప్రయోగాణాం అపాయానాంచ దర్శనాత్ । ధర్మార్థయోశ్చ వైలోమ్యాన్నాచరే త్పారదారికం । తదేత ద్దారగుప్త్యర్థం ఆరబ్ధం శ్రేయసేనృణాం । ప్రజానాం దూషణాయైవ నవిజ్ఞేయోహ్యాయం విధిః. ౫.౬.౫౨

ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే పారదారికే పంచమేఽధికరణే అంతఃపురికం, దార రక్షితం నామ షష్ఠోఽధ్యాయః.

పారదారికంలో చెప్పబడిన యోగాలను శాస్త్రదృష్టితో గమనించి శాస్త్రజ్ఞానం కలవాడు ప్రతివాడున్నూ తన భార్యల విషయమై అన్యాయం జరగకుండా ప్రవర్తించగలుగుతున్నాడు. ఈ పరదారగమనాలు ప్రాణం తుంచుకుపోతుంటే అగతిక గత్యా పాక్షికంగా చెప్పడంచేతనూ, అపాయంకనిపిస్తూ ఉండడంచేతనూ, ధర్మార్థాలకు చాలాదూరం గనుకనూ, పారదారికాన్ని ఆచరించరాదు. మానవులు తమతమ భార్యలను కాపాడుకోడానికిగా వాళ్ళ శ్రేయస్సునుకోరి చెప్పబడ్డదేకాని ప్రజలను దోషయుక్తులను చేయడానికిగా చెప్పబడ్డదికాదు. అని గట్టిగా ప్రతివారూ తెలుసుకోవాలి.

ఇలా భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయమూర్తి చేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలోని పారదారికమనే అయిదో అధికరణంలో ఆరో అధ్యాయం ముగిసింది.



శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

### ౬. వైశికాధికరణం

#### ౧. సహాయగమ్యాగమ్యాది చింతాధ్యాయం

౧-౨౮౫- వేశ్యానాం పురుషాధిగమే రతిర్వృత్తిశ్చ సర్గాత్,
౧-౨౮౬. రతితః ప్రవర్తనం స్వాభావికం. కృత్రిమమర్థార్థం.
తదపి స్వాభావికవద్రూపయేత్. కామపరాసు
హి పుంసాం విశ్వాసయోగాత్. అలుబ్ధతాం చ
ఖ్యాపయేత్తస్య నిదర్శనార్థం. న చానుపాయేన
అర్థాన్ సాధయే దాయతిసంరక్షణార్థం. నిత్య
మలంకారయోగినీ, రాజ మార్గావలోకినీ దృశ్య
మానా నచాతి వివృతా తిష్ఠేత్. ౬.౧.౧,౨

గత అధికరణాలలో కన్య, పునర్భువు, పరదారలనే ముగ్గురు నాయికలతోనూ సమాగమించే విధానం చెప్పినారు. ఇక నాలుగో నాయిక అయిన వేశ్యతో సమాగమించే విధానాన్ని ఈ అధికరణంలో చెప్పుతున్నారు. పురుషునికి, వేశ్యకు సమాగమంలో రతిఫలం సమానమైనా, ప్రయోజనం వే

కాబట్టి వేశ్యకే ఈ విషయంలో అధికారం. పురుషునికి లేదు. వేశ్యలకు పురుషుడు లభిస్తే వాడితో సంగమించడంవల్ల స్థిలస రూపమైన రతిసుఖమూ, ధనప్రాప్తి కలుగుతుంది గనుక జీవనోపాధీ లభిస్తాయి. మరోమాట. పురుషునితో సంగమిస్తే వేశ్యకు కామమూ,అర్థమూ లభిస్తాయి. వేశ్యతో సంగమించిన పురుషునికి కామం లభిస్తుంది. ధనం ఒదులుతుంది. ఆ వేశ్య రతిసుఖంకోసం పురుషునితో రమిస్తే లోకంతోపాటు స్వాభావికమే అవుతుంది. ధనంకోసం సంగమిస్తే కృత్రిమం అవుతుంది. దాన్నికూడా వేశ్య స్వాభావికంగానే ప్రకటించాలి. కామాసక్తిగల స్త్రీల విషయంలో పురుషులకు విశ్వాసం ఎక్కువ. అందువల్ల ఆ పురుషుడు ఆమెను విడువలేడు. డబ్బుమీద ఆశ చూపిస్తే అంత ఆసక్తిగాఉండడు. కామ ప్రవృత్తినే ఎక్కువగా చూపిస్తూ అర్థంమీద అసక్తిలేనట్లు నటించాలి. ఇలా అయితే అనురాగంవల్లే ఆ పురుషుడు ధనాన్ని చెల్లిస్తాడు. ఉపాయంలేకుండా ముందుకాలంలో తన రక్షణకోరకు ఉపాయపూర్వంగా ధనాన్ని సంపాదించాలి. ఆ ఉపాయాలేవో చెప్తున్నారు. వేశ్య ఎప్పుడూ చక్కగా తనదేహాన్ని అలంకరించుకుని రాజమార్గంవంక చూస్తూ మార్గస్థులు తనను చూచే సమయంలో కనిపించీ కనిపించనట్లు నిలుచోవాలి. ఇది వేశ్యల ధర్మం.

౧౨౯౭. ద్వారాయని మావర్జయే, దన్యాభ్యశ్చ అవ
౧౨౯౮. చ్ఛింద్యా, దాత్మనశ్చోపర్థం ప్రతికుర్యా, దర్థంచ సాధయే, న్నచగమ్యైః పరిభూయేత, తాన్సహాయాన్కుర్యాత్. తే త్వరక్షక పురుషాగి ధర్మాధి

కరణస్థాని దైవజ్ఞాని విజ్ఞానాని శూరాః సమాన
విద్యాః కలాగ్రాహిణః పీఠమర్ద విట విదూషక
మాలాకార గాంధిక శౌండిక రజక నాపిత భిక్షుకాశ్చ
తే తే చ కార్యయోగాత్. ౬.౧.౯

ఏ జనులు నాయకుణ్ణి తనకు అనుకూలుణ్ణిగా తయారు చెయ్యడం లోనూ, ఇతర స్త్రీలనుండి అతనిమనస్సును విరవడంలోనూ, తనకువచ్చే అనర్థాలను తప్పించడంలోనూ, అతనివల్ల ధనాన్ని రాబట్టుకోడంలోనూ, ధూర్తులైన పురుషులవలన పరాభవం కాకుండా కాపాడడంలోనూ, సమర్థులైఉంటారో ఆ సహాయకులను వేశ్య సహాయార్థము ఉంచుకోవాలి. వారు రక్షకపురుషులూ, ధర్మాధికారులూ, శాస్త్రజ్ఞులూ, పురపాలకులూ, శూరులూ, తనతో సమానమైన విద్యకలవారూ, కళలను నేర్పుకునేవారూ, పీఠమర్దుడూ, విటుడూ, చేటుడూ, విదూషకుడూ, మాలాకారుడూ, గంధకారుడూ, మావటివాడూ, చాకలి, మంగలి, బిచ్చకత్తె, మొదలైనవాళ్లు ఆయాపనులలో ఆ వేశ్యకు సహాయకులుగా ఉండతగినవారు.

౧-౨౧౯. కేవలార్థా స్త్వయమధిగమ్యాః స్వతంత్రః, పూర్వే వయసి వర్తమానః, విత్తవాన్, అపరోక్షవృత్తిః, అధికరణవాన్, అకృచ్ఛ్రాధిగతవిత్తః, ధిగసంఘర్ష వాన్, సంతతాయః, సుభగాభిమానీ, శ్లాఘనకః, షండశ్చ, పుంశబ్దార్థీ, సమానస్పర్ధీ, స్వభావత స్త్యాగీ, రాజని మహామాత్రేవా సిద్ధః, దైవ ప్రమాణః, విత్తావమానీ, గురూణాం శాసనాతిగః,

సజాతానాం లక్ష్యభూతః, సవిత్తః, ఏకపుత్రః, లింగీ,
ప్రచ్ఛన్నకామః, శూరః, వైద్యశ్చేతి. ౬.౧.౧౦

వేశ్య కేవలం డబ్బుకోసం సంగమించతగిన నాయకులను చెపుతున్నారు. మంచి యవ్వనదశలో ఉన్నవాడూ, స్వతంత్రుడూ, చాలా డబ్బుకలవాడూ, తన ఊళ్లో ఎప్పుడూ నివసించేవాడూ, కోశాధికారీ, కష్టపడకుండా ఎక్కువడబ్బు సంపాదించేవాడూ, మరి ఒకనికంటె ఎక్కువడబ్బు ముట్టచెపుతానని పందెంవేసి దగిజేరేవాడూ, ఎల్లప్పుడూ తరుగని రాబడికలవాడూ, అందగాడనని గర్వపడేవాడూ, ఇతరుల పొగడ్తలు కోరేవాడూ, నపుంసకుడూ, తనను పురుషుడని లోకం చెప్పుకోవాలని కోరేవాడూ, సమానులతో పౌరుషంకోసం పోరాడేవాడూ, స్వభావసిద్ధంగా మంచి త్యాగవంతుడూ, రాజునకూ మంత్రులకూ మిత్రుడూ, దైవప్రమాణ బుద్ధిగలవాడూ, డబ్బంటే లక్ష్యం లేనివాడూ, గురువులమాటలు ధిక్కరించేవాడూ, ఒక జాతివారికి ఆదర్శప్రాయుడునూ, ధనవంతుడునూ, ఒకపుత్రుడు కలవాడూ, సన్న్యాసీ, జారుడూ, శూరుడూ, వైద్యుడూ వీరంతా వేశ్యలకు పొందతగినవారు.

౧-౨-౬౧. ప్రీతి యశోర్థాస్తు గుణతోఽధిగమ్యాః. మహా
౧-౨-౬౧. కులీనః. విద్వాన్, సర్వసమయజ్ఞః. కవిః. ఆఖ్యాన
కుశలః, వాగ్మీ, ప్రగల్భః. వివిధశిల్పజ్ఞః. వృద్ధదర్శీ,
స్థూలలక్ష్యః. మహోత్సాహః. దృఢభక్తిః, అన
సూయకః, త్యాగీ. మిత్రవత్సలః. ఘటాగోష్ఠీ ప్రేక్షణ
క సమాజసమస్యా క్రీడనకశీలః, నీరుజః, అవ్యంగ

శరీరః, ప్రాణవాన్, అమద్యపః, వృషః, మైత్రిః,
స్త్రీణాం ప్రణేతా, లాలయితా చ, నచాసాం వశ
గః స్వతంత్రవృత్తిః, అనిష్ఠురః, అనీర్ష్యాళుః, అన
వశంకీ, చేతి నాయకగుణాః ౬.౧.౧౧.౧౨

ప్రేమనూ, కీర్తినీ, కోరేపురుషులు చాలా గుణవంతులుగా ఉంటారు. అలాంటిపురుషులను గుణాలనుబట్టి గుర్తించాలి. అట్టి నాయకుణ్ణి గుర్తించడానికి కొన్నిగుణాలు ఈ క్రింద చెపుతున్నారు. గొప్పకులంలో పుట్టినవాడూ, విద్వాంసుడూ, అన్ని విషయాలూ అనుభవపూర్వకంగా ఎఱిగిఉన్నవాడు, చక్కగా కవిత్వం చెప్పగలవాడూ, చక్కనికథలను మనోరంజకంగా చెప్పగలవాడూ, ప్రతి విషయాన్నిగూర్చీ హృదయాహ్లాదకరంగా మాట్లాడగలవాడూ, మాటలలోనూ, చేష్టలలోనూ, గడుసుదనంకలవాడూ, అన్నిశిల్పాలూ ఎఱిగిఉన్నవాడూ, జ్ఞాన వయోవృద్ధులవల్ల చక్కని అనుభవాలు గడించినవాడూ, సర్వులయందూ సమానమైన దృష్టిగలవాడూ, గొప్ప ఉత్సాహవంతుడూ, విడువనిభక్తికలవాడూ, అసూయలేనివాడూ, మంచి త్యాగబుద్ధికలవాడూ, స్నేహితులయందు వాత్సల్యం కలవాడూ, సభా సమావేశాలుజరిపే స్వభావంకలవాడూ, రోగపరిక్షీణతలేనివాడూ, అవయవలోపంలేనివాడూ. బలవంతుడూ, మద్యాన్నిసేవించనివాడూ. మంచి సురసచాతుర్యం కలవాడూ. దయాస్వభావంకలవాడూ. స్త్రీలకు నీతులునేర్పే వాడూ, స్త్రీలను గౌరవించేవాడూ, స్త్రీలకు వశుడుకాని వాడూ, స్వాతంత్ర్యజీవనం కలవాడూ, ఇతరులకు [illegible] కలిగించ

చనివాడూ, ఈర్ష్యలేనివాడూ, సందేహస్వభావం లేనివాడూ, ఈ పైన చెప్పినవారంతా వేశ్యకు గమ్యులు.

౧-౨౫౨-౨. నాయికాయాః ప్రనా రూప యౌవన లక్షణ మాధుర్యయోగినీ, గుణేష్వనురక్తా న తథార్థేషు ప్రీతిసంయోగశీలా, స్థిరమతిరేకా జాతీయా విశేషార్థినీ, నిత్యమకదర్యవృత్తిః గోష్ఠీ కళాప్రియా చేతి. ౬-౧-౧౩

ఇక నాయికాగుణాలు చెప్తున్నారు. మంచి శరీరశోభ ఉండాలి. సౌభాగ్యాదులను వెల్లడిచేసే ముఖవర్చస్సుండాలి. మంచి యవ్వనం ఉండాలి. మాటలలో ఎంతో మాధుర్యం ఉండాలి. గుణాలను ప్రేమించినట్లు అర్థాన్ని ప్రేమించనిదిగా ఉండాలి. ప్రేమతో సంభోగించే ప్రకృతిగలదిగా ఉండాలి. చలించని బుద్ధిగలదై ఉండాలి. ఒకే జాతికి చెందినదై ఉండాలి. కామవిశేషాలను కోరేదిగా ఉండాలి. ఎల్లప్పుడూ కపటంలేని ప్రవర్తనకలదై ఉండాలి. గోష్ఠులయందూ, కళలయందూ ప్రేమకలదై ఉండాలి. ఇవి నాయికాగుణాలు.

౧-౨౫౩- బుద్ధి శీలాచారః, ఆర్జవం కృతజ్ఞతా, దీర్ఘదూర
౧-౨౫౪. దర్శిత్వం, అవి సంవాదితా, దేశకాలజ్ఞతా, నాగరకతా, దైన్యాతిహాస పైశున్య పరివాదక్రోధలోభ స్తంభ చాపలవర్జనం. స్మితపూర్వాభిభాషితా, కామసూత్రే కౌశలం, తదంగ విద్యాసు చేతి సాధారణగుణాః. గుణవిపర్యయే దోషాః.

మంచి బుద్ధి, శీలమూ, ఆచారమూ, సరియైననడతా, కృతజ్ఞత దీర్ఘంగా దూరాలోచన చెయ్యడమూ, కలహించకుండా ఉండ

డమూ, దేశకాలాలనుగుర్తించి ప్రవర్తించడమూ, సా[illegible]కుగా ఉండడమూ, దైన్యమూ, ఎక్కువ నవ్వూ, స్నేహితులను ఒకరి నుంచి ఒకరిని విడదియ్యడమూ, ఎదుటివాళ్లమీద చాడీలు చెప్పడమూ, ఎప్పుడూ కోపంగా ఉండడమూ, ఆశ, నిశ్చేష్టత, చాపల్యం, ఈ ఎనిమిది అవగుణాలూ లేకుండా ఉండడమూ, నవ్వుతూ మాటలాడడమూ, కామసూత్ర విషయాలలో నేర్పూ, సంగీతం మొదలైన అంగవిద్యలలో నేర్పూ ఇవన్నీ సాధారణగుణాలు. ఈ గుణాలు తలక్రిందైతే దోషాలు.

౧౨౫౫. క్షయరోగీ కృమిశకృత్ వాయసాస్యః, ప్రియకళత్రః, పరుషవాక్ కదర్యో నిర్ఘృణః, గురుజనపరిత్యక్తః, స్తేనః, దంభశీలః, మూలకర్మణి ప్రసక్తః మానావమానయోరనపేక్షీ, ద్వేష్యైరపి అర్థహార్యః విలజ్జః, ఇత్యగమ్యాః. ౬.౧.౧౬

ఇక వేశ్య పొందతగని నాయకులను చెపుతున్నాను. క్షయరోగం కలవాడూ, ఎప్పుడూ క్రిమిరోగాలతో తీసుకునేవాడూ, (కుష్ఠురోగి) పుప్పిరోగాలు కలవాడూ, దుర్వాసనకొట్టే నోరు కలవాడూ, ఆడదైన ప్రతిదానితోనూ మంచిచెడులు విచారించకుండా కూడేవాడూ, ప్రియమైన భార్యకలవాడూ, పరుషంగా మాట్లాడేవాడూ, నీచప్రకృతీ, నీచభావమూ కలవాడూ, దయలేనివాడూ, గురువులు విడచిపెట్టగా భ్రష్టుడైనవాడూ, దొంగా, కపటంకలవాడూ, మూలికలద్వారా వశం చేసుకోగోరేవాడూ, మానావమానాలులేనివాడూ, ధనాశ

చేత శత్రువులలోనైనా చేరగోరేవాడు, ఎక్కువ సిగ్గుగల వాడూ, ఈ మొదలైనవాళ్లు వేశ్యకు గమ్యులుకారు.

౧౨౫౬- రాగో, భయ, మర్థసంఘర్షో, వైరసిర్యాతనం, జిజ్ఞా
౫౭- సాపక్షః, ఖేదో, ధర్మో, యశో ఽనుకంపా, సుహృ ద్వాక్యం, హ్రీః, ప్రియసాదృశ్యం, ధన్యతా, రాగా పనయః, సాజాత్యం, సాహావేశ్యం, సాతత్యం, ఆయతిశ్చ గమన కారణానిభవంతీత్యా చార్యాః. అర్థో, న ర్థ ప్రతీకారః, ప్రీతిశ్చేతి వాత్స్యాయనః. అర్థంతు ప్రీత్యానబాధితాస్య ప్రాధాన్యాత్. భయాదిషు గురుతాలాఘవం పరీక్ష్యం. ఇతి సహాయ గమ్యాగమ్య గమనకారణ చింతా. ౬.౧.౧౭.౨౦

వేశ్య పురుషులతో ఎందుకు సంగమిస్తుందో ఆ కారణాలు చెప్తున్నారు. హఠాత్తుగా అనురాగంపనించినా. చంపుతాడేమో అనేభయం కలిగినా, పందెములు ఏర్పడినా, శత్రువును సాధింపవలసివచ్చినా, అతనిప్రశ్న కనుక్కుందామనే పారుషం కలిగినా, ఏదైనా దుఃఖం ప్రాప్తించినా, ధర్మాన్ని ఆలోచించిగానీ, కీర్తిని ఆశించిగానీ, దయవల్లగానీ, మిత్రుని వాక్యంవల్లగానీ, సిగ్గువల్లగానీ, తన యిష్టునికి సమానుడనిగానీ, ధన్యురాలనగుదుననిగానీ, తన కామోద్రేకాన్ని అణచుకుందామని కానీ, సమానజాతియుడనిగానీ, పొరుగింటివాడుగదా అనికానీ, చిన్నప్పటినుంచీ స్నేహితుడనిగానీ, ఇతనితో సంగమిస్తే మంచిప్రభావం కలుగుతుందనికానీ, సాధారణంగా

వేశ్యలకు పొందతగనివాళ్లతోగూడా పొందు గలుగుతూ ఉంటుంది. అని పూర్వాచార్యులన్నారు. ధనంకోసమూ, ఆపదకు ప్రతిక్రియచెయ్యడం కోసమూ, కేవల ప్రేమకోసమూ వేశ్య పురుషగమనం చేస్తుందని వాత్స్యాయను లన్నారు. వేశ్యకు ధనం ప్రధానంగనుక దానికి ప్రేమ అడ్డంకారాదు. భయాదులు సంభవించినప్పుడు హెచ్చుతగ్గు లాలోచించి సంగమించాలి. ఈ విధంగా సహాయులూ, గమ్యులూ, అగమ్యులూ, అనేవారిచర్చలు వేశ్యలవిషయంలో చేయబడ్డవి. గమనకారణచింతగూడా చెప్పారు.

౧౨౬౦- ఉపమంత్రితాపి గమ్యేవ సహసా న ప్రతిజానీయాత్
౧౨౬౩ పురుషాణాం సులభావమానిత్వాత్. భావజిజ్ఞాసార్థంచ, పరిచారికాముఖా స్సంవాహనగాయక వైహాసిక పురుషాస్తమ్యే తద్భక్తాన్వా ప్రణిదధ్యాత్తదభావే పీఠమర్దాదీనాం. తేభ్యో నాయకస్య శౌచం రాగాపరాగౌ, సక్తాసక్తతే, దానాదానేచ విద్యాత్. సంభావితేనచ సహ విటపురోగాం ప్రీతిం యోజయేత్. ౬.౧.౨౧.౨౪

నాయకుడు సంగమించడానికి పిలిచినా తొందరపడి సంగమానికి ఒప్పుకోరాదు. పురుషులు త్వరలో స్వాధీనురాలైన స్త్రీని సులభంగా అవమానిస్తారు. అందువల్ల అతనిభావాన్ని తెలుసుకోడానికి తన పరిచారకులనుగానీ, గాయకుడూ, విదూషకుడూ, మొదలైనవాళ్లనుగానీ పంపాలి. వాళ్ళవల్ల నాయకుడు శుచికలవాడా? కాదా! ప్రేమకలవాడా? కాడా! ఆసక్తి

నిజంగాఉన్నదా? లేదా? దానశీలుడా? కాడా? అని విచారింప చెయ్యాలి. ఈ విషయాలు గుర్తించినతరువాత ఆ విటుల ద్వారానే ప్రేమకథ నడపాలి.

౧౨౬౮- లావక కుక్కుట మేషయుద్ధ శుకశారికా ప్రలాపన
౧౨౬౯ ప్రేక్షణిక కళా వ్యపదేశేన పీఠమర్దో నాయకం
తస్యా ఉదవసిత మానయేత్. తాంవాస్య ఆగ
తస్య ప్రీతి కౌతుక జనకం కించిద్ద్రవ్యజాతం స్వాయ
మిదమసాధారణోపభోగ్య మితి ప్రీతిదాయం
దద్యాత్. యత్ర చరమతే తయాగోష్ఠ్యా ఏన
ముపచారైశ్చ రంజయేత్. ౬.౧.౨౫-౨౬.

పీఠమర్దుడు, లావకపిట్టలూ, కోళ్లూ, గొఱ్ఱపొట్టేళ్ళూ, మొదలైనవాటిపందెములూ, చిలుకలూ, గోరువంకలూ, మొదలైనవాటిని పలుకరించడమూ, చక్కని దృశ్యాలనుచూడడం మొదలైన వినోదాలద్వారా నాయకుణ్ణి నాయిక ఉన్నతావుకు తీసుకునిరావాలి. లేక ఆమెనైనా ఇతనివద్దకు చేర్చాలి. అలా వచ్చిన నాయకునికి ప్రేమనూ, కుతూహలాన్నీ వృద్ధి చేసే ద్రవ్యాలను స్వయంగా "ఇదిచూడండి, సాధారణంగా ఎక్కడాదొరకనివస్తువు సుమండీ!" అని ప్రేమపూర్వకంగా ఇవ్వాలి. ఇతనిబుద్ధి దేనియందు సక్తమవుతుందో ఆ గోష్ఠితోనే అతన్ని ఉపచారాలద్వారా సంగమించి రంజింప చెయ్యాలి.

౧-౨౬-౭. గతేచ సపరిహాస ప్రలాపాం సోపాయనాం పరిచారి
కా మభీక్ష్ణం ప్రేషయేత్. స పీఠమర్దాయాశ్చ కార
ణాపదేశేన స్వయం గమనమితి గమ్యాపావర్తనం.

నాయకుడు వెళ్లిపోయినతరువాత, హాస్యంగానూ, చమత్కా
రంగానూ, మాట్లాడే తన పరిచారికను కానుకలుఇచ్చి అతనికి
గుర్తుగా ఇచ్చిరమ్మని పంపాలి. పీఠమర్దునితోగూడా ఏదో
కారణాన్ని పురస్కరించుకుని స్వయంగా అతనిదగ్గరకు చేరాలి.
ఇది గమ్యాపావర్తనం అంటారు.

భవంతి చాత్రశ్లోకాః—

౧-౨౬-౮-తాంబూలాని స్రజశ్చైవ సంస్కృతం చానులేపనం।
౧-౨౭౦ ఆగతస్యాహరేత్ప్రీత్యా కళాగోష్ఠీశ్చ యోజయేత్ ॥
ద్రవ్యాణి ప్రణయేద్దద్యాత్ । కుర్యాచ్చ పరివర్తనం ।
సంప్రయోగస్య చాకూతంనిజేనైవ ప్రయోజయేత్ ॥
ప్రీతిదాయైరుపన్యాసైః ఉపచారైశ్చ; కేవలైః ।
గమ్యేన సహసంసృష్టారంజయేత్తం తతఃపరం ॥

౬.౧-౨౯.౩౧

ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే వైశికే షష్ఠేఽధికరణే
సహాయ గమ్యాగమ్య గమనకారణ చింతా గమ్యాపా
వర్తనం నామ ప్రథమోఽధ్యాయః.

సంస్కారపూతమైన తాంబూలాన్నీ, పుష్పమాలలనూ, గంధాదులనూ, భోగింపవచ్చినవానికి ప్రీతిపూర్వకంగా అందించాలి. ఆయా కళలనుగురించి ప్రసంగించాలి. తనప్రేమను సూచిస్తూ ఆయావస్తువులను అందించాలి. క్రమంగా ఒకరి వస్తువులనొకరు మార్చుకోవాలి. సంభోగవిషయాన్ని నాయకునికి కొద్దిగా సూచించాలి. ఇంకా ప్రేమను సూచించేమాటలతోనూ, ఉపచారాలతోనూ, ఆ నాయకునితో కలిసి అటు తరువాత సురతక్రీడతో అతన్ని రంజింపచెయ్యాలి.

ఈ విధంగా భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయమూర్తి చేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలోని వైశికమనే ఆరో అధికరణంలో ప్రథమాధ్యాయం ముగిసింది.



శ్రీ

# వాత్స్యాయనీయం



## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

---

### ౬. వైశికాధికరణం



### ౨. కాంతానువృత్తాధ్యాయం

౧-౨౭౧- సంయుక్తా నాయకేన తద్రంజనార్థం ఏకచారిణీ
౧-౨౭౨ వృత్తమనుతిష్ఠేత్. సంజయేన్నతు సజేత్. సక్తవచ్చ విచేష్టేతేతి సంక్షేపోక్తిః. మాతరిచ క్రూరశీలాయాం అర్థపరాయాంచ ఆయత్తాస్యాత్తదభావే మాతృకాయాం. సాతుగమ్యేనాతి ప్రతీయేత. ప్రసహ్య చ దుహితరమానయేత్. తత్రతు నాయికాయాస్సంతతమరతిర్నిర్వేదో వ్రీడాభయంచ। నత్వేవ శాసనాతివృత్తిః వ్యాధించ కృతకమేకమనిమిత్తమజుగుప్సితమచక్షుర్గ్రాహ్య మనిత్యం ఖ్యాపయేత్. సతికారణే తదపదేశంచ నాయకానభిగమనం. నిర్మాల్యస్య తు నాయికా చేటికాం ప్రేషయేత్తాంబూలస్యచ.

వేశ్య నాయకునితో సంభోగాన్ని జరిపి అతనిని రంజింపచెయ్యడానికి ఏకచారిణీ వృత్తాన్ని ఆచరించాలి. నాయిక ఏకచారిణిగా ఉంటే ఆమెకు నాయకుడుగూడా భర్త అవుతాడుగనుక

కాంతానువృత్తాన్నైనా అనుసరించాలి. ఆ కాంతానువృత్త మనేది సంక్షేపమనీ, విస్తరమనీ రెండువిధాలు. అందులో సంక్షేపవిధానం చెపుతున్నారు. వేశ్యా నాయిక ఆసక్తురాలుగా కనిపించాలేగాని సక్తురాలు కాకూడదు. సక్తురాలైనట్లు నటించాలి. ఆమె క్రూరస్వభావంకలదీ, దురాశాపీడితురాలూ, అయిన తనతల్లి స్వాధీనంలో ఉన్నట్లో, లేక పెంపుడు తల్లిచేతిలోఉన్నట్లో నటించాలి. ఆ మాత తనకూతురిని నాయకునియందు సక్తురాలుకాకుండా చూస్తూఉండాలి. అతని దగ్గరనుంచి బలవంతాన తనకూతురిని విడిపించాలి. అలాటి సమయాలలో నాయిక అలారావడం తనకు ఏ మాత్రమూ ఇష్టంలేనట్లూ, దుఃఖమూ, సిగ్గూ, భయమూ, నటిస్తూ తల్లి శాసనానికి ఎదురుచెప్పలేనట్లు సూచించాలి. ఏ కారణమూ లేకుండానే తనకేదో అసహ్యంగా కనిపించనిదీ, చూపులకు గోచరంకానిదీ అయినరోగం పట్టుకున్నట్లుగా ప్రకటించాలి. ఏదో కారణాన్ని పురస్కరించుకుని ఆ వంకతో నాయకుణ్ణి సమీపించకుండా ఉండాలి. ఇంకా ఇతరనాయకులతో సంబంధాని కవకాశాన్ని కల్పించుకోవాలి. మళ్లీ ఆ నాయకులకు అనురాగంచెడకుండా వాళ్లు ధరించినపూలూ, గంధద్రవ్యాలూ స్వీకరిస్తూ ఏదో కారణంమీద సమీపించనట్లు వారికి అర్థమయేలాగా ప్రవర్తించాలి. ఆ తాంబూలాదులను అందుకోడానికి చేటికను పంపాలి.

౧-౨౭. వ్యవాయే తదుపచారేషు విస్మయః చతుష్షష్ట్యాం శిష్టత్వం, తదుపదిష్టానాంచ యోగానాం అభీక్ష్ణ్యేనాను యోగ స్తత్సాత్మ్యాత్ప్రహసివృత్తిః, మనోరథానాం

మాఖ్యానం, గుహ్యానాం వైకృత ప్రచ్ఛాదనం, శయనే
పరావృత్తస్యానుపేక్షణ మానులోమ్యం గుహ్య
స్పర్శనే సుప్తస్య చుంబనం ఆలింగనంచ. ౬.౨.౯

నాయకునితో ఏకాంతసమయంలో ప్రత్యక్షంగా నడవతగిన వర్తనాన్ని చెప్పుతున్నారు. మైథునసమయంలోనూ, అతనికి ఉపచారాలు జరిపేసమయంలోనూ ఎంతో ఆశ్చర్యాన్ని ప్రకటించాలి. చతుష్షష్టి కళాశాస్త్రంలో అతనినేర్పు కనిపెట్టి అతనికి శిష్యురాలవుతున్నట్లు నటించాలి. అతడు ఉపదేశించినయోగాలను తాను ఎక్కువగా అనుసరించాలి. అతనికి ఇష్టమైనరీతిగా రహస్య సమయాలలో ప్రవర్తించాలి. అతనితో తన కనేకరీతులుగా సంభోగించాలని కోరిక కలుగుతున్నట్లు చెప్పాలి. బొడ్డు, చంకలు, గజ్జలు మొదలైనచోట్ల వికారం కనిపించకుండా కప్పిపుచ్చాలి. అతడు పక్కమీద అటుతిరిగి పరున్నప్పుడు తాను ఓర్వలేనట్లు తనవైపు తిప్పుకోవాలి. అతడు తన గుహ్యప్రదేశాన్ని స్పృశించగోరితే తాను అతనికి ఉత్సాహాన్ని ఇవ్వడంకోసమై అడ్డుపెట్టకుండా ప్రవర్తించాలి. అతడు నిద్రపోతూఉంటే ముద్దుపెట్టుకోవాలి. కౌగిలించుకోవాలి.

౧౨౮౦. ప్రేక్షణ మన్యమనస్కస్య రాజమార్గేచ ప్రాసాద
స్థాయాః. తత్ర విదితాయా వ్రీడా, శాఠ్యనాశః,
తద్ద్వేష్యే ద్వేష్యతా, తత్ప్రియే ప్రియతా, తద్రమ్యే
రతిః, తమనుహర్షశోకే, స్త్రీషు జిజ్ఞాసా, కోపశ్చా
దీర్ఘః, స్వకృతేష్వపి నఖదశన చిహ్నేషు అన్యా
శంకా. ౬.౨.౧౦

నాయకుడు పరాకుగా రాజమార్గంలో ఉన్నప్పుడు తాను మేడమీదనుంచిచూచి పరీక్షించాలి. అలాచూస్తూ అతనిచేత తెలియబడి సిగ్గునుపొందాలి. దీన్నే శార్యనాశనం అంటారు. నాయకుని శతృవును తానుగూడా ద్వేషించాలి. అతని స్నేహితుణ్ణి తానూ స్నేహంతో చూడాలి. అతడు అందంగా ఉన్నదన్నవస్తువును తాను అలాగే అనాలి. అతని ననుసరించే సంతోష శోకాలను ప్రకటించాలి. స్త్రీల విషయాలు ప్రసంగంలో తెచ్చి అతని అభిప్రాయాన్ని గుర్తించాలి. కోపం తెచ్చుకుని వెంటనే ఉపసంహరించుకోవాలి. దంతక్షతాలూ, నఖక్షతాలూ తానేచేసి ఎవ్వతె చేసిందని ఆశంకను సూచించాలి.

౧౨౮౧-అనురాగస్యావచన మాకారతస్తు చక్షయేన్మద
౧౨౮౨ స్వప్నవ్యాధిషు తు నిర్వచనం శ్లాఘ్యానాం నాయక కర్మణాంచ, తస్మిన్ఛృణ్వాణే వాక్యార్థ గ్రహణం, తద వధార్య ప్రశంసా విషయే భాషణం, తద్వాక్యస్య చోత్త రేణ యోజనం, భక్తిమాంశ్చేత్ కథాస్వనువృత్తి రన్య త్ర సపత్న్యాః. నిశ్శ్వసే, జృంభితే, స్ఖలితే, పతితే వాతస్య చార్తిమాశంసేత. క్షుత వ్యాహృత విస్మి తేషు జీవే త్యుదాహరణం. దౌర్మనస్యే దౌర్హృ దాపదేశః. గుణతః పరస్యాకీర్తనం. న నిందా, సమాన దోషస్య దత్తస్యధారణం. వృథాపరాధే తద్వ్యసన సేవా అలంకారస్యాగ్రహణ మభోజనంచ.

నిన్నే ప్రేమిస్తున్నానని తననోటితో ఎప్పుడూ చెప్పరాదు. భావ సూచనలతో ఆ అభిప్రాయాన్ని వెలిబుచ్చాలి. మత్తెక్కి

ఉన్నప్పుడూ, స్వప్నంలోనూ, వ్యాధి సమయాలలోనూ, నాయకుని మెచ్చుకోతగిన గుణాలను ముఖతః పలవరించాలి. అతడేమైనా పుణ్యకర్మలు చేసిఉంటే వాటినిగ్రహించి అతనిని ప్రశంసిస్తూ సంభాషించాలి. అతని వాక్యానికి తనవాక్యం అనుకూల సమాధానం అయ్యేలాగా మాట్లాడాలి. అతడు తనయందు సవతులసందర్భం కాకుండా ఇతరవిషయాలు ఏవి చెప్పబోయినా ఊఁ కొట్టాలి. నాయకుడు నిట్టూర్పువిడిచే సమయంలోనూ, ఆవులించినప్పుడూ, మనస్సు సరిగా లేనప్పుడూ, ఎక్కడైనా జారిపడ్డప్పుడూ, ఎంతో ఆర్తిగా క్షేమవాక్యాలు పలకాలి. తనకు మనస్సు సరిలేనప్పుడు వ్యాధిపేరుచెప్పి తప్పించుకోవాలి. ఇతరుల గుణాలను అతనిదగ్గర కీర్తించరాదు. అతనియెదుట నిందించరాదు. అతడిచ్చినదాన్ని ధరించాలి. హఠాత్తుగా వ్యసనంగానీ, ఆపదగానీ తనకాంతునికి సంక్రమిస్తే తాను అలంకారాలు మానాలి. భోజనంగూడా మానాలి.

౧౩౮౯- తద్వ్యక్తాశ్చ విలాసాః, తేన సహ దేశమోక్షం రోప
౯౮ ణేద్రాజని నిష్క్రయంచ. సామర్థ్యమాయుష
స్తదవాప్తౌ తస్యార్థాధిగమేఽభిప్రేత సిద్ధౌ శరీరోపచ
యేవా పూర్వసంభాషిత ఇష్టదేవతోపహారాః. నిత్య
మలంకారయోగః. పరిమితోఽభ్యవహారః. గీతేచ
నామగోత్రయోః గ్రహణం. గ్లాన్యా మురసిల లాటేచ
కరం కుర్వీత. తత్సుఖ ముపలభ్య నిద్రాలాభే ఉత్సం
గేచాస్యోపవేశనం. స్వాపనంచ. గమనం వియోగే.
తస్మాత్పుత్రార్థినీ స్యాదాయుషో నాధిక్యమిచ్ఛేత్.

నాయకునికి రోగాదులు సంభవించినప్పుడు అతని సుఖదుఃఖాలలో పాలుపంచుకున్నట్లుగా అతన్ని గురించి మేడవాలి. నాయకుడు ఏ దేశాంతరానికైనా పోతూఉంటే తానుగూడా వెంబడించడానికి ప్రయత్నించాలి. నా తల్లి చాలా చండప్రచండురాలు. దానిసిమరిపించి తీసుకుని పొమ్మనాలి. ఒకవేళ రాజుగారికొలువులో నాట్యాదులకు ఆ సమయాదులలో హాజరు కావలసిఉంటే రాజుగారితో చెప్పి ఈ నిమంత్రణంనుంచి నన్ను విడిపించమనాలి. అసాధ్య విషయాన్ని నాయకుడు సాధించి పెట్టినప్పుడు ఈ పనులు సాధించిపెట్టి నా ప్రాణాలు నిలిపినారు. ఇలా మీరు చెయ్యకపోతే ఈ పాటికి యేమయేదాన్నో, అని అతనిని నుతించాలి. పూర్వం తానుకొలిచిన యిష్టదేవతా ప్రసాదాన్ని అతనికర్పించాలి. అతని నామగోత్రాలతో గీతాలు గానంచెయ్యాలి. ఏదైనా బాధలో ఉన్నట్లుంటే అతని వక్షఃస్థళమూ, ఫాలభాగమూ, చేత్తో పట్టిచూడాలి. ఆ స్పర్శ సుఖంవల్ల క్రమంగా నిద్రాలాభానికి నాయకుడు ఒగ్గితే తన తొడమీద అతనిని పరుండేట్టుచెయ్యాలి. నిద్రపుచ్చాలి. అతడు తననువిడచి ఎక్కడికైనా వెడుతూఉంటే తానుగూడా వెంట వెళ్లాలి. అతనివల్ల పుత్రులనువాంఛిస్తే ఈ కానుపు సమయంలో నేను మృతినిపొందితే జాగ్రతసుమా అనిచెప్పాలి.

౧-౨౯-౫- తస్య అవిజ్ఞాత మర్థం రహసి న బ్రూయాత్. వ్రత
౧౩౧౧ ముపవాసం చాస్య నిర్వర్తయే న్మయిదోష ఇతి.
అశక్యే స్వయమపి తద్వ్యాపాస్యాత్. వివాదే తే నాస్య
శక్య మిత్యర్థ నిర్దేశః. తదీయ మాత్మీయంవా స్వము:

విశేషేణ పశ్యేత్తే నవినా గోష్ఠ్యానుగమనమితి. నిర్మాల్య ధారణే శ్లాఘా, ఉచ్ఛిష్ట భోజనేచ. కులశీల శిల్ప జాతి విద్యావర్ణ విత్త దేశ మిత్రగుణవయో మాధుర్య పూజా, గీతాదిషుచోదన మభిజ్ఞస్య. భయశీతోష్ణ వర్షాణ్యానపేక్ష్య తదభిగమనం, స ఏవచమేస్యా దిత్యౌర్ధ్వదైహికేషు వచనం. తదిష్ట రసభావ లీలానువర్తనం. మూలకర్మాశంకా. తదభిగమనేచ జనన్యా సహ నిత్యో విషాదః. బలాత్కారేణచ యదన్యత్ర తయా నీయేత. విష మనశనం శస్త్రం, రజ్జుంవా కామయేత్. ప్రత్యాయనంచ ప్రణిధిభిః నాయకస్య, స్వయంవా అత్మనో వృత్తిగ్రహణం. నత్వే వార్థేషు వివాదః. మాత్రా వినా కించిన్న చేష్టేత. ౬.౨.౨౫.౪౨

నాయకునియెదుట అతనికి తెలియకుండా ఏ ఆలోచనా యితరులతో రహస్యంగా చేయరాదు. వ్రతంగానీ, ఉపవాసంగానీ, నాయకుడు చేయబోతూఉంటే మీ శరీరం దుర్బలంగాఉన్నది. నేనే ఆ వ్రతంచేస్తానని కల్పించుకునిచెయ్యాలి. అలా ఒప్పుకొనకపోతే తానుగూడా అతనితో ఉపవసించాలి. ఏదైనా వివాదం వచ్చినప్పుడు మిమ్ములనుపుట్టించిన బ్రహ్మకుగూడా తరం కాదనాలి. అతనివస్తువుగానీ, తనవస్తువుగానీ స్వపరభేదం లేకుండా చూడాలి. అతడులేకుండా ఏ గోష్ఠులకూ వెళ్లరాదు. అతడుధరించిన పూవులూ, మొదలైనవి ధరించడంలో పొగడ్త కలిగిఉండాలి. అతడుతినగా మిగిలినఅన్నాన్ని భుజించాలి. అతనికులాన్ని, శీలాన్ని, జాతినీ, విద్యనీ, వర్ణాన్ని, ధనాన్ని,

పూజించాలి. సంగీతసభలు జరిగేసమయంలో గాయకుని ద్వారా అతనిని స్తుతింపచెయ్యాలి. భయమనీ, చలిఅనీ, ఎండ అనీ, వర్షమనీ చూడక అతన్ని అనుసరించాలి. ఉత్తర లోకాలలోగూడా ఇతడే నాకు భర్త కావాలని పలకాలి. అతనికిష్టమైన రసభావలీలలను సూచించాలి. వశీకరణవిషయంలో తనకు అనుమానండున్నట్లు నటించాలి. అతనిని అనుసరించే సమయంలో తనతల్లితో ఎప్పుడూ వాదుపెట్టుకోవాలి. బలవంతాన ఆమె అతనినుంచి వేరుచెయ్యబోతూఉంటే విషం తినడానికో, అన్నం మానడానికో, గొంతు కోసుకోడానికో, ఉరి పెట్టుకోడానికో ప్రయత్నించాలి. నాయకుణ్ణి గూఢచారుల ద్వారా రప్పించుకోవాలి. తనంతటతనే తనకులవృత్తిని నిందించాలి. అతనితో డబ్బు విషయమై వివాదపడరాదు. తల్లి లేకుండామాత్రం ఏపనీ చెయ్యరాదు.

౧౩౧-౨- ప్రవాసే శీఘ్రాగమనాయ శాపదానం. ప్రోషితే
౧౩-౨౧ మృజానియమః. అలంకారస్య ప్రతిషేధః. మంగళం త్వపేక్ష్యం. ఏకం శంఖవలయం వాధారయేత్. స్మరణమతీతానాం గమన మీక్షణికోపశ్రుతీనాం నక్షత్ర చంద్రసూర్య తారాభ్య స్స్పృహణం, ఇష్ట స్వప్న దర్శనే తత్సంగమోమమాస్త్వితి వచనం, ఉద్వేగే నిష్టేశాంతి కర్మచ ప్రత్యాగతే కామ పూజాంచ. దేవతో పహారాణాం కరణం. సఖీభిః పూర్ణ పాత్రస్యాహారణం. వాయస పూజాచ. ప్రథమ సమాగమానంతరంచైతదేవ వాయసపూజా వర్జం. వక్తవ్య చానుమరణం బ్రూయాత్. ౬.౨.౪౨-౪౩

నాయకుడు దూరదేశానికి వెడుతుంటే గౌందరగారమ్మని ఒట్టుపెట్టుకోవాలి. అతడు వెడలిపోయినతరువాత శరీర సంస్కారాలు మానుకోవాలి. అలంకారాలు ధరించరాదు. మంగళసూత్రంమాత్రం ధరించాలి. లేక శంఖుబదండైనా ఒకటిధరించాలి. జరిగిపోయిన రోజులను లెక్కించుకోవాలి. తన నాయకునిబంధువులకు తన వ్రతాదులు తెలిసేలాగా నక్షత్రాలూ, చంద్రిసూర్యులూ, వీరిగమనాన్ని స్మరించాలి. తనకిష్టమయిన స్వప్నం అయినప్పుడు అతనిసంగమం నాకు మళ్ళీ లభించునుగాకఅని పలకాలి. రాగూడనికలలు వస్తే తత్తరపాటుతో శాంతిక్రియలుచెయ్యాలి. తిరిగి అతను తనదగ్గరకు వచ్చినప్పుడు కామపూజలు చెయ్యాలి. దేవతో పహారాదులు జరపాలి. చెలికత్తెలచేత పూర్ణపాత్రను తెప్పించాలి. వాయసపూజ చెయ్యాలి. ప్రథమ సంగమం అయిన తర్వాత మళ్ళీ పై ఉత్సవంఅంతాజరపాలి. అతనికి బాగానమ్మకం కలగడానికి నీతోనేనాకు మరణం ప్రాప్తించుగాకఅని పలకాలి.

౧౩-౨-౨. నిస్పృష్టభావః సమానవృత్తిః ప్రయోజనకారీ నిరాశంకో నిరపేక్షోఽర్థేష్వితి సక్తలక్షణాని. ౬-౨-౪౮

స్త్రీ యందు సక్తుడైనవాడెలా ఉంటాడో చెవుతున్నారు. అన్నివిధాలా బాగానమ్ముతాడు. తనతో సమానురాలినిగా చూస్తాడు. నాయిక అడిగినదల్లా తెచ్చిపెడతాడు. ఏ సందేహాలూపడడు. డబ్బువిషయమైన ఏ మాత్రమూ అపేక్షను సూచించడు. ఇవి సక్త లక్షణాలు.

౧౩-౨౩. తదేతన్నిదర్శనార్థం దత్తకశాసనాదుక్తం మనుక్తంవ లోకత శ్శీలయేత్. ౬-౨-౪౯

దీనికినిదర్శనంగా దత్తకుని శాస్త్రాన్ని గ్రహించివ్రాశారు వాత్స్యాయనులు. ఇంకా చెప్పనివిషయాలు లోకంవల్ల గ్రహించవచ్చు.

భవతశ్చాత్రశ్లోకా—

౧౩-౨౮-సూక్ష్మత్వాదతిలోభాచ్చ ప్రకృత్యాజ్ఞానతస్తథా

౧౩-౨౯. కామలక్ష్మ తు దుర్జ్ఞానం స్త్రీణాం తద్భావితైరపి

కామయంతే విరజ్యంతే రంజయంతి త్యజంతిచ

కర్షయంత్యోఽపిసర్వార్థాన్ జ్ఞాయంతే నైవ యోషితః॥

ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే వైశికే షష్ఠేఽధికరణే

కాంతానువృత్తం నామ ద్వితీయోఽధ్యాయః

వేశ్యాస్త్రీలకు కామస్వభావం సహజమా? కాదా? అనే విషయం తెలుసుకోడానికి సాధ్యపడదు కాబట్టిన్నీ, వారికి ధనలోభగుణం ఎక్కువగా ఉంటుందిగనుకనున్నూ, స్వభావసిద్ధంగా కామం అనేది అజ్ఞానలక్షణం గనుకనున్నూ, ఈ కామలక్షణాన్ని తెలుసుకోడానికి జ్ఞానవంతులకుగూడా శక్యంకాదు. ఒక్కొక్కప్పుడు బాగా ఆసక్తితో కామిస్తున్నట్లు సురతక్రియ జరుపుతారు. ఒక్కొకప్పుడు విరక్తలౌతారు. ఇలా ఉంటూనే సమస్తద్రవ్యాన్నీ అపహరించేస్తారు. కాబట్టి వారి హృదయస్వభావం బ్రహ్మకుకూడా తెలియశక్యంకాదు.

ఇలా భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయమూర్తి చేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళ వ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలోని వైశికమనే ఆరో అధికరణంలో రెండో అధ్యాయం ముగిసింది.

శ్రీ

# వాత్స్యాయనసూత్రం

:o:

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

౬. వైశికాధికరణం

### 3. అర్థాగమోపాయాధ్యాయం

౧౩౭౬-సక్తా ద్విత్తాదానం స్వాభావిక ముపాయతశ్చ. తత్ర
౩౧౭౮. స్వాభావికం సంకల్పితం, సంకల్పమధికం వా లభమా
నానోపాయా న్ప్రయుంజీతే త్యాచార్యాః. విదితమ
ప్యుపాయైః పరిష్కృతం ద్విగుణం దాస్యతీతి వాత్స్యా
యనః. ౬.౩.౧-౩

వేశ్య తనయందు ఆసక్తుడైన పురుషునివల్ల స్వాభావికంగానూ, ఉపాయ పూర్వకంగానూ ధనాన్ని రాబట్టుకోవాలి. స్వాభావికంగా తనకోరికకు సరిపోయే తీరుగాగానీ, అంతకు ఎక్కువగా గానీ ధనంలభిస్తే ఉపాయప్రయోగం అనవసరం అని ప్రాచీనాచార్యులన్నారు. మొట్టమొదటగా ఇతనివలన ఇంత లభిస్తుందని తెలిసిఉన్నా ఉపాయపూర్వకంగా ప్రవర్తిస్తే అంతకంటె రెండంతలుగా ధనం లభిస్తుందని వాత్స్యాయనులన్నారు.

౧౩౭౯-అలంకార భక్ష్యభోజ్యపేయ మాల్యవస్త్ర గంధ
౧౩౮౦. ద్రవ్యాది వ్యవహారిషు కాలిక ముద్ధార్య మర్థ ప్రతిన
యనేన తత్సమక్షం. తద్విత్త ప్రశంసా. వ్రతవృక్షా

రామదేవకులతటాకోద్యానోత్సవ ప్రీతిదాయ వ్యప దేశః. తదభిగమన నిమిత్తో రక్షిభిశ్చోరైర్వా అలంకార సరితోషః. దాహాత్కుడ్యచ్ఛేదా త్ప్రమాదా ద్భవనేచ అర్థనాశః. తథా యాచితాలంకారాణాం నాయకాలంకారాణాంచతదభిగమనార్థస్యవ్యయస్యప్రణిధిభిర్నివేదనం, తదర్థ మృణగ్రహణం. జననీసహాత దుద్భవస్య వ్యయస్య వివాదః. సుహృత్కార్యేష్వ నభిగమన మనభిహారహేతోః తైశ్చ పూర్వమాహృతా గురవోఽభిహారాః పూర్వ ముపనీతాః పూర్వం శ్రావితాస్యుః. ఉచితానాం క్రియాణాం విచ్ఛిత్తిః. నాయకార్థంచ శిల్పిషుంకార్యం. వైద్యమహామాత్రయోః ఉపకారక్రియా హేతోః. మిత్రాణాం చోపకారిణాం వ్యసనే ష్వభ్యుపపత్తిః. గృహకర్మ. సఖ్యాః పుత్రస్య ఉత్సంజనం దోహదం వ్యాధి ర్మిత్రస్య దుఃఖాపనయన మితి అలంకారైకదేశ విక్రయో నాయకస్యార్థే, తయా శీలితస్యాలంకారస్య భాండోపస్కరస్య వా వణిజో విక్రయార్థం దర్శనం. ప్రతి గణికానాంచ భాండస్య సదృశస్య వ్యతికరే ప్రతి విశిష్టస్య గ్రహణం. పూర్వోపకారాణాం అవిస్మరణ మనుకీర్తనంచ. ప్రణిధిభిః ప్రతి గణికానాం లాభాతిశయం శ్రావయేత్. తాసు నాయక సమక్షం ఆత్మనోఽభ్యధికం లాభం భూత మభూతం వా వ్రీడితానా మవర్ణయేత్. పూర్వయోగినాంచ లాభాతిశయేన పునస్సంధానే యతమానానాం ఆవిష్కృతః ప్రతిషేధః. తత్స్పర్ధినాంచ త్యాగి

యోగితా నిదర్శనం. సపుసరేప్యతీతి బాలయాచితక
మిత్యర్థాగమ ఉపాయాః. ౬.౩.౮.౨౬

ఏ ఉపాయాలవల్ల నాయకుడిచ్చే డబ్బుకంటె ఎక్కువడబ్బు దక్కడానికి వీలుంటుందో ఆ ఉపాయాలను చెవుతున్నారు. అలంకారాలూ, లడ్డూలూ మొదలైనభక్ష్యాలూ, అన్నమూ మొదలైన భోజ్యపదార్థాలూ, మద్యమూ మొదలైన పాన ద్రివ్యాలూ, వస్త్రాలూ, గంధద్రివ్యాలూ, తాంబూలాదులూ పనిముట్లూ మొదలైనవాటిని ఆయావర్తకులు వచ్చినప్పుడు నాయకునియెదుట వారితో బేరమాడి పుచ్చుకోవాలి. అలా పుచ్చుకునే సమయంలో నాయకుడు తనంతటతానే ఆ మూల్యాన్ని యిచ్చివేస్తాడు. అతడలా డబ్బుఇచ్చినప్పుడు ప్రశంసించాలి. అక్కడ ఒకవృక్షాన్ని నెలకొల్పాలి. ఇక్కడ ఒకతోట నిర్మించాలి. ఇక్కడ దేవాలయాన్ని ప్రతిష్ఠింప చెయ్యాలి. ఉద్యానోత్సవం జరపాలని కుతూహలం ఉన్నది. బంధువు వచ్చాడు. అతనికేమైనా ఇవ్వాలి. అని యేదో నెపంచెప్పి ధనం కావాలని అడగాలి. అతనితో ప్రయాణం చేస్తూ రక్షకులూ, దొంగలూ, మొదలైనవాళ్ల చేత తన అలం కారాలు దొంగిలింపచేసి గోలచెయ్యాలి. వెంటనే నాయకుడు మరికొన్ని అలంకారాలు ఇస్తాడు. తనధనంఅంతా దొంగలు దోచుకుపోయారనీ, ప్రమాదంవల్ల నిప్పంటుకుని ఇల్లు తగల పడిపోతే ఆ యింట్లో తనద్రివ్యం యెంతోపోయిందనీ, ఈ ద్రివ్యనాశనం నిన్ననుసరించడంవల్లే జరిగిందనీ మాట్లాడాలి. మాతల్లి ధనంగూడా ఇందులో కొంతఉన్నది. అదిగూడా

నాశనం అయిపోయిందని అడగాలి. తాను అడిగిన అలంకా రాలూ, నాయకుని అలంకారాలూ, అతనితో ప్రయాణం చెయ్యడంవల్ల వ్యయమయినాయని గూఢచారులద్వారా అత నికి తెలియజెయ్యాలి. అతనికోసం తాను ఋణంచేసినట్లు చూపించాలి. అతనికోసం చేసిన వ్యయాన్నిగూర్చి తల్లితో పోరాటం పెట్టుకోవాలి. నాయకుని మిత్రుని యిండ్లలో ఉత్స వాలు జరుగుతూఉంటే నాయకుడు పిలుస్తున్నా, ప్రతిమాలు తున్నా కానుక లేకుండా కదలరాదు. పూర్వం నాయకుడే యే గొప్పగొప్ప వస్తువుల నిస్తానన్నాడో అది ముందుగా తెచ్చియిస్తేనేగాని ఇల్లు కదలననాలి. లేక నాయకునిచేత "ఆ బంధువులు నాకిచ్చే బహుమానాలన్నీ నీకే యిస్తా"నని అనిపించుకోవాలి. రోజుకు జరుగుబాటులేనట్లు వంట మాని వెయ్యాలి. ఆ దుస్థితినిచూచి అతను ఏమైనా ఇవ్వకుండా ఉంటాడా? ఇంకా డబ్బు రాబట్టడానికి తగిన శిల్పుపనులు కల్పించుకుని ఆ పనులు పూర్తి చేయించడానికి తనదగ్గర డబ్బులేనట్లునటించి అతనిదగ్గర పుచ్చుకోవాలి. వైద్యులూ మొదలైనవారికి సహాయంచెయ్యాలసి కొంతద్రవ్యం హరిం చాలి. తనకు ఉపకారంచేసే బంధువులకు వ్యసనం ప్రాప్తించిం దని కొంత, ఇంటిపనులకని కొంత చెలికత్తె సంతానానికి ఉత్స వమనికొంత, దోహదమనికొంత, జబ్బుకనికొంత, తనమిత్రుని రోగనివారణకని కొంత, ద్రవ్యాన్ని అడిగి పుచ్చుకోవాలి. నాయకునికోసమై తన అలంకారంలో కొంతభాగం అమ్మి ఖర్చుపెట్టేదానిలాగా నాయకునియెదుట నటించాలి. వర్తకు నితో అదివరకే మాట్లాడి ఆ ద్రవ్యంకోసం తనయింట్లో ఉన్న

వస్తువులను తీసుకునిపొమ్మని నాయకునియెదుట కనపరచాలి. ఇలాచేస్తే ఆ ద్రవ్యాన్ని నాయకుడిచ్చివేస్తాడు. తనవాళ్లలో ఇతరులకుకూడా ఇలాటి పోలికలుగలవస్తువులే ఉండడంవల్ల మారుపడుతున్నాయనీ, అంతకంటె ఖరీదుగలవస్తువును మార్చుకునే యేర్పాటుకోసం కొంతద్రవ్యాన్ని సంగ్రహించాలి. నాయకుడు పూర్వంచేసిన ఉపకారాలను మరచిపోరాదు. స్తుతిస్తూఉండాలి. గూఢచారులద్వారా ఇతర గణికల లాభాలను వినిపించాలి. తనకంటె తక్కువైన గణికలకు సైతం పెద్దపెద్దలాభాలు సమకూడినాయని నాయకునియెదుట ఉన్నవీ లేనివీ కల్పించి సిగ్గుపడుతూ చెప్పాలి. పూర్వం తనను ఉంచుకున్నవాళ్లు తనకు పెద్దలాభం యిస్తామంటున్నారనీ, పునస్సంధానంకోసం ప్రయత్నిస్తున్నారనీ, కాని మిమ్ములను నేను విడువలేక వారిని త్రోసిపుచ్చాననీ చెప్పాలి. అలాగే తనశత్రువులకు వారి విటులు ఇంతలాభం ఇవ్వబోతున్నారనీ, తన గూఢచారులద్వారా అతనికి చెప్పించాలి. చివర చివరకు చిన్నపిల్లలు పెద్దవాళ్లవద్దజేరి చీటికీమాటికి అదితెచ్చిపెట్టు, ఇదితెచ్చిపెట్టు అని పీడించేవిధంగా ప్రవర్తించాలి. ఇవి వేశ్యలు ధనం సంపాదించే విధానాలు.

౧౩౪౧. విరక్తంచ నిత్యమేవ ప్రకృతి విక్రియాతో విద్యాత్. ముఖవర్ణాచ్చ. ౬.౩.౨౭

ఇక విరక్తుల లక్షణాలు చెప్పుతున్నారు. తానలా ధనం అడిగే సమయాలలో నాయకుడు స్వభావానికి విరుద్ధంగా ప్రవర్తించినా, ముఖలక్షణాలలో మార్పులు సూచించినా, అతన్ని విరక్తుణ్ణిగా గుర్తించాలి.

౧౩౫౮-౨-ఊనమతిరిక్తం వా దదాతి. ప్రతిలోమైః సంబధ్యతే.
౧౩౫౯-వ్యపదిశ్యాన్యత్కరోతి. ఉచితమాచ్ఛినత్తి. ప్రతిజ్ఞాతం విస్మరతి. అన్యథా వా యోజయతి. స్వపక్షైస్సంజ్ఞయా భాషతే. మిత్రకార్య మపదిశ్యాన్యత్ర శేతే. పూర్వ సంసృష్టాయాశ్చ పరిజనేన మిథః కథయతి.

ఇక ఆ విరక్తునిచేష్టలు చెపుతున్నారు. ఆ నాయకుడు ఎప్పుడూ ఇచ్చేధనంకంటె చాలా ఎక్కువైనా ఇస్తాడు. చాలా తక్కువైనా ఇస్తాడు. నాయికకు గిట్టనివాళ్లతో సహవాసం మొదలు పెడతాడు. నాయిక చెప్పినపనిని యెంతో ప్రేమతో చేసేట్టు నటించి దానికి విరుద్ధంగా చేస్తాడు. ఔచిత్యాన్ని పాటించడు తానుచేసిన వాగ్దానాన్ని మరిచిపోతాడు. లేక దాన్ని మరొక తీరుగానన్నా చేస్తాడు. తనవాళ్లతో నాయికకు తెలియకుండా సంజ్ఞలతో వంచనగా మాట్లాడతాడు. తన స్నేహితునిపని ఉన్నదనే నెపంతో మరొకచోట పడుకుంటాడు. అతనికి పూర్వ సంబంధంఉన్న వేశ్యయొక్క పరిజనంతో రహస్యంగా మాట్లాడతాడు, ఆలోచనలు చేస్తాడు.

౧౩౬౦- తస్య సారద్రవ్యాణి ప్రాగవబోధా దన్యాపదేశేన
౧౩౬౧-౨. హస్తే కుర్వీత. తాని చాస్యా హస్తా దుత్తమర్ణః ప్రసహ్య గృహ్ణీయాత్. వివదమానేన సహ ధర్మస్థేషు వ్యవహారేదితి విరక్త ప్రతిపత్తిః. ౬.౩.౫౦

అలాంటి విరక్త లక్షణాలుగల నాయకునియొక్క బంగారు వెండి మొదలైన ఖరీదుగలవస్తువులను అతనికి తెలియకుండానే ఏదో నెపంతో తన స్వాధీనం చేసుకోవాలి. ఆ వస్తువులను

ఆ నాయిక తనదగ్గరనుంచి బాకీదారుడు కొనిపోయినట్లు నటన జరపాలి. నాయకుడు పోరాటానికిదిగితే ధర్మస్థానానికిపోయి వ్యవహరించాలి. ఇది విరక్తులకూ వేశ్యలకూజరిగే కథ.

౧౩౬౩- సక్తంతు పూర్వోపకారిణ మప్యల్పఫలం వ్యళీకేనాను
౧౩౬౪. పాలయేత్. అసారంతు నిష్ప్రతిపత్తిక ముపాయ
తోఽపవాహయే దన్య మవష్టభ్య. ౬.౩ ౪౦

ఇక విరక్తుడైన నాయకుణ్ణి వెళ్లగొట్టేవిధానం చెవుతున్నారు. సాధారణంగా విరక్తుడు నాయికచేత చెప్పుదెబ్బలు తినకుండానే వెళ్లిపోతాడు. వాని విషయమై ప్రయత్నమే అనవసరం. ఇక ధనం యెంతో ఖర్చుపడి ఆమెయందు మమతను విడువలేకుండా ఉన్ననాయకుణ్ణి పూర్వం తనకంత ఉపకారంచేసిఉన్నా, కొద్దిగానో, గొప్పగానో తనకు ముట్టచెవుతున్నా ఏవో తప్పులు నారోపించి వెళ్లగొట్టేప్రయత్నంలో ఉండాలి. ఏమీ రాల్చని వాణ్ణి ధనహీనుణ్ణిగా గ్రహించి అతనివల్ల తన కేవిఫలంగానూ ఏమీలాభం లేనప్పుడు మరిఒక ధనవంతుణ్ణిచేపట్టి మొదటి వాణ్ణి సాగనంపాలి.

౧౩౬౫. తదనిష్టసేవా, నిందితాభ్యాసః, ఓష్ఠనిర్భోగః, పాదేన భూమే రభిఘాతః, అవిజ్ఞాత విషయస్య సంకథా, తద్విజ్ఞాతే ష్వవిస్మయః కుత్సాచ, దర్పనిఘాతః, అధికైస్సంవాసః, అనపేక్షణం, సమాన దోషాణాం నిందా, రహసిచావస్థానం. ౬.౩.౪౧.

విరక్త నాయకుణ్ణి సాగనంపేవిధానాన్ని ఇక్కడ చెవుతున్నారు. అతనికిష్టంలేనిపనులు చెయ్యాలి; నిందితములైన

మధ్యమూ మొదలైనవాటిని సేవించాలి. ముక్కూ మూతీ విరుస్తూ ఎక్కిరించాలి. కాళ్లతో నేలరాయాలి. అతనికి తెలియనిదాన్ని అడగాలి. అతడు తగిన సమాధానమిస్తే ఆశ్చర్యపడాలి. అసహ్యించుకోవాలి. ఈ విషయం నీకంటె ఫలానావానికి ఎక్కువగా తెలియునని పదిమందిలోనూ అతనిని హేళన చెయ్యాలి. అతడెంత తెలిసిఉన్నా పేలవంగా చూడాలి. అతనికంటె గొప్పవాళ్లతో సంచరించాలి. ఎవరిద్వారానైనా గర్వభంగం చేయించాలి. అతనివంకైనా చూడరాదు. అతనికి సంబంధించిన వస్తువు తనకెంత యిష్టమైనదైనా గ్రహించకుండా హీనంగా చూడాలి. ఎప్పుడూ అతనికి కనుపించరాదు.

౧౩౬౬. రతోపచారే హృద్వేగః. ముఖస్యాదానం, జఘనస్య రక్షణం, నఖదశనక్షతేభ్యో జుగుప్సా, పరిష్వంగే భుజమయ్యా సూచ్యా వ్యవధానం, స్తబ్ధతా గాత్రాణాం, సక్థ్నోర్వ్యత్యాసః. నిద్రాపరత్వంచ, శ్రాంత ముపలభ్యచోదనా, అశక్తౌహాసః, శక్తావనభినందనం, దివాపి భావ ముపలభ్య మహాజనాభిగమన మితి. ౬.౩.౪౨

విరక్తుడైన నాయకుణ్ణి రహస్య సమయాలలో ఎలా విరక్తి పుట్టించాలో చెవుతున్నారు. సురతసమయంలో అదిరిపాటు చూపించాలి. ముద్దులు పెట్టుకోపోతే మూతితిప్పటం, రహస్యభాగాన్ని దాచుకోడం, వ్యక్తం చెయ్యకపోవడం, అతని నఖక్షతాలకూ, దంతక్షతాలకూ అసహ్యించుకోడం, ఓర్పులేకపోవడాన్ని సూచించడం, కౌగిలింతలో తనచేతులు అడ్డుపెట్టి అతనికి

సుఖంలేకుండా చెయ్యడం, శరీరాన్ని కదల్చకుండా మొద్దు లాగా పడుకోడం, ఒకతొడమీద ఒకతొడఉంచి వ్యత్యాసంగా సురతానికి వీలులేకుండా ఉండడం, నిద్రపోతున్నట్టు నటించడం, రతిచేసి విసిగిపోయినతరువాత రతిచెయ్యమని ప్రేరేపించడం, అశక్తుడై ఉన్నప్పుడు హాస్యంచెయ్యడం, శక్తి కలవాడైతే యేమాత్రమూ మెచ్చకపోవడం, పగలుగూడా మైథునానికి ఉద్యమిస్తే అక్కడనుంచి జనసంఘంలోనికి పారిపోవడం, ఈ పన్నెండూ సురతకాలంలో విరక్తిని కలిగించి వెళ్లగొట్టే ఉపాయాలు.

౧౩౬-౭- వాక్యేషు ఛలగ్రహణం, అనర్మణిహాసః, నర్మణి
౧౩౮-౯. చాన్య ముపదిశ్యహాసేత్. వదతి తస్మిన్కటాక్షేణ పరి
జనస్య ప్రేక్షణం, తాడనంచ, ఆహత్యచాస్య కథా
మన్యాః కథాః తద్వ్యళీకానాం వ్యసనానాంచ అపరి
హార్యాణాం అనుకీర్తనం. మర్మాణాంచ చేటికయా
క్షేపణం, ఆగతే దర్శన మయాచ్యయాచన మంతే
స్వయం మోక్షశ్చేతి ప్రతిగ్రహకల్పే దత్తకస్య.

అతని మాటలలో తప్పులుపట్టాలి. చమత్కారం లేనిమాట లని నవ్వాలి. చమత్కారవాక్యాలకు దేనికో నవ్వినట్లు నవ్వాలి. అతడు మాట్లాడుతుంటే అతనివంక చూడకుండా పరిజనంవైపు చూడాలి. నవ్వుతూ చప్పటలుచరచాలి. అతని దుశ్చేష్టలూ, ఇతరకథలూ, సహించని వ్యసనాలూ, జ్ఞాపకం చేసి అతనిదగ్గర యెత్తిపొడవడం, ఇంకా రహస్య లోపాలను చేటికద్వారా ఆక్షేపింపచెయ్యాలి. అతడు తనయింటికి వచ్చి

నప్పుడు కోరరానికోరికలు కోరి అతడు దాన్ని సాధించి పెట్టలేక పోయాడని వెళ్లగొట్టాలి. ఈ ఉపాయాలు దత్తకాచార్యులు చెప్పినవి.

భవతశ్చాత్రశ్లోకౌ—

౧౩౯— పరీక్ష్య గమ్యస్సంయోగః. సంయుక్తస్యానురంజనం।
౧౪౦ రక్తాదర్థస్య చాదానం। అంతేమోక్షశ్చ వైశికం। ఏవ
మేతేన కల్పేన స్థితా వేశ్యా పరిగ్రహే,నాతి సంధీయతే
గమ్యైః కరోత్యర్థాంశ్చ పుష్కలాన్॥

ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే వైశికే షష్ఠేఽధికరణే అర్థాగమోపాయాః విరక్త ప్రతిపత్తిః నిష్కాసనక్రమా స్తృతీయోఽధ్యాయః

వేశ్య నాయకుని పరీక్షించుకుని సంయోగాన్ని నెరపడమూ, సంబంధం కుదుర్చుకున్న నాయకుణ్ణి రంజింపచెయ్యడమూ, అనురక్తుడైనవానివల్ల ధనాన్ని సాధించడమూ, ధనం లోపించినతరువాత వాణ్ణి వెళ్లగొట్టడమూ, అనే ఈ కార్యక్రమం వేశ్యలకు సంబంధించినది. ఈ క్రమంగా వేశ్య విటులను పరిగ్రహించి నాయకునితో మిక్కిలి ఆసక్తురాలుకాకుండా డబ్బు మాత్రం బాగా సంపాదిస్తుంది.

ఈ విధంగా భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయమూర్తి చేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలోని వైశికమనే ఆరో అధికరణంలో మూడో అధ్యాయం ముగిసింది.

శ్రీ

# వాత్స్యాయనీయం



## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం



### ౬. వైశికాధికరణం



### ౪. విశీర్ణ ప్రతిసంధానాధ్యాయం

౧౩౭౧. వర్తమానం నిష్పీడితార్థం ఉత్సృజంతీ విశీర్ణేన సహాసంధధ్యాత్. ౬.౪.౧

ప్రస్తుతము తనను ఉపభోగిస్తున్న పురుషుని ధనసంపదను పిండి ఒడుచుకుని విడిచిపెట్టబోతూ పూర్వం ఇలాగే సంభోగించి ఒదిలివేసిన పురుషుణ్ణి దగ్గరకుతియ్యాలి. దీన్నే విశీర్ణప్రతి సంధానం అంటారు.

౧౩౭౨. సచేదవసితార్థో విత్తవాన్ సానురాగశ్చ తతస్సంధేయః. ౬.౪.౨

పాదానికిఘరించిన లత్తుకను ఒదుల్చుకున్నట్లు ఒదిలివేసిన పురుషుణ్ణే మళ్లీ రాబట్టుకోడం ఏమిటో చెపుతున్నారు. వేశ్యను మరిగినపురుషుడు ఒకమాటు ఆమెచేత ఇంటినుండి గెంటబడినా తరువాత తరువాతమళ్లీ ఏయూపంగానైనా విత్తాన్ని సంపాదించ గలిగితే దాన్ని మళ్ళీ ఆమెకు సమర్పించి ఉపభోగించడానికి

తప్పక ప్రయత్నిస్తాడు. అతని అనురాగాన్ని బాగా పరీక్షించుకునే దగ్గరకు చేరనియ్యాలి. లేకపోతే యేదోకొంచెం ముట్టచెప్పినట్లే చెవుతూ "నన్నిది పూర్వం విశ్వాసంలేకుండా గెంటివేసింది"ని విరక్తుడై అపకారంచేస్తాడు. కాబట్టి బాగా ప్రేమనుపరీక్షించి మళ్ళీ దగ్గరకు చేర్చుకోవాలి.

౧౩౨౩. అన్యత్ర గత స్తర్కయితవ్యః, సకార్యయుక్త్యా షడ్విధః

అలా మళ్ళీ దగ్గరకు చేర్చుకున్నవాని విషయమై చేయవలసిన విధానాన్ని చెవుతున్నారు. మరొకస్త్రీని తాను విడిచినతరువాత చేపట్టినట్లు అనుమానముంటే పరీక్షించి నిరూపించుకోవాలి. ఇలా ఒకమాటు గెంటబడినపురుషులు ఆరువిధాలుగా ఉంటారు. తనతో పూర్వం సంగమించనివాడైతే ఈ భేదాలుండవు.

౧౩౨౪-ఇతస్స్వయ మపసృతః. తతోఽపి స్వయమేవాపసృతః
౧౩౨౫. ఇతస్తతశ్చ నిష్కాసితాపసృతః, ఇతస్స్వయ మపసృత స్తత్రస్థితః, ఇతో నిష్కాసితాపసృతః. ఇతో నిష్కాసితాపసృత స్తత్రస్థితః. ౬.౪.౪-౫

ఈ నాయికనుండి స్వయంగాతొలగి మరొకన్ని చేపట్టినవాడూ, ఆ స్త్రీ దగ్గరనుంచికూడా స్వయంగానే తొలగివచ్చినవాడూ, అక్కడా చెప్పుదెబ్బలుతిని తొలగినవాడూ, ఈ స్త్రీనుండి స్వయంగాతొలగి, ఆ స్త్రీదగ్గర చేరినవాడూ, ఇక్కడినుండి వెడలగొట్టబడి తొలగి వచ్చినవాడూ, ఇక్కడ వెడలగొట్టబడి అక్కడ చేరినవాడూ అని నిష్కాసితులు ఆరు విధాలుగా ఉంటారు.

౧౩౭౦. ఇతస్తతశ్చ స్వయమేవాపసృత్యోపజపతిచే దుభయోర్గుణానపేక్షీ చలబుద్ధి రసంధేయః॥ ౬.౪.౧౦

తననూ స్వయంగానే ఒదిలివేసి, మరొకదాన్నీ స్వయంగానే విడుచుకుని మళ్లీ పీఠమర్దాదులద్వారా సంధానంకోసం ప్రయత్నించేవాణ్ణి ఎన్నడూ దగ్గరకుచేర్చరాదు. వాణ్ణి గుణగ్రహణం లేనివాణ్ణిగానూ, చలబుద్ధికలవాణ్ణిగానూ గ్రహించాలి.

౧౩౭౧. ఇతస్తతశ్చ నిష్కాసితాపసృతః, స్థిరబుద్ధిః, సచేదన్యతో బహులభ్యమానయా నిష్కాసితః స్యాత్స సారోపి తయారోపితో మనూమర్షాద్బహుదాస్యతీతిసంధేయః.

ఇక్కడనుండి వెడలగొట్టబడి అక్కడనుండి నిష్కాసితుడై మళ్లీ సంధికోసం తనవద్దకు వస్తుంటే వాణ్ణి స్థిరబుద్ధిగా గ్రహించాలి. ఇతనికంటెగొప్పవాని అవలంబనం దొరకడంవల్ల మరొక స్త్రీ చేత ధనవంతుడయీకూడా వెడలగొట్టబడిఉంటే ఆమెమీది రోషంచేత నా కెక్కువగా ఇస్తాడని దగ్గరకు చేర్చుకోవచ్చు.

౧౩౭౨. నిస్సారతయా కదర్యతయా వాత్యక్తోనశ్రేయాన్.

ధనహీనుడనిగానీ, పిసినిగొట్టనిగానీ వెడలగొట్టబడిఉంటే వాణ్ణి దగ్గరకు రానియ్యరాదు.

౧౩౭౩. ఇతస్స్వయ మపసృత స్తతో నిష్కాసితాపసృతో యద్యతిరిక్త మాదౌచ దద్యాత్తతః ప్రతిగ్రాహ్యః.

ఇక్కడనుండి స్వయంగా వెళ్లిపోయి, అక్కడనుండి వెళ్లగొట్టబడి తొలగివచ్చి పూర్వం తనకిస్తానన్న బాకీని ఇచ్చివేస్తే వాణ్ణి మళ్ళీ దగ్గరకు తియ్యవచ్చు.

౧౩౮౪. ఇతస్స్వయ మపసృత్య తత్రస్థిత ఉపజపం స్తర్కయి
తవ్యః. ౬.౪.౧౪

ఇక్కడినుంచి స్వయంగానే మానుకుని అక్కడజేరి ఉపభోగిస్తూ మళ్ళీ తనవాళ్లతో ఆలోచనసాగిస్తే వాణ్ణికొంచెం పరీక్షించి గాని దగ్గరకు చేరనియ్యరాదు.

౧౩౮౫. విశేషార్థీ చాగత్య తత్రవిశేష మపశ్యన్ అగంతు
కామోమయి మాంజిజ్ఞాసితు కామ స్స ఆగత్యా సాను
రాగత్వాద్దాస్యతి. తస్యాం వాదోషాన్ దృష్ట్వామయి
భూయిష్ఠాన్గుణాన్ అధునా పశ్యతి, స గుణదర్శీ
భూయిష్ఠం దాస్యతి. ౬.౪.౧౫

దానిదగ్గర విశేషాలేమీలేవని నాయందు విశేషాలకోసం వస్తున్నాడు. నావల్ల విశేషాలు తెలుసుకోవాలని వస్తున్నాడు గనుక నాకెక్కువగా ఇవ్వగలడు. ఆమెయందు దోషాలు చూచి నాయందెక్కువగుణాలను గ్రహిస్తున్నాడు. గుణగ్రహణ ధురీణుడైన యితడు నాకుచాలాధనాన్ని కుమ్మరిస్తాడు. కాబట్టి ఇతనితో తప్పక సంధి సమకూర్చుకోవాలి.

౧౩౮౬. బాలోవా నైకత్రదృష్టిః, అతిసంధాన ప్రధానోవా,
హారిద్రాగోవా, యత్కించనకారీ వేత్యవేత్య సంద
ధ్యాన్నవా. ౬.౪.౧౬

యవ్వనం అంకురిస్తున్న పిల్లవాడుగనుక చలచిత్తం ఎక్కువ. ఎక్కువమందితో పోవాలనే దృష్టికలవాడు. ఇతనిదృష్టి యెక్కడోఉంటుంది. ఇక్కడనుంచి మరొకచోటికి పోతాడు.

అక్కడనుంచి ఇక్కడకు రావడానికి ప్రియత్నిస్తాడు. ఇలాటి వానివల్ల నాకేమిలాభము? ఏమీ తెలియనివాడు అనర్థాన్ని గూడా కల్పిస్తాడు. ఇలా ఆలోచించి మొదట్లో ప్రథమ పక్షంగా సంధిచేసుకోవచ్చు. రెండోపక్షంగా చేసుకోరాదు.

౧౩౮౭. ఇతో నిష్కాసితాపసృతః,తతస్స్వయ మపసృతః ఉప
జపం స్తర్కయితవ్యః, అనురాగా దాగంతుకామః
న బహుదాస్యతి,మమగుణైర్భావితో యోఽన్యాస్యాం
నరమ తే. ౬.౪.౧౭

ఇక్కడినుండి వెడలగొట్టబడి తొలగిపోయినాడు. ఆక్కడనుంచి స్వయంగా తొలగివచ్చాడు. తనతో కలియడానికి ప్రియత్నిస్తున్నాడు. అలాటివాణ్ణి కొంచెం పరీక్షించాలి. అనురాగం వల్ల తనదగ్గరకువస్తే ఎక్కువగా ధనంఇస్తాడు. నా గుణాలు అతనిమనస్సుకి నచ్చడంచేత ఇతరస్త్రీతో రమించలేడు. ఇలా ఆలోచించి అతనితో సంధి చేసుకోవాలి.

౧౩౮౮-పూర్వ మయోగేస వాయం మయానిష్కాసితః,
౧౩౮౯,సమాంశీలయిత్వా వైరం నిర్యాతయితుకామః ధన
మభియోగాద్వా మయా అస్యాపహృతం తద్విశ్వాస్య
ప్రతీప మాదాతుకామః నిర్వేష్టుకామోవా మాం
వర్తమానా ద్భేదయిత్వా త్యక్తుకామః ఇత్యకల్యాణ
గుణబుద్ధి రసంధేయ. ౬.౪.౨౦

పూర్వం అన్యాయంగా వెళ్ళగొట్టాను. ఇతడు నన్నునమ్మించి కసితీర్చుకోదలచి నేను పూర్వం ఇతనివల్ల గ్రహించిన ధనాన్ని నమ్మకంమీద గుంజుకోగోరుతున్నాడు. ప్రస్తుతం నాదగ్గర

ఉన్నవానితో నన్ను చీలదీసి వదిలిపెట్ట గోరుతున్నాడు. కాబట్టి ఇతనితో సంధానం నాకు కూడదని దూరం ఆలోచించి ప్రవర్తించాలి.

౧౩౯౦- అన్యథా బుద్ధిగికాలేన లంభయితవ్యః, ఇతో నిష్కా-
౧౩౯౨- సిత స్త్రత్స్థితః, ఉపజపన్నే తేన వ్యాఖ్యాతః, తేషూ
పజపత్సు అన్యత్ర స్థితా స్వయ ముపజపేత్.

ఒకమాటు వెడలగొట్టబడినవాడు కొంతకాలం పోయినతరువాత మళ్ళీ సంధానం చేసుకోతగినవాడు. ఇక్కడనుండి నిష్కాసితుడై ఆ స్త్రీ దగ్గరఉండి మళ్ళీ తనదగ్గరకు వచ్చే ప్రయత్నంలో ఉన్నవానివిషయం స్పష్టమయే ఉన్నది. వారు తన కోసం రాయబారం జరుపుతూఉంటే స్వయంగా మంత్రాంగం నడపాలి.

౧౩౯౩- వ్యలీకార్థం నిష్కాసితోమయాః సావన్యత్ర గతో
౧౪౦౦. యత్నా దానేయ్యః. ఇతః ప్రవృత్త సంభాషోవా తతగి భేద మవాప్స్యతి. వర్తమానస్య వా దర్ప విఘాతం కరిష్యామి. అర్థాగమ కాలోవాస్య, స్థాన వృద్ధిరస్యజాతా, లబ్ధమనే నాధికరణం । దారైర్వి యుక్తః పారతంత్ర్యాద్వా వృత్తః । పిత్రా భ్రాత్రా వావిభక్తః । అనేనవా ప్రతిబద్ధం. అనేన సంధిం కృత్వా నాయకం ధనినమవాప్స్యామి. విమానితో వాభార్యయా తమేవ తస్యాం విక్రమయిష్యామి. అస్య వామిత్రిం మద్ద్వేషిణీం సపత్నీం కామయతే, తద మునా భేదయిష్యామి । చలచిత్తతయా వా లాఘవ మేవ మాపాదయిష్యమీతి. ౬. ౪. ౨౪-౩౧

ఇతర స్త్రీతో రమించాడనే నెపంతో ఇతణ్ణి నేను వెళ్ళగొట్టాను. అందువల్ల ఇతడు మరొకచోటికి పోయినాడు. ప్రయత్న పూర్వకంగా అతనిని మళ్ళీ దగ్గరకు తెచ్చుకోవాలి. నావైపున సంభాషణకు మొగ్గితే అటువైపున విరక్తుడౌతాడు. ప్రస్తుతం నాదగ్గర ఉన్నవానికి అతనిని తీసుకురావడంద్వారా శృంగ భంగం చేస్తాను. ఇతనికి ఉద్యోగాదులలో చొరవ యేర్పడ్డది. కాబట్టి ధనాదులు బాగా లభించవచ్చు. అధికారంగూడా ఏర్పడ్డది. భార్యతో వియోగాన్ని పొందిఉన్నాడు. పరతంత్రుడు కాడు. స్వతంత్రుడు. అన్నదమ్ములతోనూ, తండ్రితోనూ వేరుపడ్డాడు. ఇతనికి అతడుమిత్రుడు గనుక అతనితో సంధిచేసుకుని ధనవంతుడైన నాయకుణ్ణి పొందుతాను. ఒకవేళ భార్య అతనిని తిరస్కరిస్తే అతనిచేత గట్టిగా అదలింపచేస్తాను. ఇతనిస్నేహితుడు నా శత్రురాలైన నా సవతిని కామిస్తున్నాడు. అతనితో అతనిని భేదింపచేస్తాను. ఈ మొదలైన కారణాలతో వేశ్యలు సంధానాలు జరుపుతూఉంటారు.

౧౪౦౧- తస్య పీఠమర్దాదయో మాతుర్దౌశ్శీల్యేన నాయికా

౧౪౦౪. యాస్యత్యస్యానురాగే విపాశాయాః పూర్వం నిష్కా-
సనం వర్ణయేయుః. వర్తమానే న చాకామాయాః
సంసర్గం విద్వేషంచ। తస్యాశ్చసాభిజ్ఞానైః పూర్వాను
రాగై రేనం ప్రత్యాయయేయుః, అభిజ్ఞానంచ తత్కృ
తోపచార సంబద్ధం స్యాదితి విశీర్ణప్రతి సంధానం.

వెడలగొట్టబడ్డ నాయకునిదగ్గరకుపోయి పీఠమర్దాదులు తల్లి యొక్క దుస్స్వభావంచేత ఆమె నీమీద తనకెంత అనురాగం

ఉన్నా వెడలగొట్టవలసి వచ్చింది. పరవశురాలు పాపం ఏమి చేస్తుంది." అని అతనితో పూర్వ నిష్కాసనానికి కారణాలు చెప్పాలి. ప్రస్తుతం ఉన్నవానిమీద కోరికలేదనీ, ఊరికే సంసర్గంచేస్తోందనీ, మనస్సులో బాగా ద్వేషిస్తోందనీ చెప్పాలి. ఆమె అతనిని పూర్వం ఎలాఎలా మెప్పించిందో ఆ గుర్తులన్నీ జ్ఞాపకంచేసి ఉద్రేకవంతుణ్ణి చెయ్యాలి. ఆ గుర్తులుకూడా నాయకునికి బాగా ఉపకారం చేకూర్చేవిగాచూచి జ్ఞాపకం చెయ్యాలి. ఈ క్రమంగా విశీర్ణ ప్రతిసంధానం చెప్పబడ్డది.

౧౪౦౭- అపూర్వ పూర్వ సంసృష్టయోః పూర్వ సంసృష్ట
౧౪౦౮. శ్రేయాన్, సహి విదితశీలో దృష్టరాగశ్చ సూప
చరో భవతీత్యాచార్యాః, పూర్వ సంసృష్ట స్సర్వతో నిష్పీడితార్థత్వా న్నాత్యర్థ మర్థదో, దుఃఖంచ పునః విశ్వాసయితు మపూర్వస్తు సుఖేనానురజ్యత ఇతి వాత్స్యాయనః, తథాపి పురుషప్రకృతితో విశేషః.

పూర్వం ఎన్నడూ నాయికతో కలియనివాడూ, పూర్వం ఒక మాటు కలిసినవాడూ అనే ఇద్దరిలోనూ ఎవరు శ్రేష్ఠులు అనే శంకవస్తే పూర్వం సంగమించిఉన్న పురుషునిశీలం చక్కగా నాయికకు తెలిసిఉంటుందిగనుకనూ, అతని అనురాగం ఎలాటిదో తెలుసునుగనుకనూ అతడే ఉత్తముడని పూర్వాచార్యులన్నారు. పూర్వం సంగమించిఉన్నవాడు పూర్వం పూర్తిగా ద్రవ్యాన్ని వెచ్చపెట్టేశాడు గనుక ఎక్కువగా డబ్బు ఇవ్వలేడనీ, మళ్ళీ నమ్మించడంగూడా చాలాకష్టం గనుకనూ, పూర్వం పరిచయుండఉన్నవాడు శ్రేష్ఠుడుకాడనీ, సులభంగా

అనురాగాన్ని పూనతాడుగనుకనూ, వెంటనే నమ్మతాడు గనుకనూ, పూర్వం పరిచయంలేనివాడే ఉత్తముడని వాత్స్యాయనులన్నారు. అయినా పురుషుని క్రొత్తదనం ఉందిగనుక విశేషం.

భవంతి చాత్రశ్లోకాః—

౧౮౦౮-అన్యాం భేదయితుం గమ్యాదన్యతో గమ్యమేవవా।
౧౮౦౯.స్థితస్యచోప ఘాతార్థం పునస్సంధాన మిష్యతే।
బిభేత్యన్యస్య సంయోగాద్వ్యలీకానిచ నేక్షతే।
అతిసక్తః పుమాన్యత్ర భయాద్బహు దదాతిచ॥
అసక్త మభినందేచ్చ। సక్తం పరిభవేత్తదా।
తతోஉపజాపి సంపూర్వం నారీ కాలేనయోజయేత్॥

నాయకునినుండి యితరస్త్రీని భేదింపచెయ్యడానికీ, అన్య స్త్రీ నుండి నాయకుణ్ణి భేదింపచెయ్యడానికీ తనదగ్గర ఉన్నవాణ్ణి వెళ్లగొట్టడానికీ వెళ్లగొట్టినవానితో మళ్ళీ సంధిచేసుకోవాలి. ఇతర పురుషునితో వేశ్య సంగమించడంవల్ల నాయకుడు భయపడి నాయికచేసే అపరాధాలను ఆపేక్షించడు. ఎక్కువ అసక్తుడైఉంటే ఎక్కువ ధనంగూడా ఇస్తాడు. ఇతర నాయకుల దూతలు తనదగ్గరకు వచ్చినప్పుడు తనదగ్గరఉన్న ధనవంతుడైన నాయకుణ్ణి తనయందు అనురాగం లేనివాడైతే పొగుడుతుంది. అలా చెయ్యడంవల్ల ధనం కురిపిస్తారువాళ్లు. సంధానం కోసం ప్రియత్నించేవాణ్ణే ముందుగా దగ్గరకు చేర్చాలి. తనయందు సక్తుడై ఉన్నవాణ్ణి సంధానంనుంచి వెంటనేతప్పించి విసర్జించరాదు.

౧౭౧౦. సక్తంతు వశినం నారీ సంభాష్యా వ్యవ్యతో వ్రజేత్.
౧౭౧౧. తతశ్చార్థ ముపాదాయ సక్తమేవాను రంజయేత్.
ఆయతిం పరిసమీక్ష్యాదౌ లాభం ప్రీతించ పుష్కలాం
సౌహృదం ప్రతి సంధధ్యాత్ విశీర్ణం స్త్రీ విచక్షణా.

ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే వైశికే షష్ఠేఽధికరణే విశీర్ణప్రతిసంధానం చతుర్థోఽధ్యాయః.

తనయందు ఆసక్తి కలిగి తనవశుడై ఉండేవానితో అనునయంగా మాట్లాడినా, ఇతరునిదగ్గరకుకూడా పోవాలి. ఆ ఇతరునివల్ల ధనాన్ని సంపాదించి తనను ప్రేమించేవాణ్ణి సంతోషపెట్టాలి. దూరదృష్టిగల వేశ్య మొట్టమొదటగా ముందుకాలానికి తనకు సరిపోయే ధనాన్ని చూచుకోవాలి. తరువాత పుష్కలమైన లాభాన్నీ ప్రేమనూ చూచుకుని మంచి హృదయంగల పూర్వ పరిచితునితో సంధి చేసుకోవాలి.

ఇలా భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల
ఆంజనేయమూర్తి చేత వాత్స్యాయన కామసూత్ర
ములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయ
బడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలోని
వైశిక మనే ఆరో అధికరణంలో
నాలుగో అధ్యాయం ముగిసింది.



శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

### ౬. వైశికాధికరణం

### ౫. లాభ విశేషాధ్యాయం

౧౪౧_౨. గమ్య బాహుళ్యే ప్రతిదివసంచ లభమానా నైకం ప్రతి
గృహ్ణీయాత్. ౬.౫.౧

వేశ్య ఒకనితో ఉండేదీ, అనేకులతో ఉండేదీ, ఎవ్వరినీ పరిగ్రహించనిదీ అని మూడురకాలు. వీరిలో మొదటి వేశ్యయొక్క లాభాలు చెప్పేశాడు. ఇక రెండో వేశ్యలాభాలు ముందు చెవుతారు. ఇక్కడ మూడోరకం వేశ్యలాభాలు చెవుతున్నారు. ముందుగా అసలు ఎవణ్ణీ పరిగ్రహించకపోవడం ఎందువల్ల జరుగుతుందో చెవుతున్నారు. తమనుపొందాలని ఎక్కువమంది ఎప్పుడైతే తటస్థపడతారో అప్పుడు వాళ్లలో వాళ్లకు పోటీ యేర్పడి ఒకళ్లకంటె ఒకళ్లు ఎక్కువధనం ఇస్తారు. అలా ఎవణ్ణీ పరిగ్రహించకుండా ఉంటే ఎక్కువధనం వస్తుందన్నమాట. అందువల్లే ఎవణ్ణీ ప్రత్యేకించి పరిగ్రహించకపోవడం జరుగుతుంది. ఏ ఒకణ్ణో గ్రహిస్తే ఆ ఒక్కడూ ప్రతిరోజూ ఏమి ఇవ్వగలుగుతాడు !

౧౪౧౩. దేశం కాలం స్థితిమాత్మనో గుణాన్ సౌభాగ్యంచ అన్యాభ్యో న్యూనాతిరిక్తతాం చావేక్ష్య రజన్యా మర్ఘం స్థాపయేత్. ౬.౫.౨

దేశంలోని పరిస్థితులనూ, కాలపరిస్థితులనూ, కనిపెట్టి తన గుణాలనూ, సౌభాగ్యాన్నీ, ఇతరవేశ్యలకంటె తాను గొప్పదో తక్కువదో గమనించుకుని రాత్రులయందు వెలపెట్టి ప్రవర్తించాలి. దేశపరిస్థితులంటే ఒక్కొక్క దేశంలోని వేశ్యలు పూర్వశరీరంతో రతిచేస్తే ఒకరకంగానూ, క్రింది శరీరభాగంతో రతి చేస్తే కొంచెం అధికంగానూ పూర్వాపరభాగాలతో రతిచేస్తే ఇంకా అధికంగానూ ధనాన్ని పుచ్చుకునేఅలవాటు ఉంటుంది. అలాటి పరిస్థితులను గమనించాలన్నమాట.

౧౪౧౪- గమ్యే దూతాంశ్చ ప్రయోజయేత్। తత్ప్రతిబద్ధాంశ్చ స్వయం ప్రహిణుయాత్. ౬.౫.౩

నాయిక దూతలద్వారా నాయకునివద్దకు కభురుపంపాలి. అతడు తన యిష్టమైన విధానాన్ని సూచిస్తూ ఆ దూతల ద్వారా కభురుపంపుతాడు. లేక నాయిక నాయకుని అలవాటును ఎఱిగిఉంటే తాను దూతద్వారానే రప్పించుకోవచ్చు.

౧౪౧౫. ద్విస్త్రిశ్చతు రితి లాభాతిశయ గ్రహార్థమేకస్యాపి గచ్ఛేత్। సంగ్రహాకల్పం సకలంచ చరేత్. ౬.౫.౪

దూతను నాయకునివద్దకుపంపి అతణ్ణి తనదగ్గరకు రప్పించుకుని అతనితో రతిచేస్తే ధనం లభిస్తుంది. నాయకుని అనురాగ విశేషంచేత తానుపెట్టుకున్న వెలకంటె ఎక్కువధనం లభిస్తే

దాన్ని లాభాతిశయం అంటారు. ఆ లాభం మొట్టమొదట గానే లభిస్తే మేలే. అలా లభించకపోతే అనుసరించవలసిన విధానాన్ని చెప్తున్నారు. ఈ లాభాతిశయంకోసం ఒకని దగ్గరకే ఒక్కరాత్రే ఒకమాటూ, రెండుమాట్లూ, మూడు మాట్లూ, నాలుగుమాట్లు చొప్పున సంభోగించడానికి పోవాలి. ఆయా సమయాలలో అతనిని రంజింపచేసి లాభాన్ని సాధించాలి. అలా పోయేటప్పుడు కేవలమూ ఇతరుల వైపైనా తిరిగిచూడక భర్తసన్నిధికి భార్యపోయినట్లు పోవాలన్న మాట.

౧౪౧౬. గమ్యయౌగపద్యేతు లాభసామ్యే యద్ద్రవ్యార్థినీ స్యాత్తద్దాయిని ప్రత్యక్ష ఇత్యాచార్యాః. ౬.౫.౫

అనేకులు ఒక్కమాటే రతికి సిద్ధమైనప్పుడు అందరివల్లా ద్రవ్యలాభం సమానంగానే ఉన్నప్పుడు ఎలాటి ద్రవ్యంమీద నాయికకు ఎక్కువ అవసరంఉంటుందో ఆ వస్తువును ఇచ్చే నాయకునివిషయమై అనుగ్రహదృష్టిని ప్రసరించి అతన్ని అనుగమించాలి. అని పూర్వాచార్యులన్నారు.

౧౪౧౭. అప్రత్యాదేయత్వా త్సర్వకార్యాణాం తన్మూలత్వా ద్ధిరణ్యదః ఇతి వాత్స్యాయనః. ౬.౫.౬

ఏ నాయకుడు, ఇచ్చి తీసుకోడానికి వీలులేనట్టిదిన్నీ, లోకంలో ఎక్కువ ప్రియమైనదిన్నీ అయిన బంగారాన్ని ఇవ్వడానికి సిద్ధపడుతున్నాడో ఆ నాయకున్నే అనుసరించడం ఉత్తమమని వాత్స్యాయనులన్నారు.

౧౪౧౮- సువర్ణ రజత తామ్ర కాంస్య లోహ భాండోపస్క

౧౪౧౯. రాస్తరణ వాసో విశేష గంధద్రవ్య కటుక భాండ ఘృతతైల ధాన్య పశుజాతీనాం పూర్వ పూర్వతో విశేషః, యత్తు న సామ్యాద్వా ద్రవ్యసామ్యే మిత్ర వాక్యాదతిపాతత్వాదాయతితో గమ్య గుణతః ప్రీతి తశ్చ విశేషః. ౬.౫.౭-౮

పశువులకంటె ధాన్యంగొప్పది. ధాన్యంకంటె నూనెలు, నూనెలకంటె నెయ్యి, నేతికంటె పాత్రలు, పాత్రలకంటె మిరియాలూ, జాపత్రి, జాజికాయ, మొదలైనవస్తువులు, వాటికంటె సుగంధద్రవ్యాలూ, వాటికంటె వస్త్రాలూ, వాటికంటె తివాచులూ మొదలైనవీ, వాటికంటెరాగి, కంచు, ఇత్తడి, వెండి, బంగారు మొదలైన లోహాలతో తయారుచేయబడిన పాత్రలు గొప్పవి. అయినా పట్టణంలోని అలవాట్లనుపట్టిగానీ, ఒకేరకమైనవస్తువు సిరువురునాయకు లీయనున్నప్పుడు మిత్రుల వాక్యాన్ననుసరించిగానీ, ఉత్తమమైన వస్తువునుగ్రహించి గుణాన్నీ ప్రేమనూ చూచుకుని సంగమించాలి.

౧౪౨౦. రాగిత్యాగినో స్త్యాగిని విశేషః ప్రత్యక్ష ఇత్యాచార్యాః. ౬.౫.౯

అనురాగంకలవాడూ, త్యాగబుద్ధికలవాడూ తటస్థపడితే త్యాగగుణం కలవాణ్ణే వేశ్య గ్రహించాలి. అతడే వేశ్యకు గొప్పవాడు. అని పూర్వాచార్యులన్నారు.

౧౪౨౧. శక్యోహి రాగిణి త్యాగ ఆధాతుం, లుబ్ధోపిహి రక్త స్త్యజతి నతు త్యాగీ నిర్బంధాద్రజ్యతే, ఇతి వాత్స్యాయనః. ౬.౫.౧౦

అనురాగవంతుణ్ణి ప్రయత్నించి త్యాగవంతుణ్ణిగా చెయ్యవచ్చు. ఎంతటిలుబ్ధుడైనా అనురాగంఅనేది ఉంటే త్యాగి అవుతాడు. కాని త్యాగం ఉన్నవాడైనా పురుషుడు నిర్బంధంమీదగూడా అనురాగం లేకపోతే సక్తుడుకాడు అని వాత్స్యాయను లన్నారు.

౧౪-౨౨. తత్రాపి ధనవ దధనవతో ర్ధనవతి విశేషః, త్యాగి
౧౪-౨౩. ప్రయోజనకర్త్రోః ప్రయోజన కర్తరి విశేషః. ఇత్యా
చార్యాః । ప్రయోజనకర్తా సకృత్కృత్వా కృతిన
మాత్మానం మన్యతే । త్యాగీ పున రతీతం నాపేక్షతే
ఇతి వాత్స్యాయనః. ౬.౫.౧౩.

వారిలోకూడా ధనవంతుడూ, నిర్ధనుడూ ఒక్కమాటు ప్రాప్తిస్తే ధనవంతుణ్ణే ఉత్తముణ్ణిగా గ్రహించాలి. త్యాగవంతుడూ, కార్యశూరుడూ ఒక్కమాటు ప్రాప్తిస్తే కార్యశూరుణ్ణే శ్రేష్ఠుణ్ణిగా గ్రహించాలి. అని పూర్వాచార్యు లన్నారు. కార్యశూరుడు నాయికయొక్క అవశ్యకార్యాలను ఒక్కమాటు చేసిపెట్టి తనను కృతకృత్యుణ్ణిగా తలుస్తాడు. త్యాగవంతుడు వెనుక జరిగిపోయినదాన్ని అపేక్షించక ప్రతి రోజూ ధనాన్ని ప్రసాదిస్తూఉంటాడు అని వాత్స్యాయను లన్నారు.

౧౪-౨౪- తత్రా ప్యాయతితో విశేషః, కృతజ్ఞత్యాగినో
౧౪-౨౫. స్త్యాగిని విశేషః ప్రత్యక్ష ఇత్యాచార్యాః. ౬.౫.౧౪

వారిలోగూడా ఎక్కువ ఆదాయంగల మానవులలో విశేషం ఉన్నది. కృతజ్ఞుడూ త్యాగీ ఒక్కమాటు సంక్రమిస్తే త్యాగి

యందే గోప్యతనం ప్రత్యక్షంగా కనుపిస్తుంది. అని పూర్వా చార్యులన్నారు.

౧౪_౨౯. చిరమారాధితోऽపి త్యాగీ వ్యళీకమేక ముపలభ్య ప్రతిగణికయా మిథ్యా దూషితః శ్రమమతీతం నాపేక్షతే । ప్రాయేణహి తేజస్వినః ఋజవోऽత్యా దృతాశ్చ త్యాగినోऽభవంతి । కృతజ్ఞస్తు పూర్వ శ్రమాపేక్షీ న సహసా విరజ్యతే । పరీక్షిత శీలత్వాచ్చ న మిథ్యా దూష్యత ఇతి వాత్స్యాయనః. ౬.౫.౧౫

ఎంతకాలం ఆరాధించినా త్యాగవంతుడు నాయికవలని ఒక తప్పునుచూచి వ్యర్థంగా ఆమెను దూషిస్తాడు. ఇంతవరకూ నాయిక తన విషయమై చేసిన సేవ, శ్రమ మొదలైనవేవీ గమనించడు. ఇక సర్వకాలమూ ఆతప్పిదాన్ని మరిచిపోడు. సాధారణంగా త్యాగవంతులు మంచి పౌరుషవంతులుగానూ, సరి అయిన నడక కలవారుగానూ ఉంటారు. అందువల్ల నామ దోషాన్ని సహించలేరు. ఇక కృతజ్ఞుడో పూర్వం నాయిక తనకోసం పడ్డశ్రమను, జ్ఞాపకం పెట్టుకుంటాడు. తొందరపడి విరక్తుడు కాడు. బాగా పరీక్షించే స్వభావంకలవాడు గనుక వ్యర్థంగా దూషించడు. అని వాత్స్యాయనులన్నారు.

౧౪_౨౭- తత్రాప్యా యతితోऽపి శేషః, మిత్రవచనార్థా గమ
౧౪_౨౮. యోరర్థాగమో విశేషః ప్రత్యక్ష ఇత్యాచార్యాః,

పైవారిద్దరిలోనూ ఆదాయాన్నిపట్టికూడా విశేషం ఉన్నది. మిత్రవాక్యమూ,ధనాగమమూ ఒక్కమాటు సంక్రమిస్తే అర్థాగమంలో విశేషం ప్రత్యక్షసిద్ధమని పూర్వాచార్యులన్నారు.

౧౪౨౯- సోపి హ్యర్థాగమో భవితా మిత్రం తు సకృద్వ్యాక్యే
౧౪౩౦. ప్రతిహతే కలుషితం స్యాదితి వాత్స్యాయనః,
తత్రాప్యాయతితో విశేషః. ౬.౫.౧౮-౧౯

ఆ అర్థాగమంకూడా ఒక కారణంచేత గొప్పదికావచ్చును. కాని మిత్రుడు తనవాక్యం ఒక్కమాటు వ్యర్థమైనతరువాత దోషగ్రస్తుడౌతాడు. అలా అయితే అతనివల్ల కావలసినపని పూర్తికాదు, అని వాత్స్యాయనులన్నారు. వారిలోగూడా ఆదాయాన్నిపట్టి విశేషాన్ని గమనించాలి.

౧౪౩౧. తత్రకార్య సందర్శనేన మిత్రమనునీయ శ్వో భూతే వచనమస్త్వితి తతోతిపాతమర్థం ప్రతిగృహ్ణీయాత్.

మిత్రుడు కోపగిస్తాడనే భయముంటే అతనితో "నీవు చెప్పిన పని రేపుచేస్తా"నని అనునయించి సమీపిస్తున్న ధనవిషయాన్ని గ్రహించాలి.

౧౪౩౨. అర్థాగమానర్థప్రతీకారయోః అర్థాగమ ఏవ విశేషః ప్రత్యయ ఇత్యాచార్యాః, అర్థ పరిమితావచ్ఛేదః అనర్థః పునః సకృత్ప్రసృతో నజ్ఞాయతే క్వావతిష్ఠతీతి వాత్స్యాయనః. ౬.౫.౨౨

ధనం వచ్చేసదుపాయమూ, అనర్థాన్ని తప్పించుకునే అవకాశమూ ఒక్కమాటు ప్రాప్తిస్తే ధనాగమంలోని సదుపాయమే శ్రేష్ఠము. ఇది ప్రత్యక్షంగా కనిపిస్తోందని పూర్వాచార్యులన్నారు. ధనం యేనోకొంత లెక్కకలదిమాత్రమే. అనర్థమో పలుమార్లు ప్రసరించి బాధిస్తుంది. ఎలా పరిణమించబోతుందో తెలియదు. అని వాత్స్యాయనులన్నారు.

౧౪౩౩. తత్రాపి గురుతా లాఘవకృతో విశేషః । ఏతేనార్థ
౧౪౩౪. సంశయా దనర్థ ప్రతీకారే విశేషో వ్యాఖ్యాతః.
చిన్న అనర్థంకంటె పెద్దఅనర్థం గొప్పది. ఇలా చెప్పడంవల్ల ధనంకంటెగూడా అనర్థ ప్రతీకారంలోనే విశేషం ఉన్నదని స్పష్టం చేయడమైనది.

౧౪౩౫. దేవకుల తటాకారామాణాం కరణం, స్థలీనామగ్ని చైత్యానాం నిబంధనం । గో సహస్రాణాం పాత్రాంతరితం బ్రాహ్మణేభ్యో దానం, దేవతానాం పూజోప హార ప్రవర్తనం, తద్వ్యయ సహిష్ణోర్వా ధనస్య పరి గ్రహణం ఇత్యుత్తమ గణికానాం లాభాతిశయః.

వేశ్యలు గణిక, రూపాజీవ, కుంభదాసి అని మూడురకాలు. వాళ్లు వరుసగా ఉత్తమలనీ, మధ్యమలనీ, అధమలనీ ఎన్నబడతారు. దేవాలయప్రతిష్ఠకూ, తటాకనిర్మాణానికీ, ఆరామ నిర్మాణానికీ, ఏర్లకూ, కాలువలకూ వంతెనలు నిర్మించడానికీ, ఊరివెలుపల మట్టితో ఇళ్లుకట్టించి వాటియందు సమస్తపదార్థాలూ ఉంచి అగ్నిదేవునికి అర్పణంచెయ్యడానికీ, గోవుల మందలను బ్రాహ్మణులకు దానం ఇప్పించడానికీ, దేవతలకు పూజలూ ఉపచారాలూ సమర్పించడానికీ, ఆయా ధనవ్యయాన్ని భరించడంకొరకై ఉత్తమగణికలు ధనాన్ని గ్రహిస్తారు. ఇవి ఉత్తమగణికల లాభ విశేషాలు.

౧౪౩౬. సర్వాంగికః అలంకార యోగః । గృహస్యోదారస్య కరణం । మహార్హైర్భాండైః పరిచారకైశ్చ గృహ పరిచ్ఛదస్యోజ్జ్వలతేతి రూపాజీవానాం లాభాతిశయః.

శరీరానికి అలంకారాలు సమకూర్చుకోడానికీ, అందమైన పెద్దఇల్లు నిర్మించుకోడానికీ, విలువగలపాత్రలూ, పరిచారకులూ, గృహంలో ఏ వస్తువుల కావస్తువులు తగిన సంవిధానంతో ఉంచుకోడానికీ రూపాజీవలనే మధ్యరకపువేశ్యలు ధనాన్ని సంపాదించాలి. ఇది వారి లాభాతిశయం.

౧౪౩౭. నిత్యం శుక్లమాచ్ఛాదన మపక్షుధమన్నపానం నిత్యం సౌగంధికేన తాంబూలేన చ యోగః సహిరణ్య భాగ మలంకరణ మితి కుంభదాసీనాం లాభాతిశయః.

ఎల్లప్పుడూ తెల్లనిదుస్తులను ధరించడానికీ, మనస్సులోని కలతలను పోగొట్టి ఆకలిసిమాన్పే అన్నం లభ్యంకావడానికీ, పానీయాలకూ, ఎప్పుడూ సుగంధద్రవ్యాలతో కూడిఉన్న తాంబూలం లభించడానికీ, బంగారుసొమ్ములు అలంకరించుకోడానికీ కుంభదాసి అనే వేశ్యలకు ధనంకావాలి. ఇది వారి లాభాతిశయం.

౧౪౩౮. ఏతేన ప్రదేశేన మధ్యమాధమానామపి లాభాతిశయాః స్సర్వాసామేవ యోజయేదిత్యాచార్యాః.

ఉత్తమతరగతికిచెందిన వేశ్యల లాభాతిశయాలద్వారా మధ్యమాధమవేశ్యల లాభాతిశయాలుగూడా తెలుసుకోవాలి. అంటే పైనచెప్పినక్రమంగా ఉత్తమమధ్యమ అధమవేశ్యలను నిర్ణయించాలన్నమాట.

౧౪౩౯. దేశకాల విభవ సామర్థ్యానురాగ లోక ప్రవృత్తి వశాద నియత లాభాదియమవృత్తిరితి వాత్స్యాయనః.

దేశం సంపదతో కూడిఉన్నా ఉండకపోయినా, కాలం సుభిక్షంగా ఉన్నా ఉండకపోయినా, తనవైభవం కొద్దిగాఉన్నా గొప్పగాఉన్నా, సామర్థ్యం ఎక్కువగాఉన్నా తక్కువగా ఉన్నా, నాయకుని అనురాగం ఎక్కువగాఉన్నా అల్పంగా ఉన్నా, ఆయా అవస్థా విశేషాలనుపట్టి ధనలాభం లెక్క కట్ట తగినది కాదు. అనుకున్నదానికంటె ఎక్కువైనా లభించవచ్చు. తక్కువైనా లభించవచ్చు.

౧౪౪౦. గమ్య మన్యతో నివార యితుకామా, సక్త మన్యస్యా నుపహర్తుకామా వా, అన్యాంవా లభతో వియుయుక్షమాణా, గమ్యసంసర్గా దాత్మనః స్థానం వృద్ధిమాయతి మభిగమ్యతాంశ్చ మన్యమానా, అనర్థ ప్రతీకారేవా సాహాయ్యమేవం కారయితుకామా, సక్తస్య వాన్యస్య వ్యళీకార్థినీ పూర్వోపకార మకృతమివ పశ్యంతీ, కేవల ప్రీత్యర్థినీవా, కల్యాణబుద్ధి రల్ప మపి లాభం ప్రతిగృహ్ణీయాత్. ౬.౫.౩౦

వేశ్య ఒక్కొకప్పుడు కొద్ది లాభంకోసంగూడా సంగమింపవలసి వస్తుందని నిరూపిస్తూ దానికి కారణాలు చెవుతున్నారు. నాయకుని బుద్ధిని ఇతర స్త్రీనుండి మళ్లించడానికీ, ఇతరవేశ్యయందు ఆసక్తుడైన వానిని అపహరించడానికీ, ఇతరవేశ్యకు వచ్చే లాభాన్ని పడగొట్టడానికీ, అతనితో రతిచేస్తే తనకు ప్రతిష్ఠా, అభివృద్ధీ, ధనలాభమూ, గొప్పకీర్తివస్తాయనీ, తనకువచ్చే ఆపదకు ప్రతిక్రియచెయ్యడానికి సహాయం కోరాలనీ, తనయందు సక్తుడైనా మరొకస్త్రీ నాశ్రయించిఉన్న నాయకుణ్ణి

అతడు పూర్వం ఎంత ఉపకారంచేసిఉన్నా గణించకుండా అతనియందు తప్పుమోపి యాతన పెట్టడానికీ, కేవలం ప్రేమ పరవశురాలైగానీ, బుద్ధిమంతుడనిగానీ, స్వల్పమైన లాభం తోనే సంగమిస్తుంది ఒక్కొకప్పుడు వేశ్య.

౧౪౪౧- ఆయత్యర్థినీతు తమాశ్రితావర్థం ప్రతిచికీర్షంతీ నైవ
౧౪౪౨. ప్రతిగృహ్ణీయాత్ । త్యక్ష్యామ్యేన మన్యతః ప్రతి
సంధాస్యామి గమిష్యతిదారైర్యోక్ష్యతే, నాశయిష్య
త్యర్థాన్ । అంకుశభూతః ఉత్తరాధ్యక్షోఽస్యా గమి
ష్యతి స్వామీ పితావా, స్థానభ్రంశో వాస్య భవిష్యతి
చలచిత్తశ్చేతి మన్యమానా తదాత్వే తస్మాల్లాభ
మిచ్ఛేత్. ౬.౫ ౩౧-౩౨

తనకు ముందుకాలంలో అనర్థాలు తొలగిపోయే ఉద్దేశ్యం కలిగి ఉన్న నాయిక అనర్థప్రతీకారంకోసం నాయకునితో సంగమిస్తూ ఏమాత్రమూ ధనలాభాన్ని కోరరాదు. అతనిని వదలి వేద్దామనుకున్నప్పుడూ, మరి ఒకతెను ఒప్పగింతమనుకున్నప్పుడూ, భార్యతో కలుసుకోబోతున్నాడనిగానీ, ధనాన్ని పాలిస్తున్నాడనిగానీ, అతనికి అంకుశంవంటివాడైన ప్రభువో, తండ్రో వస్తాడేమో అనిగానీ, ఇతనికి స్థానభంగం జరుగుతుందనికానీ, చలచిత్తుడనికానీ, తాత్కాలికమైన స్వల్ప లాభాన్ని అపేక్షించే వేశ్య పురుషునితో సంగమిస్తుంది.

౧౪౪౩. ప్రతిజ్ఞాతమీశ్వరేణ ప్రతిగ్రహం లప్స్యతే । అధి
కరణం స్థానంవా ప్రాప్స్యతి, వృత్తికాలోఽస్య వాసన్నః,

వాహనమస్యాగమిష్యతి, సస్యమస్య పత్స్యతే, కృత
మస్మి న్న నశ్యతి నిత్యమవిసంవాదకో వేత్యాయత్యా
మిచ్ఛేత్, పరిగ్రిహత్వం చాస్యాచరేత్. ౬.౫.౩౩

ముందుముందు ప్రభువునల్ల వాగ్దత్తమైన గొప్ప కానుకను పొందబోతాడనికానీ, అధికారస్థానాన్ని పొందబోత్తాడని కానీ, ఇతనికి చక్కనివృత్తి లభించబోతోందనికానీ, ఇతనికి వాహనం లభించబోతోందనికానీ, గొప్పపంట ఇతనికి చేజిక్కుతుందనిగానీ, ఇతనికిచేసినమేలు వృధా పోదనిగానీ, ఆడితప్పని వాడనిగానీ ఇలాటి ఊహలతో ఆ యతివిషయమై అతన్ని కోరాలి. అతనివల్ల కొద్దిగా ధనాన్నిగూడా ప్రస్తుతానికి పరిగ్రిహించాలి.

భవతశ్చాత్రశ్లోకా—

౧౭౪౮-కృచ్ఛ్రాధిగత విత్తాంశ్చ రాజవల్లభ నిష్ఠురాన్
౧౭౪౯.ఆయత్యాంచ తదాత్వేచ దూరాదేవ విసర్జయేత్।
అనర్థో వర్జనేయేషాం గమనేఽభ్యుదయస్తథా
ప్రియత్నేనాపి తాన్గత్వా సాపదేశ మపక్రమేత్
౬.౫.౩౪.౩౫

కష్టపడి ధనాన్ని సంపాదించినవాళ్లనూ, రాజులకు ఇష్టులుగానూ, క్రూరులుగానూ ఉండేవాళ్లనూ, ఉత్తరకాలంలో గూడా ఎందుకూ ఉపయోగించనివాళ్లనూ దగ్గరకు చేరనియ్యరాదు. ఏ పురుషులను విడిచిపెడితే అనర్థంకలుగుతుందో వారిని విడువరాదు. ఎవరితోసంగమిస్తే అభ్యుదయం చేకూరు

తుందో ఆ పురుషులను తాను ప్రియత్నపూర్వకంగా వాళ్ల దగ్గరకుపోయి ఏదో నెపంమీాద వారితో పొత్తు కుదుర్చుకోవాలి.

౧౪౪౬. ప్రసన్నా యే ప్రయచ్ఛంతి స్వత్త్రేప్యగణితం వసు
స్థూల లక్షాన్మహోత్సాహాం స్తాంగచ్ఛేత్స్వైరపివ్యయైః॥

ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే వైశికే షష్ఠేఽధికరణే లాభ విశేషాః పంచమోఽధ్యాయః.

ఆహ్లాదకరమైన చిరునవ్వుతో పలకరించి హృదయపూర్వకంగా ప్రసన్నులై స్వల్పమైన ధనాన్ని లక్ష్యంలేకుండా ఏ పురుషులు అర్పిస్తారో అలాంటి వితరణబుద్ధిగల ఉత్సాహవంతులైన పురుషులను తన ప్రియాణపుభుర్చులతోనైనా పోయి కలుసుకుని సంగమించాలి.

ఈవిధంగా భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ,
ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయమూర్తి
చేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళ
వ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను
తెలుగువ్యాఖ్యలోని వైశికమనే ఆరో అధి
కరణంలో అయిదో అధ్యాయం ముగిసింది.

శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

### ౬. వైశికాధికరణం

### ౬. అర్థానర్థానుబంధ సంశయ విచారాధ్యాయం

౧౪౪౭. అర్థానాచర్యమాణా ననర్థా అప్యనూప్భవంతి, అను
బంధా స్సంశయాశ్చ. ౬.౬.౧

ధన సంపాదనకు పూనుకున్నపుడు అర్థాలూ, అనర్థాలూ గూడా ఆ అర్థాలననుసరించే సంభవిస్తూఉంటాయి. ఆ అర్థానర్థాలేకాక వాటికిసంబంధించిన ఇతర అనుబంధాలూ సంశయాలూగూడా ప్రాప్తిస్తాయి.

౧౪౪౮. తే బుద్ధిదౌర్బల్యాదతిరాగా దత్యభిమానాదతి
దంభాత్ అత్యార్జవాదతి విశ్వాసా దతిక్రోధాత్ప్రమా
దా త్సాహసాద్దైవయోగాచ్చస్యుః. ౬.౬.౨

ధనమూ, దానికి సంబంధించినవే ప్రాప్తిస్తే పరిగ్రహించవచ్చు, అర్థవిషయంలో సందేహంగూడా కొందరికి కలుగుతూనే ఉంటుంది. ఇక అనర్థాలూ, వాటి అనుబంధాలూ, సంశయాలూ వాటిని పరిగ్రహించరాదు. కాబట్టి అవి యెట్లా సంభవిస్తాయో ఆ కారణాలు చెపుతున్నారు.

పై అనర్థాదులు తెలివితక్కువవల్లగానీ, ఎక్కువ అనురాగాన్ని కలిగిఉండడంవల్లగానీ, ఎక్కువ అభిమానం వల్లగానీ, ఎక్కువ గర్వంవల్లగానీ, ఎక్కువ మంచితనంవల్లగానీ, ఎక్కువ నమ్మకంవల్లగానీ, ఎక్కువ కోపంవల్లగానీ, పొరపాటువల్లగానీ, ఎక్కువ సాహసంవల్లగానీ, దైవయోగంవల్లగానీ కలుగుతూఉంటాయి. మానవులలో పందొమ్మిదిపాళ్లూ, దైవయోగం ఒకపాలూ అనర్థాలకు కారణం అవుతూఉంటుంది.

౧౪౪౯. తేషాం ఫలం కృతస్య వ్యయస్య నిష్ఫలత్వం, అనాయతిః, ఆగమిష్యతోఽర్థస్య నివర్తనం, ఆప్తస్య నిష్క్రమణం, పారుష్యస్య ప్రాప్తిః, అపరిచయతా, శరీరస్య ప్రఘాతః, కేశానాం ఛేదనం, అంగవైకల్యస్యాపత్తిరితి.

పై అనర్థాలకూ, అనుబంధాలకూ, సంశయాలకూ, ఫలితాన్ని చెపుతున్నారు. నాయకుణ్ణి పొందటానికి చేసిన వ్యయమంతా వ్యర్థంకావడమూ, తనపేరుప్రతిష్ఠలూ రూపుమాయడమూ, రాబోయేలాభం ఎవరిచేతనో అడ్డగింపబడడమూ, ప్రాప్తించిన ధనం మధ్యవర్తులచేత అపహరింపబడడమూ, నిందకు గురికావడమూ, ఎవనిపరిచయమూ ప్రాప్తించకపోవడమూ, శరీరానికి ప్రమాదమూ, కేశఖండనమూ, అంగవైకల్యమూ ఈ మొదలైనవి ఫలితాలు.

౧౪౫౦. తస్మాత్తానాదిత ఏవ పరిజిహీర్షేదర్థభూయిష్ఠాంశ్చ ఉపేక్షేత. ౬.౬.౪

అందువల్ల బుద్ధి దౌర్బల్యాదులను మొట్టమొదటగానే పోగొట్టుకోవాలి. ధనప్రాప్తికి హేతువులైన కారణాలను అంగీకరించాలి.

౧౪౫౧. అర్థో ధర్మః కామ ఇత్యర్థ త్రివర్గః, అనర్థః, అధర్మః, ద్వేషః ఇత్యనర్థత్రివర్గః. ౬.౬.౫

ఇక అర్థానర్థాలలో ఉన్న అనుబంధ నిరనుబంధాలను విచారిస్తున్నారు. అర్థమూ, ధర్మమూ, కామమూ అనే ఈ మూటినీ కలిసి అర్థత్రివర్గం అంటారు. అనర్థమూ, అధర్మమూ, ద్వేషమూ అనే ఈ మూటినీ అనర్థత్రివర్గం అంటారు. వీటికి మూలాలైన అర్థానర్థానుబంధ సంశయవిచారం చెయ్యబోతున్నారుగనుక ధర్మాధర్మాలనూ, కామద్వేషాలనూగూడా ఇక్కడ చెప్పారు. ఇలా చెప్పడంవల్ల అనుబంధాలులేనివిధం చెప్పినట్లైంది.

౧౪౫౨. తేష్వాచర్యమాణే ష్వన్యస్యాపి నిష్పత్తి రనుబంధః

పై అర్థాదులారింటిలోనూ ఏ ఒకదాన్ని సాధిస్తున్నా తక్కిన అయిదూ ప్రాప్తించడాన్ని అనుబంధం అంటారు.

౧౪౫౩. సందిగ్ధాయాంతు ఫలప్రాప్తౌ స్యాద్వా నవేతి శుద్ధ సంశయః. ౬.౬.౭.౮

ఫలం ప్రాప్తిస్తుందా? ప్రాప్తించదా అనే సందేహంకలిగితే దాన్ని శుద్ధసంశయం అంటారు. ఇతనితో సంగమిస్తే ఇది సంక్రమిస్తుందేమో అనే సందేహం కలగడాన్ని సంకీర్ణ సందేహం అంటారు.

౧౪౫౪- ఏకస్మిన్కార్యే క్రియమాణే కార్యద్వయస్యోత్పత్తి
౧౪౫౫.రుభయతో యోగః, సమంతా దుత్పత్తి స్సమంతతో యోగః, ఇతితా నుదాహరిష్యామః. ౬.౬.౯.౧౦

ఒకపనికోసం ప్రయత్నిస్తూఉంటే దానితోపాటు మరొకటి గూడా సంక్రమిస్తే దాన్ని ఉభయతోయోగం అంటారు. ఒక కార్యాన్ని సాధించబూనితే అర్థానర్థాదులు అనేకం సంక్రమిస్తే దాన్ని సమంతతోయోగం అంటారు. వాటి ఉదాహరణలు చెవుతున్నారు.

౧౮౫౬. విచారితరూపోఽర్థ త్రివర్గః. ౬.౬.౧౧

చక్కగా విచారించి ప్రవర్తిస్తే అర్థత్రివర్గమూ, బాగా విచారించకుండా తెలివితక్కువగా ప్రవర్తిస్తే అనర్థత్రివర్గమూ అని చెప్పడమైంది.

౧౮౫౭-యస్యోత్తమస్యాభిగమనే ప్రత్యక్షతోర్థలాభః,గ్రహణీ
౧౮౬౩.యత్వమాయతీరాగమః, ప్రార్థనీయత్వం చాన్యేషాం
స్యాత్సోఽర్థో అర్థానుబంధః లాభమాత్రే కస్య చిదన్యస్య గమనం, సోఽర్థోనిరనుబంధః, అన్యార్థ పరిగ్రహే సక్తాదాయతిచ్ఛేదనం. అర్థస్య నిష్క్రమణం, లోకవిద్విష్టస్యవా నీచస్య గమనం, అయత్నఘ్న మర్థోఽనర్థానుబంధః, స్వేనవ్యయేన శూరస్య మహామాత్రస్య ప్రభావతోవా లుబ్ధస్యగమనం,నిష్ఫలమపి వ్యసన ప్రతీకారార్థం మహతశ్చార్థఘ్నస్య నిమిత్తస్య ప్రశమన మాయతి జననంచ సోఽనర్థోఽర్థానుబంధః, కదర్యస్యసుభగమానినః కృతఘ్నస్యవా అతి సంధానశీలస్య స్వైరపివ్యక్తైః తదారాధన మపి నిష్ఫలం. సోఽనర్థో నిరనుబంధః, తస్యైవ రాజవల్లభస్య క్రౌర్య ప్రభావా దధికస్య తథైవారాధన మంతే నిష్ఫలం నిష్కాసనంచ

రోపకరం సోఽనర్థోఽనర్థానుబంధః, ఏవం ధర్మ కామ
యోరపి అనుబంధాన్యోజయేత్. ౬.౬.౧౨.౧౮

ఉత్తమపురుషునితో సంగమిస్తే ప్రత్యక్షంగా ధనలాభమూ, మంచి పేరుప్రతిష్ఠలూ, గౌరవమూ, ప్రజలకు ఆదర్శంగా ఉండడమూ, ఇతరులచేత ప్రార్థింపబడడమూ, కలుగుతుంది. దాన్ని అర్థానుబంధం అంటారు. అంటే ఇతర లాభాలులేని దన్నమాట. ధనహీనుడై ఇతరులడబ్బును గ్రహించడంలో ఆసక్తికలవానితో గమనంచేస్తే తనకున్న ప్రభావాదికం పేరూ ప్రతిష్ఠలూ తుడిచిపెట్టుకుపోతాయి. ఉన్నధనం నాశనమౌ తుంది. లోకంచేత ద్వేషింపబడుతున్నవారితో గానీ, నీచుల తోగానీ, గమనం జరుగుతుంది. ఈ అర్థాన్ని అనర్థానుబంధం అంటారు. తన వ్యయంతోనే గొప్పశూరుడూ, మహాసామం తుడూ, ప్రభువూ అయిన పిసినిగొట్టుతో గమనంచేస్తే అది నిష్ఫలమైనా వ్యసనాన్ని పోగొట్టుకోడానికి చేసేదికాబట్టి అనర్థ మైనా అర్థానుబంధం కలదిమాత్రం అవుతుంది. ధూర్తుడూ, తనను తాను సుందరుడనని అభిమానించుకునేవాడూ, కృత ఘ్నుడూ, సంధికార్యాలు చెడగొట్టేవాడూ అయిన వానితో తన ధనవ్యయంతో ఆరాధించినా ఆశ్రమ అంతా వ్యర్థమే, ఆ అనర్థం అనుబంధంలేనిది. అలాటి రాజబంధువూ, క్రూర ప్రభావంచేత అధికుడూ అయినవానితో తన స్వంత ఖర్చులతో సంగమిస్తే నిష్ఫలమూ, వెళ్లగొడితే దోషమూ, సంక్ర మిస్తాయి. ఈ అనర్థాన్ని అనర్థానుబంధం అంటారు. ఇలా ధర్మకామాల అనుబంధాలను సమకూర్చుకుని చూచుకోవాలి.

౧౭౮౭-పరస్పరేణచ యుక్త్యా సంకిరే దిత్యనుబంధాః। పరితో
౧౭౮౯. షితోఽపి దాస్యతి నవేత్యర్థ సంశయః। నిష్పీడితార్థ
మఫల ముత్సృజంత్యా అర్థ మలభమానాయా ధర్మ
స్స్యాన్న వేతి ధర్మసంశయః । అభిప్రేత మనుపలభ్య
పరిచారక మన్యంవా క్షుద్రం గత్వా కామస్స్యాన్న
వేతి కామ సంశయః। ప్రభావవాన్ క్షుద్రో అనభి
మతోఽనర్థం కరిష్యతి న వేత్యనర్థ సంశయః। అత్యంత
నిష్ఫలస్సక్తః పరిత్యక్తః పితృలోకం యాయాత్తత్రా
ధర్మ స్స్యాన్న వే త్యధర్మసంశయః॥ ౬.౬.౧౯

పరస్పరంగానూ, యుక్తిగానూగూడా సంకీర్ణాలను సృష్టించ వచ్చు. అతడు నావల్ల తృప్తిపడినా ధనం ఇస్తాడా? ఇవ్వడా? అనే సందేహాన్ని అర్థసంశయం అంటారు. ధనంఅంతా అపహరించి ఆ వ్యర్థుణ్ణి విడిచిపెట్టడం ధర్మమవుతుందా? కాదా? అని సందేహపడడం ధర్మసంశయం అంటారు. తాను కోరిన సొగసుకాణ్ణి పొందలేక సేవకునితోనో, ఏ నీచునితోనో సంగమించి అది కామం అవునా? కాదా? అని సందేహపడడం కామసంశయం అంటారు. తాను పొందబోయేవానియందు తన కిష్టంలేకున్నా నీచుడుగనుక పోకపోతే అనర్థాన్ని చేస్తాడేమో? చెయ్యడేమో? అని సంశయించడం అనర్థసంశయం అంటారు. మరీ వ్యర్థుడైకూడా తనయందు తీపివదలని వాణ్ణి వదిలివేస్తే వాడు చచ్చి స్వర్గంచేరితే నాకు అక్కడ అధర్మం ప్రాప్తిస్తుందా? ధర్మంప్రాప్తిస్తుందా? అనే సంశయాన్ని ధర్మసంశయం అంటారు.

౧౪౭౦. రాగస్యాఽపి విషయాయాం అభి(ప్రేత మనుపలభ్య విరాగస్స్యాన్న వేతి ద్వేష సంశయ ఇతి శుద్ధసంశయాః। అథ సంకీర్ణాః। ఆగంతో రవిదితశీలస్య వల్లభ సం(శయస్య ప్రభవిష్ణోర్వా సముపస్థితస్యారాధన మర్థానర్థ ఇతి సంశయః। శ్రోత్రియస్య (బహ్మచారిణో దీక్షితస్య (వతినో లింగినో వా మాం దృష్ట్వా జాతరాగస్య ముమూర్షో ర్మిత్రవాక్యాదానృశంస్యాచ్చ గమనం ధర్మోఽధర్మ ఇతి సంశయః, లోకాం దేవాకృత ప్రత్యయాదగుణో గుణవాన్వే త్యనవేక్ష్య గమనం కామో ద్వేష ఇతి సంశయః। సంకిరేచ్చ పరస్పరేణేతి సంకీర్ణసంశయాః॥ ౬.౬.౨౯.30

అనురాగంచేత పీడితురాలై తన వగకాణ్ణి పొందలేక ఇతడు విరక్తుడా? కాడా? ఇతనికి నామీాద ఏమైనా దోషమున్నదా? లేదా? అనే సంశయాలు రెండూకలిగితే వాటిని శుద్ధ సంశయాలంటారు. ఇక సంకీర్ణసంశయాలను చెవుతున్నారు. క్రొత్తగా ఎక్కడినుంచోవచ్చిన అతని స్వభావాదులు తనకు తెలియక, అతడు రాజాశ్రితుడు, ప్రభుత్వంకలవాడూ, అయి ఉండి తనను సమీాపిస్తే అతనిని సేవించడం అనర్థమా? అర్థదాయకమా? అనే సందేహాన్ని అర్థానర్థసంశయం అంటారు. శ్రోత్రియుడూ బ్రహ్మచారీ, దీక్షలోఉన్నవాడూ, యతీ, అయిన అతనికి నన్నుచూడగానే మోహం ఉదయించింది. నేను సంగమించకపోతే చచ్చిపోతాడు. అతని ప్రార్థనవల్లా, దయాస్వభావంవల్లా అతన్ని అంగీకరించడం ధర్మమా?

అధర్మమూ? దీన్ని ధర్మాధర్మసంశయం అంటారు. లోకం మీాది కోపంతో ఇతను గుణవంతుడా? కాడా? అనే విచారంతో పనిలేకుండా ఏ పనిలేకుండా ఏ పురుషునితోనైనా సంగమించడం కామమా? ద్వేషమా? అనేది మరో సంకీర్ణ సంశయం, ఇలా పరస్పర విరుద్ధాలైన సంశయాలు సమకూడితే సంకీర్ణ సంశయా లంటారు.

౧౪౭౧-యత్ర పరస్యాభిగమనే౽ర్థః సంఘుక్షితః స ఉభయ
౧౪౭౪. తో౽ర్థః. యత్ర స్వేన వ్యయేన నిష్ఫల మభిగమనం నర్తాచ్చానుక్షితా ద్విత్త ప్రత్యాదానం స తూభయతో౽నర్థః, యత్రాభిగమనే౽ర్థో భవిష్యతి న వేత్యాశంకా, పక్తోపి సంఘుర్షాద్దాస్యతి న వేతి స ఉభయతో౽ర్థ సంశయః। యత్రాభిగమనే వ్యయవతి పూర్వో విరుద్ధః క్రోధా దపకారం కరిష్యతి నవేతి ఉభయతో౽నర్థః, ఇత్యుద్దాలకే రుభయతో యోగాః॥

ఎక్కడ పరునితోసంగమిస్తే అతనివల్లా, తనకు అంతకుపూర్వం పొందుతూ ఉన్నవానివల్లా ధనంలభిస్తే దాన్ని ఉభయతోర్థం అంటారు. ఎక్కడ తన ఖర్చులతోనే అన్యునితో సంగమిస్తే అదీ నిష్ఫలమై, పూర్వం పొందుతూఉన్నవానివల్ల చెప్పుదెబ్బలూ, ధనాపహరణమూ జరిగితే దాన్ని రెండిటాచెడడం, లేక ఉభయతో౽నర్థం అంటారు. ఎక్కడ గమనంచేస్తే ధనలాభం ఉంటుందా? ఉండదా అనే సంశయం కలుగుతుందో, సక్తుడైనా పోటీలో ధనం ఇస్తాడో, ఇవ్వడో అనే సంశయం కూడా కలుగుతుందో అక్కడ రెండువిధాలా అర్థసంశయం,

ఎక్కువ వ్యయపడి గమనంచేస్తే, పూర్వుడు అలిగాడు. వాడు కోపంవల్ల అపకారంచేస్తాడేమో? అలాగే ఇప్పుడు అనురాగాన్ని పూనినవాడు కోపంవల్ల ఇచ్చిందిగూడా గుంజుకుపోతాడేమో అనే యోగాన్ని ఉభయతోఽనర్థం అంటారు. ఇవి ఔద్దాలకి చెప్పిన ఉభయతోయోగాలు.

౧౪౭౫-బాభ్రవీయాస్తు యత్రాభిగమనేఽర్థోఽనభిగమనేచ
౧౪౭౬.సక్తాదర్థః స ఉభయతోఽర్థః। యత్రాభిగమనే నిష్ఫలోవ్యయః అనభిగమనేచ నిష్ప్రతీకారోఽనర్థః స ఉభయతోఽనర్థః। యత్రాభిగమనే నిర్వ్యయోదాస్యతి నవేతి స ఉభయతోఽనర్థ సంశయః। యత్రాభిగమనే వ్యయవతి పూర్వో విరుద్ధః ప్రభావవాన్ ప్రాప్స్యతే నవేతి సంశయోఽనభిగమనేచ క్రోధాదనర్థం కరిష్యతి నవేతి స ఉభయతోఽనర్థసంశయః । ఏతేషామేవ వ్యతికరే అన్యతోఽర్థో అన్యతోఽనర్థః। అన్యతోఽర్థో అన్యతోఽర్థసంశయః। అన్యతోఽర్థోఽన్యతోఽనర్థసంశయః। అన్యతోఽర్థసంశయః। అన్యతోఽనర్థసంశయః। ఇతి షట్సంకీర్ణయోగాః ॥ ౬.౬.౩౪.౩౫

బాభ్రవీయులిలాచెప్పారు. ఏ యోగంలో ఇతరులతో సంగమిస్తే అర్థప్రాప్తి కలుగుతుందో, సంగమించకుండాఉంటే పూర్వుం ఉన్నవానివల్ల అర్థప్రాప్తి కలుగుతుందో దాన్ని ఉభయతోఽర్థం అంటారు. ఏ యోగంలో అభిగమనంచేస్తే ధనవ్యయమూ, నైష్ఫల్యమూ సంక్రమిస్తాయో, అభిగమనం చెయ్యకపోతే, ప్రతిక్రియలేని అనర్థమూ ప్రాప్తిస్తుందో దాన్ని

ఉభయతోఽనర్థసంశయం అంటారు. ఏ అభిగమనంవల్ల పూర్వం ఉన్నవాడు విరోధిస్తాడో, ప్రభావవంతుడు దొరుకుతాడా, దొరకడా? అనే సంశయం ఉంటుందో, అభిగమనం చెయ్యక పోతే క్రోధంవల్ల అనర్థాల్ని కల్పిస్తాడా? అనేసంశయం కలుగుతుందో దాన్ని ఉభయతోఽనర్థసంశయం అంటారు. వీటికి విపరీతంగా జరిగితే, అన్యతోఽర్థమూ, అన్యతోఽనర్థమూ, అన్యతోఽర్థమూ, అన్యతోఽర్థసంశయమూ, అన్యతోఽనర్థమూ, అన్యతోఽనర్థసంశయమూ, అన్యతోఽనర్థాసంశయమూ, అన్యతోఽర్థ సంశయమూ, ఇలా ఆరు సంకీర్ణ యోగాలు కలుగుతాయి.

౧౪౭౭- తేషు సహాయైస్సహ విమృశ్య యతోఽర్థ భూయిష్ఠోఽ
౧౪౭౮. ర్థసంశయో గురురనర్థప్రశమో వా తతః ప్రవర్తేత। ఏవం
ధర్మకామావప్యవస్థైవ యుక్త్యా ఉదాహరేత్। సంకీ
ర్ణేచ్ఛ పరస్పరేణ వ్యతిషంజయేచ్చే త్యుభయతో
యోగాః॥ ౬.౬.౪౬

ఆ శుద్ధ సంకీర్ణ సంశయాలవిషయమై పూర్వంచెప్పిన పీఠమర్దాది సహాయులతో ఆలోచించి ఏ యోగంవల్ల అర్థం ఎక్కువగా ప్రాప్తిస్తుందో, ఏ యోగంవల్ల అర్థసంశయంకలదో ఏ యోగం వల్ల గొప్ప అనర్థం శాంతిస్తుందో ఆ యాంబరువుసుళువులను గమనించి ఆ మార్గాన ప్రవర్తించాలి. ఇలాగే ధర్మకామా లను గూర్చిగూడా ఉదాహరణలు చూచుకోవాలి. ఇలాగే ధర్మకామాలకు సంకీర్ణం ఏర్పరచాలి. మార్పుకూడా చేసు కోవాలి, వీటిని ఉభయతోయోగాలంటారు. .

౧౪౮౦. సంభూయచ విటాః పరిగృహ్ణంత్యేకా మసౌ గోష్ఠీ
పరిగ్రహః ॥ ౬.౬.౪౮

చాలామంది విటులు ఒకచోట గుమిగూడి ఒక్క వేశ్యతో అను
గమిస్తే దాన్ని గోష్ఠీ పరిగ్రహం అంటారు. విటులలో
ఎంతో అన్యోన్యం ఉంటేనేగాని ఈ గోష్ఠి జరుగదు.

౧౪౮౧. సా తేషా మితస్తతః సంపృచ్ఛమానా ప్రత్యేకం
సంఘర్షా దర్థం నిర్వర్తయేత్. ౬.౬.౪౯

ఆ వేశ్య నియమంలేకుండా ఒకనితోనూ, ఇద్దరితోనూ, ముగ్గు
రితోనూ, అనేకులతోనూ కామకేళిజరుపుతూ ఒక్కొక్కరి
దగ్గరనుంచి ధనాన్ని సంపాదించాలి.

౧౪౮౨-సువసంతకాదిషుచ యోమ ఇమ మముంచ మనో
రథం సాధయిష్యతి, తస్యాద్య గమిష్యతి మే దుహితేతి
మాత్రా వాచయేత్ । తేషాంచ సంఘర్షజేఽభిగమనే
కార్యాణి లక్షయేత్. ౬.౬.౫౦

ఇలాటి సంఘర్షణాలు జరిగే సమయంలో నాయకులకు స్పర్థ
ఏర్పరచడానికి కారణాలు చెప్తున్నారు. సువసంతకాది ఉత్స
వాలలో వేశ్యమాత విటులదగ్గర చేరి ఎవ్వరు నా కోరికలను
తీరుస్తారో ఆ పురుషునితో నా కూతురు సంగమిస్తుందని
చెప్పాలి. ఇలా వేశ్య తనతల్లిద్వారా చెప్పించాలన్నమాట.
అప్పుడు వారిలో వారికి పోటీయేర్పడి ఒకరికంటె ఒకరు
ఎక్కువ ధనాన్ని యిస్తారు. అప్పుడు వాళ్ల త్యాగాన్ని కని
పెట్టాలి.

౧౫౧౭. ఏకతోఽర్థః సర్వతోఽర్థః, ఏకతోఽనర్థః సర్వతోఽనర్థః, అర్థతోఽర్థః । సర్వతోఽర్థః । అర్థతోఽనర్థః । సర్వతోఽనర్థః । ఇతి సమంతతో యోగాః॥ ౬.౬.౫౧

పైన చెప్పిన గోష్ఠీ విషయమై చేయవలసిన క్రమాన్ని ఇక్కడ చెప్తున్నారు. ఒకనివల్ల కొంతద్రవ్యాన్ని గడించాలి. తరువాత అందరివల్లా ధనాన్ని గడించాలి. ఈ క్రమంగా సమంతతో యోగాలను చెప్పారు.

౧౫౧౮. అర్థో సంశయ మనర్థసంశయంచ పూర్వవ ద్యోజయే త్సంకీర్ణే చ. ౬.౬.౫౨

అర్థసంశయాన్ని, అనర్థసంశయాన్ని పూర్వంవలెనే గ్రహించాలి. సంకీర్ణాలనుగూడా ఇలాగే గ్రహించాలి.

౧౫౧౯-తథా ధర్మకామావపి. ఇత్యర్థానర్థానుబంధ సంశయ
౧౫౨౦. విచారాః. ౬.౬.౫౩

అలాగే ధర్మకామాలనుగూర్చి కూడా సంశయాలనూ, సంకీర్ణ సంశయాలనూ గమనించాలి. ఇలా అర్థానర్థానుబంధ సంశయ విచారాలు పూర్తి అయినాయి.

౧౫౨౧-కుంభదాసీ, పరిచారికా, కులటా, స్వైరిణీ, నటీ,
౧౫౨౨.శిల్పకారికా, ప్రకాశవినష్టా, రూపాజీవా, గణికాచేతి వేశ్యావిశేషాః. ౬.౬.౫౪

ఏయే స్త్రీలకు వేశ్యావృత్తి విధింపబడ్డదో చెప్తున్నారు. కుంభదాసి, వేశ్యాజాతిలోచేరినదే. పరిచారిక:- ఈమె రాజులకు దాస్యంచేసి బ్రతుకుతుంది. కులట:- ఈమె కులంలో

నుంచి భ్రష్టురాలై ధర్మం తప్పి భర్తవల్ల భయపడి మరియొకని యింటిలోచేరి వానితో సంగమిస్తూ ఉంటుంది. స్వైరిణి:- ఈమె భర్తను తిరస్కరించి తన యింట్లోగానీ, పరుని యింట్లో గానీ ఇతరులతో కూడుతుంది. నటి:- ఈమె నాట్యకళను నేర్చి నాటకాదులలో పాత్రలు ధరిస్తూ ఉంటుంది. శిల్పకారిక:- ఈమె చేతిపనులుచేసి జీవించేవాళ్ల భార్య. ప్రకాశవినష్ట; రూపాజీవ, గణిక అనే వీరంతా వేశ్యా విశేషాలలో చేరతారు.

౧౪౮౯. సర్వాసాం చానురూప్యేణ గమ్యాస్సహాయాస్తదుపరంజన మర్థాగమోపాయా, నిష్కాసనం, పునస్సంధానం లాభ విశేషానుబంధాః । అర్థానర్థానుబంధ సంశయ విచారాశ్చేతి వైశికం ప్రకరణం. ౬.౬.౫౦

ఈ ప్రకరణంలో చెప్పబడిన నాయికలకు తగిన విటులూ, సహాయకులూ ఉండాలనీ, వారు వారిని రంజింపచెయ్యాలనీ, అర్థాగమోపాయాలూ, నిష్కాసన విధానాలూ, పునస్సంధానాలూ, లాభవిశేషాలూ, అనుబంధవిశేషాలూ, అనర్థానర్థానుబంధ సంశయవిచారాలూ అనే విషయాలు చెప్పబడ్డాయి. ఇది వైశిక ప్రకరణం.

భవంతి చాత్రశ్లోకాః—

౧౪౯౦. రత్యర్థాః పురుషాయేన । రత్యర్థా శ్చైవ యోషితః ॥
శాస్త్రస్యార్థప్రధానత్వాత్ । తేన యోగోత్ర యోషితాం ॥ ౬.౬.౫౧

రతినే ప్రధానంగా ఎంచుకునేపురుషులూ, రతినే ప్రధానంగా తలంచే స్త్రీలూగూడా ప్రపంచంలో ఉన్నారుగనుక శాస్త్రం విషయప్రధానంగా ఉపదేశం చేస్తున్నది. అందువల్ల ఈ వైశికాధికరణంలో వేశ్యా స్త్రీలకే అధికారం.

౧౪౯౧. సంతి రాగపరా నార్యః । సన్తి చార్థపరా అపి ।
ప్రాక్ తత్ర వర్ణితో రాగః । వేశ్యాయోగాశ్చ వైశికే॥

ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే వైశికే షష్ఠేఽధికరణే అర్థానర్థానుబంధ సంశయ విచారాః వేశ్యావిశేషాశ్చేతి షష్ఠోఽధ్యాయః.

ప్రపంచంలో ప్రధానంగా ఎంచబడే స్త్రీల విషయం కన్యాసంప్రయుక్తక, భార్యాధికారిక, పారదారికాధికరణాలలో చెప్పే ఉన్నాం. వారు అనురాగ ప్రధానలుగనుక వారి కనుకూలమైన చరిత్రను అక్కడ వర్ణించాం. ఇక వేశ్యలకు అనురాగం ఉన్నా వాళ్లు ధనప్రధానలు కాబట్టిన్నీ, రతీ, వృత్తీ వాళ్లకు కావాలి కాబట్టిన్నీ వారి చరిత్రను ఇక్కడ చెప్పినాము.

ఈ విధానంతో భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల
ఆంజనేయమూర్తి చేత వాత్స్యాయన కామసూత్ర
ములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయ
బడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలోని
వైశికమనే ఆరో అధికరణంలో
ఆరో అధ్యాయం ముగిసినది.

శ్రీ

# వాత్స్యాయనీయం



## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం



### ౭. ఔపనిషదికాధికరణం



### ౧. సుభగంకరణాధ్యాయం

౧౪౯౨. వ్యాఖ్యాతం కామసూత్రం. ౭.౧.౧

తంత్రావాపాత్మకముగా కామసూత్రం స్పష్టం చేయబడ్డది.

౧౪౯౩. తదుక్తైస్తు విధిభి రభిప్రేత మర్థ మనధిగచ్ఛ న్నౌపనిషద మాచరేత్. ౭.౧.౨

తంత్రావాపాది విధాలచేత కామాన్ని పొందలేకపోతే ఔపనిషదికాన్ని (ఔషధప్రయోగాన్ని) ఆచరించాలి.

౧౪౯౪. రూపం గుణో వయ స్త్యాగ ఇతి సుభగం కరణం.

ఇక సుభగంకరణయోగాన్ని చెప్తున్నారు. అది, రూపమూ, గుణమూ, యశస్సూ, భాగ్యమూ, అని నాలుగురకాలుగా ఉంటుంది. సుభగం కరణమంటే శరీరానికి అందాన్ని సమకూర్చడం, ముందుగా రూపాన్ని గురించి చెప్తున్నారు. రోజురోజూ కనీసం ఒక్కమారైనా స్నానం చెయ్యాలనీ, రెండురోజులకొకసారి ఒళ్లు పట్టించుకోవాలనీ, పూర్వం చెప్పిన

క్రమంగా శరీరానికి చక్కని సంస్కారం చేస్తే హృదయాకర్షక మైన అంశంవస్తుంది. నాయకునకు ఉండవలసినవని పైనచెప్పిన గుణాలు ఎంత కురూపినైనా సుందరుణ్ణిగా చేస్తాయి. అందువల్ల ఆ గుణాలను అలవరచుకోడానికి ప్రయత్నించాలి. యవ్వనంలో మానవుడు చెయ్యలేనిపని ఉండదు. ఆ యవ్వనాన్ని మంచి నడవడికతో స్థిరంగా ఉండేలాగా ప్రయత్నించాలి. వృద్ధుణ్ణిచూస్తే స్త్రీలు పతితుడని అనాదరిస్తారు. ఆ వార్ధక్యంలోగూడా జుట్టును సువాసనద్రవ్యాలతో సంస్కరించుకొంటూ ఉంటే స్త్రీలకు వైముఖ్యం ఏర్పడదు. కురూపిఅయినా, గుణహీనుడైనా, వృద్ధుడైనా, డబ్బు వెదజల్లేవాడైతే, స్త్రీలు తమంతటతామే ఎగబడతారు.

౧౮-౫. తగరకుష్ఠతాళీసపత్త్రానులేపనం సుభగం కరణం.

ఎవనికి రూపమూ, గుణమూ, యవ్వనమూ, దానబుద్ధిలేవో వాని విషయమై చేయవలసినవిధానం చెవుతున్నారు. గ్రంధిపర్ణమూ, చెంగల్వకోష్ఠమూ, తాళిసపత్రీ వీటిని పొడికొట్టి శరీరానికి నలుగుపెడితే శోభవస్తుంది.

౧౮-౬. ఏతైరేవ సుపిష్టైః వర్తిమాలిప్య అక్షతైలేన నర
కపాలే సాధిత మంజనంచ. ౭.౧.౫

పై వస్తువులనే చూర్ణంచేసి గుడ్డలోపోసి ఆ గుడ్డను వత్తిగా తయారుచేసి, మనిషిపుర్రెలో తాటిగింజలనూనె పోసి ఈ వత్తితో దీపం వెలిగించి దానిమసిని మరిఒకపుర్రెకు పట్టేలాగా

చేసి ఆ కాటుకను కండ్లకు పెట్టుకుంటే ఇది ఒకరకమైన సుభగం కరణ మవుతుంది.

౧౪౯౭. పునర్నవా, సహదేవీ, శారిబా, కురంటకోత్పల పత్రైశ్చ సిద్ధతైల మభ్యంజనంచ. ౭.౧.౬

గల్జేరు, సహదేవి, నల్లసుగంధిపాల, గోరింట, ఈ చెట్లూ వీటి వేళ్లూ, కలువపూవు మధ్యభాగమూ వీటితో కషాయం తీసి దానిలోనుంచి నూనెతీసి ఆ నూనెను తలంటుకోడంగూడా ఒక రకమైన సుభగంకరణమే.

౧౪౯౮. తద్యుక్తా ఏవస్రజశ్చ. ౭.౧.౭

పై పునర్నవాదుల చూర్ణాన్ని పూలమాలలకు పట్టించి ధరించడంగూడా ఒకరకమైన సుభగం కరణయోగమే.

౧౪౯౯. పద్మోత్పల నాగకేసరాణాం శోషితానాం చూర్ణం మధుఘృతాభ్యామవలిహ్యాసుభగో భవతి. ౭.౧.౮

తామరపూవులయొక్క, కలువలయొక్క కింజల్కాలనూ, నాగకేసరాలనూ, చూర్ణంచేసి తేనెతోనూ నేతితోనూ కలిపి సేవిస్తే మానవుడు సుందరుడౌతాడు.

౧౫౦౦. తాన్యేవ తగరతాళీస తమాల పత్రయుక్తా న్యనులిప్య.

తామరలయొక్క కలువలయొక్క కింజల్కాలనూ, గ్రంధితగరమూ, తాళిసపత్రి, తమాలపత్రిమూ అనేవాటిని నూరి ఒంటికి నలుగుపెట్టుకుంటే మానవుడు మంచి అందగాడౌతాడు.

౧౫౦౧. మయూరస్యాక్షితరక్షోర్వా సువర్ణేనావలిప్య దక్షిణ హస్తేన ధారయేదితి సుభగం కరణం. ౭.౧.౧౦

నెమలియొక్కగానీ, చిరుతపులియొక్కగానీ కళ్లు పచ్చి పసుపా కుతో చుట్టి కుడిచేతితో పట్టుకునిఉంటే ఒకరకమైన సుభగం కరణం.

౧౫౦౨. బాదరమణిం, శంఖమణించ తథైవ తేషు చాథర్వ ణాన్ యోగాన్ గమయేత్. ౭.౧.౧౧

రేగుపూస, శంఖమణి పసుపాకుతో చుట్టి ధరిస్తే ఒకరకమైన సుభగం కరణం. ఇంకా అథర్వణవేదంలో చెప్పబడిన యోగాలనుగూడా ఆచరించాలి.

౧౫౦౩. విద్యాతంత్రాచ్చ విద్యాయోగా త్ప్రాప్త యౌవనాం పరిచారికాం స్వామీ సంవత్సర మాత్రి మన్యతో వారయేత్. తతో వారితాం బాలాం వా మత్వా లాలసీభూ తేషు గమ్యేషు యోఽస్యై సంఘ ర్షేణ బహుదద్యా త్తస్మై విసృజేత్. ఇతి సౌభాగ్య వర్థనం. ౭.౧.౧౨

విద్యా తంత్రాలతోనూ, విద్యా యోగాలతోనూ, యవ్వన వతి అయిఉన్న పరిచారికను రక్షకులు ఒక సంవత్సరకాలం పురుష సంపర్కంలేకుండా ఆపి ఆమెనుగూర్చి విటులు ఉవ్విళ్లు లూరేసమయంలో బాగా ధనం ఇచ్చేవానిదగ్గరకు ఆమెను పంపాలి. ఇది సౌభాగ్యవర్థనయోగం. వేశ్యలలా చేస్తారు.

౧౫౦౪-గణికా ప్రాప్తయౌవనాం స్వాం దుహితరం తస్యాః ౧౫౧౧.విజ్ఞానశీల రూపానురూపేణ తా నభిమంత్ర్య సారేణ యోఽస్యా ఇదమిదంచ దద్యా త్సపాణిం గృహ్ణీయాదితి

సంభావ్య రక్షయేదితి. సాచ మాతు రవిదితా నామ నాగరకపుత్త్రైగి ధనిభి రభ్యర్థం ప్రీయేత, తేషాం కళాగ్రహణే గాంధర్వశాలాయాం, భిక్షుకీభవనే, తత్ర తత్రచ సందర్శన యోగః, తేషాం యథోక్తదాయినాం మాతా పాణిం గ్రాహయేత్, తావ దర్థ మలభమానాతు స్వేనా ప్యేకదేశేన దుహిత్రా ఏతద్దత్తమనేనేతి ఖ్యాపయేత్ । ఊఢాయా కన్యాభావం విమోచయేత్। ప్రచ్ఛన్నం వాత్తైస్సంయోజ్య స్వయమజానతీ భూత్వా తతో విదితేష్వేతం ధర్మస్థేషు నివేదయేత్ । సఖ్యా వతు దాస్యావా మోచితకన్యాభావాం, సుగృహీత కామసూత్రాం, ఆభ్యాసికేషు యోగేషు ప్రతిష్ఠితాం, ప్రతిష్ఠితే వయసి సౌభాగ్యేచ దుహితర మవసృజంతి గణికాః ఇతి ప్రాచ్యోపచారః, పాణిగ్రహశ్చ సంవత్సర మవ్యభిచార్యస్తతో యథా కామినీస్యాత్ । ఊర్ధ్వమపి సంవత్సరా త్పరిణీతేన నిమంత్ర్యమాణా లాభ మప్యుత్సృజ్యతాం రాత్రిం తస్యాగచ్ఛేదితి వేశ్యాయాః పాణిగ్రహణ విధి స్సౌభాగ్య వర్ధనంచ. ౭.౧.౨౨

గణిక యుక్తవయస్కురాలైన తన కూతురిని ఆమె విజ్ఞానానికీ, శీలానికీ, రూపానికీ తగినపురుషులను పిలిచి ఈ యీవస్తువులను ఎవ్వరిస్తారో అతనితో నా కూతురు పాణిగ్రహణం చేస్తుందని చెప్పి సంరక్షణచెయ్యాలి. ఆ కన్యకగూడా తల్లికి తెలియకుండా నాగరకుడైన ధనవంతుణ్ణి ప్రేమించాలి. వాడికి

నాట్యశాలలయందూ, భిక్షుకీభవనాలలోనూ, దర్శనాన్ని సమకూర్చాలి. తరువాత వారితో తాను సూచించినవి ఇవ్వ గలవాసితో ఈమెకు వేశ్యమాత పాణిగ్రహణం చేయించాలి. వాళ్లు తానుకోరినంతా ఇవ్వకపోతే తన ద్రవ్యాన్ని తన కూతు రికిగాను ఇచ్చి ప్రకటించాలి. అలా పాణిగ్రహణం చేయించి కన్యాత్వంనుంచి విడిపించాలి. అంతకుపూర్వమే రహస్యంగా తనకూతురిని సంగమింపచేసి తానేమీ యెరగనట్లు అటు తరు వాత బయటపడితే ధర్మాధికారులకు తానేమీ యెరుగనట్లు నివేదించాలి. ఇది తాను ముందు సూచించిన ద్రవ్యం పూర్తి అయేందుకు వేసే యెత్తుగడ. ఇలా చెలికత్తెలద్వారా కన్యాత్వంనుంచి విడివడి కామసూత్ర రహస్యాలనన్నిటినీ చక్కగా గ్రహించి, అభ్యాసయోగాలునేర్చి మంచి యౌవన ప్రభావంగలిగి మెరసిపడుతున్న తన కూతురిని విటులకు తారుస్తూఉంటారు వేశ్యమాతలు. ఇది ప్రాచ్యుల పద్ధతి. పాణిగ్రహణంచేసినది ఒక సంవత్సరకాలం ఇతరులతో సంగ మించక అటుపిమ్మట కాముకివలె ప్రవర్తించాలి. సంవత్సరం దాటినతరువాతకూడా పాణిగ్రహణం చేసుకున్నవాడు కబు రంపినప్పుడు ఎంతటి లాభాన్నైనా వదిలివేసి ఆ రాత్రి అత నితో సంభోగించాలి. ఇది వేశ్యయొక్క పాణిగ్రహణవిధి. ఈ క్రమం వారికి సౌభాగ్యప్రదం.

౧౫౧౧-౨-ఏతేన రంగోపజీవినాం కన్యాః వ్యాఖ్యాతాః। తస్మై ౧౫౧౧౩.తు తాం దద్యుర్యపఏషాం కుర్యో విశిష్ట ముపకు ర్యాత్। ఇతి సుభగం కరణం. ౭.౧.౨౪

ఇలా చెప్పడంవల్ల రంగస్థలాలలో నటించి జీవించే నటుల యొక్క కన్యలుగూడా వ్యాఖ్యానం చేయబడ్డారు. వీరి విషయంలో ఒక విశేషమున్నది. నృత్య నాట్యాదులలో ఎవరు మిక్కిలి తమకు ఉపకారం చేస్తూఉంటారో వాళ్లకే ముందుగా కన్నెను పై రీతిగా ఒప్పచెప్పి రంజింపచెయ్యాలి. ఇది సుభగంకరణవిధానం.

౧౫౧౪-ధుత్తూరక మరిచ పిప్పలీచూర్ణైః మధుమిశ్రైః లిప్తలిం

౧౫౧౫. గస్య సంప్రయోగో వశీకరణం। వాతోద్భ్రాంత పత్రం మృతకనిర్మాల్యం మయూరాస్థిచూర్ణావచూర్ణం వశీకరణం. ౭.౧.౨౫

పై విధంగా లోకప్రియుడుగా తయారైన నాయకుడు తన ఇష్టసిద్ధికోసం చేసే వశీకరణ విధానాన్ని చెపుతున్నారు. ఉమ్మెత్తగింజలూ, మిరియాలూ, పిప్పళ్లూ, పొడిచేసి తేనెతో రంగరించి లింగానికి పూసికొని అరనిచ్చి సంభోగిస్తే నాయిక వశురాలౌతుంది. ఈ సంగతి నాయికకు తెలియనీయరాదు. వాతోద్భ్రాంతపత్రమూ, పీనుగగుండె, చకోరపక్షి ఎముకలూ చూర్ణంచేసి కలిపి స్త్రీలకు తలమీదా, పురుషులకు పాదాలమీదా పూస్తే వశీకరణమౌతుంది.

౧౫౧౬-స్వయం మృతాయాః మండలకారికాయా శ్చూర్ణం,

౧౫౧౭. మధుసంయుక్తం సహామలకైః స్నానం వశీకరణం, వజ్రస్నుహీ గండకాని ఖండశః కృతాని మనశ్శిలా గంధపాషాణచూర్ణే నాభ్యజ్య సప్త కృత్వః శోషితాని చూర్ణయిత్వా మధునా లిప్తలింగస్య సంప్ర

యోగో వశీకరణం । ఏతే నైవ రాత్రౌ ధూమం కృత్వా తద్ధూమతిరస్కృతం సౌవర్ణం చంద్రమసం దర్శయతి । ఏతైరేవ చూర్ణితైః వానరపురీషమిశ్రితైః యాం కన్యా మవకిరేత్ సా అన్యస్మై నదీయతే.

మండకారిక అనేది ఒక నీటిపిట్ట. ఇది ఒక గ్రిద్దజాతిలోనిది. వాటిలో ఆడపక్షి తనంతటతాను చచ్చిపోగా దానిని చూర్ణం చేసి యష్టిమధుకముల చూర్ణముతోనూ, ఉసిరిపళ్లచూర్ణం తోనూ కలిపిన నీళ్లతో స్నానంచేస్తే వశీకరణసిద్ధి అవుతుంది. జెముడుచెక్క, గండకం అనే చేపపిల్లా, వీటిని ముక్కలుగా చేసి ఎండపెట్టి మణిశిలాగంధకచూర్ణాలతో కలిపి ఏడుమాట్లు ఎండపెట్టి పొడిచేసి తేనెతో కలిపిమూరి లింగానికిపట్టిస్తే వశీకరణం అవుతుంది. ఈ పొడితోనే రాత్రిసమయంలో పొగవేసి ఆ పొగలోనించి చంద్రుణ్ణి చూపించాలి. ఈ చూర్ణాలనే కోతి పురీషంతో కలిపి కన్యపైనచల్లితే వశీకరణం అవుతుంది.

౧౫-౨౦-వచా గండకాని సహకార తైల లిప్తాని శింశుపా
౧౫-౨౮. వృక్షస్కంధ ముత్కీర్య షణ్మాసం నిదధ్యాత్ । తత
షడ్భిర్మాసైరపనీతాని దేవకాంత మనులేపనం వశీకరణం చేత్యాచక్షతే । తథా ఖాదిరసారజాని శకలాని తనూనియం వృక్ష ముత్కీర్య షణ్మాసం నిదధ్యాత్పుష్ప గంధాని భవంతి. గంధర్వకాంత మనులేపనం వశీకరణం చేత్యాచక్షతే । ప్రియుంగవ స్తగరమిశ్రాః సహకార తైలదిగ్ధాః నాగవృక్ష ముత్కీర్య షణ్మాసం నిహితాః నాగకాంత మనులేపనం వశీకరణ మిత్యా

చక్షుతే । ఉష్ట్రాస్థి భృంగరాజ రసేన భావితం దగ్ధం అంజనం నాళికాయాం నిహిత ముష్ట్రాస్థి శలాక యైవ స్రోతోంజన సహితం పుణ్యాల చక్షుష్యం వశీకరణం చేత్యాచక్షుతే । ఏతేన శ్యేనభాసమయూరాస్థిమ యాని అంజనాని వ్యాఖ్యాతాని । ఇతి వశీకరణం.

తెల్లవస, చేవ, ఈ వస్తువులకు తియ్యమామిడి తైలంపూసి శింశు పావృక్షపు తొఱ్ఱలోచేర్చి మూసివైచి ఆరు నెలలుంచి నూరి నాయికకు పూసినా, తాను ఉపయోగించుకున్నా ఎక్కువ మనః ప్రియంగా ఉంటుంది. ఇది సుభగం కరణంగాని, వశీ కరణంకాదు. చేవగల చంద్రముక్కలను నలగగొట్టి సువాసన గల చెట్టుతొఱ్ఱలోఉంచి మూసి ఆరునెలలుంచి తీస్తే ఆ పుష్ప ముల సువాసన వీటికి పడుతుంది. వాటిని అరగదీసి పూసినా పూసుకున్నా గంధర్వ స్త్రీలనుగూడా భ్రమపెట్టే సౌందర్యం ఏర్పడుతుంది. (పేంఖణపు చెట్లపూలూ, గ్రంధి తగరమూ, తియ్యమామిడి తైలంతో పూసి నాగవృక్షంతొఱ్ఱలో ఆరు మాసాలుంచి తీసి నీటితో అరగతీసి లేపనం చేస్తే నాగ కాంతా నులేపనం అవుతుంది. వశీకరణంగూడా అవుతుంది. ఒంటె ఎముక ముక్కను గుంటగరాకు తైలంతో భావనచేసి కాల్చి మసిచేసి కాటుక తయారుచేసికొని, ఒంటె ఎముకతో చేసిన గొట్టంలో దానినిపెట్టి ఆ ఎముకముక్కతోనే కళ్లకుపెట్టుకుంటే కళ్ళరోగాలు పోతాయి. వశీకరణం అవుతుంది. డేగ, భాస పిట్ట, నెమలి, వీటి అంజనాలుగూడా పై వాటివలెనే ఊహించుకోవాలి. ఇది వశీకరణ ప్రకరణం.

౧౫-౨౫-ఉచ్చటాకంపశ్చవ్యాయష్టిమధుకంచ సశర్కరేణ
౧౫-౨౬. పయసా పీత్వా వృషీభవతి। మేష భస్తముష్క.
సిద్ధస్య పయస స్సశర్కరస్య పానం వృషస్యయోగః.

నాయిక వశమైనా సంభోగించే శక్తిలేనివాడు ఈ క్రియలు చెయ్యాలి. వీటినే వృష్యయోగాలంటారు. గుండ తుంగగడ్డ, చవ్యమూ, యష్టిమధుకమూ, వీటినిపొడికొట్టి పంచదారతో గూడా పాలలోకలిసి తాగితే నపుంసకత్వం తొలుగుతుంది. మేక గొర్రె ఈ జంతువుల అండాలవల్లవచ్చేపాలను చక్కెరతో జోడించి తాగితే నపుంసకత్వం పోతుంది.

౧౫-౨౭. తథా విదార్యాః క్షీరికాయాః స్వయం గుప్తాయాశ్చ క్షీరేణపానం। తథా ప్రియాళు బీజానాం మోరటా విదార్యోశ్చ క్షీరేణైవ, శృంగారటవ, కసేరుక, మధూలికాని క్షీర కాకోల్యాసహ పిష్టాని స శర్కరేణ పయసాఘృతేన మందాగ్నినా ఉత్కారికాం పక్వాయావదర్థం భక్షితవాన్ అనంతాః స్త్రియో గచ్ఛతీ త్యాచార్యాః ప్రచక్షతే। మాషకమలినిం పయసాథౌతా ముష్ణేన ఘృతేన మృదూకృత్య ఉద్ధృతాం వృద్ధవత్సాయాః గోః పయస్సిద్ధం పాయసం మధుసర్పిభ్యాం అశిత్వా అనంతాః స్త్రియోః గచ్ఛతీ త్యాచార్యాః ప్రచక్షతే. ౭.౧.౩౮.౪౧

నేలగుమ్మడి, పాలపళ్లు, దురదగొండి వీటిని పాలలో వేసికాచి ఆపాలుతాగితేనూ, అలాగే చారపప్పూ, చాగచెట్టుగింజలూ, నేలగుమ్మడిగింజలూ పాలలో నానవేసితాగితేనూ,

సింగాణిగడ్డలూ, ములువెలగా, యష్టిమధుకమూ వీటిని క్షీర కాకోలితోనూరి పిండిచేసి పంచదారకలిపినపాలుగానీ, నేతితో గానీ కలిపి నిప్పుసెగమీాదవండి భుజిస్తే ఎక్కువమంది స్త్రీలతో రమించగలుగుతాడు. మాషకమలినిని నీటిలో వేసి నానబెట్టి పై పొట్టుతీసి కడిగి గోరువెచ్చని నేతితో వేయించి ఆవుపాలలో వేసి పాయసంచేసి దానిలో నెయ్యీ, తేనే కలిపిభక్షిస్తే అనేకస్త్రీలను మెప్పింపనచ్చు. ఇది పూర్వాచార్యులు చెప్పిన పద్ధతి.

౧౫౩-౪౦-విదారీ స్వయంగుప్తా శర్కరా మధుసర్పిభ్యాం
౧౫౩-౪౧. గోధూమచూర్ణేన పోళికాం కృత్వా యావదర్థం భక్షితవాన్ బహుస్త్రియో గచ్ఛతీ త్యాచార్యాః ప్రదక్షత్రే. చటకాండ రసభావితైః తండులైః పాయసం సిద్ధం మధుసర్పిర్భ్యాం ప్లావితం యావదర్థ మితి సమానం పూర్వేణ । చటకాండ రసభావితానపగత త్వచస్తిలాన్ శృంగాటక కసేరుక స్వయంగుప్తా ఫలాని గోధూమ మాషచూర్ణైః సశర్కరేణ పయసా సర్పి షాచ పక్వం సంయావం యావదర్థం ప్రాశితవానితి సమానం పూర్వేణ. సర్పిషో మధున శ్శర్కరాయా మధుకస్య ద్వేద్వేపలే మధురసాయాః కర్షః ప్రస్థం పయస ఇతి షడంగ మమృతం మేధ్యం వృష్యమా యుష్యం యుక్తరస మిత్యాచార్యాః ప్రచక్షతే। శత పదీ శ్వదంష్ట్రా గుడకషాయే పిప్పలీ మధుకల్కే గోక్షీరచ్ఛాగ ఘృతే పక్వే తస్యపుణ్యారంభేణాన్వహం ప్రాశనం మేధ్యం వృష్య మాయుష్యం యుక్త రస

మిత్యాచార్యాః ప్రచక్షతే । శతావర్యా శ్శ్వదంష్ట్రాయాః శ్రీపర్ణీ ఫలానాంచ క్షుణ్ణానాం చతుర్గుణిత జలేన పాక ఆప్రకృత్యావస్థానా త్తస్య పుష్యారంభేణ ప్రాతః ప్రాశనం మేధ్యం వృష్య మాయుష్యం యుక్తరస మిత్యాచార్యాః సంప్రచక్షతే॥ ౭.౧.౪౨.౪౭

నేలగుమ్మడి, దురదగొండి పొడిచేసి పంచదార, తేనే, నెయ్యితో కలిపి, తగుమాత్రపు గోధుమరవ్వతో కలిపి పోణీలుచేసి తృప్తితీరా భక్షిస్తే పురుషుడుచాలామందిస్త్రీలను పొందగలుగుతాడు. ఊరపిచ్చుకగుడ్లచొనతో బియ్యం నానబెట్టి ఆ బియ్యంతో పరమాన్నం వండించి దాంట్లో నెయ్యా, తేనేకలిపి భుజిస్తేగూడా అనేక స్త్రీలతో రమించగలుగుతాడని ప్రాచీనాచార్యు లన్నారు. పిచ్చికగ్రుడ్లచొనలోనే చేరుడునువ్వులు, సింగాణిగడ్డలూ, ములువెలగపళ్లూ, దురదగొండిగింజలూ, గోధుమరవ్వ, మినపసున్ని, పంచదార, పాలుకలిపి జావగా కాచి పుచ్చుకుంటే పలువురుస్త్రీలను తృప్తిపరచవచ్చు. తేనె, నెయ్యి, పంచదార యష్టిమధుకము వీటిని రెండేసి, రెండేసి పలములచొప్పునా, మధురసం ఒక కర్షమూ, ఒకప్రస్థం పాల లోకలిపి ముద్ద అయేదాకా ఉడకబెడితే షడంగామృతం ఔతుంది. దీన్ని సేవిస్తే మేధస్సు వృద్ధి అవుతుంది. మంచి పుంస్త్వం కలుగుతుంది. ఆయుష్యం వృద్ధిఅవుతుంది. పిల్లపీచర గడ్డలూ, పల్లేరూ, బెల్లం, వీటితో కషాయంకాచి పిప్పళ్లూ, యష్టిమధుకమూ, కలికంతీసి, ఆవుపాలు, మేకనెయ్యి వీటితో పైరెంటినీకలిపి వండి పుష్యమీనక్షత్రం మొదలు ప్రతిరోజూ

ప్రొద్దుటిపూట భక్షిస్తే చక్కని వీర్యపుష్టి ఆయుష్యమూ కలుగుతుంది.

౧౫౩౦. శ్వదంష్ట్రా చూర్ణ సమన్వితం తత్సమ మేవ యవ
చూర్ణం ప్రాతరుత్థాయ ద్విపలక మనుదినం ప్రాశ్నీ
యాన్మేధ్యం వృష్యం యుక్తరస మిత్యాచార్యాః
ప్రవక్షతే॥ ౭.౧.౪౮

ఏనుగు పల్లేరుకాయచూర్ణాన్నీ యవచూర్ణాన్నీ సమానంగా గ్రహించి ప్రతిరోజూ ప్రొద్దున రెండేసికలాలు భక్షిస్తే మంచి బుద్ధి బలమూ, వీర్యవృద్ధీ, రక్తవృద్ధీ, కలుగుతాయని ప్రాచీనాచార్యు లన్నారు.

౧౫౩౧-ఆయుర్వేదాచ్చ వేదాచ్చ విద్యాతంత్రేభ్య ఏవచ।
౧౫౩౨. ఆప్తేభ్యశ్చైవ బోద్ధవ్యా యోగాయే ప్రీతికారకాః।
న ప్రయుంజీత సందిగ్ధాన్ న శరీరాత్యయావహాన్।
న జీవఘాత సంబద్ధాన్ నాశుచి ద్రవ్య సంయుతాన్।
తపోయుక్తిః ప్రయుంజీత శిష్టైరనుగతాన్విధీన్।
బ్రాహ్మణైశ్చ సుహృద్భిశ్చ మంగళై రభినందితాన్॥

ఇతి శ్రీ వాత్స్యాయనీయే కామసూత్రే ఔపనిషదికే సప్త
మేఽధికరణే సుభగంకరణం, వశీకరణం, వృష్యా
యోగాః ప్రథమోఽధ్యాయః.

ఆయుర్వేదంనుంచీ, అథర్వణవేదంనుంచీ, కామ విద్యాతంత్రం తెలిసినవారినుంచీ, ఆప్తులనుంచీ ప్రేమను వృద్ధిచేసేయోగాలను

గ్రహించాలి. సందేహంగా ఉన్న యోగాలుగానీ, శరీరానికి జబ్బుకలుగజేసే యోగాలుగానీ, హింసాత్మకాలైన యోగాలుగానీ, తుచ్ఛపదార్థాలు ఉపయోగించే యోగాలుగానీ నీతీ నియమంగల బుద్ధిమంతులు ప్రయోగింపరాదు. ఏ యోగాలను పెద్దలు అనుసరిస్తున్నారో, బ్రాహ్మణులూ, స్నేహితులూ, మంగళకరాలని అభినందిస్తున్నారో వాటినే ఆచరించాలి.

ఇలా భారద్వాజగోత్రుడున్నూ, యజుశ్శాఖీయుడున్నూ, ఆపస్తంబసూత్రుడున్నూ అయిన మేడిచెర్ల ఆంజనేయమూర్తిచేత వాత్స్యాయన కామసూత్రములకు జయమంగళవ్యాఖ్య ననుసరించి వ్రాయబడిన 'రతిరేఖ' అను తెలుగువ్యాఖ్యలోని ఔపనిషదికమనే ఏడో అధికరణంలో మొదటి అధ్యాయం ముగిసింది.



శ్రీ

# వాత్స్యాయనీయం

## రతిరేఖ అను తెలుగు వ్యాఖ్యాన సమేతం

౭. ఔపనిషదికాధికరణం

### ౨. నష్టకామ ప్రత్యానయనాధ్యాయం

౧౫౩౮. చండవేగాం రంజయితు మశక్నువన్ యోగా నాచరేత్ । రతస్యోపక్రమే సంబాధస్య కరేణోపమర్దనం తస్యా రసప్రాప్తికాలేచ రతియోజనమితి రాగ ప్రత్యానయనం । ఔపరిష్టకం మందవేగస్య గత వయసో వ్యాయత రతి శ్రాంతస్యచ రాగ ప్రత్యానయనం. అపద్రవ్యాణి యోజయేత్, తాని సువర్ణ రజత తామ్ర కాలాయస గజదంత గవలద్రవ్య మయాని.

సంభోగానికి పుత్రులూ, రతి అని రెండు ఫలాలు, పుత్రప్రాప్తి కోసం పుంస్త్వాన్ని సంపాదించే యోగాలు చెప్పారు. ఇక చాలాసేపు సురతసుఖాన్నికోరే స్త్రీ మందవేగుని విషయంలో విముఖురాలౌతుంది. అలా అనురాగాన్ని పోగొట్టుకున్న వాడు మళ్లీ అనురాగాన్ని కల్పించి ఆ స్త్రీని తృప్తిపరచే మార్గాలు చెవుతున్నారు. చాలాసేపు సురతసమ్మర్దాన్ని:

కల్పిస్తేకాని తృప్తిపడని స్త్రీని తొందరగా స్ఖలనంఅయ్యే మంద వేగుడు మెప్పించలేడు. అప్పుడు యోగాల నాచరించాలి. అతడు సురతాన్ని ప్రారంభించే సమయంలోనే ఆమెయొక్క- భగంలోపలి భాగానికి వేళ్లు చొప్పించి ఆమెకు భావప్రాప్తి కలుగబోయే సమయంలో లింగసంయోగంతో రతి చెయ్యాలి. ఇలాచేస్తే ఆ చండవేగ తృప్తి పడుతుంది. ఇలాగే మందవేగుడూ, వృద్ధుడూ, అంతకుముందే బాగా రతిచేసి అలిసినవాడూ, ఔపరిష్టిక రతి చెయ్యాలి. అంటే ముఖరతి అన్నమాట. పూర్వం చెప్పబడ్డది. లేక అపద్రవ్యాలనన్నా ఉపయోగించాలి. అపద్రవ్యాలంటే పురుషుని మేహనంతో సమానమైన ఆకారంగల సాధనాలన్నమాట. వాటిని బంగారంతోనూ, వెండితోనూ, రాగీ, ఇనుమూ, ఏనుగుదంతమూ, మొదలైనవాటితో తయారు చేస్తారు.

౧౫౩౫. త్రాపుషాణి సైసకాని చ మృదూని శీతవీర్యాణి,
౧౫౪౦.వృష్యాణి, కర్మణిచ ధృష్ణూని భవంతీతి బాభ్రవీయాః
యోగాః, దారుమయాణి సామ్యతశ్చేతి వాత్స్యాయనః, లింగప్రమాణాంతరం బిందుభిః కర్కశ పర్యంతం బహుళం స్యాత్ । ఏత ఏవద్వే సంఘాటి త్రిప్రభృతి యావత్ప్రమాణం వా చూడకః. ఏకామేవ లతికాం వేష్టయే దిత్యేకచూడకః॥ ౭.౨.౬.౧౧

త్రపుషమనే లోహంతో చేయబడినవి త్రాపుషకాలు. సీసంతో తయారుచేయబడినవి సీసకాలు. పై రెండు సాధనాలూ పురుషుని మేహనంలాగా నున్నగానూ, మృదువుగానూ

ఉండి యోనిలో ప్రవేశపెట్టినది మొదలు సుఖప్రదాలై పురుషుని లింగంచేసే పనినంతటినీ, చేసి స్త్రీలకు స్ఖలనసుఖాన్ని కల్పిస్తాయి. చల్లని స్పర్శసుఖాన్ని యిస్తాయి. ఇలా బాభ్రవీయులన్నారు. ఇవికాక కొయ్యతో తయారుచేసే సాధనాలు ఉన్నాయి. వాటిని ఉపయోగించరాదని బాభ్రవీయులన్నారు. ఆయా దేశపద్ధతులనుపట్టి కొయ్యసాధనాలనుగూడా ఉపయోగించవచ్చునని వాత్స్యాయనులన్నారు. ఈ అపద్రవ్యాలలో ఒక్కొక్క స్త్రీకి ఒక్కొక్కరకమైనది యిష్టంగా ఉంటుంది. పురుషుని అంగంతో సమానమైన లోపలిభాగమూ, కొసన బెజ్జమూ ఈ మొదలైన అమరికతో కూడిఉంటుంది. వీటికి ఆ అమరికలోని భేదాలనుపట్టి సంఘాటి అనీ, చూడకంఅనీ అంటారు.

౧౫౨౧- ఉభయతో ముఖచ్ఛిద్రః, స్థూల కర్కశ వృషణ
౧౫౨౨.గుటికాయుక్తః, ప్రమాణవశయోగీ కట్యాం బద్ధః
కంచుకో జాలకం వా, తదభావే అలాబూనాళకం
వేణుశ్చ తైలకషాయైః సుభావితః సూత్రేణ కట్యాం
బద్ధః శ్లక్ష్ణా కాష్ఠ మాలా వా గ్రథితా బహుభిరామలకా
స్థిభిస్సంయుక్తే త్యపవిద్ధక యోగాః. నత్వవిద్ధస్య కస్య
చిద్వ్యవాయే వృత్తి రస్తీతి దాక్షిణాత్యానాం లింగస్య
కర్ణయోరివ వ్యధనం బాలస్య. ౭.౨.౧౫

పై సాధనాలలో పురుషుని అంగాన్ని జొప్పించి రతిచెయ్యాలన్న మాట. పురుషుని అంగాన్ని చొప్పించేవైపున ఆ సాధనానికి రెండుపక్కలూ రెండురంధ్రాలుంటాయి. ఆ రంధ్రాలలో

త్రాళ్లు గ్రుచ్చి పురుషుడు తన నడుమునకు బిగించుకుంటాడు. వాటికి పెద్దవీ, కఠినంగా ఉండేవీ అయిన వృషణాలుగూడా ఉంటాయి. అలా నడుముకు కట్టేదాన్ని జాలకమనీ, కంచుకమనీ అంటారు. ఈ సాధనం లింగానికి అంతటా వ్యాపించి ఉంటుంది. ఇది లేకపోతే సొరకాయబుర్రనో, వెదురు గొట్టాన్నో శుభ్రంచేసి, చివరభాగాన్ని మెత్తగా ఉండేలాగా చేసి నడుముకు కట్టుకుని లింగాన్ని దానిలో ప్రవేశపెట్టాలి. ఈ సాధనం చాలా నునుపుగా ఉండాలి. దీన్ని కాష్ఠమాల అంటారు. దీనికి ప్రక్కభాగాలలో కొయ్యగళికలూ, ఉసిరి గింజలూ కట్టి ఉపయోగించాలి. ఇవి అపవిద్ధయోగాలు. దక్షిణాదివాళ్లు బాల్యంలోనే చెవిలో పుల్లలుపెట్టి తిప్పినట్లే ఈ సాధనాలలో లింగాన్నిజొన్పి తిప్పే ఆచారం ఉన్నది.

౧౫౮౫- యువాతు శస్త్రేణ భేదయిత్వా యావ ద్రుధిరస్యా
౧౫౫౩.గమనం తావ దువకే తిష్ఠేత్। నైశద్యార్థంచ తస్యాం రాత్రౌ నిర్బంధా ద్వ్యవాయః। తతః కషాయై రేకదినాంతరితం శోధనం, వేతస కుటజ శంకుభిః క్రమేణ వర్ధమానస్య వర్ధనై ర్బంధనం। యష్టి మధుకేన మధుయుక్తేనశోధనం। తతస్సీసకపత్రకర్ణికయా వర్ధయేత్। మ్రక్షయేద్భల్లాతక తైలే నేతి వ్యధనయోగాః। తస్మిన్ననేకాకృతి వికల్పా న్యపద్రవ్యాణి యోజయేత్। వృత్తమేకతోవృత్త ముదూఖలకం కుసుమకం, కంటకితం కంకాస్థి గజ ప్రహారికం, అష్టమండలికం, భ్రమరకం, శృంగాటక మాన్యాని వో పాయతః కర్మతశ్చ బహు కర్మ సహతా చైషాం మృదు కర్కశతా యథా

సాత్మ్య మితి । ఇతి నష్టరాగ ప్రత్యాయనం । ద్విష
ష్టితమం ప్రకరణం ॥ ౭.౨.౨౮

ఇక లింగాన్ని వ్యధనంచేసే విధానాన్ని చెపుతున్నారు. యువకుడైన విటుడు లింగాన్ని కత్తితో కోసి వెచి రక్తం పూర్తిగా ఆగిపోయేవరకూ నీటిలో ఉండాలి. ఆ రాత్రికి మూత్రాన్ని బిగించాలి. తరువాత రోజువిడిచి రోజు కషాయాలతో కడగాలి. వేముబద్దలూ, ప్రబ్బలిబద్దలూ మొదలైనవాటితో లింగానికి కట్టుకట్టిఉంచాలి. వాటితో క్రమంగా పెరుగుతున్న లింగాన్ని గట్టిగా కట్టుకట్టాలి. తేనెతో యష్టిమధుకాన్ని కలిపి శోధించాలి. తరువాత లింగంయొక్క పెరుగుదలకోసం సీసక కర్ణపత్రికను కట్టాలి. జీడితైలంతో సాధనంలో ప్రవేశపెట్టడానికి మేహనాన్ని బాగామర్దించాలి. ఇవి వ్యధనయోగాలు. ఇలా అనేకరంధ్రాలుగల సాధనాలలో లింగాన్ని అనేకరకాలుగా ప్రవేశపెట్టాలి. వృత్తమూ, ఏకతోవృత్తమూ, ఉదూఖలమూ, కుసుమకమూ, కంటకితమూ, కంకాస్థి, గజప్రహారికమూ, అష్టమండలికమూ, భ్రమరకమూ, శృంగాటకమూ, ఈ మొదలైనవాటిని ఉపాయాన్నిపట్టీ, చేసేపనినిపట్టీ, అనేక క్రియలకుపయోగించేవాటిని ఇష్టాన్నిపట్టి మృదువుగానూ, కఠినంగానూ అమర్చుకోవాలి. ఇది నష్టరాగ ప్రత్యాయనం.

౧౫౹౫౪. ఏవం వృకజానాం జంతూనాం శూకై రుపబృంహితం
లింగం దశరాత్రం తైలేన మృదితం పున రుపబృంహితం,
పునః ప్రమృదితం, ఇతి జాతశోఫం ఖట్వాయా మధో
ముఖస్తదంతరే లంబయేత్ ॥ ౨.౨.౨౯

ఇక లింగాన్ని వృద్ధిపొందించుకునేవిధానాన్ని చెవుతున్నారు. ఇలా చెట్టుపెరళ్లతోనూ, జంతువుల రోమాలతోనూ, వృద్ధిపొందింపబడిన లింగాన్ని పదిరాత్రులు తైలంతోమర్దించి మరల పైపాటితో పెంచి మళ్ళీ పదిరాత్రులు మర్దిస్తే లింగం చక్కగా సాగుతుంది. అటుతరువాత మళ్ళీ ముడుచుకునిపోకుండా మంచంమీద బోర్లగాపరుండి దాని రంధ్రాలలో మేహనాన్ని వేలాడవెయ్యాలి.

౧౫౫౫. -తతస్త్రైకషాయైః కృతవేదనా నిగ్రహం సోపక్రమేణ నిర్ధారయేత్। యావజ్జీవం శూకజో నామశేఫో
విటానాం। అశ్వగంధా శబర కంద జలశూక బృహతీ ఫల మాహిష నవనీత హస్తికర్ణ వజ్ర వల్లీరసైః ఏకైకేన పరిమర్దనం మాసికం వర్ధనం। ఏతైరేవ కషాయైః పక్వేన తైలేన పరిమర్దనం షాణ్మాస్యం। దాడిమ త్రపుష బీజాని వాలు బృహతీ రసశ్చేతి। మృద్వగ్నినా పక్వేన తైలేన పరిమర్దనం పరిషేకో వాన తాంస్తాశ్చ యోగా నాప్తేభ్యో బుద్ధ్యేతేతి వర్ధమాన యోగాః. ౭. ౨. ౨౬-౩౧

ఇలా తన యిష్టమైనంత పొడుగుగా లింగం సాగినతరువాత చల్లని పంచకషాయాలతో తడుపుతూ బాధను సహిస్తూ సంసిద్ధం చేసుకోవాలి. ఇలా పెంచబడినసాధనం సాధారణంగా విటులకే ఉంటుంది. దాన్ని శూకజశేఫం అంటారు. అశ్వగంధమూ, శబరకందమూ, జలశూకమూ, బృహతీఫలమూ, మాహిషనవనీతమూ, ఈమొదలైన రసాలతో నెలరోజులు

మర్దిస్తే లింగం వృద్ధిఅవుతుంది. పై మూలికల కషాయాలతో వండిన తైలంతో మర్దనచేస్తే ఆరుమాసాలలో లింగం వృద్ధి అవుతుంది. దానిమ్మగింజలూ, త్రపుషబీజ లూ, వాలుకా, బృహతీఫలరసాలూ, వీటిని సన్నని మంటపైన వండి తైలంతీసి లింగాన్ని మర్దించినా, పూసినా లింగం వృద్ధి అవుతుంది. ఇంకా ఇలాటి యోగాలను ఆప్తులవల్ల తెలుసుకోవాలి.

౧౫౬-౧- అథ స్నుహీ కంటక చూర్ణైః పునర్నవా వానర పురీ

౧౫౬-౩. షలాంగలికా మూల మిశ్రైర్యా యామవకిరేత్సానాన్యం కామయేత్ । తథా సోమలతా , వల్గుజా, భృంగ లోహోపజిహ్వికా చూర్ణైః వ్యాధిఘాతక జంబూ ఫల నిర్యాసేన ఘనీకృతేవ చ లిప్తసంబంధాం గచ్ఛతో రాగో నశ్యతి । గోపాలికా, బహుసాదికా జిహ్వికా చూర్ణైః మాహిషీ తక్రయుక్తైః సా తాంగచ్ఛతో రాగో నశ్యతి ॥ ౭-౨-౩౩

ఇక చిత్రయోగాలు చెవుతున్నారు. స్నుహీ కంటకచూర్ణం తో పునర్నవా, వానరపురీష, లాంగలికా మూలాలనుకూర్చి చూర్ణంచేసి స్త్రీ శిరస్సుకురాస్తే ఆమె ఇతరులను ప్రేమించదు. ఇలాగే సోమలత, వల్గుజ, భృంగలోహమూ, ఉపజిహ్వక, వీటి చూర్ణములతో వ్యాధిఘాతక జంబూఫల నిర్యాసాదులు కలిపి కలికంతీసి భగానికి పూతచేస్తే ఆద్రవం తగిలినవెంటనే లింగం వాలిపోతుంది. గోపాలిక, బహుపాదిక, జిహ్వక వీటి.

చూర్ణాన్ని గేదెనుజ్జికతో కలిపి భగానికి పూసుకుని స్నానం చేసిన యువతితో సంభోగిస్తే వెంటనే కామం నశిస్తుంది.

౧౫౬౮- నీపామ్రాతక జంబూకుసుమయుక్త మనులేపనం
౧౫౭౫. దౌర్భాగ్యకరం స్రజశ్చ । కోకిలాక్షఫలప్రలేపో
హస్తిన్యాస్సంహతమేకరాత్రే కరోతి। పద్మోత్పలక
బంధ సర్జక సుగంధ చూర్ణాని మధూని పిష్టాని లేపో
మృగ్యాః విశాలీకరణం । స్నుహీసోమార్క క్షీరైః
అవల్గుజాఫలైః భావితా న్యామలకాని కేశానాం
శ్వేతీకరణం । మదయంతికా కుటజకాంజనికాగిరి
కర్ణికా శ్లక్ష్ణపర్ణీ మూలైః స్నానం కేశానాం ప్రత్యాన
యనం ॥ ౭.౨.౩౯

నీపామ్రాతకమూ, జంబూకుసుమమూ, వీటితో తయారు చేసిన అనులేపనమున్నూ, వాటి పూలమాలలున్నూ, దౌర్భాగ్యాన్ని కలిగిస్తాయి. హస్తినీజాతిస్త్రీకి కోకిలాక్షు ఫలద్రవ్యంతో భగాన్ని మర్దనంచేస్తే ఒక్కరాత్రిలోనే ముడుచుకునిపోతుంది. పద్మోత్పల, కదంబసర్జన, సుగంధచూర్ణాలను తేనెతో నూరి భగానికిపూస్తే మృగీజాతిస్త్రీకి యోని వెడల్పవుతుంది. స్నుహీ, సోమార్కక్షీర, అవల్గుజాఫలాలద్రవ్యంతో భావనచేసిన అమలకాన్ని జుట్టుకురాస్తే జుట్టు తెల్లబడిపోతుంది. మదయంతి కాదిమూలాలు వేసి కాచిననీళ్ళతో స్నానంచేస్తే ఆజుట్టు మళ్లీ నల్లబడుతుంది.

౧౫౭౯- ఏతైరేవ సుపక్వైస్తైలేన అభ్యంగా త్కృష్ణీ కర
౧౫౮౧. ణాత్క్రమేణాస్య ప్రత్యానయనం, శ్వేతాశ్వస్య
ముష్కస్వేదైః సప్తకృత్వో భావితేన ఆలక్తకేన రక్తో
ధర శ్శ్వేతో భవతి। మదయంతికాదీన్యేవ ప్రత్యా
నయనే, బహుపాదికా కుష్ఠతగర పీఠభవంతి। శ్రవణ
ప్రియంగుతైల తాళీస దేవదారు వజ్ర కందకైరుస్త
లిప్తం వంశం వాదయతో యా శబ్దం శృణోతి సా వ
శ్యాభవతి। ధుత్తూరఫలయుక్తో అభ్యవహారః ఉన్మాద
కరః। గుడో జీర్ణతశ్చ ప్రత్యానయనం॥ ౭.౨.౪౫

పూర్వం చెప్పిన మదయంతికాది మూలికలు వేసి కాచిన నూనెను రోజురోజూ తల అంటుకుంటే వెంట్రుకలన్నీ నల్ల పడతాయి. తెల్లగుఱ్ఱము వృషణాలమీది చెమటతో ఏడు మార్లు అలక్తకాన్ని భావనచేసి దాన్ని అద్దితే ఎఱ్ఱగాఉన్న పెదవి తెల్లపడుతుంది. పైనచెప్పిన తైలం మళ్ళీ యథాప్రకారంగా చేస్తుంది. బహుపాదికాది మూలికలను నూరి పిల్లన గ్రోవికిరాచి దానిని మోగిస్తే ఆ ధ్వనినివిన్న ఆడది వశ్యురాలౌతుంది. ధుత్తూరంతోకలిపిన అన్నాన్నితింటే పిచ్చి యెత్తుతుంది. బెల్లంతింటే ఆపిచ్చి పోతుంది.

౧౫౮౨- హరితాళ మనశ్శిలాభక్షిణో మయూరస్య పురీషేణ
౧౫౮౭. లిప్తహస్తో యద్ద్రవ్యం స్పృశతి తన్న దృశ్యతే।
అంగార తృణభస్మనా తైలేన విమిశ్రముదకం క్షీర
వర్ణం భవతి। హరీతకామ్రాతకయోః శ్రవణ
ప్రియంగుకాభిశ్చ పిష్టాభి ర్లిప్తాని లోహభాండాని తా

లేన దుకూల స్పర్శ నిర్మోకేణ వర్త్యా దీపం ప్రజ్వాల్య పార్శ్వే దీర్ఘీకృతాని కాష్ఠాని సర్పవద్భవంతే। శ్వేతాయా శ్వేతవత్సాయాః గోః క్షీరస్య పానం యశస్య మాయుష్యంచ । బ్రాహ్మణానాం ప్రశస్తానామాశీః । ఇతి చిత్రా యోగా శ్చతుష్షష్టితమం ప్రకరణం॥ ౭.౨.౪౧

హరితాళాన్నీ, మనశ్శిలనూ, తినే నెమలిపురీషం చేతికి, పూసుకొని ఏ వస్తువును ముట్టుకుంటే ఆ వస్తువు మాయమవుతుంది. అంగార తృణభస్మంతోనూ, తైలంతోనూ నీటినికలిపితే ఆనీరు పాలవలె అవుతుంది. హరీతక, ఆమ్రాతకాలతో శ్రవణ ప్రియంగువులను కలిపి పిండిచేసి లోహపాత్రలకు పూస్తే రాగి పాత్రలుగా అవుతాయి. గుడ్డవత్తిగానీ, పాముకూసాన్ని వత్తిగాచేసిగానీ శ్రవణప్రియంగుతైలంతో తడిపి దీపంపెడితే పక్కన ఉన్నకొయ్యలు పాములలాగా తిరుగుతాయి. తెల్లని దూడగల తెల్లఆవుపాలు తాగితే క్షేమం కలుగుతుంది. ఆయుస్సు వృద్ధి అవుతుంది. ప్రసిద్ధులైన బ్రాహ్మణుల ఆశీర్వాదాలుగూడా ఆయుస్సును వృద్ధిచేస్తాయి. ఇలా చిత్రయోగాలు చెప్పారు. ఇది అరువదినాలుగో ప్రకరణం.

భవంతి చాత్రశ్లోకాః—

౪౨/౪౩. పూర్వశాస్త్రాణి సందృశ్య ప్రయోగా ననుసృత్యచ।
కామసూత్ర మిదం యత్నాత్సంక్షేపేణ నివేదితం॥

పూర్వం వ్రాయబడిన శాస్త్రాలు చూచినీన్ని, ప్రయోగాల ననుసరించినీన్ని ఎంతో ప్రయత్నించి సంగ్రహరూపంగా ఈ కామసూత్రం చెప్పడమైనది.

౧౫౪౯. ధర్మమర్థంచ కామంచ ప్రత్యయం లోకమేవచ ।
పశ్యత్యేతస్య తత్వజ్ఞో నచరాగాత్ప్రవర్తతే.

ఈ కామశాస్త్ర తత్త్వాన్ని గుర్తించిన బుద్ధిమంతుడు ధర్మాన్నీ, అర్థాన్నీ, కామాన్నీ, విశ్వాసాన్నీ, దేశస్థితినీ గమనించి ప్రవర్తిస్తాడు. కాని కేవలం కామాంధుడై ప్రవర్తించలేడు.

౧౫౫౦. అధికారవశా దుక్తా యే చిత్రా రాగవర్ధనాః । తదనంతర మత్రైవ తే యత్నాద్వినివారితాః॥ ౭.౨.౫౪

ప్రకరణ సందర్భాన్నిపట్టి శాస్త్రంలో చెప్పవలసిన విషయాలు గనుక అధకారరీత్యా అనురాగాన్ని పెంపుచేసే చిత్రయోగాలను చెప్పాం. అయినా వెనువెంటనే అక్కడే వాటిని ఆచరించరాదని నిషేధించే ఉన్నాం.

౧౫౫౧- న శాస్త్ర మస్తీత్యేతేన ప్రయోగా హి సమీక్షతే।
౧౫౫౨. శాస్త్రార్థాన్వ్యాపినో విద్యా త్ప్రయోగాం స్త్వైకదేశికాన్। బాభ్రవీయాంశ్చ సూత్రార్థాన్ ఆగమయ్య విమృశ్యచ । వాత్స్యాయన శ్చకారేదం కామసూత్రం యథావిధి. ౭.౨.౫౫

శాస్త్రంలో ఉన్నదిగనుక అచరింపతగినదని ఆచరణకు దిగరాదు. శాస్త్రవిషయాలు ప్రపంచాన్ని చెప్పేవి. ప్రయోగాలు ఒకదేశానికి సంబంధించినవి. అని తెలుసుకోవాలి.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B162 |
| పుస్తకం పేరు | వాత్స్యాయనీయం |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 547 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Rehana |
| | Pravin |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |